# భారతదేశ యాత్రా దర్శిని

( ఈ పుస్తకం మీ చెంత ఉంటే ఓ గైడ్ ఉన్నట్టే )

హనిమూన్ వెళ్ళే దంపతులకి .... పెద్దవాళ్ళకి ....

శుభకార్యాలకి... మీ ఆప్తులకిది చక్కటి బహుమతి.

.................................................................



.................................................................

.................................................................

.................................................................

సందర్భముగా, ఇలాంటి ఆనంద సమయంలోని ఈ

సంతోషం మీకు కలకాలం ఉండాలని కోరుకుంటు,

ఆ సర్వేశ్వరుడుని ప్రార్థిస్తూ ..............................

సంతకం

# భారతదేశ యాత్రాదర్శిని

# Bharathadesa Yatra Darshini

మైథిలీ వెంకటేశ్వరరావు

Mythili Venkateswara Rao

కాపీరైట్ :
గూటూరి అక్షర

Copy Right :
GUTURI AKSHARA

మూల్యం : రూ. 90/-

Price : **Rs. 90/-**

ముఖ చిత్రం :
రమణ

Cover Design :
**RAMANA**

ప్రింటర్స్ :
భావన ఆఫ్‌సెట్
సాయి ఆఫ్‌సెట్

Printers :
**Bhavana Offset,**
**Sai Offset.**

డి.టి.పి. :
వింధ్య గ్రాఫిక్స్
గుంటూరు.

D.T.P. :
**VINDYA GRAPHICS,**
**Guntur.**

కాపీలకు :
సరస్వతి పబ్లికేషన్స్
సత్యనారాయణపురం,
విజయవాడ-11

For copies :
**Saraswathi Publications**
Satyanarayanapuram,
VIJAYAWADA - 11.

ముద్రణ :
జూలై, 1999

Edition :
**July, 1999**



## భారతదేశంలోని అన్ని పుణ్యక్షేత్రాలు, విహార స్థలాలు ఇలా చదువుకుంటూ సందర్శించండి

# ఆంధ్ర ప్రదేశ్

రెండు లక్షల డెబ్బయి అయిదువేల అరవై ఎనిమిది చ.కి.మీ. గల ఆంధ్ర ప్రదేశ్ రాజధాని హైదరాబాద్... ఇందు జనాభా 6, 63,04,854.

**ప్రధాన నగరాలు, పట్టణాలు :** హైదరాబాద్, విజయవాడ, విశాఖపట్టణం, కరీంనగర్, నిజామాబాద్, మహబూబ్‌నగర్, నల్గొండ, ఖమ్మం, కొత్తగూడెం, గోదావరిఖని, భద్రాచలం, కాకినాడ, రాజమండ్రి, శ్రీకాకుళం, విజయనగరం, తిరుపతి, తెనాలి, వరంగల్, నెల్లూరు, చీరాల, ఒంగోలు, సంగారెడ్డి, ఆదిలాబాద్, ఆదోని, భీమవరం, అనంతపురం, చిత్తూరు, కడప, కర్నూలు, గుంటూరు...

**సరిహద్దులు :** ఆంధ్ర ప్రదేశ్‌కు తూర్పున బంగాళాఖాతం, పశ్చిమాన కర్నాటక, దక్షిణాన తమిళనాడు, ఉత్తరాన వాయువ్యదిశన మహారాష్ట్ర, ఈశాన్యంలో మధ్యప్రదేశ్ ఒరిస్సాలున్నాయి.

**ప్రధాన భాషలు :** తెలుగు, ఉర్దూ.

**వాతావరణం :** సమ్మర్ 41°C నుంచి 20°C చలికాలం 32°C నుంచి 13°C వరకు.

**విశ్వవిద్యాలయాలు :** జవహర్‌లాల్ టెక్నోలాజికల్ యూనివర్శిటీ (హైదరాబాద్), కృష్ణదేవరాయ (అనంతపూర్), వెంకటేశ్వర, పద్మావతి విశ్వవిద్యాలయాలు తిరుపతిలో కలవు. ఇంకా కాకతీయ, ఆంధ్రా, వరంగల్, విశాఖపట్టణాలలో, ఉస్మానియా యూనివర్శిటి హైద్రాబాద్‌లోనూ, నాగార్జున విశ్వవిద్యాలయం గుంటూరు-విజయవాడ రోడ్డు లైనులో ఉన్నాయి.

**యాత్రా పర్యాటక ప్రదేశాలు :** తిరుపతి, శ్రీకాళహస్తి, కైలాసనాధ కోన జలపాతం, పులికాట్ సరస్సు, నాగలాపురం, నెల్లూరు వోడరేవు, అమరావతి, వైకుంఠపురం, పెదకాకాని, మంగళగిరి, ఉండవల్లి, విజయవాడ, కొండపల్లి, వేదాద్రి, కొల్లేరు, ద్వారకా తిరుమల, హంసలదీవి, మోపిదేవి, క్షీరారామము (పాలకొల్లు), అంతర్వేది, పెనుగొండ, రాజమహేంద్రవరం, ద్రాక్షారామం, అన్నవరం, సింహాచలం, విశాఖపట్నం, హార్సిలిహిల్స్, నాగార్జునసాగర్, చేజెర్ల, కపిలేశ్వరాలయం, కోటప్పకొండ, మహానంది, అహోబిలం, పుష్పగిరి, శ్రీశైలం, అలంపురం, మంత్రాలయం, లేపాక్షి, విజయనగరం, బొబ్బిలి, శ్రీకూర్మం, హైదరాబాద్, వరంగల్లు, రామప్పగుడి, హనుమకొండ, యాదగిరిగుట్ట, భద్రాచలం, శ్రీకాకుళం.

ఈ ప్రదేశాలన్నీ నవంబర్ నుంచి జూన్ నెల మధ్య దర్శిస్తే ప్రకృతి రమణీయతను ఆస్వాదించవచ్చు. ఇంకా ముఖ్యంగా ఫిబ్రవరి, మార్చి లోపలయితే భూమి పచ్చపట్టుచీర కట్టుకున్న తెలుగింటి ఆడపడుచులా ఉంటుంది. తనువు పులకించి అద్వితీయమైన అనుభూతి మీకు మిగులుతుంది.

## టూరిస్ట్ ఇన్‌ఫర్‌మేషన్ కేంద్రాలు

★ ఆంధ్ర ప్రదేశ్ ట్రావెల్ మరియు టూరిజం డెవలప్‌మెంట్ కార్పొరేషన్, 'యాత్రినివాస్' ఎస్.పి.రోడ్, సికింద్రాబాద్-500 003. ఫోన్ : 817672, 816375

★ టూరిస్ట్ ఇన్‌ఫర్‌మేషన్ కౌంటర్, సికిందరాబాద్ రైల్వేస్టేషన్.

★ టూరిస్ట్ ఇన్‌ఫర్‌మేషన్ ఆఫీసర్, రీజనల్ టూరిస్ట్ ఇన్‌ఫర్‌మేషన్ బ్యూరో, హిల్ కాలనీ, నాగార్జునసాగర్-508 202. ఫోన్ : 2133-34.

★ టూరిస్ట్ ఇన్‌ఫర్‌మేషన్ ఆఫీసర్, రీజనల్ టూరిస్ట్ఇన్‌ఫర్‌మేషన్ బ్యూరో, ఫస్ట్ ఫ్లోర్, నెహ్రూనగర్, షాపింగ్-కమ్-ఆఫీసు కాంప్లెక్స్, విశాఖపట్టణం. ఫోన్: 63016.

★ టూరిస్ట్ ఇన్‌ఫర్‌మేషన్ ఆఫీసర్, రీజనల్ టూరిస్ట్ ఇన్‌ఫర్‌మేషన్ బ్యూరో, టూరిస్ట్ రెస్ట్‌హౌస్, కాజీపేట, వరంగల్. ఫోన్ : 6201.

★ టూరిస్ట్ ఇన్‌ఫర్‌మేషన్ కౌంటర్, ప్లాట్‌ఫారం నెం. 1, కాజీపేట రైల్వేస్టేషన్.

★ టూరిస్ట్ ఇన్‌ఫర్‌మేషన్ ఆఫీసర్. రీజనల్ టూరిస్ట్ ఇన్‌ఫర్‌మేషన్ బ్యూరో, 3 చౌల్ట్రీ దగ్గర, తిరుపతి. ఫోన్ : 23208.

★ టూరిస్ట్ ఇన్‌ఫర్‌మేషన్ సెంటర్, తిరుపతి రైల్వేస్టేషన్.

★ టూరిస్ట్ ఇన్‌ఫర్‌మేషన్ ఆఫీసర్, రీజనల్ టూరిస్ట్ ఇన్‌ఫర్‌మేషన్ బ్యూరో, గోపాల్‌రెడ్డిరోడ్, పాతబస్టాండ్ ఎదురు, విజయవాడ-520 002.

★ అసిస్టెంట్ మేనేజర్ (ట్రాన్స్‌పోర్ట్), క్రిష్ణవేణి మోటల్, సీతానగరం, విజయవాడ. ఫోన్ : 426382.

★ డిప్యూటీ డైరెక్టర్, ఎ.పి. స్టేట్ టూరిస్ట్ ఇన్‌ఫర్‌మేషన్ సెంటర్, ఎ.పి. భవన్, అశోకా రోడ్, న్యూఢిల్లీ - 110 001. ఫోన్ : 381293.

★ మేనేజర్, గవర్నమెంట్ ఆఫ్ ఇండియా టూరిస్ట్ ఆఫీస్, సన్‌డోజి బిల్డింగ్, హిమయత్‌నగర్, హైదరాబాద్- 500 029. ఫోన్ : 666877.

★ ఆంధ్ర ప్రదేశ్ టూరిస్ట్ ఇన్‌ఫర్‌మేషన్ సెంటర్, హోటల్ ఫ్లామింగో, పానాజిగోవా.

★ ఆంధ్రప్రదేశ్ స్టేట్ టూరిస్ట్ ఇన్‌ఫర్‌మేషన్ బ్యూరో, 5వ ఫ్లోర్, గగన్ విహార్, యం.జి. రోడ్, హైదరాబాద్ - 500 001. ఫోన్ : 4732554.

## తిరుమల - తిరుపతి

తిరుమల శిఖరాగ్రంపై నెలకొనియున్న శ్రీ వేంకటేశ్వరుని ఆలయం, దేశంలో అత్యంత ప్రాచీనమైనది. శ్రీ రామానుజుల వారి పాదస్పర్శతో పవిత్రమైన ఈ ప్రదేశం నిత్యం పచ్చతోరణమే. నిత్య పెళ్లి కొడుకు శ్రీ వేంకటేశ్వరుని చూడటానికి బ్రహ్మ ఇచ్చిన ఈ రెండు కనులు చాలవు. ఆ దివ్య మంగళ స్వరూపాన్ని చూడటానికి, చూచి తరించటానికి భారతదేశం నుంచే కాక మొత్తం ప్రపంచం నుంచి, ఎంతోమంది భక్తులు శ్రీవారిని (స్వామి వారిని) నిత్యం దర్శించి తరిస్తున్నారు.

1600 కోట్ల మిలియన్ల సంవత్సరాలకి ముందు సహజ శిలాతోరణంగా స్వామి వారు యేర్పడ్డారని, భౌగోళిక శాస్త్రజ్ఞులు, పురాతన శాస్త్రవేత్తలు, ఇతిహాసాలు, పురాణ గాథలు చెబుతున్నాయి.

**కొండలలో నెలకొన్న ఈ కోనేటిరాయుడి కథ......** ఋషులందరికి త్రిమూర్తులలో ఎవరు పూజనీయులు అనే సందేహం వచ్చి, పరీక్షించే భారం భృగుమహర్షి మీద మోపారు.

ఆయన కైలాసాన్ని, బ్రహ్మలోకాన్ని దర్శించి వైకుంఠం చేరి సరాసరి పాల సముద్రం మీద శేషపాన్పుపైన శయనించిన విష్ణుమూర్తిని చేరాడు. భార్య సపర్యలలో కళ్ళుమూసుకొని తన రాకను గమనించని శ్రీహరి మీద కోపాన్ని ఆయన ఎదురు రొమ్ము మీద తన్ని ప్రదర్శించారు.

అంత శ్రీ మహావిష్ణువు చివ్వునలేచి ఇసుమంత కూడా కోపించక ఆయన కాలిని పట్టుకొని, నన్ను తన్నిన ఈ కాలికి యేమీ ఇబ్బంది కలగలేదు కదా అని అనునయంగా ప్రశ్నించాడు.

అది చూసి లక్ష్మీదేవి ఆగ్రహావేశురాలయింది. తన నివాసస్థలమైన వక్షస్థలం మీద తన్ని తనని కూడా అవమానపరచిన భృగుమహర్షితో తన భర్త వినమ్రతగా మాట్లాడటం సహించలేకపోయింది. వైకుంఠాన్ని, విష్ణువుని వదిలి కానరాకుండా వెళ్ళిపోయింది. లక్ష్మీదేవి లేని వైకుంఠం శూన్యంగాతోచి భార్యకోసం వెతుకుతూ హరి పిచ్చివాడై తిరగటం ప్రారంభించారు.

తర్వాత కొన్నాళ్ళకు అడవులలో తిరుగుతున్న శ్రీ మహావిష్ణువు శ్రీనివాసుడిగా అవతరించారు. ఆకాశరాజు కుమార్తె పద్మావతిదేవిని లోకోత్తర రీతిలో వివాహం చేసుకోవటంతో సర్వమానవాళికి కొంగు బంగారమై కోరిన కోర్కెలు తీర్చే శ్రీ పద్మావతి, వేంకటేశ్వరులై తిరుమలవాసులైనారని పురాణ కథ.....

భారతదేశం మొత్తం మీద ఎక్కువ ఆదాయాన్ని పొందుతున్న ఈ దేవాలయం, ఆ డబ్బుని ప్రజోపయోగమైన ఎన్నో పనులకి హిందూ ధర్మప్రచారానికి వినియోగిస్తోంది.

**రోడ్డు :** దక్షిణాదినగల అన్ని ప్రధాన పట్టణాలు. నగరాల నుంచి తిరుపతికి రోడ్డు సౌకర్యం వున్నది. హైదరాబాద్ నుంచి సూర్యాపేట, విజయవాడ, గుంటూరు, నెల్లూరు, గూడూరు. శ్రీకాళహస్తి మీదుగా 704 కి.మీ. అదే భాగ్యనగరం నుంచి కర్నూలు, కడప, పీలేరు మీదుగా తిరుపతికి 617 కి.మీ., ముంబాయి నుంచి పూనె, హరిహర్ తుంబానే, బెంగుళూరు నుంచి 1281 కి.మీ., చెన్నై నుంచి రెడ్‌హిల్స్, తడ, శ్రీకాళహస్తి, రేణిగుంటల మీదుగా 170 కి.మీ. కలకత్తా నుంచి కటక్, విశాఖపట్టణం, విజయవాడ, నెల్లూరు మీదుగా 2,887 కి.మీ.

**తిరుపతి నుంచి కొండమీదకు :** ప్రతిరోజు ఉదయం 3.30 నుంచి రాత్రి 11 గంటల వరకూ ప్రతిమూడు నిమిషాలకు ఆర్.టి.సి. బస్సు సౌకర్యం ఉన్నది. బస్ చార్జి మనిషికి 14/- రూపాయలు, రానుపోను ఒకేసారి టిక్కెట్ తీసుకొనవచ్చును.

**కాలిబాట...** అలిపిరి వద్ద పదకొండు కిలోమీటర్లుగల కాలిబాట ఉంది. ఈ మార్గం ద్వారా మొక్కుబడులు తీర్చుకుంటూ దివ్య ప్రదేశాలను సందర్శించుకుంటూ భక్తులు తిరుమల చేరవచ్చు. యాత్రికుల సామాను అలిపిరి టోల్‌గేట్ వద్ద ఇచ్చి రసీదు తీసుకుని కాలిబాటన ప్రయాణించి కొండ మీద తిరుమల కేంద్ర విచారణ కార్యాలయంలో చూపించి తిరిగి మీ సామాను తీసుకోవచ్చు. ఇది ఉచిత సర్వీసు.

## తిరుపతి - తిరుమలలో వసతి

**తిరుపతిలో వసతి :** శ్రీ కోదండరామ ధర్మశాల, శ్రీ గోవిందరాజు ధర్మశాలలో ఉచితంగా వసతి దొరుకుతుంది. ఇందులో వంట చేసుకొనే సౌకర్యం కూడా ఉంది. ధర్మశాలలో ఉన్న సెంట్రల్ రిసెప్షన్ ఆఫీసులో సూపరింటెండెంట్‌ను కలవాలి.... శ్రీ వెంకటేశ్వర ధర్మశాలలో ఒకరోజుకి అద్దెకింద ఒకరికి 50/-, ఇద్దరికి 100/- నాలుగు పడకల గది 100/-కు దొరుకుతాయి. ఇది రైల్వే స్టేషన్ ఎదురుగా ఉన్నది.

ఇంకా డబ్బు కలవారు దిగటానికి తిరుపతిలో ఎన్నో ఖరీదయిన హోటల్స్ ఉన్నాయి.

## తిరుమలలో వసతి

ఉచిత వసతి కావలసినవారు బస్టాండ్ సమీపంలోని సెంట్రల్ రిసెప్షన్ ఆఫీసులో సంప్రదించవచ్చును.

గదులను కాటేజీలను కావలసినవారు తిరుమలకి 30 రోజులు ముందుగా ప్రొఫ్టేను కార్య నిర్వహణాధికారి టి.టి.డి.కి వారి పేరు మీద పంపాలి. దానిపై మీరెప్పుడు వస్తున్నది, ఎంతమంది వస్తున్నది వివరంగా వ్రాయండి.

ఇకపై నాలుగు గంటలకు సర్వీసు చార్జీలు ఈ విధంగా ఉంటాయి.

గమనిక ఈ క్రింద రేట్లు రచయిత విషయ సేకరణ చేస్తున్నప్పుడు అమలులో వున్నవిగా గమనించాలి.

| | |
|---|---|
| **శ్రీ పద్మావతీ అతిధి గృహ ప్రాంతం :** | |
| మాస్టర్ సూట్ (ఒక్కొక్కటి) | 1,500/- |
| ఇతర 7 రూములు (ఒక్కొక్కటి) | 500/- |
| **ఆంధ్రో అతిథి గృహం :** | |
| పెద్ద రూములు 2 (ఒక్కొక్కటి) | 1,000/- |
| చిన్న రూములు 2 (ఒక్కొక్కటి) | 500/- |
| బాలకుటీరం | 250/- |
| గోదావరి సదన్ | 500/- |
| గంబెల్ అతిధి గృహం | 250/- |
| ఇందిరా అతిధి గృహం | 500/- |
| జగన్నాథ భవన్ | 500/- |
| లక్ష్మి నిలయం | 500/- |
| మోడీ భవన్ | 250/- |
| శ్రీనికేతన్ | 1,000/- |
| శ్రీనివాస నిలయం | 500/- |
| **విద్యాసదన్ అతిధి గృహం :** | |
| మాస్టర్ సూట్లు (ఒక్కొక్కటి) | 1,500/- |
| ఇతర రూములు (ఒక్కొక్కటి) | 500/- |
| శాంతిసదన్ | 500/- |
| గోకులం అతిధి గృహం | 1,000/- |
| హెచ్.ఆర్.జె. ఎ. అండ్ బి. పోర్షన్స్ | 400/- |
| స్పెషల్ టైప్ కాటేజీలు | 400/- |
| ఎస్.వి. అతిధి గృహం | 100/- |
| మూల గదులు | 150/- |
| నారాయణగిరి అతిధిగృహం-1 | 100/- |
| మూల గదులు | 150/- |
| నారాయణగిరి అతిధి గృహం-2 | 100/- |
| మూల గదులు | 150/- |

| | |
|---|---|
| నారాయణగిరి అతిధి గృహం-3 | 100/- |
| మూలగదులు | 150/- |
| రామ్ భగీచా అతిథిగృహం-1 | 100/- |
| రామ్ భగీచా అతిథిగృహం - 2 | 100/- |
| రామ్ భగీచా అతిథిగృహం-3 | 100/- |
| వరాహస్వామి అతిథిగృహం | 100/- |
| శేషాద్రినగర్ అతిథి గృహం | 100/- |
| హిల్‌వ్యూ కాటేజీలు (డీలక్స్) | 100/- |
| హిల్‌వ్యూ అతిథిగృహం (పెద్దది) | 100/- |
| హిల్‌వ్యూ అతిథిగృహం (చిన్నది) | 50/- |
| **టి.బి. కాటేజీలు :** | |
| ఒక రూము | 30/- |
| లోపలివైపు కాటేజీలు (ఒక్కొక్కటి) | 100/- |
| బయటివైపు కాటేజీలు (ఒక్కొక్కటి) | 75/- |
| పెళ్ళి కాటేజీలు | 200/- |
| పెళ్ళి కాటేజీలు | 100/- |
| మంగళంబావి కాటేజీలు (ఎం.బి.సి) | 75/- |
| వాలీ వ్యూ కాటేజీలు (వి.వి.సి.) | 75/- |
| **అళ్వార్‌టాంక్ కాటేజీలు (ఎ.టి.సి.) :** | |
| కాటేజీలు | 50/- |
| రూములు | 30/- |
| కళ్యాణమండపము (ఎస్.ఆర్.కె.ఎం.) | 1,000/- |
| కళ్యాణమండపము (ఎ.టి.సి-99) | 100/- |
| అంజనాద్రినగర్ కాటేజీలు | 15/- |
| గరుడాద్రినగర్ కాటేజీలు | 15/- |
| శంఖుమిట్ట కాటేజీలు | 15/- |
| శేషాద్రినగర్ కాటేజీలు | 15/- |
| హిల్‌వ్యూ కాటేజీలు (ఆర్డినరీ) | 15/- |

ప్రసాదాలు (చెరుపులు)

అన్న ప్రసాదాలు

| | |
|---|---|
| దద్దోజనం | 100/- |
| పులిహోర | 200/- |
| పొంగలి | 225/- |
| చక్కెర పొంగలి | 250/- |
| శాకరీ బాత్ | 250/- |
| పాయసం | 225/- |
| సీరా | 450/- |

పై రుసుములు చెల్లించిన గృహస్థుకు నివేదన తర్వాత 1/4 సోల ప్రసాదం ఇస్తారు.

**పడుల ప్రసాదాలు (పణ్యారములు)**

| | | |
|---|---|---|
| లడ్డూ | పడి | 750/- |
| వడ | పడి | 350/- |
| పోళి | పడి | 350/- |
| దోసె | పడి | 350/- |
| తేనెతోళ | పడి | 350/- |
| అప్పం | పడి | 250/- |
| జిలేబి | పడి | 600/- |
| ఆర్జితం లడ్డు | పడి (పెద్దవి) | 2,500/- |
| ఆర్జితం లడ్డు | పడి (చిన్నవి) | 750/- |

5 గురిని శ్రీవారి దర్శనానికి అనుమతిస్తారు.

పడి అనగా 51 సంఖ్య. ఈ రుసుము చెల్లించిన గృహస్థులు వారు అర్పించిన ప్రసాదంలో 30 ఇస్తారు. ప్రసాదాలకు వారే స్వంత పాత్రలు తెచ్చుకోవాలి.

## శ్రీ వేంకటేశ్వర స్వామి వారి ఆలయం, తిరుమల.

## ఆలయ కార్యక్రమ వేళలు

**శని, ఆది వారాలలో...**

★ ఉ. 3-00 గం॥ నుండి ఉ. 3-30 గం॥ వరకు సుప్రభాతం
(ప్రత్యేక ప్రవేశం రూ. 100/-ల టికెట్టుపైన)

★ ఉ. 3-30 గం॥ నుండి ఉ॥ 3-45 గం॥ వరకు శుద్ధి మొదలగునవి.

★ ఉ. 3-45 గం॥ నుండి ఉ 4-30 గం॥ వరకు తోమాల సేవ

(టికెట్టు వెల రూ. 220/-లు).

★ ఉ. 4-30 గం॥ నుండి ఉ. 4-45 గం॥ వరకు కొలువు, పంచాంగ శ్రవణం.

★ ఉ. 4-45 గం॥ నుండి ఉ. 6-00 గం॥ వరకు మొదటి అర్చన

(సహస్రనామార్చన టికెట్టు వెల రూ. 220/-లు)

★ ఉ. 6-00 గం॥ నుండి ఉ. 6-30 గం॥వరకు మొదటిగంట, బలి, శాత్తు మొర

★ ఉ. 6-00 గం॥ నుండి ఉ. 11-00 గం॥ వరకు సర్వదర్శనం.

★ ఉ. 11-00 గం॥ నుండి మ॥ 12-00 గం॥ వరకు

శుద్ధి, రెండవ అర్చన (ఏకాంతం) రెండవ గంట.

★ మ॥ 12-00 గం॥ నుండి రా॥ 7-00 గం॥ వరకు సర్వదర్శనం.

★ మ॥ 1-00 గం॥ నుండి సా॥ 5-00 గం॥ వరకు

ఆర్జిత కళ్యాణోత్సవం, బ్రహ్మోత్సవం, వాహన సేవలు, ఊంజల సేవ మొ॥

★ రా॥ 7-00 గం॥ నుండి రా॥ 8-00 గం॥ వరకు

శుద్ధి, రాత్రి కైంకర్యం (ఏకాంతం), రాత్రి గంట.

★ రా॥ 8-00 గం॥ నుండి రా॥ 10-00 గం॥ వరకు సర్వదర్శనం.

★ రా॥ 10-00 గం॥ నుండి రా॥ 10-30 గం॥ వరకు

శుద్ధి, ఏకాంత సేవకు ఏర్పాట్లు

★ రా॥ 10-30 గం॥ ఏకాంతసేవ

(టికెట్టు రూ. 120/-లు)

**గమనిక :** అవసరాన్ని బట్టి రా॥ 10-00 గం॥ల తర్వాత కూడ సర్వదర్శనం జరుగుతుంది.

**సోమవారాలలో ప్రత్యేక సేవ : విశేష పూజ**

★ ఉ. 3-00 గం॥ నుండి ఉ. 3-30 గం॥ వరకు సుప్రభాతం

(ప్రత్యేక ప్రవేశం రూ. 120/-ల టిక్కెట్టుపైన)

★ ఉ. 3-30 గం॥ నుండి ఉ. 3-45 గం॥ వరకు శుద్ధి మొదలగునవి.

★ ఉ. 3-45 గం॥ నుండి ఉ. 4-30 గం॥ వరకు తోమాలసేవ

(టికెట్టు వెల రూ. 220/-లు)

★ ఉ. 4-30 గం॥ ఉ. 4-45 గం॥ వరకు

కొలువు, పంచాంగ శ్రవణం, బంగారు వాకిలిలో.

★ ఉ. 4-45 గం॥ నుండి ఉ. 6-00 గం॥ వరకు మొదటి అర్చన

(సహస్రనామార్చన టికెట్టు వెల రూ. 220/-లు)

★ ఉ. 6-00 గం॥ నుండి ఉ. 6-30 గం॥ వరకు
మొదటి గంట, బలి, శాత్తుమొర
★ ఉ 6-00 గం॥ నుండి ఉ. 11-00 గం॥ వరకు సర్వదర్శనం.
★ ఉ 11-00 గం॥ నుండి మ॥ 12-00 గం॥ వరకు
శుద్ధి, రెండవ అర్చన (ఏకాంతం) రెండవ గంట.
★ మ. 12-00 గం॥ నుండి రా. 7-00 గం॥ వరకు సర్వదర్శనం.
★ మ 1-00 గం॥ నుండి సా॥ 5-00 గం॥ వరకు
ఆర్జిత కళ్యాణోత్సవాలు, బ్రహ్మోత్సవం,
వాహనసేవలు, ఊంజల సేవ మొ॥
★ రా. 7-00 గం॥ నుండి రా. 8-00 గం॥ వరకు
శుద్ధి, రాత్రి కైంకర్యాలు (ఏకాంతం), రాత్రి గంట.
★ రా. 8-00 గం॥ నుండి రా. 10-00 గం॥ వరకు సర్వదర్శనం
★ రా. 10-00 గం॥ నుండి రా. 10-30 గం॥ వరకు
శుద్ధి, ఏకాంత సేవకు ఏర్పాట్లు
★ రా. 10-30 గం॥ ఏకాంతసేవ
(టికెట్టు రూ. 120/-లు)

**మంగళవారాలలో (ప్రత్యేక సేవ : అష్టదళ పాదపద్మారాధనము)**

★ ఉ. 3-00 గం॥ నుండి ఉ. 3-30 గం॥ వరకు సుప్రభాతం
(ప్రత్యేక ప్రవేశం రూ. 120/-ల టిక్కెట్టుపైన)
★ ఉ. 3-30 గం॥ నుండి ఉ. 3-45 గం॥ వరకు
శుద్ధి మొదలగునవి.
★ ఉ. 3-45 గం॥ నుండి ఉ. 4-30 గం॥ వరకు తోమాలసేవ
(టికెట్టు వెల రూ. 220/-లు)
★ ఉ. 4-30 గం॥ ఉ. 4-45 గం॥ వరకు
కొలువు, పంచాంగ శ్రవణం బంగారు వాకిలిలో.
★ ఉ. 4-45 గం॥ నుండి ఉ. 6-00 గం॥ వరకు మొదటి అర్చన
(సహస్రనామార్చన టికెట్టు వెల రూ. 220/-లు)
★ ఉ. 6-00 గం॥ నుండి ఉ. 6-30 గం॥ వరకు
మొదటి గంట, బలి, శాత్తుమొర

★ ఉ. 6-00 గం॥ నుండి ఉ. 11-00 గం॥ వరకు సర్వదర్శనం.

★ ఉ 11-00 గం॥ నుండి మ॥ 11-15 గం॥ వరకు శుద్ధి

★ మ. 11-15 గం॥ నుండి మ. 11-45 గం॥వరకు అష్టదళ పాదపద్మారాధనసేవ (రెండవ అర్చన బంగారు పద్మములతో)

★ మ. 11-45 గం॥ నుండి మ.12-00 గం॥ వరకు రెండవ గంట

★ మ. 12-00 గం॥ నుండి రా. 7-00 గం॥ వరకు సర్వదర్శనం

★ మ 1-00 గం॥ నుండి సా॥ 5-00 గం॥ వరకు
**ఆర్జిత కళ్యాణోత్సవాలు, బ్రహ్మోత్సవం, వాహనసేవలు,**

★ రా. 7-00 గం॥ నుండి రా. 8-00 గం॥ వరకు
**శుద్ధి. రాత్రి కైంకర్యాలు (ఏకాంతం), రాత్రి గంట.**

★ రా. 8-00 గం॥ నుండి రా. 10-00 గం॥ వరకు సర్వదర్శనం

★ రా. 10-00 గం॥ నుండి రా. 10-30 గం॥ వరకు
**శుద్ధి, ఏకాంత సేవకు ఏర్పాట్లు**

★ రా. 10-30 గం॥ ఏకాంతసేవ
(టికెట్టు రూ. 120/-లు టికెట్టు కొన్నవారిని అనుమతిస్తారు.)

గమనిక : అవసరాన్ని బట్టి రా. 10-00 గం॥ల తర్వాత కూడ సర్వదర్శనం జరుగుతుంది.

**బుధవారాలలో (ప్రత్యేకసేవ : ఆర్జిత సహస్రకలశాభిషేకం)**

★ ఉ. 3-00 గం॥ నుండి ఉ. 3-30 గం॥ వరకు సుప్రభాతం
(ప్రత్యేక ప్రవేశం రూ. 120/-ల టిక్కెట్టుపైన)

★ ఉ. 3-30 గం॥ నుండి ఉ. 3-45 గం॥ వరకు శుద్ధి

★ ఉ. 3-45 గం॥ నుండి ఉ. 4-30 గం॥ వరకు **తోమాలసేవ**
(టికెట్టు వెల రూ. 220/-లు)

★ ఉ. 4-30 గం॥ నుండి ఉ. 4-45 గం॥ వరకు
**కొలువు, పంచాంగ శ్రవణం బంగారు వాకిలిలో.**

★ ఉ. 4-45 గం॥ నుండి ఉ. 6-00 గం॥ వరకు **మొదటి అర్చన**
(సహస్రనామార్చన టికెట్టు వెల రూ. 220/-లు)

★ ఉ. 6-00 గం॥ నుండి ఉ. 6-30 గం॥ వరకు
**మొదటి గంట, బలి, శాత్తుమొర సహస్రకలశాభిషేకం ఏర్పాట్లు**

★ ఉ. 6-30 గం॥ నుండి ఉ. 8-30 గం॥ వరకు
**ఆర్జిత సహస్ర కలశాభిషేకం, రెండవ అర్చన (ఏకాంతం),**
**రెండవ గంట, శుద్ధి,**

★ ఉ. 8-30 గం॥ నుండి రా. 7-00 గం॥వరకు సర్వదర్శనం

★ మ. 1-00 గం॥ నుండి సా॥ 5-00 గం॥ వరకు

**ఆర్జిత కళ్యాణోత్సవాలు, బ్రహ్మోత్సవం, వాహనసేవలు, ఊంజలసేవ మొ॥**

★ రా. 7-00 గం॥ నుండి రా. 8-00 గం॥ వరకు

**శుద్ధి, రాత్రి కైంకర్యాలు, (ఏకాంతం) రాత్రి గంట**

★ రా. 8-00 గం॥ నుండి రా. 10-00 గం॥ వరకు సర్వదర్శనం

★ రా. 10-00 గం॥ నుండి రా. 10-30 గం॥ వరకు

**శుద్ధి, ఏకాంత సేవకు ఏర్పాట్లు**

★ రా. 10-30 గం॥ **ఏకాంతసేవ**

(టికెట్టు రూ. 120/-లు టికెట్టు కొన్నవారిని అనుమతిస్తారు.)

గమనిక : అవసరాన్ని బట్టి రా. 10-00 గం॥ల తర్వాత కూడా సర్వదర్శనం జరుగుతుంది.

**గురువారాలలో (ప్రత్యేక సేవ : తిరుప్పావడ, పూలంగిసేవ)**

★ ఉ. 3-00 గం॥ నుండి ఉ. 3-30 గం॥ వరకు సుప్రభాతం

(ప్రత్యేక ప్రవేశం రూ. 120/-ల టిక్కెట్టుపైన)

★ ఉ. 3-30 గం॥ నుండి ఉ. 3-45 గం॥ వరకు

**శుద్ధి మొ॥**

★ ఉ. 3-45 గం॥ నుండి ఉ. 4-30 గం॥ వరకు

**తోమాలసేవ** (టికెట్టు వెల రూ. 220/-లు)

★ ఉ. 4-30 గం॥ ఉ. 4-45 గం॥ వరకు

**కొలువు, పంచాంగ శ్రవణం, బంగారు వాకిలిలో.**

★ ఉ. 4-45 గం॥ నుండి ఉ. 6-00 గం॥ వరకు

**మొదటి అర్చన** (సహస్రనామార్చన టికెట్టు వెల రూ. 220/-లు)

★ ఉ. 6-00 గం॥ నుండి ఉ. 6-30 గం॥ వరకు

**మొదటి గంట, బలి, శాత్తుమొర**

★ ఉ. 6-30 గం॥ నుండి ఉ. 8-00 గం॥ వరకు

**నళ్ళింపు (ఆభరణ విసర్జనం) రెండవ అర్చన (ఏకాంతం), తిరుప్పావడ మొ॥**

★ ఉ. 8-00 గం॥ నుండి సా. 6-00 గం॥ వరకు సర్వదర్శనం.

★ మ. 1-00 గం॥ నుండి సా॥ 5-00 గం॥ వరకు

**ఆర్జిత కల్యాణోత్సవాలు, బ్రహ్మోత్సవం, వాహనసేవలు, ఊంజలసేవ మొ॥**

★ రా. 6-00 గం॥ నుండి రా. 8-00 గం॥ వరకు
పెద్దశుద్ధి, రాత్రి కైంకర్యాలు, పూలంగి సమర్పణ రాత్రి గంట మొ॥
★ రా. 8-00 గం॥ నుండి రా. 10-00 గం॥ వరకు
పూలంగి సర్వదర్శనం
★ రా. 10-00 గం॥ నుండి రా. 10-30 గం॥ వరకు
శుద్ధి, ఏకాంత సేవకు ఏర్పాట్లు
★ రా. 10-30 గం॥
ఏకాంతసేవ టికెట్టు రూ. 120/-లు టికెట్టు కొన్నవారిని అనుమతిస్తారు.

గమనిక : అవసరాన్ని బట్టి రా. 10-00 గం॥ల తర్వాత కూడ సర్వదర్శనం జరుగుతుంద

**శుక్రవారాలలో (ప్రత్యేక సేవ : అభిషేకం)**

★ ఉ. 3-00 గం॥ నుండి ఉ. 3-30 గం॥ వరకు
సుప్రభాతం (ప్రత్యేక ప్రవేశం రూ. 120/-ల టిక్కెట్టుపైన)
★ ఉ. 3-30 గం॥ నుండి ఉ. 4-30 గం॥ వరకు
నళ్ళింపు, శుద్ధి, నిత్యకట్ల కైంకర్యాలు ఉదయం
మొదటిగంట అభిషేకం ఏర్పాట్లు
★ ఉ. 4-30 గం॥ ఉ. 6-00 గం॥ వరకు
అభిషేకం
★ ఉ. 6-00 గం॥ నుండి ఉ. 7-00గం॥ వరకు
సమర్పణ మొ॥
★ ఉ. 7-00 గం॥ నుండి ఉ. 8-00 గం॥ వరకు
తోమాలసేవ మరియు అర్చన
(రూ.220/-లు టిక్కెట్లు కొన్నవారికి ప్రవేశం)
★ ఉ. 8-00 గం॥ నుండి ఉ. 9-00 గం॥వరకు
రెండవగంట, బలి, శాత్తుమొర మొ॥
★ ఉ. 9-00 గం॥ నుండి, రా. 8-30 గం॥ వరకు
సర్వదర్శనం
★ మ. 1-00 గం॥ నుండి సా॥ 5-00 గం॥ వరకు
ఆర్జిత కళ్యాణోత్సవాలు, బ్రహ్మోత్సవం, మొ॥
★ రా. 7-00 గం॥ నుండి రా. 8-30 గం॥ వరకు
సహస్ర దీపాలంకరణ సేవ కొలిమి మంటపంలో.

★ రా 8-30 గం॥ నుండి రా 9-30 గం॥ వరకు

శుద్ధి, రాత్రి కైంకర్యాలు, రాత్రి గంట మో॥

★ రా 9-30 గం॥ నుండి రా 10-00 గం॥ వరకు సర్వదర్శనం

★ రా 10-00 గం॥ నుండి రా 10-30 గం॥ వరకు

శుద్ధి, ఏకాంత సేవ ఏర్పాట్లు

★ రా 10-30 గం॥ ఏకాంతసేవ

(టికెట్టు రూ 120/-లు టికెట్టు కొన్నవారిని అనుమతిస్తారు.)

గమనిక : అవసరాన్ని బట్టి రా 10-00 గం॥ల తర్వాత కూడ సర్వదర్శనం జరుగుతుంది.

## శ్రీవారి ఆలయం, తిరుమల ఆర్జిత సేవల ధరలు

| వ.నెం. | సేవ/ఉత్సవం పేరు | ప్రవేశం | సమయం (గం॥లలో) | రోజు | టికెట్టు ధర (రూ॥లలో) |
|---|---|---|---|---|---|
| **నిత్యసేవలు** | | | | | |
| 1. | సుప్రభాతం | ఒక్కరికి | ఉ. 03-00 | ప్రతిరోజు | రు. 120 |
| 2 | తోమాలసేవ | ఒక్కరికి | ఉ. 03-45 | ప్రతిరోజు | రు. 220 |
| 3. | సహస్రనామార్చన | ఒక్కరికి | ఉ. 04-30 | ప్రతిరోజు | రు. 220 |
| 4. | ఏకాంతసేవ | ఒక్కరికి | రా. 10-30 | ప్రతిరోజు | రు. 120 |
| 5 | కళ్యాణోత్సవం | ఐదుగురికి | ఉ. 10-00 | ప్రతిరోజు | రు. 2,500 |
| 6. | ప్రత్యేక కళ్యాణోత్సవం | ఇరువురికి | ఉ. 10-00 | ప్రతిరోజు | రు. 750 |
| 7. | ఆర్జిత బ్రహ్మోత్సవం | ఐదుగురికి | మ. 01-00 | ప్రతిరోజు | రు. 500 |
| 8. | డోలోత్సవం | ఆరుగురికి | మ. 01-30 | ప్రతిరోజు | రు. 750 |
| 9. | అర్చనానంతర దర్శనం | ఒక్కరికి | ఉ. 05-00 | శుక్రవారాలు తప్ప | రు. 100 |
| 10. | ఆమంత్రణోత్సవం | ఒక్కరికి | ఉ. 03-30 | శుక్రవారం తప్ప | రు. 620 |
| | | ఒక్కరికి | ఉ. 06-30 | శుక్రవారం | రు. 620 |
| 11. | తోమాల సేవ మరియు అర్చన | ఒక్కరికి | ఉ. 06-30 | శుక్రవారాలు | రు. 420 |
| 12. | సహస్ర దీపాలంకరణ సేవ | ఐదుగురికి | సా. 05-30 | ప్రతిరోజు | రు. 500 |

## వారం వారం సేవలు

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | విశేషపూజ | ఐదుగురికి | ఉ. 6-00 | సోమవారం | రు. 3,000 |
| 2. | అష్టదళపాద పద్మారాధనం | ఐదుగురికి | ఉ. 5-30 | మంగళవారం | రు.3,500 |
| 3. | సహస్ర కలశాభిషేకం | ఆరుగురికి | ఉ. 5-30 | బుధవారం | రు. 5,000 |
| 4. | తిరుప్పావడసేవ | ఆరుగురికి | ఉ. 5-30 | గురువారం | రు. 5,000 |
| 5. | పూరాభిషేకం | ఒక్కరికి | ఉ. 3-30 | శుక్రవారం | రు. 750 |
| 6. | పునుగు గిన్నె | ఒక్కరికి | ఉ. 3-30 | శుక్రవారం | రు. 300 |
| 7. | కస్తూరి గిన్నె | ఒక్కరికి | ఉ. 3-30 | శుక్రవారం | రు. 150 |
| 8. | నిజపాద దర్శనం | ఒక్కరికి | ఉ. 5-30 | శుక్రవారం | రు. 100 |
| 9. | వస్త్రాలంకరణ సేవ | ఇద్దరికి | ఉ. 3-30 | శుక్రవారం | రు. 12,250 |

## ప్రత్యేక సందర్భ సేవలు

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | పవిత్రోత్సవం | ఐదుగురికి | ఉ. 8-00 | ఆగష్టు | రు. 7,500 |
| 2. | వసంతోత్సవం | పదిమందికి | మ. 2-00 | జనవరి | రు.3,000 |
| 3. | పుష్పయాగం | ఐదుగురికి | ఉ. 6-00 | నవంబరు | రు.3,500 |
| 4. | అభిధేయక అభిషేకం | ఐదుగురికి | ఉ. 8-00 | జూన్ | రు.2,000 |
| 5. | పద్మావతి పరిణయం | ఐదుగురికి | సా. 3.00 | ఫిబ్రవరి | రు. 5,000 |
| 6. | పుష్పపల్లకి | ఐదుగురికి | సా. 5.30 | జులై | రు. 1,000 |
| 7. | ప్లవోత్సవం | ఐదుగురికి | ఉ. 6-00 | సం॥ 5 సార్లు | రు. 2,500 |
| 8. | కోయిల్ ఆళ్వారు తిరుమంజనం | పదిమందికి | ఉ. 11-00 | సం॥ 4 సార్లు | రు. 3,000 |

(ఉగాది, ఆణివార ఆస్థానం. బ్రహ్మోత్సవం, వైకుంఠ ఏకాదశిలకు ముందువచ్చు మంగళవారం నాడు జరుగుతుంది.)

**ఇతర వివరాలకు ఫోన్ : 79277, 77777 ఎక్స్. 3679 మరియు 3589**

ఇంకా శుక్రవారం అభిషేకం, పూర్ణాభిషేకం, కస్తూరిగిన్నె సర్కార్ ఉంజుల్ సేవ, ప్రత్యేక సందర్భ సేవలు, వసంతోత్సవం, పవిత్రోత్సవం, పుష్పయాగం, ప్రతి నెలలోను జరిగే ప్రత్యేక సేవలు ఎన్నో......

* శ్రీనివాసమంగాపురం, నారాయణవనం, నాగలాపురాలలో కూడా కళ్యాణోత్సవాలు జరుగుతాయి.

రూ 200/- టిక్కెట్టు. ఉదయం 10 గంటల నుండి 11 గంటల వరకూ. ఇవికాక ప్రత్యేక ప్రవేశాలు కలవు. రూ. 750/- లకు 5 గురికి వెంటనే దర్శనం మరియు 10 లడ్డూలు ఉచితంగా ఇవ్వబడతాయి.

**తిరుమలలో చేయకూడనివి :**

సిగరెట్, మత్తుమందులు సేవించకూడదు. వెంట తీసుకురాకూడదు. మాంసాహారాన్ని వదలండి. పవిత్ర ప్రదేశంలో ఉమ్మివేయటం, అసహ్యకరమైన పనులు చేయకండి. ఆలయం పరిసరాల్లో ఉమ్మివేస్తే పి.హెచ్. సెక్షన్ 44 ప్రకారం 50 రూ. జరిమానా, పరిశుభ్రంగా ఉంచండి. తిరుమలలో పువ్వులు పెట్టుకోకండి. అన్ని పూలు వారికే శ్రీవారికే ......

**తిరుమలలో చూడాల్సిన ప్రదేశాలు :**

**ఆకాశగంగ :** శ్రీవారి ఆలయానికి ఉత్తరంగా 3 కి.మీ. దూరంలో ఉంది.

**పాపవినాశనం :** తిరుమల ఆలయానికి 5 కి.మీ. దూరంలో ఉన్న ఈ జలపాతంలో స్నానం చేస్తే సర్వపాపాలు పోతాయని భక్తుల నమ్మకం.

**వైకుంఠతీర్థం :** శ్రీవారి ఆలయానికి ఈశాన్యదిశలో 3 కి.మీ. దూరంలో ఉంది.

**స్వామి పుష్కరిణి :** శ్రీవారి ఆలయానికి పక్కగా ఉంది. పరమపవిత్రమైన ఈ పుష్కరిణిలో స్నానం చేసి స్వామిని దర్శిస్తారు.

**తుంబురు తీర్థం :** ఆలయానికి ఉత్తరంగా 16 కి.మీ. దూరంలో ఈ తీర్థం ఉంది.

**మ్యూజియం :** 10, 11, 12 శతాబ్దాల నాటి విగ్రహాలు, వందల సంవత్సరాల నాటి సంగీత వాయిద్య పరికరాలు, అప్పటి ఆయుధాలు అన్నింటిని మించి స్వామి పాదాలు చూడొచ్చు. మ్యూజియంలోకి ప్రవేశం 1 రూపాయి. ఈ మ్యూజియం స్వామి ఆలయం ఎదురుగా ఉంది.

**తిరుపతిలో దర్శించవలసిన దేవాలయాలు :**

శ్రీ గోవింద రాజస్వామి ఆలయం, శ్రీ కోదండ రామస్వామి ఆలయం, శ్రీ కపిలేశ్వర స్వామి ఆలయం. గోవిందరాజస్వామి ఆలయంలో మ్యూజియం ఉంది. ఇక్కడ అనేక దేవాలయాలు, గోపురాలు, శిల్పకళకి సంబంధించిన ఎన్నో విషయాలు తెలుసుకోవచ్చు. అనేక గుడుల గోపురాల ఫోటోలను చూడవచ్చు.

శ్రీ పద్మావతిదేవి ఆలయం తిరుపతికి అయిదు కిలోమీటర్ల దూరంలో తిరుచానూరులో ఉన్నది. ఆమెని దర్శించందే తిరుమల యాత్ర ఫలవంతం కాదని

భక్తుల విశ్వాసం. ఇంకా శ్రీనివాస మంగాపురం, నారాయణవనంలోని శ్రీకళ్యాణ వెంకటేశ్వరస్వామి ఆలయాలు ఎంతో పురాణ ప్రసిద్ధి పొందినవి. తప్పనిసరిగా దర్శించవలసినవి.

తిరుపతి నుంచి ఆంధ్రప్రదేశ్ ప్రయాణ పర్యాటక అభివృద్ధి సంస్థ శ్రీకాళహస్తి - చంద్రగిరి, తిరుపతి ఆలయాల దర్శన యాత్రా సర్వీసు నడిపిస్తోంది.

**వాటి వివరములు :**

ప్రతిరోజూ ఉదయం 10 గంటల నుండి సాయంత్రం 5-30 గం॥ వరకు బస్సు ఎ.పి.యస్.ఆర్.టి.సి. సెంట్రల్ బస్ స్టేషన్ మరియు రైల్వేస్టేషన్ నుండి 10 గంటలకు బైలుదేరును.

**చూపించు ప్రదేశములు :**

1) శ్రీకాళహస్తీశ్వర ఆలయం
2) తిరుచానూరు పద్మావతి ఆలయం
3) శ్రీనివాస మంగాపురం కళ్యాణ వెంకటేశ్వర స్వామి ఆలయం
4) చంద్రగిరి మహల్ (కోట) (శుక్రవారం శెలవుదినం)
5) హరేరామ హరేకృష్ణ ఆలయం
6) కపిల తీర్థం (కపిలేశ్వర ఆలయం)
7) గోవిందరాజుస్వామి ఆలయం గుడి దగ్గర వదలివేయబడును.

టికెట్టు వెల 1 కి --- రూ. 60.00 పెద్దలకు
రూ. 50-00 పిల్లలకు 5 సం॥ నుండి 10 సం॥ వరకు

ప్రతి ఆలయమునందు జనము ఎక్కువగా యున్న యెడల స్పెషల్ దర్శనం టికెట్టు ప్రతి యాత్రికులు విధిగా కొనవలయును.

భోజన మరియు వసతి సదుపాయమునకు డిప్యూటీ మేనేజర్, హిల్‌వ్యూ గెస్టు హౌస్, తిరుపతి. ఫోన్ : 22424 వారిని సంప్రదించండి.

## టికెట్లు అమ్మబడు ప్రదేశములు

1. **అసిస్టెంట్ మేనేజర్**
**ఎ.పి. టూరిజం స్టాల్ నెం. 15**
**టి.టి.డి. 1వ సత్రం**
**రైల్వేస్టేషన్ ఓవర్‌బ్రిడ్జి**
**(ఎదురుగా) తిరుపతి.**

2. ఇన్‌ఫర్‌మేషన్ అసిస్టెంట్
ఎ.పి. టూరిజం కేంద్రం
రైల్వేస్టేషన్
తిరుపతి

3. **ఇన్‌ఫర్‌మేషన్ అసిస్టెంటు స్టాల్ నెం. 21 ఎ.పి.యస్.ఆర్.టి.సి. సెంట్రల్ బస్‌స్టేషన్, తిరుపతి.**

## తిరుపతి నుండి బయలుదేరు రైళ్ళు

| | | | |
|---|---|---|---|
| 7405 | తిరుపతి | సికింద్రాబాద్ | 5-30 |
| 8480 | " | పూరి | 9-40 |
| 6054 | " | చెన్నై | 10-05 |
| 7491 | " | వారణాసి | 13-45 |
| 7490 | " | కొచ్చిన్ | 13-45 |
| 7598 | " | మహబూబ్‌నగర్ | 14-40 |
| 7430 | " | హైదరాబాద్ | 5-30 |
| 6799 | " | మధురై | 15-40 |
| 6058 | " | చెన్నై | 17-30 |
| 7423 | " | సికింద్రాబాద్ | 18-30 |
| 7487 | తిరుపతి | విశాఖ | 19-00 |
| 7494 | " | ముంబాయి | 21-40 |
| 6208 | " | కొండాపురం (బుధ, ఆది) | 6-30 |
| 214 | " | మైసూర్ | 22-00 |
| 287 | " | గుంతకల్ | 21-45 |

విమానం : తిరుపతి నుంచి హైదరాబాద్, విజయవాడ, బెంగుళూరు, చెన్నైలకు విమాన సౌకర్యం కలదు.

### చిత్తూరు

కోదండ రామస్వామి ఆలయం, గిరింపేటలో సుబ్రహ్మణ్యస్వామి దేవాలయం ఉంది. ఇక్కడికి పన్నెండు కిలోమీటర్ల దూరంలోనే ఉంది. మరో ప్రసిద్ధి చెందిన ఆలయం, అదే కానిపాకం.

### కానిపాకం

చిత్తూరుకి పడమటలో ఐరాల వెళ్ళే దారిలో వర సిద్ధివినాయక స్వామి గుడి ఉంది. ఇక్కడ గణపతిస్వామి నీళ్ళలో కూర్చుని ఉంటాడు. చాలా శక్తివంతమైన దేవుడు. చుట్టుపక్కల ఊళ్ళవారు ఏ గొడవలైనా స్వామి దగ్గరికొచ్చి అక్కడ తమ వివాదాలను పరిష్కరించుకుంటారు. ఈ మధ్యనే ప్రభుత్వం గుడిని బాగా అభివృద్ధిపరిచింది.

## శ్రీకాళహస్తి

ఏ వేదంబు పఠించె లూత ? భుజంగం బేశాస్త్రముల్సూచె ? దా
నే విద్యాభ్యాసనం బొనర్చెఁగరి ? చెంచే మంత్రమూహించె ? బో
ధావిర్భావ నిదానముల్ చదువులయ్యా ! కావు ! నీ పాదసం
సేవాసక్తియెకాక. జంతుతతికిన్ శ్రీ కాళహస్తీశ్వరా !

శ్రీ కాళహస్తి లింగం ఎత్తైన పీఠం మీద ఉంటుంది. లింగం దంతాలతో కూడిన ఏనుగువలె ఉంటుంది. లింగం కుడిభాగంలో సాలీడు కనిపిస్తుంది. స్వామి పశ్చిమాభిముఖంగా తిరుపతి కొండలవైపు చూస్తూ ఉంటాడు.

ఈ క్షేత్ర సన్నివేశాన్ని మహాకవి ధూర్జటి ఇలా చెప్పాడు.

శమనాశారజ తాద్రి మేను, శరిమా శంభుండు, దుర్గాద్రి నీ
ల మహాద్రుల్ చనుదోయి, పొన్మొఖరి లీలావేణి, బాహుగ్రులిం
ద్ర మయూరాఖ్య సహస్రలింగ పద భారద్వాజ తీర్థముశిలై
యమరున్ ముక్తివధూటి కన్నగిరి మహాత్మ్యంబు సామాన్యమే!

ఆలయ ప్రావరణంలోనే వున్న సూర్య పుష్కరిణి, చంద్రపుష్కరిణి కాక ఈ కాళహస్తి కొండల్లో పన్నెండు తీర్థాలున్నాయి. అవి సుప్రసిద్ధములైనవి.

1. హరిహర తీర్థము : ఇది కాళహస్తికి మూడు మైళ్ళలో వుంది.
2. కళింగ తీర్థము : ఇది కాళహస్తికి మూడు మైళ్ళలోవుంది.
3 సహస్రలింగ తీర్థము : ఇది నైరుతి మూలగా అయిదున్నర మైళ్ళలో ఉంది.
4. మార్కండేయ తీర్థము : ఇది సహస్రలింగ తీర్థానికి ఆరున్నర మైళ్ళలో ఉంది.
5. మయూర తీర్థం : మయూర మహర్షి పేరిటిది.
6. భారద్వాజ తీర్థము : ఇది ఆలయానికి మూడున్నర మైళ్ళలో ఉంది.
7. నారద తీర్థము : ఊరి మధ్యలో ఉంది.
8. సరస్వతీ తీర్థము : ఈ తీర్థం ప్రసాదంగా 40 రోజులు సేవిస్తే మూగవారికి మాటలు వస్తాయి అని భక్తుల నమ్మకం.
9. శుకతీర్థము : శుక మహర్షి పేరిటిది.
10. బ్రహ్మతీర్థము
11. మణికర్ణికా తీర్థము
12. తత్త్వ ప్రకాశ తీర్థము

ఇక్కడ గుడి ఎప్పటి నుంచి ఉన్నదో తెలీదు. స్కాంద పురాణంలో శ్రీ కాళహస్తి ప్రసక్తి ఉంది. అర్జునుడు తీర్థయాత్రా సందర్భంగా వచ్చి ఈ క్షేత్రం సందర్శించి భారద్వాజ మహర్షి వల్ల ఈ స్థల మహిమను, స్వర్ణముఖీ మహిమను విన్నట్లు అందులో వున్నది.

పంచభూత శైవక్షేత్రములలో శ్రీకాళహస్తి ఎంతో ప్రసిద్ధి చెందింది. కంచిలో పృధ్వీలింగము, జంబుకేశ్వరంలో జలలింగము, తిరువణ్ణామలైలో తేజోలింగము, శ్రీకాళహస్తిలో వాయులింగము, చిదంబరంలో ఆకాశలింగము ఇవి పంచభూత క్షేత్రములు. ఆ పంచభూత క్షేత్రాలలో ఒకటి ఈ కాళహస్తి. శ్రీ కాళహస్తీశ్వరాలయం రాహుకేతు నిలయం. వాయులింగేశ్వరుని దర్శిస్తే రాహుకేతు దోషం పోతుంది. ఇక్కడ ఆలయంలో ఏ మూల చూసినా సర్పదోష నివారణ పూజలు చేస్తున్న దృశ్యమే కనపడుతుంది. కాశీలో పోతే ముక్తి. కాని ఇక్కడ కాలుపెడితేనే ముక్తి.

తిరుపతికి 65 కి.మీ. దూరంలో ఉంది. ఇచ్చటనే భక్త కన్నప్ప చరిత్ర జరిగింది. స్వయంభూలింగముగా వెలసిన ఈ స్వామిని సాలె పురుగు, కాళము, హస్తి మూడూ అకుంఠిత భక్తితో పోటాపోటీగా పూజించి, చివరికి మోక్షము పొందాయని పురాణ కథ. స్వర్ణముఖి నది వొడ్డున దుర్గమ్మ గుడిలో విశేషం.... ఆ తల్లి కాళ్ళకు సంకెళ్ళు వేసి ఉండటం. ఈశ్వరుడు ఋషిరూపంలో వచ్చి, మనుషుల్ని తింటున్న దుర్గమ్మకి సంకెళ్ళు వేశారన్నది ఇక్కడ స్థల మహత్యంలో చెప్పబడింది. ఈ క్షేత్రంలోనే బ్రహ్మ గుడి కూడా ఉంది. ఈ క్షేత్ర సందర్శనం మహాభాగ్యం.

## కైలాసనాథకోన జలపాతం

చెన్నై వెళ్ళేదారిలో నాగలాపురం అవతల బస్సు దిగి రెండు కి.మీ. దూరం వెళితే ఈ సుందర జలపాతాన్ని కనులారా చూడవచ్చు. నవంబర్, డిసెంబర్, జనవరిలో సందర్శిస్తే మరింత బాగుంటుంది. ఈ జలపాతం నీటిలో ఎన్నో వ్యాధులను నిర్మూలించే శక్తి వుందని ప్రతీతి.

## పులికాట్ సరస్సు

మంచి పిక్నిక్ స్పాట్. శ్రీకాళహస్తికి 27 కి.మీ. దూరంలో వుంది. ప్రక్కనే వున్న శ్రీహరికోటకు కూడా అనుమతి తీసుకొని వెళ్ళి చూడవచ్చు.

## జొన్నవాడ

నెల్లూరుకు 25 కి.మీ. దూరంలో ఉంది. ఇక్కడ కామాక్షి దేవి దేవాలయం ఉంది. ఈ దేవి అనుగ్రహమున సంతానప్రాప్తి, దీర్ఘరోగ నివారణ, గ్రహబాధ నివృత్తి ఎందరికో కలిగాయి. తిక్కన ఇక్కడ యజ్ఞం చేసి సోమయాజి అయ్యాడు. ఆలయానికి చుట్టు పక్కల అనేక శిథిల ఆలయాలున్నాయి.

## నాగలాపురం

విజయనగర రాజుల వైభవానికి తార్కాణంగా నిలిచిన ఈ ప్రదేశంలో చారిత్రక విశేషాలు కోకొల్లలు. శ్రీకృష్ణదేవరాయలు తన తల్లికి కట్టించిన దేవాలయము ఇక్కడే ఉంది.

## నెల్లూరు

ప్రాచీనమైన సింహపురి గ్రామ దేవత ఇరుకలు మహేశ్వరి (ఇరుగాలమ్మ) పట్టణంలో పడమటి దిశన ఉంది. శ్రీరంగ నాథాలయం శ్రీరంగనాయకస్వామిని దర్శించవచ్చు. నెల్లూరు నుంచి గూడూరు వెళ్ళేదారిలో నెల్లూరు ఎంట్రన్స్‌లో అయ్యప్పస్వామి ఆలయం ఉంది. తప్పనిసరిగా దర్శించదగ్గ ముఖ్యమైనది. పెన్నానది వొడ్డున కవి తిక్కన మహాభారతాన్ని రాసిన ప్రదేశం చూడవచ్చు. కాని ఆ ప్రదేశం చెప్పనలవిగాని స్థితిలో ఉంది. అంతటి మహనీయుడిని మరిచిపోకుండా స్థానికులైనవారు నడుం కట్టి తీర్చిదిద్దితే ఆర్థిక సహాయం (నాచేతనైన రీతిలో) ఈ పుస్తక రచయితగా నేను ఇవ్వటానికి సిద్ధం. పెన్నానదిలో స్నానం మనసుకు ఆహ్లాదం, వసతికి సింహపురి (రైల్వేస్టేషన్ రోడ్డు) ఇంకా అనేక హోటల్స్.

## పెంచల కోన

నెల్లూరు నుంచి 50 కి.మీ. దూరం. గూడూరు నుంచి 40 కి.మీ. గోనుపల్లి అనే గ్రామానికి 6 కి.మీ. దూరంలో ఉంది. ఇక్కడ స్వామి శ్రీ పెనుశిల లక్ష్మీనరసింహస్వామి. ఈ స్వామివారు 'స్వయంభు'. పెనుశిలయనగా పెద్ద శిల అనీ, పెనవేసుకున్నందున పెనుశిల అంటారు. నవనారసింహులకే వొకరు స్వామి. ఈ ప్రదేశమే కణ్వమహర్షి నివశించినది. చుట్టూ కొండలు, చక్కటి ప్రకృతితో అలరారుతోంది ఈ క్షేత్రం.

## వాడరేవు

చుట్టుప్రక్కలవారు సముద్ర స్నానానికి ఇక్కడికే వస్తారు. బీచ్ రిసార్ట్ కూడా ఉంది. సముద్రతీరంలో హాయిగా సన్నిహితులతో ప్రశాంతంగా ఉండవచ్చు.

## గుంటూరు

ఈ జిల్లాలో 1360కి పైగా దేవాలయాలున్నాయి.

అర్. అగ్రహారంలో ప్రసిద్ధి చెందిన రామనామక్షేత్రం ఉంది. కొత్తపేటలో ఆంజనేయస్వామి వారి ఆలయం. ఇంకా శ్రీ కన్యకాపరమేశ్వరి దేవాలయం, శ్రీ కుసుమ హరనాథాలయం ఉన్నాయి. ఇచ్చటనుండి అమరావతి, పెదకాకాని, మంగళగిరి దగ్గర, వసతికి.... హోటల్ సుదర్శన్, రవిశంకర్, విజయకృష్ణాలాంటివి ఉన్నాయి.

## అమరావతి

గుంటూరు నుండి ఇచ్చటకు ప్రతి అరగంటకు బస్సులున్నాయి. గుంటూరుకి 27 కి.మీ. దూరంలో ఉంది. కృష్ణానదీ తీరమున వున్న ఈ క్షేత్రం పెద్ద క్షేత్రముగా విశేషమైన పేరుగాంచి ఉంది. అమరేశ్వరాలయంలో అమరేశ్వరస్వామి. దేవేరి రాజ్యలక్ష్మి అమ్మవారు అయిదు ప్రాకారాల మధ్య వేంచేసి ఉంటారు. పదిహేను అడుగుల ఎత్తున లింగము మూడు అడుగుల కైవారంతో ఏనుగు దంతాల రంగులో ఉంటుంది.

ఇచ్చట శివలింగము దినదినం పెరుగుతుండటంతో ఏంచేయాలో తెలీక నడినెత్తిన మేకు కొట్టారని, అంతటితో ఆగిందని దానికి గుర్తుగా లింగం నడినెత్తిపైన మేకు కొట్టినప్పుడు కారిన రక్తం ధారల చారలు గమనించవచ్చు. శ్రీ స్వామి వారికి అభిషేకాలు చేయాలన్నా పైకి వెళ్ళే చేస్తారు. ఇక్కడ మ్యూజియంలో శిల్పాలు చూస్తే. అమరావతి గత వైభవం కళ్ళకు కట్టినట్టు కనిపిస్తుంది. వసతికి గవర్నమెంట్ టూరిస్ట్ రెస్ట్ హౌస్ ఉంది.

## పొన్నూరు

గుంటూరు నుంచి 25 కి.మీ. దూరం. ఈ పట్టణంలో ప్రసిద్ధి చెందిన శ్రీ భావనారాయణస్వామి దేవాలయం ఉంది. ఈ స్వామిని శ్రీ సాక్షి భావ నారాయణస్వామి అని కూడా అంటారు. ఈ దేవాలయ ప్రాంగణమున శ్రీ రాజ్యలక్ష్మి అమ్మవారి దేవాలయం శ్రీకాశీ విశ్వేశ్వరాలయము, శ్రీకాశీ విశాలాక్షి దేవాలయము వెలిశాయి.

ఈ పొన్నూరులోనే, శ్రీ సహస్ర లింగేశ్వరస్వామి దేవస్థానము ఉంది. ఈ ఆలయాన్ని 1939లో నిర్మించారు. ఇక్కడే 1961లో శ్రీ వీరాంజనేయస్వామి, శ్రీ పెద్ద గరుత్మంతస్వామి విగ్రహ ప్రతిష్టలు జరిగాయి. ఈ విగ్రహాలు ఏకశిలా విగ్రహములై 24 అడుగుల ఎత్తుతో వీరాంజనేయస్వామి, 30 అడుగుల ఎత్తుతో శ్రీ పెద్ద గరుత్మంత స్వామీ నయనానందకరంగా అగుపిస్తారు.

**వల్లూరు శ్రీ వల్లూరమ్మ దేవస్థానం :** ఒంగోలు నుంచి అతిదగ్గర. ఆంధ్రకేసరి శ్రీ టంగుటూరి ప్రకాశం పంతులుగారి జన్మస్థలం కూడా ఈ వల్లూరే. 275 సంవత్సరాల క్రితం ఒక మహాయజ్ఞములో శ్రీ అమ్మవారు ఆవిర్భవించినట్లు ఇచ్చటి స్థల పురాణం వల్ల తెలుస్తుంది.

## వైకుంఠపురం

అమరావతి నుంచి 6 కి.మీ. దూరంలో పవిత్ర కృష్ణానది తీరాన కొండమీద శ్రీ వేంకటేశ్వరుడు కొలువు తీరివుంటాడు. ఇచ్చట నుండి వర్షాకాలంలో విజయవాడకు లాంచీల మీద వెళ్ళవచ్చు.

## పెదకాకాని

గుంటూరు నుంచి ఆటోలో కూడా వెళ్ళొచ్చు అంతదగ్గర.... సాంబశివాలయం..... కోరిన కోర్కెలను సాంబశివుడు సాఫల్యం చేస్తాడని భక్తకోటి అపారనమ్మకం. ఈ స్వామి శ్రీశైల లింగాంశము కలిగియుండుటచే ద్వాదశ జ్యోతిర్లింగముల యందలి మహిమ ఇందు నెలకొనివుంది. ఈ దేవాలయ ప్రాంగణంలో భరద్వాజునిచే నిర్మింపబడిన శివ రూపము కలదు. ఇందు సమస్త తీర్థములను నిక్షిప్తము చేశారు.

## మంగళగిరి

రాత్రి సమయాల్లో దేవతలు అర్చనలు జరుపుతారని ప్రతీతి. కొండమీద స్వామి వారిని సేవించడానికి మధ్యాహ్నం వరకే అవకాశం ఉంది. స్వామివారికి నివేదనలలో ప్రధానమైనది బెల్లపు పానకం. శ్రీనృసింహస్వామి హిరణ్యకశిపుని సంహారం చేయటానికి స్తంభం నుంచి ఉద్భవించి, ఆ రాక్షసుని తొడలపై వేసికొని, పొట్ట చీల్చి పేగులను మెడలో ధరించి భీకరంగా వుండగా, సర్వదేవతలు శాంతించమని వేడుకున్నారు. ఆయన శాంతించలేదు. శ్రీలక్ష్మీదేవి కొండమీద తపస్సు చేసి స్వామివారికి పానకం నివేదించింది. దాన్ని స్వీకరించి స్వామివారు శాంతించారు. లక్ష్మీదేవి తపస్సు చేయటం వల్ల మంగళగిరి అనే పేరు వచ్చింది. శ్రీపానకాల లక్ష్మీ నృసింహస్వామి దేవాలయ గర్భగుడిలో భక్తప్రహ్లాద, లీలావతిదేవి విగ్రహాలు వున్నాయి. ఎన్నో ప్రత్యేకతలు వున్న ఈ క్షేత్రంలో సౌకర్యాల దృష్ట్యా కొన్ని లోపాలున్నాయి.

## మాచెర్ల

శ్రీ చెన్న కేశవాలయము ఉంది. చంద్రవంక నదీతీరమున నున్న ఆలయంలో ఐదు తలల నాగ ప్రతిమ తెల్ల పాలరాతితో చేయబడినది ఉంది. ఇక్కడున్న శ్రీకృష్ణుని విగ్రహ ప్రతిష్ట బ్రహ్మనాయుడు చేశాడు. గర్భగుడి దగ్గరలో నాలుగు స్థంభాల మండపంలోని శిల్ప సౌందర్యం మనల్ని ముగ్ధుల్ని చేస్తుంది.

ఈ ఆలయానికి ఎడమవైపు వీరభద్ర స్వామి దేవాలయం, భద్రకాళి విగ్రహంతోపాటు శనేశ్వర విగ్రహం కూడా ఉన్నాయి. దగ్గరలో కామేశ్వరి దేవాలయం కూడా ఉంది. ఈ నగర సందర్శన ఆనాటి కారెంపూడి వీరుల సాహసగాథను గుర్తుకు తెస్తుంది.

## ఉండవల్లి

కృష్ణానది ఒడ్డున వున్నదీ గుహాలయము. ఈ వైష్ణవాలయములో రెడ్డిరాజుల శాసనాలు ఉన్నాయి. స్వామి విగ్రహం పెద్దది. 5,6 శతాబ్దాల కాలంలో ఆంధ్రప్రాంతాన్ని

పాలించిన విష్ణుకుండిన రాజులు ఇక్కడి గుహలను నిర్మించినట్టు తెలుస్తోంది. నాలుగు అంతస్తులుగా ఉంటాయి గుహలు. మొదటి అంతస్తులో విఘ్నేశ్వరుడు, దత్తాత్రేయుడు, శంకరుని విగ్రహాలున్నాయి. రెండవ అంతస్తులో పద్మనాభస్వామి దేవతామూర్తి ఉంది. ఈ ఉండవల్లి నుంచి మంగళగిరి పానకాల స్వామి గుడికి సొరంగ మార్గం వుందని చెబుతారు.

## విజయవాడ

"శ్రీ ఓం దుర్గేస్మృతాహరసి భీతి మశేషజంతోః
స్వస్థైస్మృతామతి మదీవ శుభాందదాసి
దారిద్ర్య దుఃఖభయహారిణి కాత్వదన్యా
సర్వోపకార కరుణాయ సదార్ద్ర చిత్తా".

ఇంద్రకీలాద్రిపై వెలిసిన అమ్మ, అమ్మలను గన్న పెద్దమ్మ, కనకదుర్గమ్మ వేంచేసి వుంది. ఇక్కడే పాండవ మధ్యముడు పాశుపతాస్త్రము కోసం తపస్సు చేసి విజయం సాధించినది. అందుచేతనే ఆ విజయం పేర విజయవాడగా పిలవబడుతోంది. ప్రతి పన్నెండు సంవత్సరాలకి కృష్ణాపుష్కరములు జరుగుతాయి. ఈ తల్లిని అగస్త్యాది మహర్షులు, పరశురామ, శ్రీరామ, శ్రీకృష్ణాది అవతార పురుషులతో పాటు దేవరాయలాది రాజులు, అర్చించి, అభీష్ట సిద్ధులు పొందారు. ఇక్కడి అమ్మవారి రౌద్రరూపం శాంతింపచేయటానికి జగద్గురు ఆదిశంకరాచార్యులు శ్రీచక్ర ప్రతిష్ఠ గావించారు. ఈమె సాక్షాత్తు పక్కనగల శ్రీవేంకటేశ్వరునికి సోదరి. అమ్మవారిని, శ్రీ మల్లేశ్వరాలయం దర్శించి మెట్లు దిగితే క్రొత్త గుళ్ళు వస్తాయి. ఈ దేవాలయాలను తప్పనిసరిగా దర్శించండి. బందరు రోడ్డులో, ఆంధ్రజ్యోతికి ఇవతల రోడ్డులో వేంకటేశ్వరస్వామి ఆలయం వుంది. గొల్లపూడిలో అయ్యప్పస్వామి ఆలయం దర్శించి శబరిమల వెళ్ళిన ఫలం పొందండి.

ఈ మధ్యనే నిర్మించిన రాజీవ్‌గాంధి పార్క్ మీ ప్రయాణ బడలికను తగ్గిస్తుంది. మైసూర్ బృందావన్ గార్డెన్స్‌లో ఉన్నటువంటి మ్యూజికల్ వాటర్ ఫౌంటెన్ ఇచ్చట ముఖ్య ఆకర్షణ.

కృష్ణానదిలో బోటు విహారానికి సాయంత్రం నాలుగులోపు కృష్ణవేణి మోటెల్‌కి వెళ్ళండి. సుందర భవానీ ఐలాండ్స్‌లో సేదతీరండి. ఈ కృష్ణవేణి మోటెల్ నుండి అమరావతికిబోటు సౌకర్యం వుంది. 10 మందికి చార్జి 1500 రూ. రెండు సార్లు అల్పాహారంతో మోటార్ బోటు మీద అమరావతికి కృష్ణానదిపై ప్రయాణించటం మధురాతి మధురమైన అనుభూతి.

విజయవాడ నుంచి టూరిజం శాఖవారు కొన్ని గ్రూప్ టూర్స్ నిర్వహిస్తున్నారు.

**సౌత్ ఇండియన్ టూర్** :

ప్రతి నెల నాలుగో శనివారం. మొత్తం ప్రయాణం 14 రోజులు, శనివారం రోజు రాత్రి 8.00 గంటలకు బైలుదేరుతుంది. టికెట్టు 2200/-, పిల్లలకు 1650/-.

**యాత్రా ప్రదేశాలు** : తిరుపతి, తిరుత్తణి, కాంచీపురం, చెన్నై, మహాబలిపురం, పక్షితీర్థం, పాండిచ్చేరి, చిదంబరం, కుంభకోణం, శ్రీరంగం, తిరుచ్చి, మధురై, రామేశ్వరం, తిరుచెందూరు, కన్యాకుమారి, సుచీంద్రము, త్రివేంద్రం, కోవలం, కొచ్చిన్, గురవాయూరు, ఊటీ, మైసూరు, శ్రీరంగపట్నం, శ్రావణ బెళగొళ, బేళ్ళూరు - హాలిబీడ్, బెంగుళూర్, లేపాక్షి, శ్రీశైలం.

**తిరుపతి టూరు** : ప్రతి శుక్రవారం మూడురోజుల యాత్ర......... పెద్దలకు రూ. 300/-, పిల్లలకు రూ. 200/- శుక్రవారం రాత్రి 7 గంటలకు బయలుదేరి సోమవారం ఉదయం తిరిగివచ్చే ఈ టూరులో తిరుచానూరు, శ్రీకాళహస్తి, శ్రీనివాస మంగాపురం, తిరుపతి, తిరుమల.

**నాగార్జునసాగర్** : ప్రతి మంగళవారం సాయంత్రం 3 గంటలకు బైలుదేరి నాగార్జునసాగర్ డామ్, ఎత్తిపోతల వాటర్ చూసుకొని గురువారం రాత్రి 10.30 కి వచ్చేయవచ్చు. పెద్దలకు రూ. 140/- పిల్లలకు రూ. 100/-.

**అమరావతి** : ఉదయం 8 గంటలకు బైలుదేరి తిరిగి రాత్రి ఏడు గంటలకు విజయవాడకు చేరుకొంటారు. టిక్కెట్ రూ. 35/- మార్గమధ్యంలో మంగళగిరి కూడా చూడవచ్చు.

పై టూర్స్ గురించి మరికొన్ని వివరాలు కావలసినవారు 61220 / 75382 కు ఫోన్ చేయవచ్చు. ఎ.పి. టూరిజం ఫోన్ : 577386.

## విజయవాడలో రైలు సమయాల వివరాలు

**ఎంక్వయిరీ : కంప్యూటర్ 131; ఓరల్ 577775, రిజర్వేషన్ : 135, 578955**

| రైలు నెంబరు | ఎక్కడి నుంచి ఎక్కడికి | రైలు పేరు | చేరుకునే సమయం | బయలుదేరే సమయం |
|---|---|---|---|---|
| | **గూడూరు వైపుకు** | | | |
| 8439 | పూరి - తిరుపతి (శని) | | 00-15 | 00-35 |
| 2622 | న్యూఢిల్లీ - చెన్నై | తమిళనాడు | 00-15 | 00-25 |
| 2760 | హైదరాబాద్ - చెన్నై | చార్మినార్ | 01-30 | 01-40 |

| | | | | |
|---|---|---|---|---|
| 6040 | వారణాసి - చెన్నై | గంగా కావేరి | | |
| | | (బుధ, శుక్ర) | 03-10 | 03-30 |
| 6044 | పాట్నా - చెన్నై | (సోమ, శని) | 03-10 | 03-30 |
| 6094 | లక్నో - చెన్నై | (బుధ, శని) | 02-55 | 03-15 |
| 6032 | జమ్ముతావి - చెన్నై | (సోమ, మంగళ, ఆది) | 02-55 | 03-15 |
| 2711 | విజయవాడ - చెన్నై | పినాకిని | | 06-00 |
| 7090 | వారణాసి - కొచ్చిన్ | (శుక్ర) | 06-15 | 06-25 |
| 7479 | హౌరా-తిరుపతి | | 08-00 | 08-20 |
| 2434 | నిజాముద్దీన్ - చెన్నై | రాజధాని | | |
| | | (గురు, శని) | 14-05 | 14-20 |
| 6045 | అహ్మదాబాద్ - చెన్నై | నవజీవన్ | 09-30 | 09-50 |
| 2841 | హౌరా - చెన్నై | కోరమాండల్ | 10-25 | 10-45 |
| 7406 | సికింద్రాబాద్-తిరుపతి | కృష్ణ | 13-00 | 13-15 |
| | నిజాముద్దీన్ - మంగుళూర్ | మంగళ (ఈ రైలు రద్దు చేయబడినది) | | |
| 2626 | న్యూఢిల్లీ - త్రివేంద్రం | కేరళ | 14-45 | 15-00 |
| 5012 | గోరఖ్‌పూర్ - కొచ్చిన్ | (బుధ, ఆది, సోమ) | 18-50 | 19-10 |
| 7058 | బిలాస్‌పూర్ - కొచ్చిన్ | (మంగళ, శని) | 18-50 | 19-10 |
| 7082 | ఇండోర్ - కొచ్చిన్ | (గురు) | 18-50 | 19-10 |
| 8689 | బొకారో - కొచ్చిన్ | | 19-15 | 19-35 |
| 6003 | హౌరా - చెన్నై | మెయిల్ | 20-00 | 20-20 |
| 6310 | పాట్నా - అలెప్పి | (శుక్ర) | 20-50 | 21-10 |
| 5626 | గౌహతి - బెంగుళూర్ | (మంగళ, గురు) | 04-30 | 04-50 |
| 5624 | గౌహతి - కొచ్చిన్ | (సోమ) | 04-30 | 04-50 |
| 6324 | హౌరా - త్రివేంద్రం | (మంగళ, శని) | 04-30 | 04-50 |
| 5628 | గౌహతి - త్రివేంద్రం | | 04-30 | 04-50 |
| 7044 | కాకినాడ - చెన్నై | సర్కార్ | 21-05 | 21-25 |
| 6318 | జమ్ముతావి - కన్యాకుమారి | (బుధ) | 21-30 | 21-40 |
| 6688 | జమ్ముతావి - మంగుళూరు | (శని) | 21-30 | 21-40 |

| | | | | |
|---|---|---|---|---|
| 7488 | విశాఖ - తిరుపతి | తిరుమల | 22-00 | 22-20 |
| 2616 | న్యూఢిల్లీ - చెన్నై | జి.టి. ఎక్స్‌ప్రెస్ | 23-10 | 23-20 |
| 2712 | చెన్నై - విజయవాడ | పినాకిని | 21-10 | |
| 2764 | సికింద్రాబాద్ - తిరుపతి | (ఆది, శని) | 01-05 | 01-15 |
| | **విశాఖపట్టణం వైపుకు** | | | |
| 7048 | సికింద్రాబాద్ - కాకినాడ | గౌతమి | 02-10 | 02-30 |
| 7487 | తిరుపతి - విశాఖపట్టణం | తిరుమల | 02-40 | 03-10 |
| 8690 | అలెప్పీ - బొకారో | బొకారో | 05-55 | 06-20 |
| 2718 | విజయవాడ - విశాఖపట్టణం | రత్నాచల్ | | 06-10 |
| 6004 | చెన్నై - హౌరా | మెయిల్ | 06-10 | 06-35 |
| 8562 | నిజాముద్దీన్ - విశాఖపట్టణం | లింక్ | 07-15 | 07-35 |
| 7239 | గుంటూరు - విశాఖపట్టణం | సింహాద్రి | 09-00 | 09-25 |
| 7046 | హైదరాబాద్ - హౌరా | ఈస్ట్ కోస్ట్ | 13-20 | 13-40 |
| 5625 | బెంగుళూరు - గౌహతి | (శుక్ర, శని) | 14-05 | 14-25 |
| 6309 | కొచ్చిన్ - పాట్నా | (మంగళ) | 14-05 | 14-25 |
| 5623 | కొచ్చిన్ - గౌహతి | (బుధ) | 14-05 | 14-25 |
| 5627 | త్రివేండ్రం - గౌహతి | (సోమ) | 14-05 | 14-25 |
| 6323 | త్రివేండ్రం - హౌరా | (ఆది, గురు) | 14-05 | 14-25 |
| 1019 | ముంబాయి - భువనేశ్వర్ | కోణార్క్ | 14-20 | 14-40 |
| 2842 | చెన్నై - హౌరా | కోరమాండల్ | 15-45 | 16-00 |
| 8440 | తిరుపతి - పూరి | (శని) | 22-55 | 23-15 |
| 7008 | హైదరాబాద్ - వైజాగ్ | గోదావరి | 23-30 | 23-50 |
| 8402 | ఓఖా - పూరి | (గురు) | 21-45 | 22-00 |
| 2704 | సికింద్రాబాద్ - హౌరా | ఫలక్‌నామ | 21-10 | 21-30 |
| 6804 | తిరుచురాపల్లి - హౌరా | (బుధ, శని, సోమ) | 05-45 | 05-55 |
| 2717 | విశాఖపట్టణం - విజయవాడ | రత్నాచల్ | 19-00 | |
| 8564 | బెంగుళూరు - విశాఖపట్టణం | ప్రశాంతి (ఆది, శుక్ర) | 08-00 | 08-20 |

## గుంటూరు వైపుకు

| | | | | |
|---|---|---|---|---|
| 7615 | పలాస - కాచిగూడ | విశాఖ | 00-25 | 00-45 |
| 7240 | విశాఖపట్టణం - గుంటూరు | సింహాద్రి | 13-55 | 14-05 |
| 7202 | సికింద్రాబాద్ - గుంటూరు | గోల్కొండ | 19-40 | 19-55 |
| 7225 | విజయవాడ - లోండా | అమరావతి | | 21-00 |
| 7055 | నరసాపూర్ - సికింద్రాబాద్ | నరసాపూర్ | 22-10 | 22-25 |
| 2703 | హౌరా - సికింద్రాబాద్ | ఫలక్‌నామా | 05-00 | 05-20 |
| 7226 | లోండా - విజయవాడ | అమరావతి | 05-35 | |
| 8563 | విశాఖపట్టణం - బెంగుళూరు | ప్రశాంతి (శుక్ర) | 12-15 | 12-35 |

## కాజీపేట వైపుకు

| | | | | |
|---|---|---|---|---|
| 8401 | పూరి - ఓకా | (సోమ) | 00-00 | 00-20 |
| 6039 | చెన్నై - వారణాసి | జి.కె. ఎక్స్‌ప్రెస్ (ఆది, మంగళ) | 00-20 | 00-35 |
| 9767 | చెన్నై - జైపూర్ | (బుధ, శని, సోమ) | 00-20 | 00-35 |
| 2759 | చెన్నై - హైద్రాబాద్ | చార్మినార్ | 01-15 | 01-25 |
| 2621 | చెన్నై - న్యూఢిల్లీ | తమిళనాడు | 04-20 | 04-30 |
| 1020 | భువనేశ్వర్ - ముంబాయి | కోణార్క్ | 04-20 | 04-40 |
| 2615 | చెన్నై - న్యూడిల్లీ | జి.టి. ఎక్స్‌ప్రెస్ | 05-25 | 05-35 |
| 2713 | విజయవాడ - సికింద్రాబాద్ | శాతవాహన | | 06-00 |
| 5011 | కొచ్చిన్ - గోరఖ్‌పూర్ | (బుధ, శుక్ర, శని) | 06-20 | 06-30 |
| 7057 | కొచ్చిన్ - బిలాస్‌పూర్ | (గురు, ఆది) | 06-20 | 06-30 |
| 7081 | కొచ్చిన్ - ఇండోర్ | (మంగళ) | 06-20 | 06-30 |
| 5221 | కొచ్చిన్ - బరౌని | (సోమ) | 06-20 | 06-30 |
| 7201 | గుంటూరు - సికింద్రబాద్ | గోల్కొండ | 06-30 | 06-40 |
| 2625 | త్రివేండ్రం - న్యూఢిల్లీ | కేరళ | 11-10 | 11-25 |
| 7045 | హౌరా - హైదరాబాద్ | ఈస్ట్‌కోస్ట్ | 12-00 | 12-20 |
| 6031 | చెన్నై - జమ్ముతావి(ఆది, బుధ, గురు) | | 13-55 | 14-15 |
| 6093 | చెన్నై - లక్నో (మంగళ, శని) | | 13-55 | 14-15 |

| | | | | |
|---|---|---|---|---|
| 6317 | కన్యాకుమారి - జమ్ముతావి | హిమసాగర్ | | |
| | | (శని) | 16-05 | 16-15 |
| 6687 | మంగుళూరు-జమ్ముతావి | నవయుగ | | |
| | | (మంగళ) | 16-05 | 16-15 |
| 6046 | చెన్నై - అహ్మదాబాద్ | నవజీవన్ | 16-35 | 16-50 |
| 8561 | విశాఖపట్టణం-నిజాముద్దీన్ | లింక్ | | |
| | | (శుక్ర, ఆది) | 18-20 | 18-40 |
| 2433 | చెన్నై - నిజాముద్దీన్ | రాజధాని | | |
| | | (శుక్ర, ఆది) | 17-55 | 18-05 |
| 7089 | కొచ్చిన్ - వారణాసి | (ఆది) | 20-40 | 20-50 |
| 7007 | విశాఖ - హైద్రాబాద్ | గోదావరి | 22-45 | 23-05 |
| 7047 | కాకినాడ - సికింద్రాబాద్ | గౌతమి | 23-35 | 23-55 |
| 2763 | తిరుపతి సికింద్రాబాద్ | (ఆది, శని) | 23-15 | 23-25 |
| 6043 | చెన్నై - పాట్నా | (మంగళ, గురు) | 20-40 | 20-50 |
| 2714 | సికింద్రాబాద్ - విజయవాడ | శాతవాహన | 21-45 | |
| 6343 | యెర్నాకులమ్ - నిజాముద్దీన్ | స్వర్ణ జయంతి | | |
| | | (బుధ) | 14-40 | 15-00 |

**గుడివాడ వైపుకు**

| | | | | |
|---|---|---|---|---|
| 7043 | చెన్నై - కాకినాడ | సర్కార్ | 03-15 | 03-35 |
| 7056 | హైద్రాబాద్ - నర్సాపూర్ | నర్సాపూర్ | 04-25 | 04-45 |
| 7480 | తిరుపతి - హౌరా | | 18-30 | 18-50 |
| 7616 | కాచిగూడ - పలాస | విశాఖ | 23-00 | 23-10 |

## హోటల్స్ అండ్ గెస్ట్‌హౌసెస్

హోటల్ ఐలాపురం, గాంధీనగర్.

హోటల్ మనోరమ, మహాత్మాగాంధీ రోడ్,

స్వర్ణాప్యాలెస్, గవర్నర్‌పేట, ఏలూరురోడ్

హోటల్ మమత, పాతబస్టాండ్ ఎదురు, ఏలూరు రోడ్.

హోటల్ నారాయణ స్వామి, హనుమాన్‌పేట

కాంధారి ఇంటర్నేషనల్, మహాత్మాగాంధీ రోడ్

హోటల్ జగపతి ఇంటర్నేషనల్. శైలజా థియేటర్ దగ్గర. గాంధీనగర్.
మోడరన్ కేఫ్. బీసెంట్‌రోడ్. గవర్నర్‌పేట.
హోటల్ అభిలాష్. గూడవల్లివారి వీధి. గవర్నర్‌పేట.
హోటల్ మేనక. ఎల్.ఐ.సి ఆఫీసు ప్రక్కన. గవర్నరుపేట.
హోటల్ బాలాజీ రెసిడెన్సీ అండ్ హోటల్ శ్రీ బాలాజీ, ఎల్.ఐ.సి బిల్డింగ్ ఎదుట.
గవర్నర్‌పేట.
బృందావన్ లాడ్జి, బీసెంట్‌రోడ్. గవర్నర్‌పేట.
హోటల్ ఛాయ. శివాలయం ఎదుట, చల్లపల్లి బంగ్లారోడ్డు
హోటల్ శ్రీలేఖ, తాడంకి వారి వీధి, గవర్నరుపేట.
వాసవి రెస్టారెంట్. గాంధీనగర్.
ఎస్కిమో, గాంధీనగర్
కృష్ణా రెసిడెన్సీ, గవర్నరుపేట.
పారడైజ్, కాంగ్రెస్ ఆఫీస్ రోడ్,
రాజ్‌టవర్స్, ఏలూరురోడ్
హోటల్ తిలోత్తమ, పాత బస్టాండ్ దగ్గర
హోటల్ మేఘదూత్, జె.డి. హాస్పిటల్ రోడ్.
అభినవ హోటల్, సప్తగిరి కాలేజి దగ్గర.
హోటల్ సరోవర్, అప్సర థియేటర్ దగ్గర.
అజంతా హోటల్, ఏలూరురోడ్
అనిల్ రెస్టహౌస్, గవర్నరుపేట
బాబాయి హోటల్, హనుమాన్ పేట
ఆంజనేయ విలాస్, మోలాపంజా వీధి
దుర్గావిలాస్ లాడ్జి, గవర్నరు పేట
హోటల్ గురు, గాంధీనగరం
హోటల్ అప్సర, రాజాజీ వీధి, గవర్నరుపేట
హోటల్ చంద్ర, పూర్ణానందం పేట
హోటల్ ఎం.ఎస్.ఆర్. మారుతీనగర్.
హోటల్ పెక్స్, గవర్నరుపేట
హోటల్ సంగీత, మహాత్మగాంధీ రోడ్
హోటల్ శాంతి, అప్సరా దగ్గర

హోటల్ సంతోష్, జె.డి. హాస్పిటల్ రోడ్
మేనక లాడ్జి, గవర్నర్‌పేట
హోటల్ షిర్డి, మహాత్మాగాంధీ రోడ్
హోటల్ సిద్ధార్థ, కాళేశ్వరరావు రోడ్
హోటల్ శ్రీనివాస్, యు.టి.ఐ. ఆఫీసు వెనుక
హోటల్ స్వామి, పెద్దిభొట్లవారి వీధి
హోటల్ విక్రమ్, పూర్ణానందం పేట
హోటల్ జయదుర్గ, కాళేశ్వరరావు రోడ్
కనకదుర్గా రెస్ట్‌హౌస్, కందులవారి వీధి
శ్రీను హోటల్, శేషయ్య వీధి
టూరిస్ట్ హోమ్, ప్రకాశం రోడ్
వెల్‌కమ్ హోటల్, గాంధీనగర్
రామకృష్ణా రెస్ట్‌హౌస్, గవర్నర్‌పేట
శ్రీ దుర్గా లాడ్జి, ప్రకాశం రోడ్
హోటల్ అన్నపూర్ణ, బీసెంట్‌రోడ్
శ్రీ సాయి డీలక్స్ లాడ్జి, హనుమాన్‌పేట

### విజయవాడ పట్టణంలో పురాతన సత్రములు

పాత శివాలయం సమీపంగా సుబ్రహ్మణ్యం కట్టించిన సత్రం, వినాయకుని గుడి సమీపంలో తిమ్మరాజు వెంకటాచలం పంతులుగారి సత్రం, కొత్తపేట హిందూ హైస్కూల్ సమీపంలో పుచ్చా లక్ష్మయగారి సత్రం, సామారంగం చౌక్ వద్ద చల్లంరాజు సత్రంతోపాటు గుడివాడ సత్రంకూడా ఉన్నాయి.

ఇంకా బ్రహ్మణవీధిలో కనకదుర్గ గుడిమెట్ల వద్ద ఒక సత్రంతోపాటు చుండూరి వెంకటరెడ్డిగారు కొండమీద కట్టించిన సత్రం వున్నాయి. శ్రీ లక్ష్మీ నారాయణస్వామి వైశ్య కళ్యాణ మందిరం సమీపంలో పోనిశెట్టి సత్యనారాయణ వైశ్యసత్రం వుంది.

ఈ విజయవాడ తొలినామం బెచ్చవాడ అదే క్రమంగా వెచ్చవాడగా మారింది. ఆపై విజ్జవాడగా, విజయవాడగా మారింది. ఒకప్పుడు ఈ విజయవాడే వేంగీ చాళుక్యుల రాజధాని. జైనశైవ క్షేత్రాల నిలయమైన ఈ విజయవాడలో గుళ్ళు, గోపురాలు అనేకం. అలాంటి విజయవాడపై కొన్ని గాథలు.

జైన బౌద్ధ భిక్షుకులకిది నివాసం అయి ఉండేది కనుక దీనికి భిక్షవాటిక అని పేరు. అదే బెజవాడ అయిందని చెపుతారు. కాని 1200 సం॥ల క్రితం విష్ణువర్ధన రాజు వ్రాయించిన తామ్ర శాసనంలో మాత్రం విజయవాడగానే వుంది.

అష్టాదశ శక్తిపీఠాలలో ఒకటైన శ్రీ కనకదుర్గా దేవి ఆవాసమైన పుణ్యక్షేత్రం. ఆమె ఈ నగరం అధిష్ఠాన దేవత. ఇంద్రకీలాద్రిపై వేంచేసివున్న ఈ అమ్మ శ్రీ కనకదుర్గా క్షేత్రం మహత్యం. రంభ కరంభులనేవారు సంతానంకోసం ఈశ్వరుని గురించి తపస్సు చేశారు. కరంభుడు నీటిలోను, రంభుడు చెట్టుపైన తపస్సు చేశారు. అది చూసి ఇంద్రుడు కోపం పట్టలేక మొసలిరూపంలో వచ్చి కరంభుని తినివేశాడు. దానితో రంభుడు తన తలని నరుకుకొని ఈశ్వరునికి అర్పిస్తాడు.

దానితో శివుడు ప్రత్యక్షమై కావలసిన వరము కోరుకోమంటాడు. మూడు జన్మలవరకు నువ్వే నా కొడుకుగా పుట్టాలని రంభుడు కోరుకుంటాడు. ఈశ్వరుడు తథాస్తు అని దీవించి. అంతర్ధానమవుతాడు.

దానితో ఆనందంగా రంభుడు తిరిగిపోతుండగా మార్గమధ్యంలో ఒక మహిషి కనిపిస్తుంది. కామంతో అనుభవిస్తాడు. అప్పుడు శివుడు తన అంశతో ఆ మహిషి గర్భంలో ప్రవేశిస్తాడు. ఆమెకు పుట్టినవాడే మహిషాసురుడు.

అతడు పెరిగి పెద్దవాడై తన తండ్రి, సోదరుడికి జరిగింది తెలిసి ఉగ్రుడై ఇంద్రుడి మీదకు దండెత్తి జయించి స్వర్గాధిపత్యం పొందుతాడు. ముల్లోకాలను గడగడలాడిస్తాడు.

కాత్యాయన మహర్షి ఆశ్రమంకు వెళ్ళి స్త్రీ రూపం ధరించి మరీ బాధిస్తూ వుండటంతో ఆ మహర్షికి కోపం వచ్చి స్త్రీ చేతిలోనే హతమవుతావని శపిస్తాడు.

మహిషాసురుడి దురాగతాలు ఎక్కువైపోతుండటంతో ఆదిపరాశక్తిని ప్రార్థిస్తారు దేవతలు. అప్పుడు ఆమె ఉగ్ర చండీరూపమెత్తి మహిషాసురుని సంహరిస్తుంది.

మరో జన్మలో రుద్రకాళి రూపంలో మూడవ జన్మలో మహాకాళి రూపంలో మహిషాసురుడ్ని సంహరించింది. స్కంధ పురాణంలో సహ్యాద్రి ఖండంలో ఈమె విజయ గాథలు ఉన్నాయి. ఈ మహాతల్లి దుష్టులపాలిట సింహ స్వప్నం. ఈ అమ్మే మహా సరస్వతి, మహాకాళి, మహాలక్ష్మి, బాలాత్రిపుర సుందరి, లలితా త్రిపుర సుందరి, రాజరాజేశ్వరి, కుండలినీ మహాశక్తి ఈ కనకదుర్గే.

**ఈవిడ వేంచేసిన ఇంద్రకీలాద్రి కథ :**

ఈ పర్వతాన్ని అధిష్టించినవాడు ఇంద్రకీలుడు అనే యక్షుడు. ఒకప్పుడు ఈ యక్షుడు కృష్ణానదిలో రోజుస్నానం చేస్తూ ఉత్తర భాగంలో తపస్సు చేసుకునేవాడు. అతని తపస్సుకు మెచ్చిన ఆది దంపతులు ప్రత్యక్షమై ఏమివరం కావాలో కొరుకోమంటారు. పార్వతీ పరమేశ్వరులకి తను ఆసనం అవ్వాలని కోరుకుంటున్నానని చెబుతాడు. అతని కోరిక తీర్చడానికి మహిషాసురుని సంహారం తరువాత కనకదుర్గా మాత ఇంద్రకీలాద్రి పర్వతంపై వెలసింది. ఇక్కడ వెలసిన దుర్గ 8 బాహువులతో 8 ఆయుధాలు ధరించి

ఉంటుంది. దీన్ని చూస్తుంటే మహిషాసురుని [illegible] శూలంతో పొడుస్తూ దర్శనమిస్తుంది. ఈ దేవిమూర్తి పాదముల్లో శ్రీ చక్రం వుంది. ఆ చక్రానికి ప్రక్కనే ఉత్సవమూర్తి ఉంది. పూజలన్నీ శ్రీ చక్రానికే జరుగుతాయి. దేవి మకరతోరణంపై నవదుర్గల విగ్రహాలు ఉన్నాయి.

**నవదుర్గలు** : శైలపుత్రి, బ్రహ్మచారిణి, చంద్రఘంట, స్కందమాత కూష్మాండ, కాత్యాయని, కాళరాత్రి, మహాగౌరి, సిద్ధి.

**ఇక్ష్వాకులు, బృహత్పాలయనులు, పల్లవులు, విష్ణుకుండినులు పాలించిన ఈ విజయవాడలో ప్రముఖ ఆలయాలు :**

[illegible] కోదండరామ, శ్రీనగరేశ్వరస్వామి ఆలయాలు బహు పెద్దవి. కృష్ణలంకలో శివాలయం, కాళీమాత ఆలయాలు ఉన్నాయి.

**మాచవరం దాసాంజనేయ స్వామి ఆలయం :**

వ్యాసరాయలనే హనుమద్భక్తుడు పాదచారిగా పర్యటిస్తూ ప్రతి ప్రదేశంలో హనుమంతుని దేవాలయం కట్టించాడు. అలా ఆయన ఈ విజయవాడకు వచ్చినప్పుడు శంఖు, చక్రాదులతో హనుమంతుని విగ్రహాన్ని ప్రతిష్ఠించారు.

ఈ గుడి చాలా ప్రముఖమైనది. కొత్త వాహనాలు కొన్నవారు ఇక్కడ పూజ చేయిస్తారు. ధనుర్మాసంలో ఇక్కడ ఉత్సవాలు జరుగుతాయి.

**శ్రీ భ్రమరాంబ మల్లీశ్వరాలయం :** ఇంద్రకీలాద్రి పర్వత పాద ప్రాంతంలో వుంది. దీన్ని పాత శివాలయంగా పిలుస్తారు. దీన్ని త్రిభువనమల్లుడు నిర్మించాడు. ఈ ఆలయ ప్రాంగణంలో వీరాంజనేయస్వామి, విఘ్నేశ్వరుడు, సత్యనారాయణ స్వామి ఉన్నారు.

**త్రిశక్తి పీఠం :** కొత్త బస్టాండు వద్ద ఉంది. జ్ఞానశక్తికి శ్రీ మహా సరస్వతిని ఆవాహన చేసి విగ్రహాలను ప్రతిష్టించారు

**విక్టోరియా జూబ్లీ మ్యూజియం :** గోల్కొండ రాజుల కాలమునాటి ఆయుధాలు, వ్రాతప్రతులు, ప్రాచీన శిలాశాసనాలు ఉన్నాయి. శివుని విగ్రహం ఉంది. ఈ విగ్రహాన్ని నాలు, ఐదు దశాబ్దాల కాలానికి చెందినదిగా భావిస్తారు. ఇంకా ప్రాచీనకాలం నాటి నాణాలుకూడా ఉన్నాయి.

**కృష్ణానది మ్యూజియం :** రెండువేల సంవత్సరాలనాటి బౌద్ధ విగ్రహం అభయ ముద్రతో ఆశీర్వదిస్తుంది. కృష్ణానది పుట్టు పుర్వోత్తరాల గురించి తెలుసుకోవచ్చు. వర్ణచిత్రాలు, శాతవాహన కాలంనాటి వెండినాణాలతోపాటు ఎంతచూచినా తనివితీరని అన్నపూర్ణాదేవి విగ్రహం మనల్ని మంత్రముగ్ధుల్ని చేస్తుంది. ఈ మ్యూజియం ఐదవగదిలో అనేక దేశాలకు చెందిన నాణాలు ఉన్నాయి. వీటిని చూస్తూ మైమరచి పోతాము. ఈ మ్యూజియం కృష్ణానదీ ప్రాంగణంలో ఉంది.

### కొండపల్లి

ఈ పేరు వినగానే తెలుగువారికి గుర్తుకొచ్చేది బొమ్మలు. లబ్ధ ప్రతిష్ఠులయిన ఎందరో రచయితలు తమ నాయికలను కొండపల్లి బొమ్మతో పోలుస్తారు విజయవాడకు 16 కి.మీటర్ల దూరంలో వున్నది ఈ కొండపల్లి. 14వ శతాబ్దంలో కొండవీటి ప్రభువు అనవేమారెడ్డి నిర్మించిన ఖిల్లాకొండ శిఖరంపై ఉంది. రెడ్డిరాజుల వైభవం ఇంకా ఇక్కడి చిహ్నాల్లో కనపడుతుంది ఇక్కడున్న కోనేరు లోతు ఎంతో ఇంతవరకూ ఎవరికి అంతుపట్టలేదు. ఖిల్లాలో అన్ని కాలాల్లోను నీరు ఉండె కొనేరు ఉంది పులినోటి నుంచి ధారపడే శిల్పం మంచి ఆకర్షణ. ఇక్కడ ఔషధమొక్కలు విపరీతంగా దొరుకుతాయి.

### పెనుగ్రంచిప్రోలు

విజయవాడ నుంచి రెండు గంటల్లో వెళ్ళవచ్చు. కృష్ణానదీ తీరాన వున్న ఈ తిరుపతమ్మ ఆలయం బహు ప్రసిద్ధి. ఇక్కడ బలులు విపరీతంగా ఇస్తారు.

### చిక్కవరం

లింగం చెరువు ఒడ్డున శ్రీ బ్రహ్మయ్య లింగేశ్వరస్వామి ఆలయం వుంది. గన్నవరం మండలంలోని ఈ అతి పురాతనమైన ఆలయం 7వ శతాబ్దానికి చెందినది.

### వేదాద్రి

కృష్ణాతీరంలో వున్న ఈ క్షేత్రములో నదీ గర్భంలో లింగాకారంలో నృసింహస్వామి వుంటారు. నీటిలో దిగటానికి మెట్లు వున్నాయి. విజయవాడ, హైదరాబాద్ రూటులో వున్న జగ్గయ్యపేట నుంచి వేదాద్రికి బస్సులో వెళ్ళవచ్చు.

### కొల్లేరు

ఏప్రియల్ నుండి నవంబర్ మధ్యలో చూడాలి. ఆ సమయం పక్షులకు సీజన్. ఈ మంచినీటి సరస్సు వద్ద రకరకాల సుందరమైన పక్షులు మన మనసులని పులకించేలా చేస్తాయి. విజయవాడకు 94 కిలోమీటర్ల దూరంలో వుందీ సరస్సు.

### ద్వారకా తిరుమల

చిన్న తిరుపతిగా పిలుచుకుంటారు. ఏలూరు నుండి భీమడోలు మీదగా చేరవచ్చును. గుట్టమీద ఏడు కొండలస్వామి ఆలయం వుంది. తిరుపతికి వెళ్ళలేని భక్తులు ఇక్కడే తలనీలాలు, మొక్కుబడులు సమర్పించుకుంటారు. ఇక్కడవున్న కుంకుడు చెట్టుమీద గరుడపక్షి వాలితే ఏడుకొండలు దిగి వెంకటేశ్వరస్వామి ద్వారకా తిరుమలకి వస్తారని పురాణంలో చెప్పబడివుంది. ఆలయ సింహద్వారములు మూసినా, చీకటిగా వున్నా గోపురం నుండి జ్యోతి కనపడుతుంది. దూరం నుంచి

అయితే చాలా క్లియర్‌గా దగ్గరగా అయితే చిన్న దీపంలా కనపడటానికి కారణం పర్వతంలో మణి వున్నదని అంటారు. ఇక్కడ నుంచి క్షీరారామమునకు వెళ్ళుటకు సౌకర్యం వుంది. ఈ ద్వారకా తిరుమల ఏలూరు నుండి 38 కి.మీ. విజయవాడ నుంచి 105 కి.మీ. ఇక్కడి స్వామి దర్శనవేళలు ఉ॥ 6-00 నుండి మ 12-00 వరకు సాయంత్రం 3-00 నుండి రాత్రి 8 వరకు శీఘ్రదర్శనము రూ. 15 శ్రీ వారి దర్శనము రూ. 2/- ఆలయంలో ఫోటోలు తీయరాదు.

## హంసలదీవి

వేణుగోపాలస్వామి వారి ఆలయం గల హంసలదీవిలోనే కృష్ణానది సాగర సంగమం అవుతుంది.

## మోపిదేవి

సుబ్రహ్మణ్యేశ్వరాలయం, కోరిన కోర్కెలు తీర్చే ఈ ఆలయం ప్రక్కనే సకలేశ్వరాలయములోని లింగము పాతాళము వరకు వున్నదని స్థలపురాణంలో చెప్పబడినది.

## క్షీరా రామము

పంచరామాల్లో ఒకటిగా వున్న ఈ క్షేత్రంలో రామలింగేశ్వరుడి లింగము పద్దెనిమిది అంగుళములు ఎత్తున వుంటుంది. సాంబశివుడు త్రిశూలంతో ఒక సరస్సును నిర్మించి పాలతో నింపాడట. ఇక్కడ గాలిగోపురం పదకొండు అంతస్తులు వుంటుంది. దీన్ని 1777లో నిర్మించారు.

## అంతర్వేది

పరవళ్ళు తొక్కే గోదావరి నది మీద ప్రయాణం చేసి అంతర్వేది చేరవచ్చు. చాలా పురాతనమైన ఇక్కడ ఆలయంలో స్వామి శ్రీ లక్ష్మీ నరసింహస్వామి. స్పష్టంగా వినిపించే సముద్రహోరు, గోదావరి సముద్రంలో కలిసే చోటు కన్నులారా చూడవచ్చు. సముద్రపు నీరు, గోదావరి నీరు రెండు విడివిడిగా పారుతుంటాయి. ఆ ప్రదేశాన్నే అన్నా చెల్లెళ్ళ గట్టు అంటారు. లక్షలాది యాత్రికులని రప్పించుకునే ఈ స్వామికి ఉత్సవాలు, రథోత్సవాలు జరుగుతాయి. ప.గో. జిల్లా నర్సాపురం నుంచి పడవలో వెళ్ళచ్చు.

## పాలకొల్లు

శ్రీ క్షీర రామలింగేశ్వరము. శ్రీ రామచంద్రుడు ప్రతిష్ఠించిన లింగము. ఆలయ ప్రాంగణంలో అనేక దేవతల విగ్రహాలు గలవు. ఆలయ రాజగోపురం 150 అడుగుల ఎత్తు. ఈ గోపురాన్ని క్రీ.శ. 1415లో నిర్మించారు. పంచరామాల్లో ఒకటి.

## పెనుగొండ

ఆర్య వైశ్యులకు ఇలవేల్పు. శ్రీ కన్యకా పరమేశ్వరి సాక్షాత్తు పార్వతీదేవి అవతారం. కుసుమ శ్రేష్ఠి పుత్రికగా జన్మించి, పరమేశ్వరునికి అంకితం చేసిన ఈ జన్మ పరులకు ఆధీనం కాకూడదని ఆత్మార్పణ చేసుకున్న ఆ తల్లిని బ్రహ్మ ఇచ్చిన ఈ రెండు కనులతో చూస్తే జన్మ చరితార్థకమవుతుంది. ఇక్కడికి దగ్గరలో వున్న గ్రామమే శ్రీనాథ కవిసార్వభౌముని జన్మస్థలం.

## మల్లీశ్వరము

తణుకు నుంచి 12 కి.మీ. దూరం వశిష్ట గోదావరి తీరాన వుందీ మల్లేశ్వరము. శ్రీ కపిల మల్లేశ్వర స్వామి ప్రతిష్ఠ బహు పురాతనమైనది. గోదావరి పొంగినప్పుడు స్వామి వారి గర్భాలయంలోకి పాతాళ గంగవచ్చునట్లు పైకి వచ్చును. గోదావరి తగ్గిన వెంటనే ఆలయంలోని నీరు తోడనవసరం లేకుండా అంతరించిపోవును. కార్తీకమాసములోను, నవరాత్రులలోను ఉత్సవాలు జరుగును.

## లక్ష్మణేశ్వరము

నరసాపురంకు 6 కి.మీ. దూరంలో వుంది. లక్ష్మణునిచే ప్రతిష్ఠింపబడిన శ్రీ దుర్గా లక్ష్మణేశ్వరస్వామి ఆలయం వుంది. ఇక్కడి స్వామికి కొప్పువుంది. అందులకే కొప్పు లింగేశ్వరుడని కూడా అంటారు. శ్రీ స్వామివారికి రోకలిపోటు, కోడి కూత వినపడకూడదు. అందుకే గుడి సమీపంలో ఇళ్ళు లేవు.

## భీమవరం

పంచారామాల్లో ఒకటి ఈ భీమారామము. 'చంద్రుడిచే ప్రతిష్ఠింప చేసిన లింగము గనుక సోమేశ్వర క్షేత్రమని పిలుస్తారు'. ఈ ఆలయంలో ఓ ప్రత్యేకత వుంది. పౌర్ణమినాడు శ్వేత వర్ణంలో కన్పించే ఈ శివలింగం క్రమక్రమంగా అమావాస్య నాటికల్లా రంగు మారిపోతుంది. ఈ మార్పులు మీరు చూడాలంటే పౌర్ణమినాడు, అమావాస్యనాడు దర్శించి చూడాలి. ఈ దేవాలయంలో లింగము చంద్రశిల అని చంద్రునిలో వచ్చే మార్పులవల్లే అలా జరుగుతోందని కొంతమంది వాదన. ఈ ఆలయము ముందు భాగములో ఒక కోనేరు ఉంది. గట్టున రాతి స్థంభం పైన నందీశ్వరుని విగ్రహం వుంటుంది. నందీశ్వరుని నుంచి చూస్తే మనకి శివాలయంలోని లింగాకారం కన్పిస్తుంది.

ఒకే దేవాలయంలో మూడు వాకిట్ల నుంచి చూస్తే శివుని లింగానికి బదులుగా అర్ధనారీశ్వరుడిగా కన్పిస్తుంది. కార్తీకమాసం అంతా అభిషేకాలు వేడుకగా జరుగుతాయి మహాశివరాత్రి బ్రహ్మోత్సవం వైభవోపేతంగా చేస్తారు.

## భద్రాచలం

క్షేత్ర మహత్యము చాలా ప్రాముఖ్యం. కంచర్ల గోపన్న 1670 నుంచి 1674 వరకూ శ్రీ రామాలయము నిర్మాణం చేశాడు. పన్ను డబ్బుని ఆలయ నిర్మాణానికి వెచ్చించినందుకు కారాగారబద్ధుడైనాడు. శ్రీ సీతారాముడు స్వయంగా తానీషా ప్రభువుకి బాకీ చెల్లించి భక్తుడైన గోపన్నను ఖైదు నుంచి విముక్తి చేసి భక్తుల మీద తన ప్రేమని చాటాడు. గోపన్న చేయించిన ఆభరణాలన్నీ ఇప్పటికీ వున్నాయి. ఆ కంచర్ల గోపన్నే భక్తరామదాసు. స్వామి వారిపై అనేక వేల కీర్తనలు వ్రాశారు. ప్రతి శ్రీరామనవమికి రాష్ట్ర ప్రభుత్వం తరపున ముత్యాల తలంబ్రాలు స్వామికి పంపుతారు. అప్పుడు జరిగే కళ్యాణం ఆలిండియా రేడియో, టి.వి.ల్లో ప్రసారం చేస్తారు. భద్రాచలం నుంచి 8 కి.మీ. దూరంలో వున్న ఉష్ణగుండం, జటాయువు మంటాపం 5 కి.మీ., 35 కి.మీ. దూరంలో వున్న పర్ణశాల (ఈ పర్ణశాలలో సీతమ్మవారు చీరలారేసుకున్న గుర్తులు. రాములవారిని, లక్ష్మణుని శూర్పణఖ కవ్వించినచోటు చూడవచ్చు) వైకుంఠ ఏకాదశి ముందురోజు వరకూ ఒక్కొక్క రోజు ఒక్కొక్క అవతారంతో మత్స్య, కూర్మ, వరాహ-నారసింహ, వామన, పరశురామ, శ్రీరామ, బలరామ, శ్రీకృష్ణ దశావతారములతో శ్రీస్వామివారికి అలంకారములు జరుగుతాయి. శ్రీ వైకుంఠ ఏకాదశినాడు తెల్లవారుజామున 5 నుంచి 6 వరకు ఉత్తర ద్వార దర్శనం. ఈ సీతారామ చంద్రుల సందర్శనము ధర్మ, అర్థ, కామ, మోక్షములను చతుర్విధ పురుషార్థములను ఇచ్చును.

కన్నతల్లిలా చల్లగా వుండి ప్రవహించే గోదావరి మనోహర నేత్రపర్వంగా వుంటుంది. దేవస్థానము సత్రములు, కాటేజీలున్నాయి వసతికి. ముందుగా గదులు బుక్ చేసుకోవాలనుకునేవారు ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్, శ్రీ సీతారామచంద్ర స్వామివారి దేవస్థానం, భద్రాచలం వారిపేరు మీద యం.ఒ. చేయాలి. మరిన్ని వివరాలు కావాలంటే ఫోన్ నంబర్స్ 32428, 32405.

## రాజమండ్రి

రాజరాజ నరేంద్రుడు ఈ రాజమహేంద్రవరాన్ని రాజధానిగా చేసుకొని 11వ శతాబ్దం ముందువరకూ పాలించాడు. ప్రతి పన్నెండు సంవత్సరాలకి ఇక్కడ గోదావరి పుష్కరాలు జరుగుతాయి. కోటిలింగాలరేవు, లింగేశ్వరస్వామి ఆలయం, ధవళేశ్వరం ఆనకట్ట, మార్కేండేయ ఆలయము ముఖ్యంగా చూడాల్సినవి. వసతికి మహాలక్ష్మి హోటల్ పంచవటి, పుష్కర గేట్.

## ర్యాలి

రాజమండ్రి నుంచి 25 కి.మీ. దూరం. గోదావరి నదీ శాఖలైన గౌతమి, వశిష్ఠ పాయల మధ్య నెలకొని వుంది శ్రీ జగన్మోహినీ కేశవస్వామి ఆలయం. అయిదు అడుగుల ఎత్తు, మూడు అడుగుల వెడల్పు కలిగిన సాలగ్రామ శిలయందు స్వయం వ్యక్తం. ఎదుట పురుష రూపం. వెనుక స్త్రీ రూపంగల ఈ స్వామిని దర్శించి తరించటం అంటే పూర్వజన్మ సుకృతం.

## కోటిపల్లి

తూర్పు గోదావరి జిల్లాలో కాకినాడ పట్టణానికి దగ్గరలో పామర్రు మండలంలో వున్న ఈ పుణ్య క్షేత్రం గురించి బ్రహ్మాండపురాణంలోనూ స్కాంధ పురాణంలోనూ వుంది. ఈ క్షేత్రం పుణ్యగాథ.

ఈ కోటిపల్లిలో దేవేంద్రుడు నిర్మించిన స్వయంభూ శివలింగం వుంది. యోగలింగంగా కూడా భావిస్తారు. పాతాళం నుంచి ఉద్భవించిన ఈ లింగంకు ఉత్సవాలు వుండవు. కారణము యోగలింగం అవటం వలన. ఈ కోటిపల్లి కోటేశ్వరుడు మేషమానది అయిదు మాసాలు కోటి తీర్థ జలంలో వుంటాడు. మిగతా ఏడు మాసాలు కోటి తీర్థ జలలింగాన్ని చేరి నేల మట్టం వరకు తొణికిసలాడుతూ భక్తుల కన్నులను పునీతం చేస్తూ ఉంటుంది.

**సిద్ధి క్షేత్రం :** కోటిపల్లిలో తపస్సు చేసిన ప్రదేశంలో విష్ణుమూర్తి, శ్రీదేవి, భూదేవి సమేతుడై దేవతల కోరికపై సిద్ధి జనార్ధన స్వామిగా అవతరించాడు.

**శ్రీ రాజరాజేశ్వరి :** సోమేశ్వర సన్నిధాన ముఖ మండపంలో జగన్మాత శ్రీ రాజరాజేశ్వరి గంభీరంగా దర్శనమిస్తుంది. ఈ కోటిపల్లి క్షేత్రంలో శ్రీ రాజరాజేశ్వరి కన్న తల్లిగా భక్తుల కోరికలు మన్నిస్తుంది.

### ఈ కోటిపల్లిలో ఆలయాలు :

**సోమగుండం :** 8 ఎకరాల విస్తీర్ణంలో నిర్మించిన సోమగుండంలో స్నానం చేసిన సమస్త కష్టాలు తొలుగుతాయని నమ్మకం. సోమగుండం దక్షిణ గట్టు మీద శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర ఆలయం వుంది. ఇంకా శ్రీ ఆంజనేయస్వామి దేవాలయం వెనుక హనుమంతు గుండం అనే సరస్సు గట్టు మీద అతి పురాతనమైన ఆంజనేయ స్వామి ఆలయం వుంది. ఈ కోటిపల్లిలోనే ముత్యాలమ్మ అమ్మవారు కూడా ఉన్నారు. ఈ తల్లి భక్తులను చల్లని చూపులతో పరామర్శిస్తుంది.

### కోటిపల్లి తీర్థ పురాణ గాథ :

బ్రహ్మదేవుడు తన భార్య కోరికపై అతిలోక సౌందర్యవతిని సృష్టించాడు. ఆమే అహల్య. చివరకు తానే గౌతమ మహర్షికి ఇచ్చి పెళ్ళిచేశాడు. అపురూపమైన ఆమె సౌందర్యాన్ని చూసి దేవేంద్రుడికి మతిపోయింది. ఎలా అయినా ఆమెను పొందాలనే దుర్బుద్ధితో బ్రహ్మకాలం కాకుండానే కోడిరూపం ఎత్తి కూస్తాడు. ఈ కోడికూత విని స్నానానికి బయలుదేరుతాడు గౌతముడు ఆ మహర్షి వెళ్లగానే ఇంద్రుడు గౌతముడులాగా మారి అహల్యాదేవి ప్రక్కకి చేరతాడు. అదేమి తెలియని ఆమె భర్తే అనుకొని గౌతముని రూపంలో ఉన్న ఇంద్రునికి సహకరిస్తుంది నదీతీరానికి వెళ్ళిన గౌతముడు ఇంకా వేళ కాలేదని వెనక్కి వస్తాడు. అలికిడికి ఇంద్రుడు పిల్లి రూపంలో పారిపోతాడు. దివ్య దృష్టితో అంతా గ్రహించిన గౌతముడు ఉగ్రుడౌతాడు.

భార్యని పాషాణం కమ్మని శపిస్తాడు. ఆ తరువాత దేవేంద్రుడుని ఏ యోని సంపర్కం కోసం అంత నీచత్వం చేశాడో ఆ యోనులు శరీరం నిండా మొలవమని శపిస్తాడు.

అహల్యాదేవి విలపిస్తుండటంతో కోపం తగ్గిన గౌతముడు రాతిగా ఉన్న నీకు శ్రీరాముని పాద స్పర్శ తాకగానే నాతిగా మారతావని శాపవిమోచనం తెలియచేస్తాడు.

సహస్ర యోని దుర్గంధ పూరితమైన ఇంద్రుడు విలపిస్తూ గౌతముడి కాళ్ళు పట్టుకొంటాడు. పరమ దయానిధి గౌతముడు ఇంద్రుడితో భూలోకాన ఉన్న కోటిపల్లి తీర్థంలో స్నానం చెయ్యి శాపం తొలగిపోతుందని చెపుతాడు. ఇంద్రుడు ఆనందంగా ఈ కోటిపల్లి తీర్థంలో స్నానం చేస్తాడు. అన్ని తొలగిపోతాయి.

అలా ఏ దోషమున్నా ఈ కోటిపల్లి తీర్థ స్నానం ద్వారా తొలగిపోతాయి.

### ద్రాక్షారామం

దక్ష ప్రజాపతి అనేక యజ్ఞాలు చేయటం వల్ల ద్రాక్షారామమని పేరువచ్చింది. ఇక్కడి భీమేశ్వరస్వామి స్ఫటికలింగము. పదిహేను అడుగుల ఎత్తున వుండే ఈ లింగము ప్రసిద్ధి చెందినది. ఇక్కడి ఆలయాన్ని చాళుక్య భీముడు కట్టించాడు.

దక్షిణ కాశీగా ప్రసిద్ధి చెందిన ఈ ద్రాక్షారామం పంచరామాలలో ఒకటి. మిగతావి అమరారామము, భీమారామము, క్షీరారామము, కుమారారామం. ఇక్కడి శివలింగము ఎత్తు 15 అడుగులు కాగా చుట్టూ రెండంతస్థుల ఆలయం వుంది. ఆలయం క్రింది అంతస్థు చీకటిగా వుంటుంది. ఈ అంతస్థులో భక్తులు ప్రదక్షిణ జరిపి పై అంతస్థులో అర్చనలు జరుపుతారు.

శ్రీ మందేశ్వరస్వామి దేవస్థానం : తూర్పు గోదావరి జిల్లా కొత్తపేట మీదుగా అమలాపురం పోవు బస్సు మార్గమున 8 కి.మీ. దూరంలో ఈ మందపల్లి కలదు. ఈ మందపల్లి క్షేత్రమున పదునాలుగువేల నూటెనిమిది పుణ్యతీర్థములు కలవు. ఇక్కడి మందేశ్వరస్వామి వారికి పూజా కార్యక్రమములు మనియార్డరు చేసిన వారికి కూడా జరుపుతారు

## అన్నవరం

శ్రీ వీర వెంకట సత్యనారాయణ స్వామి ఆలయము. ఆంధ్రులు తమ ఇంట ఏ శుభకార్యం జరిగినా ఈ స్వామి వ్రతం తప్పక చేసుకుంటారు. శ్రీ పిడపర్తి కృష్ణమూర్తి శాస్త్రిగారు నిర్మించిన సన్‌డయల్ (కాల నిర్ణయ నిర్దేశిక యంత్రం) స్వామి సన్నిధిలో రత్నగిరి మీద వుంటుంది. ఎండ ఆధారంగా కాల నిర్ణయం చేస్తుందీ గడియారం. పవిత్ర పంపానదీ తీరాన రత్నగిరి సానువుల దరి అన్నవరం గ్రామం ప్రక్కన ఖరనామ సంవత్సర శ్రావణశుద్ధ విదియనాడు శ్రీ సత్యదేవుడు స్వయం వ్యక్తమైన ఈ దివ్యక్షేత్ర సందర్శనం మహాభాగ్యం. స్వామిదర్శన వేళలు ఉ॥ 6 నుండి రాత్రి 8 వరకూ.

ఎగ్జిక్యూటివ్ ఆఫీసరుగారితో సంప్రదించి కాటేజీలు, గదులు పొందవచ్చు. కొండమీద వసతికి, భోజనానికి ఎలాంటి ఇబ్బందీ వుండదు.

## స్వామి వారి సేవలు, పథకములు

పంపానదీ తీరములో ప్రకృతి రమణీయతతో శోభిల్లితమగు రత్నగిరిపై వేంచేసియున్న శ్రీ వీర వెంకట సత్యనారాయణస్వామి స్వయం వ్యక్తమై హరిహరహిరణ్య గర్భ, త్రిమూర్త్యాత్మకమైన శ్రీమత్త్రిపాద్విభూతి మహా వైకుంఠ నారాయణ యంత్రమును ప్రతిష్ఠింపబడి శివ సహిత అనంతలక్ష్మీ సతీ సమేతుడైన శ్రీ వీర వెంకట సత్యన్నారాయణ స్వామిని సేవించువారికి ఐహిక ముష్మిక సకల సిరిసంపదలు కలుగును. మహా పుణ్యప్రదమైన, శ్రీ వీరవెంకట సత్యనారాయణ స్వామి వారి వ్రతము భక్తుల పాలిటి కల్పవృక్షము, వరప్రసాదము. భక్తుల సౌకర్యార్థము వివిధ సేవలు శాశ్వత ప్రాతిపదికపై ప్రతి సంవత్సరములో వారు కోరిన ఏ రోజైన అట్టి పూజలు జరుపబడును.

**రుసుములు :**

శాశ్వత కళ్యాణము రూ. 3,000/-లు, శాశ్వత విశిష్ట వ్రతము, శాశ్వత ప్రత్యేక వ్రతము, శాశ్వత వ్రతములకు వరుసగా రూ. 1,116, రూ. 500/-, రూ. 300/-, శాశ్వత నిత్యపూజకు రూ. 250/-లు, రూ. 35/-లు మనియార్డరు పంపిన యెడల శ్రీ స్వామివారు వ్రతము గోత్ర నామముతో జరిపించి పోస్టు ద్వారా ప్రసాదము పంపబడును.

## అప్పనపల్లి

[illegible]

## పిఠాపురం

[illegible]

**తంటికొండ** : తూర్పు గోదావరి జిల్లా గోకవరం వద్ద వుంది. ఇక్కడ స్వామి శ్రీ వేంకటేశ్వరస్వామి బహుళ ప్రసిద్ధి పొందిన క్షేత్రమిది.

ఈ తూర్పు గోదావరి జిల్లాలోని సామర్లకోటలో శ్రీ కుమారా రామ భీమేశ్వర స్వామి, [illegible]పురంలో సూర్యనారాయణ స్వామి ఆలయం పావన గోదావరి తీరంలో రాజమహేంద్రవరంలో దేవాలయాలు తప్పక దర్శించతగ్గవి. ఇంకా ధవళేశ్వరంలో జనార్ధనస్వామి ఆలయం వుంది. కొండమీద సీతారాముల పాద ముద్రలు ఉన్నాయి.

**కోరుకొండ** : శైవ వైష్ణవ క్షేత్రం. రాజమహేంద్రవరానికి 20 కి.మీ. దూరంలో వున్నది లక్ష్మీ నరసింహాలయం. దశావతారాలకే సంబంధించిన శిల్పాలతోబాటు శ్రీరామ క్రతు స్తంభం వుంది.

**పలివెల** : ఇక్కడ స్వామి కొప్పు లింగేశ్వర స్వామి. స్వామికి కొప్పు వుంటుంది. క్రీ.శ. 12 కాలం నాటి రాజ శాసనాలతోపాటు పెద్ద నంది కూడా కలదు.

**సర్పవరం** : అత్యంత ప్రాచీనమైన ఈ క్షేత్రం కాకినాడకు 6 కి.మీ. దూరంలో వుంది. ఈ క్షేత్రం గురించి భీమేశ్వర పురాణంలో శ్రీనాథుడు ఇలా చెప్పాడు.

"పరమగీర్వాణ యాగవైభవమునెలవు
నిఖిల కల్యాణ గుణకేలి నిలయమనఘ
దివ్యములు నూట ఎనిమిది తిరుపతులకు
పరమ పదమైన శ్రీ సర్ప పురమునందు"

**ముక్తేశ్వరం** : ఈ క్షేత్రం అమలాపురమునకు 12 కి.మీ. దూరంలో వుంది. రావణుని చంపిన తరువాత బ్రహ్మ హత్యా పాపం పోగొట్టుకొనుటకు శ్రీ రాముడు ఎన్నో క్షేత్రాలు దర్శించాడు. అలా దర్శించిన క్షేత్రాల్లో ఒక్కటి ఈ ముక్తేశ్వరం. ఇక్కడే శ్రమణి అనే స్త్రీకి శివుడు మోక్షం ఇచ్చాడు. అందుకే క్షమ ముక్తేశ్వరాలయం అని కూడా అంటారు. ఈ క్షేత్రం గురించి సంస్కృతంలో శ్లోకం.

"ముక్తేశ్వరం తతిస్తీర్థం
శ్రుణష్య సుసమాహిత :
యస్మితా తీర్థనలా ముక్తిం
క్షణా ద్యాంతి శివాజ్ఞయా"

**మురుమళ్ళ :** ఇక్కడున్న శ్రీ భద్రకాళీ సమేత వీరేశ్వర స్వామికి ప్రతి దినం కళ్యాణమే.

## విశాఖ పట్టణం

విష్ణుకుండినులు. శాతవాహనులు ఏలిన ఈ విశాఖపట్టణం ఒకప్పుడు చిన్న మత్స్యకారుల పల్లె. ఈ విశాఖకు వచ్చిన కలెక్టర్స్‌లో ఒకరిపేరు వాల్తేరు. ఒకప్పటి మత్స్యకారులు దేవత విశాఖ. పోనుపోను ఆ పేరే విశాఖపల్లే పట్టణమయి విశాఖపట్టణంగా మారింది.మరికొంత మంది చెప్పేదాని ప్రకారం వైశాఖేశ్వరుని ఆలయం ఇక్కడుండడంవల్ల వైశాఖ పట్టణం అని పిలిచేవారని అదే విశాఖపట్టణం అయిందని -

ఏమైనా బ్రిటీషు సామ్రాజ్యాన్ని గడగడలాడించిన అల్లూరి సీతారామరాజు ఈ జిల్లావాడే. అంతటి ప్రాముఖ్యత గల ఈ విశాఖపట్టణంలో ఎన్నో దర్శనీయ స్థలాలు.

**అందాలకు నిలయమైన ఈ విశాఖలో :**

**బొర్రా గుహలు :** పదో శతాబ్దం నాటి గుహలు. ఈ ప్రదేశం విశాఖనుంచి 110 కి.మీ. దూరంలో వుంది. ఇక్కడికి నగరం నుంచి రైలు, బస్సు సౌకర్యాలున్నాయి.

**సాగర దుర్గ ఆలయం :** ఈ ఆలయానికి పడవమీద పోర్టు చానెల్‌దాటి అటువైపు ఒడ్డుకు వెళ్ళి ఆలయాన్ని అమ్మవారిని చూడొచ్చు.

**భీమునిపట్నం :** భీమసేనుడు నివశించిన ప్రదేశం. అందుకే ఆ పేరు. ఇక్కడ డచ్ సమాధులున్నాయి. నరసింహస్వామి ఆలయంతోపాటు ఆహ్లాదకరమైన బీచ్ ఆకర్షణ.

**ఉడాపార్క్ :** విజయవాడ, మైసూర్, హైదరాబాద్‌లలో ఉన్నట్లు ఇక్కడకూడా మ్యూజికల్ ఫౌంటెన్ వుంది. బస్టాండ్ నుంచి 5 కి.మీ. దూరం. రకారకాల గేమ్స్‌తో ఇక్కడ సమయం తెలియకుండానే గడచిపోతుంది.

**కైలాసగిరి :** 305 మీటర్ల ఎత్తునవున్న ఈ కైలాసగిరి చేరడానికి మెట్లద్వారానూ, బస్సులోను వెళ్ళవచ్చు. ఇక్కడ్నించి సువిశాల అందాల సుందర నగరం, ఉవ్వెత్తున లేస్తున్న కెరటాల కడలిని చూడొచ్చు.

**రామకృష్ణా బీచ్ :** ఇక్కడ కాళీమాత ఆలయం, పాండురంగడి ఆలయం వున్నాయి. ఈ బీచ్ రైల్వే స్టేషన్ నుంచి 3 కి.మీ. దూరంలో వుంది. బ్రహ్మాండంగా ఎంజాయ్ చెయ్యొచ్చు.

**డాల్ఫిన్ హిల్ :** 437 మీటర్ల ఎత్తులో వున్న ఈ డాల్ఫిన్ కొండ పాత పోస్టాఫీసు [illegible] వుంది.

**జూపార్క్ :** ఇందిరాగాంధీ జూలాజికల్ పార్క్. 429 ఎకరాల్లో వున్న ఈ [illegible] ఇక్కడున్న నీటి ఏనుగుని చూస్తే [illegible] జంతువులతోపాటు మొసళ్ళు, పక్షులను కూడా చూడవచ్చు.

**[illegible] :** సముద్రపు [illegible] తో కలిసి మనల్ని వుక్కిరి బిక్కిరి చేస్తుంది. ఇక్కడ [illegible] స్వామి ఆలయం వుంది. సప్తఋషులు యజ్ఞం చేసి [illegible] ప్రతిష్ఠించారని స్థల మహాత్మ్యం చెబుతోంది. ఈ ఆలయం చుట్టూ బావులున్నాయి. దేవుడి మహాత్మ్యం ఇక్కడ [illegible] ఈ బావుల్లో మంచినీరు వుంటుంది. (దగ్గరలో సముద్రం వుంది) ఇంకా [illegible] ప్రాంతంలో మోదకొండమ్మ, పొట్నూరులో శ్రీకృష్ణదేవరాయల విజయస్థూపం. విశాఖకు 30 కి.మీ. దూరంలో గంగవరం బీచ్, యలమంచిలి సమీపంలో పంచధారలు. ఈ పంచధారలు అనకాపల్లి నుంచి 24 కి.మీ. దూరం.

ఇక్కడున్న [illegible] ధర్మలింగేశ్వర ఆలయంలోని శివలింగాన్ని సాక్షాత్తు యముడు నిర్మించాడని స్థల మహాత్మ్యం చెబుతోంది. ఇక్కడ ఐదు ధారలు నిరంతరం పడుతూండడంవల్ల ఈ పేరు వచ్చింది. ఇక్కడ అనేక శిల్పాలు ఉన్నాయి. ఇంకా నూకాంబికా అమ్మవారు విశాఖ నుంచి 35 కి.మీ. దూరంలో అనకాపల్లిలో ఉంది.

ఇవన్నిటితోపాటు ఈ విశాఖ నుంచి అండమాన్ ప్రయాణించవచ్చు. ఈ అండమాన్ వైజాగ్ నుంచి 1212 కి.మీ. సముద్రమార్గం ద్వారా అండమాన్ వెళ్లడం ఒక మధురమైన అనుభూతి. ఇక్కడ నుంచి అండమాన్‌కి 36 గంటలపైన పడుతుంది.

**పూర్తి వివరాలు కావలసినవారు సంప్రదించండి :**

పోస్ట్ బాక్స్ 117, ఫోర్ట్ మెయిన్ గేటు ఎదురు, విశాఖపట్టణం. ఫోన్ : 65584, 65597. 62661. టెలెక్స్ : 495-210.

మనము ఎన్నోసార్లు విన్న సెల్యులర్ జైలుతోపాటు, రోజ్ ఐలెండ్, ఈ అండమాన్ టూర్‌లో చూడొచ్చు.

**బలి ఘట్టం :** ఇక్కడ లింగం స్ఫటికంలా వుంటుంది. ఈ ప్రాంతంలో విభూది గనులు ఉన్నాయి. బ్రహ్మ ప్రతిష్టించిన లింగం అవడంతో బ్రహ్మలింగేశ్వర ఆలయం అంటారు. ఇక్కడనుంచి తూర్పున ఉన్న పర్వతాలపై సప్త ఋషులు తపస్సు చేసుకుంటూ ఉంటారని భక్తుల నమ్మకం. బ్రహ్మాండ పురాణంలో ఉన్న ఈ ప్రదేశాన్ని దక్షిణకాశిగా కూడా భావిస్తారు భక్తులు. ఇక విశాఖ నగరానికి వస్తే.... ఇక్కడ దర్శించాల్సిన శక్తివంతమైన అమ్మవారి క్షేత్రం వుంది. అదే కనకమహాలక్ష్మి ఆలయం

కొబ్బరికాయనీటితో పసుపు కుంకుమలకే ఇక్కడి అమ్మవారు సంతృప్తి చెంది భక్తులపాలి కొంగు బంగారమై భాసిల్లుతోంది. ఇక్కడి అమ్మవారి ఒడిలో పసిపిల్లలను ఉంచి అమ్మ నుంచి ఆశీస్సులు అందుకుంటారు. గురువారం ఇక్కడ విశేషంగా వస్తారు. అమ్మవారికి వామహస్తం మోచేయి వరకు వుండదు.

**దాని గురించి పురాణకథ** :

పూర్వము శివభక్తుడు కాశీ వెళ్ళుటకై ఆ మార్గాన ప్రయాణిస్తూ ప్రస్తుత గుడివద్ద నున్న బావిలో స్నానం చేసి పూజా కార్యక్రమాలు నిర్వర్తించాడు.

అదే బావినుంచి అమ్మవారు ప్రత్యక్షమై ఆ సద్బ్రాహ్మణుడితో ఇదే ప్రదేశమున నా గుడి కట్టించి పూజా కార్యక్రమాలు నిర్వర్తించమనగా, అంత ఆ బ్రాహ్మణుడు లేదని చెప్పి, తన కాశీ ప్రయాణం గురించి చెప్పగా, ఆ తల్లి కోపోద్రిక్తురాలై ఆయుధాన్ని ప్రయోగించబోగా, పరమశివుడు భక్తునికి అండగానిలచి అమ్మవారి హస్తాన్ని నరికాడని స్థల మహాత్యం. ఆపై అమ్మవారు శాంతించి కనకమహాలక్ష్మిగా అవతరించింది. ఆపై అమ్మవారి కోరిక ప్రకారం ఆ బ్రహ్మణుడు అమ్మవారిని ప్రతిష్ఠించి పూజాకార్యక్రమాలు నిర్వహించగా అతనికి ముక్తి లభించెను.

రైల్వే ఎంక్వయిరి : కంప్యూటర్ విచారణ 130, తెలుగు 131 చేయాలి. అలాగే ఇంగ్లీషులో వివరణ కావాలనుకుంటే 132, హిందీలో 133, రైల్వే రిజర్వేషన్, విచారణ కొరకు 135 లేదా 1842414.

ఎ.పి.యస్.ఆర్.టి.సి. ఎంక్వయిరీ కొరకు 546400

**ఈ ఉక్కు నగరంలో వసతి**

**తాజ్ రెసిడెన్సీ** : బీచ్‌రోడ్, 567756, 564784, సింగిల్ రూమ్‌కి 2100/-, డబల్ రూమ్ 2,400/-, డీలక్స్ 3,800 వరకు ఉంటుంది.

**మేఘాలయ** : 425 నుంచి 625 వరకూ ఈ హోటల్ మునిసిపల్ కార్పొరేషన్ వెనుక వుంది. ఫోన్ : 555141

**దసపల్లా** : 450/- నుంచి 1000/- వరకూ. ఫోన్ : 564825

**ది పార్క్** : ఫైవ్‌స్టార్ హోటల్ 1800/- నుంచి 4500/- వరకూ, బీచ్‌రోడ్‌లో వున్న ఈ హోటల్ ఫోన్స్ : 555185, 554458.

**గ్రీన్‌పార్క్** : 695/- నుంచి 1500/- వరకూ, వాల్తేరు మెయిన్ రోడ్‌లో వున్న త్రీస్టార్ హోటల్ ఫోన్ : 564444.

షిప్స్ : 350 - నుంచి వున్నాయి రూమ్స్. డాబాగార్డెన్స్‌లో వున్న ఈ హోటల్ ఫోన్ : 547675

సరోవర్ : 450 - నుంచి దొరుకుతాయి. ద్వారకా నగర్‌లోని ఈ హోటల్ ఫోన్ : 556004.

శ్రీకన్య : 280/- నుంచి రూమ్స్ దొరుకుతాయి. ఈ హోటల్ ఫోన్ : 564881.

సెంటర్ పాయింట్ : 400/- నుంచి రూమ్స్ వసతికి దొరుకుతాయి. డాబాగార్డెన్స్‌లో వున్న ఈ హోటల్ ఫోన్ : 574256.

పాలెంబీచ్ : బీచ్‌రోడ్‌లో వున్న ఈ హోటల్ ఫోన్ : 554026 ఎ/సి సింగిల్ రూమ్ 500 వరకూ వుంటుంది.

## విశాఖపట్టణములో విమాన సర్వీసులు

| FLIGHT (Effective from 1-3-98) | | Dep. | Arr. | fare Rs. |
|---|---|---|---|---|
| విశాఖపట్టణం -కలకత్తా | 1, 3, 5 CD 571 | 15.35 | 16.55 | 3785 |
| విశాఖ-చెన్నై | 2, 4,6 CD 552 | 14.45 | 15.50 | 3035 |
| విశాఖ-హైదరాబాదు | 1, 3, 5 CD 562 | 12.35 | 13.35 | 2865 |
| విశాఖ-హైదరాబాదు | 2, 4, 7 CD 572 | 12.50 | 13.50 | 2865 |
| విశాఖ-ముంబాయి | 1,3,5,7 CD 141 | 13.15 | 16.45 | 5145 |
| (విశాఖ-భువనేశ్వర్) | | | | |
| **విశాఖ-భువనేశ్వర్** | 1,3, 5, 7 CD 141 | 13.15 | 14.50 | 3025 |

## విశాఖ పట్టణములో రైల్వే టైమ్ టేబుల్

రైలు టైమింగ్స్ (ఎక్స్‌ప్రెస్)

| రైలు నం. | రైలు పేరు | వచ్చువేళ | వెళ్ళువేళ |
|---|---|---|---|
| 6003 | హౌరా-చెన్నై (మెయిల్) | 12.55 | 13.20 |
| 6004 | చెన్నై-హౌరా (మెయిల్) | 13.45 | 14.05 |
| 2841 | హౌరా-చెన్నై- కొరమండల్ ఎక్స్‌ప్రెస్ | 04.30 | 04.50 |
| 2842 | చెన్నై-హౌరా కొరమండల్ ఎక్స్‌ప్రెస్ | 22.15 | 22.35 |
| 6309 | కొచ్చిన్ - పాట్నా (మంగళ) | 20.55 | 21.15 |
| 6310 | పాట్నా-కొచ్చిన్ (శుక్ర) | 14.50 | 15.10 |
| 6519 | బెంగుళూరు-గౌహతి (ఆది) | 20.55 | 21.15 |

| | | | |
|---|---|---|---|
| 6520 | గౌహతి-బెంగుళూరు (మంగళ) | 22.00 | 22.20 |
| 6321 | త్రివేంద్రం - గౌహతి (బుధ) | 20.55 | 21.55 |
| 6322 | గౌహతి-త్రివేంద్రం (సోమ) | 22.00 | 22.20 |
| 6323 | త్రివేంద్రం-హౌరా (గురు, ఆది) | 20.55 | 21.15 |
| 6324 | హౌరా - త్రివేంద్రం (శని, మంగళ) | 14.50 | 15.10 |
| 5623 | కొచ్చిన్ - గౌహతి (సోమ) | 20.55 | 21.15 |
| 5624 | గౌహతి - కొచ్చిన్ (గురు) | 22.00 | 22.20 |
| 5625 | బెంగుళూర్ - గౌహతి (శుక్ర, శని) | 20.55 | 21.15 |
| 5626 | గౌహతి-బెంగుళూర్ (బుధ, ఆది) | 22.00 | 22.20 |
| 8079 | హౌరా - తిరుపతి | 22.45 | 23.05 |
| 8080 | తిరుపతి - హౌరా | 5.50 | 06.15 |
| 7488 | విశాఖ - తిరుపతి (తిరుమల) | - | 14.30 |
| 7487 | తిరుపతి-విశాఖ (తిరుమల) | 11.05 | - |
| 8561 | విశాఖ-హెచ్. నిజాముద్దీన్ | - | 12.00 |
| 8562 | హెచ్. నిజాముద్దీన్-విశాఖ | 14.35 | - |
| 8689 | టాటా-అలిప్పి-బొకారో | 10.45 | 11.05 |
| 8690 | అలిప్పి - టాటా-బొకారో | 15.10 | 1530 |
| 8045 | హౌరా-హైదరాబాదు (ఈస్టకోస్ట్) | 05.15 | 05.35 |
| 8046 | హైదరాబాదు - హౌరా (ఈస్టకోస్ట్) | 20.35 | 20.55 |
| 1020 | భువనేశ్వర్-ముంబాయి సి.ఎస్.టి.-కొనార్క్ | 21.40 | 22.00 |
| 1019 | ముంబాయి సి.ఎస్.టి.-భువనేశ్వర్ -కొనార్క్ | 21.20 | 21.40 |
| 7007 | విశాఖ-హైదరాబాదు (గొదావరి) | - | 16.00 |
| 7008 | హైదరాబాదు - విశాఖ (గొదావరి) | 06.50 | - |
| 7015 | పలాస - సికింద్రాబాదు (విశాఖ) | 16.25 | 16.40 |
| 7016 | సికింద్రాబాదు - పలాస (విశాఖ) | 07.25 | 07.40 |
| 8517 | బిలాస్‌పూర్ - విశాఖ | 02.15 | - |
| | (మంగ, బుధ, శుక్ర మరియు శని) | | |
| 8518 | విశాఖ-బిలాస్‌పూర్ | | |
| | (సోమ, బుధ, శుక్ర మరియు ఆది) | - | 23.40 |
| 8544 | హెచ్. నిజాముద్దీన్ - విశాఖ (సమత) | 22.30 | - |
| 8543 | విశాఖ-హెచ్. నిజాముద్దీన్ | - | 04.00 |

| | | | |
|---|---|---|---|
| | (సోమ బుధ. గురు మరియు ఆది) | | |
| 7240 | విశాఖ - గుంటూరు | - | 08.15 |
| 7239 | గుంటూరు - విశాఖ (సింహాద్రి) | 18.45 | - |
| 8401 | పూరి - ఓఖా (ఆది) | 17.30 | 17.50 |
| 8402 | ఓఖా-పూరి (శుక్ర) | 05.30 | 05.50 |
| 2703 | హౌరా - సికింద్రాబాదు (ఫలక్‌నామా) | 23.05 | 23.25 |
| 2704 | సికింద్రాబాద్ - హౌరా (ఫలక్‌నామా) | 04.05 | 04.25 |
| 7245 | విశాఖ-విజయవాడ (రత్నాచల్) | - | 13.00 |
| 7246 | విజయవాడ-విశాఖ (రత్నాచల్) | 12..10 | - |
| 8439 | పూరి - తిరుపతి (శుక్ర) | 17.30 | 17.50 |
| 8440 | తిరుపతి - పూరి (ఆది) | 05.30 | 05.50 |
| 5553 | విశాఖ - నిజాముద్దీన్ (స్వర్ణజయింతి) (సోమ-శుక్ర) | - | 08.50 |
| 8554 | నిజాముద్దీన్ - విశాఖ (సోమ. గురు) | 19.35 | - |

## సింహాచలం

విశాఖపట్టణం పరిసర ప్రాంతాల్లో ఆప్యాయంగా సింహాద్రి అప్పన్నగా పిలుస్తారు. ఈ దేవాలయం 11వ శతాబ్దానికి ముందు నిర్మించబడింది. కొండ మీద గోదావరి, గంగ, కూర్మ, మాధవ ఆకాశధారలను హనుమద్వారము వరకూ చూడచ్చు. శ్రీ మహావిష్ణువు అవతారమైన ఈ వరాహనృసింహస్వామి క్షేత్రంలో వైశాఖ శుద్ధ తదియనాడు బ్రహోత్సవాలు జరుగుతాయి. సంవత్సరం పొడవున చందనంతో మెత్తి వేయబడినస్వామి నిజరూపాన్ని దర్శించటానికి లక్షల మంది యాత్రికులు వస్తారు. ఈ వరాహలక్ష్మీ నరసింహస్వామి సన్నిధిలో 14-15 శతాబ్దములో (1428) కళింగ దిగ్విజయయాత్ర ముగించి సింహాద్రి నాధుని దర్శించి నిర్మించిన శ్రీకృష్ణదేవరాయల 'విజయధ్వజము' శిలా శాసనము కలదు. ఇంకా కుళుత్తోంగ చోళుడు కట్టించిన మంటపాలు, స్థూపాలతోపాటు సంతాన గోపాల యంత్ర ప్రతిష్టమైన కప్పస్థంభము కలవు. ఈ సింహాచల క్షేత్రం విశాఖ నుంచి 16 కి.మీ. సముద్రమట్టానికి 800 అడుగుల ఎత్తులో ఉంది. క్రీ.శ. 1098 తర్వాత చెక్కిన 500 శిలాశాసనాలు ఉన్నాయి. ఇక్కడున్న కప్ప స్థంభాన్ని కౌగిలించుకొని కోరుకుంటే కోరిన కోరిక తీరుతుందని నమ్మకం. కొండమీదకు మెట్లు, బస్సు ద్వారా వెళ్ళవచ్చు. స్వామి సర్వదర్శనం 7 నుండి సా. 4 వరకూ, మళ్ళీ 6 నుండి 7 వరకూ తిరిగి 8 నుండి 9 వరకు......... ఉండటానికి APTDC చందన టూరిస్ట్ రెస్టహౌస్, దేవస్థానముల సత్రాలు, గదులు........

## హార్సిలీ హిల్స్

పెనుగొండ నుంచి 140 కి.మీ. వుంటుంది. సముద్ర మట్టానికి 1265 మీ. ఎత్తులో వున్న ఈ ప్రదేశం కడు రమ్యంగా, నేత్రపర్వంగా ఉంటుంది. ఎన్నో సుందర ప్రదేశాలను చలన చిత్రాల్లో చిత్రీకరించారు. APTTDC టూరిస్ట్ రెస్ట్‌హౌస్ వుంది.

## నాగార్జున సాగర్

ఆచార్య నాగార్జునుని నివాసం. 1926లో ఈ ప్రదేశాన్ని త్రవ్వగా పురాతత్వశాఖ వారికి అపారమైన అవశేషాలు లభించాయి. కొండమీద అపురూపంగా భద్రపరిచిన ప్రాచీన శిలా శిల్పాలు, మహారాణి స్నానమట్టం, మ్యూజియం, లాల్‌బహదూర్, జవహర్‌లాల్ నెహ్రూ పేర్ల మీద వున్న ఎడమకాలువ, కుడి కాలువలే కాక 11కి. మీటర్ల దూరంలో వున్న ఎత్తిపోతల జలపాతం కూడ చూడదగ్గది. ఇక్కడ చంద్రవంక నది నీరు పైనుంచి పడుతుంది.

ఇంక శ్రీరంగనాయకస్వామి ఆలయం చాలా రమణీయం. జూన్ నుంచి ఫిబ్రవరిలోపు సాగర్ నుండి శ్రీశైలంకి బోటులో ప్రయాణించవచ్చు.

**ఉండటానికి వసతి :**

A.P.T.T.D.C. ప్రాజెక్ట్ హౌస్‌హిల్ కాలనీ

గవర్నమెంటు టూరిస్ట్ రెస్ట్‌హౌస్

విజయ విహార్, గెస్ట్‌హౌస్, హిల్‌కాలనీ

యూత్ హాస్టల్, హిల్ కాలనీ

లాంచీలో ప్రయాణించవచ్చు కొండవరకు రేట్లు 18, 8, 25, 15

## చేజెర్ల కపిలేశ్వరాలయం

గుంటూరు జిల్లాలోని చేజెర్ల గ్రామంలో వున్న కపిలేశ్వరస్వామి కోరిన కోర్కెలు తీర్చే స్వామిగా భక్తులు కొనియాడతారు. ఈ దేవుని సన్నిధిలో ఒక రాత్రి నిదురించి కోర్కె కోరుకుంటే 3 నెలలు తిరిగేలోపు ఆ కోర్కె ఫలిస్తుందనే ప్రగాఢ విశ్వాసం, ఇంతవరకూ ఎవరికి వమ్ముకాలేదంటే అతిశయోక్తి కాదు. క్రీ.శ. 3-4 శతాబ్దాలకి చెందిన ఈ దేవాలయంలో మూడు గజాల ఎత్తు కలిగిన సహస్ర లింగాకారమూర్తిగా స్వామి దర్శనమిస్తారు.

## కోటప్పకొండ

ప్రతి శివరాత్రికి తిరునాళ్ళు నభూతో నభవిష్యతి అన్నరీతిలో జరుగుతాయి. ప్రభలు బండ్లు కట్టుకొని గ్రామాలకి గ్రామాలే తరలి వస్తారు. మూడు శిఖరాలు గల ఈ త్రికూటాచలం నర్సరావుపేటకు అతి దగ్గర.

## మహానంది

గాజులపల్లె నుండి 6 కి.మీ. నంద్యాల నుండి 15 కి.మీ. ఈ పురాతన క్షేత్రం.

ఈ దేవాలయము గాలి గోపురము (పడమట) 1907 సం॥ నవంబరు 19వ తారీఖున ప్రతిష్ఠించ గావింపబడినది. గాలిగోపురము (ఉత్తరమున) శకనం. 1930లో జీర్ణోద్ధరణ గావింపబడినది. దక్షిణదిక్ గోపురము కూడా అపుడే జీర్ణోద్ధరణ గావింపబడింది.

జగద్గురు కంచి కామకోటి పీఠాధిపతి శ్రీశ్రీశ్రీ చంద్రశేఖర యతీంద్రుల వారిచే నవగ్రహ ప్రతిష్ఠ గావింపబడినది.

ఈ దేవాలయము పడమటి గోపురమునకు లోపల భాగమున జ్యోతిస్తంభము కలదు. ఈ స్తంభవము దేవాలయము కట్టించిన నాటిదని ప్రతీతి. ఈ స్తంభము ఇప్పటికీ ఉన్నది.

ఇచట కామేశ్వరీ దేవాలయము శ్రీ కోదండరామాలయము రెండును చూడదగ్గవి. ఇచ్చట వెలసిన నవనందుల గురించి :

**ప్రథమనంది :** నంద్యాలకు నైరుతి భాగమున చామకాలువ ఒడ్డున రైల్వేస్టేషన్‌కు కొలది దూరములో నున్నది.

**నాగనంది :** నంద్యాల పట్టణమందలి ఆంజనేయస్వామి దేవాలయము నందు వెలసియున్నది

**వినాయక నంది :** మహానందిలో ఆగ్నేయముగా నున్నది. ఇచ్చట నిత్యపూజలు జరుగుచున్నవి.

**గరుడ నంది :** మహానందికి పడమర దిక్కున ఉన్నది. ఇచ్చట వెలసియున్న శివలింగమునకు ఈ గరుడ లింగమునకు పూజలు చేసిన తరువాత మహా నందీశ్వరునకు పూజలు చేసేవారు. ఇప్పటికి నిత్యపూజలు జరుగుచున్నవి.

**శివనంది :** నంద్యాల పట్టణమునకు సుమారు 15 కి.మీ. దూరములో కడమ కాల్వాయను గ్రామమున వెలిసియున్నది.

**విష్ణు నంది (కృష్ణనంది) :** మహానందికి సుమారు 3 కి.మీ. దూరములో తూర్పున ఉన్నది. ఇచ్చట నంది విగ్రహము పాలరాతితో మలచబడియున్నది. ఇచ్చట కూడా స్నానము చేయుటకు స్వచ్ఛమైన కొలను కలదు. నిత్య పూజలు, అర్చనలు జరుగుచున్నవి.

**మహా నంది :** నవనందులలో ముఖ్యమైనది. శ్రేష్ఠమైనది. ఇచ్చటకు అన్ని కాలముల యందు వేలాది మంది భక్తులు వచ్చుచున్నారు. శ్రీ మహానందీశ్వరుడు వెలసియున్న పరమ పవిత్రమైన క్షేత్రమిది.

**సూర్య నంది** : నంద్యాల పట్టణమునకు సుమారు ఐదు కి.మీ. దూరమున తూర్పుననున్నది. సూర్యుడు ఉదయించునపుడు అరుణ కిరణములు ఈ లింగముపై పడును. అందువలన దీనిని "సూర్యనంది" అందురు.

**సోమ నంది** : నంద్యాల పట్టణమునకు తూర్పుననున్నది.

ఈ నవనందులను నంది మండలం అంటారు. ఈ మహా నందిక్షేత్రం నందు మహాశివరాత్రికి ఉత్సవములు జరుగును. ఎన్నో ఉత్సవములు, శివనామ సంకీర్తన, సప్తాహములు జరుగును. దసరా ఉత్సవములు జరుగును.

ఇచ్చట భక్తులు నిరంతర కృషితో ఇటీవల శైవాగమ, ఆది శైవాగమ పాఠశాలను స్థాపించి యున్నారు.

ఎన్నో వసతి గృహములతో నిత్యమూ భక్తజన సందోహముతో ఈ క్షేత్రము ఎంతో వైభవముగ విరాజిల్లుచున్నది.

ఇచ్చటనే ప్రకృతి శోభతో పురాతనమైన ఓంకార క్షేత్రము కలదు. మహానందికి సుమారు 10 కి.మీ. దూరమున, విష్ణునందికి సుమారు 7 కి.మీ. దూరముననున్నది. ఈ క్షేత్రమును దర్శించుటకు కాలి బాటనే వెళ్ళవలసి యుండును. నట్టడివిలో చుట్టూ కొండల మధ్య వెలసి యున్నదీ ఓంకారేశ్వరుడు. దేవాలయము పురాతనమైనది. మధ్యలో రాతితో కట్టిన కోనేరు కలదు. అందులో స్వచ్ఛమైన నీరు భక్తుల హృదయాలను ముగ్ధులను చేస్తుంది. ఈ కోనేటిలో మునిగినపుడు అడుగు భాగము నుంచి నీళ్ళలో "ఓం" అని ఓంకార శబ్దము అస్పష్టంగా వినిపిస్తున్నదట! ఎందరో ఋషి పుంగవులు తపస్సు చేసుకొనిన పవిత్ర స్థలమిది. దర్శించవలసిన క్షేత్రము. ప్రతిరోజూ స్వామి వారికి నిత్యపూజలు జరుగుతుంటాయిక్కడ.

ఈ క్షేత్రమున మూడు నీటి ధారలు ప్రవహించుచున్నవి.

**బ్రహ్మగుండము** : ఈ నీటి ధార కల గుండము ఆలయమునకు ఉత్తరాన కలదు. ఈ నీటినే క్షేత్రమునకు పంపుల ద్వారా సరఫరా చేయుట జరుగుచున్నది.

**విష్ణుగుండము** : ఈ గుండము నీటి ధార ఆలయమునకు దక్షిణమున కలదు. ఇందలి నీరు పరిసరముల సాగుకై ఉపయోగపడుచున్నది.

**రుద్ర గుండము** : ఈ గుండములోని నీరు గర్భాలయమునందు గల శివలింగము మీద నుండి వచ్చుచున్నది. సుమారు వేయి ఎకరముల భూమిని సస్యశ్యామలముగా చేయుచున్నది. నీటి ధార ఆలయ ప్రాకరము లోపలనే నిర్మించిన పుష్కరిణిలో ప్రవేశించి రెండు తూముల ద్వారా బయటకు ప్రవహించుచున్నది. ఈ పుష్కరిణి ఐదు అడుగుల లోతు నీరు కలిగియుండునట్లు నిర్మింపబడి యుండినందున స్త్రీ, పురుషులెల్లరు ప్రమాదములు లేకుండా స్నానము చేయవచ్చును. ఈ పుష్కరిణిలో నీరు అతి

స్పష్టముగా చెప్పగా ఉండుటయే గాక ఇందు స్నానమాచరించిన ఉల్లాసమును, ఆరోగ్యమును మనశ్శాంతిని కలిగించుననుట అనుభవైకవేద్యమే మరియు పాపములు తొలగి పుణ్యము సిద్ధించుననీ భక్తుల ప్రగాఢ విశ్వాసమైయున్నది. ఇందలి నీటి ప్రవాహము అతివృష్టి అనావృష్టి పరిస్థితులకు హెచ్చుటగానీ తగ్గుటగానీ జరగక ఒకే రీతిలో నుండుట ఆశ్చర్యమును కలిగించును.

ఇచ్చట తిరుపతి దేవస్థానమువారి 28 గదుల సత్రము 10 గదుల శ్రీ కామేశ్వరీ సత్రము, శ్రీ మహానందీశ్వర స్వామి సత్రము, కాటేజీలు కలవు. ప్రతి సంవత్సరము మాఘ బహుళ ఏకాదశి నుండి ఫాల్గుణ బహుళ పాడ్యమి వరకు మహాశివరాత్రి పర్వదిన సందర్భమున బ్రహ్మోత్సవములు జరుగును.

## అహోబిలం

నంద్యాల నుండి వెళ్ళవచ్చు. దశావతారాల్లో నాల్గవ అవతారమైన నరసింహస్వామి మూర్తి. మిగతా తొమ్మిది అవతారాలు కూడా దర్శించవచ్చు. గవర్నమెంట్ టూరిస్ట్ రెస్ట్‌హౌస్‌లో దిగవచ్చు. దిగువన అహోబిలం ఆగ్నేయాన 2 కి.మీ. దూరాన శ్రీ యోగానందనరసింహస్వామి సన్నిధి కలదు.

పుణ్యక్షేత్రాలకు కాణాచి అయిన కడప జిల్లాలో పుణ్యక్షేత్రాలు :

కడపలో శ్రీ లక్ష్మీ వేంకటేశ్వర దేవాలయం వుంది. కడప నుంచి 2 కి.మీ. దూరం ఈ క్షేత్రం. అతి ప్రాచీనమైనది. ఇక్కడవున్న శ్రీ లక్ష్మీ వేంకటేశ్వర దర్శనానంతరము తిరుమలేశుని దర్శిస్తారు భక్తులు. కృపాచార్యులు ప్రతిష్ఠించినట్లు స్థల మహాత్మ్యము తెలుపుతుంది. వేంకటేశ్వర స్వామి వెనుక ఆంజనేయస్వామి విగ్రహం వుంది.

**తాళ్ళపాక** : 1408-1424 మధ్య తన మధుర గీతాలతో ఆ వేంకటేశ్వర స్వామిని ప్రసన్నం చేసుకొన్న మహనీయుడు తాళ్ళపాక అన్నమాచార్యుడు ఈ వూరి వాడే. శ్రీ అన్నమయ్య 22 వేల కీర్తనలు రచించాడు. భక్తి రస బంధురమై అనితరసాధ్యమైన పదరచన చేసిన పదకవితాపితామహుడు నివసించిన ప్రదేశం ఈ తాళ్ళపాక.

**ఒంటిమిట్ట** : ఏకశిలా నగరమని ఈ క్షేత్రమునకు ప్రసిద్ధ నామము వుంది. ఇక్కడ శ్రీ కోదండరామస్వామిని జాంబవంతుడు ప్రతిష్ఠించారు. ఏకరాయిలో, శ్రీరాముడు, లక్ష్మణుడు, సీతను చూడవచ్చు. ఇక్కడ రామ తీర్థముంది. శ్రీరాముడు, సీత కోరికపై రామ బాణంతో పాతాళగంగను పైకి తెచ్చాడని స్థల పురాణం. గోపుర నిర్మాణం చోళ శిల్ప సంప్రదాయంలో కన్పిస్తుంది.

**శ్రీ అగస్త్యేశ్వర దేవస్థానము** : చోళరాజు నందవర్మ గర్భాలయాన్ని నిర్మించాడు. అగస్త్య మహర్షి స్వామిని ప్రతిష్ఠించడంతో ఆ పేరుతో పిలుస్తారు.

శ్రీ త్రేతేశ్వర స్వామి : ఇక్కడ దక్షయజ్ఞం జరిగినట్లు ఆధారాలు ఉన్నాయి. త్రేతేశ్వరునిపై పాలు పిండిన ఆవు పాదముద్రలు, మోకాటి గుర్తులు చూడవచ్చు. ఇక్కడున్న బహుదానదిలో స్నానం సర్వపాపహరణం. ఇంకా శ్రీ వీరభద్రస్వామి ఆలయం అల్లాడపల్లెలోను, వీరబల్లెలో శ్రీహరిహరాదుల ఆలయాలు ఉన్నాయి.

**గండిక్షేత్రం** : హనుమంతుడు ఈ గండి క్షేత్రములో రెండు కొండల నడుమన బంగారు తోరణం కట్టి శ్రీరామ చంద్రుని ఆహ్వానించిన క్షేత్రమిదే. ఈ తోరణం కనిపిస్తే 6 నెలల్లో దివంగతులు అవుతారు. 1914లో అక్టోబర్ 10న జిల్లా కలెక్టర్ సర్ థామస్ మన్రో దొరకు ఈ తోరణం కన్పించింది. ఈ క్షేత్రాన్ని మానసిక వ్యాధులు, సంతానం లేని వారు ఎక్కువగా స్వామిని సేవిస్తారు.

**పుష్పగిరి క్షేత్రం** : పినాకిని నదీతీరంలో వున్న ఈ క్షేత్రం దక్షిణకాశీగా పిలుస్తారు. సంతానం లేని వారు ఇక్కడున్న గిరి ప్రదేశం చూస్తే సంతానవంతులవుతారని నమ్మకం.

**సంగమేశ్వర దేవాలయం** : కడపజిల్లాలో కమలాపురం తాలూకాలో వున్న అనిమెలలో ఉంది ఈ దేవాలయం. ఈ గుడిలో ఈశ్వరునికి ఎదురుగా నల్లరాతితో పొడవైన నంది విగ్రహం ఉంది. వైశాఖ శుద్ధపౌర్ణమి నాడు తిరునాళ్ళు జరుగుతాయి.

**ముక్తి రామేశ్వరం :**

ప్రొద్దుటూరు నుండి 6 కి.మీ. దూరం. ఇచ్చటి ఈశ్వర లింగము సైకతలింగము. నేలకి 5 అంగుళాల ఎత్తునవున్న ఈ లింగముపై ఇసుకను అదిమిపెట్టిన వేలిముద్రలు ఇప్పటికి అగుపిస్తాయి.

**శ్రీవారాపుర వేంకటేశ్వరస్వామి :**

కడప జిల్లాలోని జమ్మల మడుగు పట్టణంలో శతాబ్దాల చరిత్ర కలిగిన వేంకటేశ్వర స్వామి ఆలయం ఉంది. నారాపురుడనే భక్తుడు నిర్మించటంతో ఆ పేరుతో పిలుస్తారు. ఉత్తరదిశగా ఇసుక తిన్నెల్లో నిర్మించిన ఈ ఆలయం తప్పనిసరిగా దర్శింపదగ్గది.

## శ్రీ బ్రహ్మంగారి మఠము

16వ శతాబ్ది ప్రాంతమువారు అయిన శ్రీ పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామి వారు కాలజ్ఞాన తత్త్వాన్ని పామరులకి కూడా అర్థమయ్యే భాషలో వ్రాశారు. భూత, వర్తమాన భవిష్యత్తు కాలాన్ని కళ్ళకు కట్టినట్టు చెప్పిన స్వామి 1594 మే నెలలో జీవ సమాధిని పొందారు. అదే శ్రీ బ్రహ్మంగారి మఠము. చుట్టూ నల్లమల అడవులు. రమణీయమైన ప్రకృతి, అద్భుతమైన రైలుమార్గం. బస్సులో అయితే బద్వేలు మీదుగా వెళ్ళాలి. గిద్దలూరు నుంచి వచ్చేవారు మల్లేపల్లి దగ్గర దిగిరావాలి.

## శ్రీశైలము (శ్రీశైల శిఖరం దృష్ట్వా పునర్జన్మ విద్యతే)

పురాణ ప్రసిద్ధమైన ఈ క్షేత్రంలో శ్రీశైల భ్రమరాంబికా మల్లికార్జునస్వామి వారు వెలిసి ఉంటారు. ఎక్కడాలేని విధంగా ఇక్కడ స్వామిని చేతులతో తాకి పునర్జన్మ లేకుండా ముక్తిని పొందవచ్చు. ఇంతటి మహాత్మ్యగల పుణ్యక్షేత్రం ద్వాదశ జ్యోతిర్లింగములలో మొట్టమొదటిది. సముద్రమట్టానికి 1500 అడుగుల ఎత్తులో వున్న ఈ అనాదిక్షేత్రమును శ్రీ రామచంద్రుడు బ్రహ్మహత్యాపాతక విముక్తికై ప్రదక్షిణ చేశారు. ఆలయదర్శన వేళలు మ॥ 1.15 నుండి 3.30 వరకూ మరియు రాత్రి 9.00 ల నుండి 10.00 ల వరకూ ఉచిత దర్శనం కలదు. శ్రీ భ్రమరాంబికాలయంతోపాటు ఎడమవైపున పార్వతీదేవి ఆలయం ఉంది. ఆంధ్రుల గర్వకారణమైన ఈ శ్రీశైలంలో దర్శనీయ స్థలాలు.

1) సహస్ర లింగాలయము 2) చంద్ర కుండము 3) వృద్ధ మల్లిఖార్జునస్వామి 4) రుద్రాక్ష మంటపము 5) సారంగ మంటపము 6) పంచాక్షరీ మంటపము 7) గోగర్భం 8) ఘంటామఠము 9) ఏనుగుల చెరువు 10) పాతాళగంగ 11) లింగాలగట్టు 12) నృసింహబిలము.

అన్ని కులాల వారికి సత్రాలున్నాయి. ఉచిత భోజన పథకము ఉంది. టి.టి.డి. గెస్ట్‌హౌస్, టూరిస్ట్‌రెస్ట్‌హౌస్ లాంటివి ఉన్నాయి. APTDC శైలవిహార్, టూరిస్ట్‌రెస్ట్‌హౌస్ కూడా ఉంది.

## మంత్రాలయము

పవిత్ర తుంగభద్రానదీ తీరాన వుంది ఈ క్షేత్రము.

శ్రీ మంత్రాలయ రాఘవేంద్రస్వామి వారు ఇక్కడే జీవసమాధి పొందారు. స్వామి వారిని దర్శించే ముందు గ్రామదేవతయైన మంచాలమ్మను దర్శించండి. అది స్వామి ఆభీష్టం. భాద్రపద మాసంలో గొప్ప ఉత్సవం జరుగుతుంది. APTTDC టూరిస్ట్ రెస్ట్‌హౌస్‌లో దిగవచ్చు.

**రామతీర్థం :** ఇక్కడున్న రామాలయము అతిప్రాచీనమైనది. కొండమీద సీతమ్మ కోనేరు ఉంది. ఇక్కడ సీతాదేవి స్నానం చేసేదని చెబుతారు.

**భీమిలి :** విశాఖ నుంచి 33 కి.మీ. దూరానవున్న సాగరతీరం. ఆంధ్రా గోవాగా పేరుపొందిన భీమిలీలో 17వ శతాబ్దంలో నిర్మించిన బిల్డింగులు ఉన్నాయి. హవామహల్ ఉంది.

**శ్రీరామక్షేత్రం :** విజయనగరానికి 15 కి.మీ. దూరంలో ఉన్నాయి. రామతీర్థాలు. వాస్తుశాస్త్ర ప్రమాణములలో కొండపక్కగా నిర్మించబడింది.

పుణ్యగిరి : విజయనగరానికి 35 కి.మీ. దూరంలో శృంగవరపు కోటకు 5 కి.మీ. దూరంలో ఉంది ఈ పుణ్యగిరి. సముద్రమట్టానికి 20 మీ. ఎత్తులో ప్రకృతి సౌందర్యంతో విలసిల్లుతూంది. ఇక్కడి దేవాలయం అతిపురాతనమైంది.

## విజయనగరం

విజయనగర సంస్థానాధీశుల కోటలో రాజభవనాలు చూడవచ్చు. ఇక్కడ గురజాడ అప్పారావుగారి ఇల్లు చూడొచ్చు. ఇక్కడే రామతీర్థం వెళ్ళటానికి బండిమార వలసి ఉంటుంది. ఇక్కడ బౌద్ధక్షేత్రాలున్నాయి.

## బొబ్బిలి

తెలుగు శౌర్య ప్రతాప గాథలకు పుట్టినిల్లు. తాండ్రపాపయ్య సింహగర్జనలతో చరిత్ర సృష్టించినది ఈ ప్రదేశమే. శ్రావణ గోపాలస్వామి ఆలయం ఆనాటి సంప్రదాయాలను తెలియచెబుతుంది. P.W.D. గెస్ట్‌హౌస్ వసతికి సౌకర్యంగా ఉంటుంది.

**ముఖలింగ క్షేత్రము** : ఆముదాలవలస నుంచి 30 కి.మీ. ఇక్కడి స్వామి శ్రీముఖలింగేశ్వరస్వామి. ఈ దేవాలయాన్ని శ్రీ మధుకేశ్వరస్వామి దేవాలయం అని కూడా అంటారు. ఈ ఆలయానికి పంచపీఠస్థలమని పేరు కూడా.

**రావివలస** : టెక్కలి మండలంలో వున్న రావివలసలో మల్లిఖార్జునస్వామి దేవాలయం ఉంది. ఇక్కడి శివలింగం చాలా పెద్దది.

## శ్రీకూర్మం

శ్రీ కూర్మనాథ స్వామి ఆలయం. ఈ దేవాలయంతో పాటు శ్రీ రామానుజాచార్యులు, శ్రీ వరద రాజస్వామి, శ్రీ మధ్వాచార్యులు, శ్రీ కోదండరామస్వామి ఆలయాలు ఉన్నాయి. అతి ప్రాచీనమైన ఈ క్షేత్రంలో స్తంభాల మీద అపురూపమైన శిల్పాలు చెక్కి ఉన్నాయి. అరసవిల్లికి 8 కి.మీ. దూరంలో వున్న ఈ క్షేత్రంలో స్వామి పడమటి ముఖముగా ఉంటారు. ఈ ఆలయంలో రెండు ధ్వజ స్థంభములున్నాయి.

**అరసవిల్లి** : సూర్యదేవాలయం ఉంది. ఇక్కడ గర్భగుడిలో సూర్యుడి విగ్రహం పాదాల మీద ఉదయించే సూర్యుడి కిరణాలు పడటం విశేషం. ఈ ఆలయం క్రీ.శ. 672లో నిర్మించారు. ఇక్కడే ఇంద్రుడు ఆరోగ్యవంతుడయ్యాడు. ఎక్కడెక్కడ్నించో ఇక్కడికి ఆరోగ్యం కోసం వస్తారు. గుడిలో చక్కని శిల్పాలున్నాయి.

## యాదగిరిగుట్ట

యాదగిరి గుట్టమీద శ్రీ లక్ష్మీనృసింహ స్వామిని 315 మెట్లు ఎక్కిదర్శనం చేసుకోవచ్చు. కొండమీదికి నేరుగా బస్సులు కూడా ఉన్నాయి. దర్శనీయ స్థలాలు శివాలయము, అద్దాల మంటపము. స్వామి వారి ఉత్సవాలు ఫాల్గుణ తదియ నుండి

ద్వాదశి వరకూ జరుగుతాయి. విజయవాడ, హైదరాబాద్ రైలుమార్గంలో ఉన్న రాయగిర్ స్టేషన్ నుంచి అతిదగ్గర. భువనగిరి నుంచి 15 కి.మీ. హైద్రాబాద్ నుండి 60 కి.మీ.

## హనుమకొండ

ఇక్కడ ఆలయం అద్భుత శిల్పసంపదతో నేత్రపర్వంగా ఉంటుంది. 3 ద్వారాల్లో వున్న శివాలయం స్థంభాల మీద, దర్వాజాల మీద చూడచక్కని శిల్పాలున్నాయి. ఈ ఆలయం నంది నల్లరాతితో సొంపుగా చెక్కబడినది. హైదరాబాద్ - విజయవాడ రైలు మార్గంలో కాజీపేట నుండి గాని, వరంగల్ నుంచిగాని దిగి ఈ వేయి స్థంభాల మంటపం చూడొచ్చు.

## వరంగల్లు

దీనినే ఓరుగల్లు అంటారు. ఒకప్పుడు ఆంధ్రరాజుల కాకతీయులు రాజధానిగా చేసుకొని పాలించారు. వీరు కళారాధకులు. వారి కాలంలో ఎన్నో ఆలయ కట్టడాలు తీర్చిదిద్దారు. క్రీ.శ. 1310లో అల్లావుద్దీన్ సారధ్యంలో దండయాత్ర జరిపి ప్రతాపరుద్రుని ఓడించారు. నగర శిల్పాలను ధ్వంసం చేశారు. అపురూపమైన సంపదని వేయి ఏనుగులతో ఢిల్లీ తరలించినట్లు చరిత్ర ఆధారాలు చెబుతున్నాయి. ఇక్కడి శిథిలాలను చూసిన కంటతడి రాకమానదు. వరంగల్లు నుండి హనుమకొండకు వెళ్ళే దారిలో ప్రభుత్వ పాలిటెక్నిక్ కళాశాలకు వెనుకగా అర కి.మీ. దూరంలో కొండమీద శ్రీ భద్రకాళీ దేవాలయం ఉంది. రుద్రదేవుడు 1163లో నిర్మించిన సహస్ర స్థంభ దేవాలయం హనుమకొండలో ఉంది. వసతికి ఏకశిల, సర్దార్ వల్లభాయ్ పటేల్ రోడ్డు ఫోను - 37315, శంకర్, చౌరస్తా, హనుమకొండ బావుంటాయి.

**మేడారం :** వరంగల్లుకు ఈశాన్యదిశన 110 కి.మీ. దూరంలో ఉంది. ఇక్కడ అతి వైభవంగా జాతర జరుగుతుంది. ఆ సమయంలో సంతానం లేనివారు సమ్మక్క, సారక్కల గద్దెల చుట్టూ పదాలు పాడతారు. ఇక్కడ మొక్కుబడులుగా వెండి బంగారు వస్తువులే కాకుండా అమ్మవారికి కోడెదూడలు సమర్పిస్తారు. ఇంకా ఈ వరంగల్ జిల్లాలో శ్రీ మల్లిఖార్జున స్వామి దేవస్థానం అయినవోలులో, శ్రీ వెంకటేశ్వర స్వామి దేవస్థానం చిలుకూరు కొండలో, పాలపల్లిలో శ్రీలక్ష్మీనరసింహ ఆలయం కలవు.

## రామప్ప గుడి

వరంగల్లు నుంచి 77 కి.మీ. దూరం. ఇక్కడ శిల్పాలు హొయలు పోతుంటాయి. కాకతీయుల శిల్ప కళాభిరుచికి తార్కాణం రామప్ప సరస్సు దగ్గరున్న రామప్పగుడి.

## బుగ్గరామేశ్వరం

ప్రాణలింగం ఉంది. ఇక్కడ నమశ్శివాయః అనగానే ప్రక్కనే ఉన్నకొలను నుంచి ఐదు బుగ్గలు లేస్తాయి. అదే ఇక్కడి ప్రత్యేకత.

## హైదరాబాద్

**ఆంధ్రప్రదేశ్ రాజధాని :** జంట నగరాల కలయిక. పూర్వము దీనికి భాగ్యనగరమని పేరు. మహమ్మద్ కులీ వంశీయుల నాలుగో తరంవాడైన కుతుబ్‌షాహీ 1590లో నిర్మించాడు ఈ నగర నిర్మాణాన్ని.

**గోల్కొండ :** శిథిలమైపోయిన ఈ కోట ఇప్పటికి యాత్రికులను ఆకర్షిస్తోంది. ఓ పక్కగా కుత్‌బ్‌షాహీల సమాధులున్నాయి. ఇక్కడే భద్రాచల రామదాసును బంధించిన కారాగారము ఉంది. 120 మీటర్ల ఎత్తునగల కొండమీద ఉన్న ఈ కోట ప్రత్యేక ఆకర్షణ, శబ్దవిద్యలోని ప్రావీణ్యం, విశిష్టత ఇక్కడ వినవచ్చు. మొదటి ద్వారం దగ్గర నిలబడి శబ్దం చేస్తే చాలు 61 మీటర్ల ఎత్తున ఉన్న దర్బారు హాలులోకి వినపడుతుంది. దీని రహస్యం ఇప్పటికీ మేధావులకు అంతుపట్టలేదు. ప్రసిద్ధి చెందిన కోహినూర్ వజ్రం ఇక్కడిదే.

**చార్మినార్ :** 186 అడుగుల ఎత్తు 55 మీటర్ల ఎత్తుగల నాలుగు స్థంభాల కట్టడం.

**జామా మసీదు :** 1598లో కట్టబడిన పురాతన కట్టడం ఫలక్‌నామా పాలెస్. ఇందులో నిజాం నవాబులు సేకరించిన అనేక అద్భుత అరుదైన వస్తువులున్నాయి.

**ఉస్మాన్ సాగర్ :** ఇక్కడి నుండే హైదరాబాద్ పట్టణానికి మంచినీరు వచ్చేది.

**సాలార్‌జంగ్ మ్యూజియం :** 35 వేల రకాలైన అరుదైన వస్తువులు ప్రపంచం నలుమూలల నుండి సేకరించబడ్డాయి. రాజులు వాడిన సర్వవస్తువులు, అరుదైన దంతపు సామానులు వగైరాలు అనేకం. ప్రసిద్ధి పొందిన యూరోపియన్ పెయింటింగ్‌లే కాక లూయిస్ వాడిన వస్తువులు, ఆంటోనియెట్స్ వాడిన టేబుల్ కూడా ఉంది. విచిత్రమైన గడియారం, విషం పెడితే రంగుమారే పళ్ళెం మొదలైన ఎన్నో వింతలు ఈ మ్యూజియంలో ఉన్నాయి.

ఇంకా పబ్లిక్ గార్డెన్స్, సుందరమయిన పాలరాతి హిందూ దేవాలయం బిర్లామందిర్, నెహ్రూ జూలాజికల్ పార్క్ చూడదగ్గవి.

**ఓషన్ పార్క్ :** సిటీకి దూరంగా వున్న ఇక్కడ రకరకాల వాటర్ గేమ్‌లున్నాయి. స్విమ్మింగ్ చేయచ్చు. వీడియోగేమ్స్ కూడా వున్నాయి. ఇక్కడ ఓ రోజంతా ఎంజాయ్ చేయవచ్చు.

లుంబిని పార్క్ :

ప్రవేశం రూ. 2 లోపల బోటు మీద హుస్సేన్‌సాగర్‌లో తిరగొచ్చు. బుద్ధుడి చుట్టూ రౌండ్ వేయచ్చు బోటులో. ఆహ్లాదకరమైన సాయంత్రాన్ని గడపొచ్చు ఈ పార్క్‌లో.

సికింద్రాబాద్‌లో శ్రీ ఉజ్జయిని మహాకాళి దేవస్థానము, శ్రీ వెంకటేశ్వర స్వామి దేవస్థానము చిక్కడపల్లిలో. శ్రీ సీతారామచంద్రమూర్తి దేవాలయము సీతారాంబాగ్‌లో శ్రీ గణపతి దేవాలయం సికింద్రాబాద్‌లో, విజయనగర్ కాలనీలో శ్రీ వేంకటేశ్వరస్వామి దేవస్థానములేకాక ప్రఖ్యాతి చెందిన (హైదరాబాద్) బిర్లామందిర్ ఉన్నాయి.

సికింద్రాబాద్, హైదరాబాద్‌ను కలుపుతూ 18 కి.మీ. హుస్సేన్‌సాగర్ సరస్సు ఉంది. విహారానికి బోటు మీద ప్రయాణించవచ్చు. టాంక్‌బండ్ మీద సాయంత్రం అయితే మంచి కాలక్షేపం... విగ్రహాలు పక్కన నూనూగు చీకటిలో కూర్చుని, కాసేపు అన్ని మరచిపోయి ప్రశాంతంగా చిరుతుళ్ళు తింటూ గడపవచ్చు కుటుంబ సభ్యులతో.

ఆంధ్రప్రదేశ్ టూరిజం వారు టూరిస్టులకు కొన్ని ప్రత్యేక టూర్ సర్వీసులు కండక్ట్ చేస్తున్నారు.

హైదరాబాద్ సిటి టూరు :

ప్రతి రోజువుండే ఈ ప్రోగ్రాంలో ఉస్మానియా యూనివర్శిటి, వెంకటేశ్వర టెంపుల్, హుస్సేన్‌సాగర్, గోల్కొండకోట, కుతుబ్‌షాహీ సమాధులు, సాలార్‌జంగ్ మ్యూజియం, చార్మినార్, మక్కామసీదు, నెహ్రూ జులాజికల్ పార్క్, గండిపేటలను కవర్ చేస్తారు. దాదాపు పదిగంటలలో... పెద్దవారికి 45/- పిల్లలకి 25/- హుస్సేన్‌సాగర్‌లో బోటు ఎక్కి విహారం చెయ్యాలనుకునే వారికి స్పీడ్ బోటు (నలుగురు పట్టే వాటర్ టాక్సీ) 40/-..... ఇంకా 5/-, 3/- రూపాయలతో విహారం చెయ్యచ్చు. అత్యంత ఆకర్షణ అయిన బుద్ధుడి విగ్రహం ఇక్కడే ఉంది.

నాగార్జునసాగర్ టూరు :

ప్రతిరోజూ ఉండే ఈ టూరు పెద్దలకు 85/- పిల్లలకు 45/- ఈ యాత్రలో చూపించే ప్రదేశాలు నాగార్జునసాగర్‌లోని అన్ని ప్రదేశాలు ఇంకా ఎత్తిపోతల జలపాతం......

ఇంకా టూరిజంవారు తిరుపతి, శ్రీశైలం, మంత్రాలయం సౌత్‌ఇండియన్ టూర్, గోవా టూరు నిర్వహిస్తున్నారు.

మీకు మరిన్ని వివరాలు కావలసిన 843931 గాని 843932 గాని ఫోను చేసి తెలుసుకొనవచ్చును.

## ఉండటానికి వసతి

హోటల్ అన్నపూర్ణ, నాంపల్లి స్టేషన్‌రోడ్.

అశోక, 6-1-70, లకడికపూల్.

బంజారా. రోడ్ నెం. 3, బంజారాహిల్స్

బ్లూమూన్, 6-3-1186/ఎ, రాజ్‌భవన్‌రోడ్, బేగంపేట.

ద్వారక, రాజ్‌భవన్ రోడ్.

కృష్ణ ఒబరాయ్. రోడ్‌నెం. 1, బంజారాహిల్స్.

వెల్‌కమ్ గ్రూప్.

YWCA గెస్టహౌస్, మెథోడిస్ హైస్కూల్ వెనుక -

తాజ్ గేట్‌వే, రోడ్ నెం. 1, బంజారాహిల్స్.

రుక్మిణి. ఆర్.టి.సి. క్రాస్‌రోడ్.

## IBS నుంచి బైలుదేరే సర్వీసులు

**ఆదిలాబాద్ :**

4.30, 6.00, 7.30, 9.30, 10.30, 15.00, 21.00, 22.00, 23.00, 23.30.

**అనంతపూర్ :**

21.30 (JBS), 22.00, 22.00 (JBS), 22.30 (JBS), 23.00 (JBS).

**బెంగుళూర్ (574 Km) :**

8.00, 17.00, 17.30 (JBS), 18.30, 19.00, 19.15, 19.45, 20.00, 20.15, 20.20 (JBS), 21.00, 21.15.

**భద్రాచలం :**

5.00, 6.30 (JBS), 9.00, 10.45, 11.30, 21.00 (JBS), 21.30 (NZB), 22.30.

**బోధన్ :**

(VIA-NZB) 4.45, 5.45, 6.45, 7.45, 9.15, 10.30, 11.00, 11.30, 12.00, 12.45, 13.00, 13.45, 14.30, 15.00, 15.15, 16.00, 16.30, 17.30, 18.00, 18.15, 22.00, 22.30, 23.30.

**వయా మెదక్ :**

2.55, 5.00, 6.00, 7.00, 7.40, 8.45, 9.00, 9.15, 9.45, 10.00, 11.00, 13.10, 14.00, 14.15, 14.30, 15.45, 16.30, 18.30, 22.00.

**చిత్తూరు :**

13.00, 16.15, 18.00, 19.00 (JBS)

**చెన్నై (700 kms) :**

16.30

కడప :

8.00, 9.00, 19.30, 20.30 (KPHB), 21.30, 22.00 (JBS), 22.30.

ఏలూరు :

(VIA-VIZ) 15.00, 22.00 (JBS), 22.30, 23.00 (BHEL)
(VIA KHAM) 8.30, 21.00.

గోదావరిఖని :

0.30, 4.15, 5.45, 6.30, 6.45, 8.15, 9.00, 9.15, 9.30, 12.30, 13.15, 13.30, 14.45, 15.00, 18.00, 20.00, 23.00, 23.45.

గుంటూరు :

(VIA-NLG) 7.30, 10.45, 12.30 (BHEL), 20.15, 22.30, 23.00 (BHEL).
(VIA-VIJ) 9.45, 10.15, 21.30, 22.15.

హనుమకొండ :

6.30, 7.30,8.15, 9.00, 9.30, 9.45, 10 15 10.45, 11.15, 12.30, 12.45, 13.00, 14.00, 14.30, 15.15, 15.30, 16.00, 16.30, 17.30, 17.45, 18.00, 19.00, 19.15, 20.00, 20.15, 20.45, 21.00, 21.30, 21.45, 22.30, 23.00.

కాకినాడ :

19.00 (JBS), 21.30, 21.00 (JBS)

ఖమ్మం :

6.00, 6.45, 13.30, 14.30, 15.30, 18.00, 22.45.

కర్నూలు :

0.30, 1.00, 5.00, 6.00, 7.00, 7.30, 11.00, 11.20, 12.00, 12.40, 13.20, 14.00, 14.30, 15.00, 15.30, 16.00, 16.30, 18.00, 18.30, 19.00, 21.00, 22.20, 23.20.

మచిలీపట్నం :

10.00, 22.00

మహబూబ్‌నగర్ :

6.15, 7.45, 8.10, 8.15, 8.45, 9.00, 9.15, 9.45, 10.15, 10.30, 10.45, 11.15, 11.45, 12.25, 13.15, 14.15, 14.45, 15.15, 15.45, 16.15, 16.45, 17.15, 17.45, 18.10, 18.15, 18.45, 19.15, 19.45, 20.15, 20.30, 20.45, 21.15, 21.45, 23.15, 23.45.

మంత్రాలయం :

13.00

మెదక్ :

7.00, 8.40, 9.00, 9.20, 9.40, 11.00, 11.45, 12.45, 13.30, 14.45, 15.30, 16.00, 17.00, 18.00, 19.00, 19.15, 20.10, 20.30, 21.30.

ముంబాయి **(720 km) :**

14.00. 14.45. 19.00, 20.00

మైసూర్ **(703 km.) :**

16.30 (JBS)

నాగార్జునసాగర్ :

17.30

నల్గొండ :

4.30, 5.15, 6.15, 7.00, 8.15, 8.30, 8.45, 9.15, 9.20, 10.00, 10.45, 11.00, 11.15, 11.45, 12.30, 13.15, 14.00, 14.45. 15.30, 16.15, 16.45, 17.30, 18.15, 19.00, 19.45, 20.15, 21.00.

నంద్యాల :

0.00, 8.40, 10.00, 10.40, 11.40, 14.00, 20.00, 23.20.

నెల్లూరు :

20.00 (JBS), 21.00 (BHEL)

నిజామాబాద్ :

0.30, 5.00, 5.30, 6.00, 6.30, 7.00, 8.40, 9.30, 10.00, 10.30, 11.00, 11.30, 12.00, 12.30, 13.00, 14.00, 14.30, 15.00, 15.30, 16.00,16.30, 17.00, 17.30, 18.00, 18.30, 19.00, 19.30, 20.00, 20.30, 21.00, 22.00, 22.30, 23.30.

ఒంగోలు :

VIA-MCL 9.30, 19.30, 20.15, 21.30, 22.30, 23.00.

VIA-NLG 20.30, 21.00, 21.30 (BHEL), 22.00

రాయచూరు **(211 km) :**

5.00, 7.00, 8.00, 10.00, 14.00, 15.00, 16.00, 22.00.

రాజమండ్రి :

18.00 (JBS), 19.00

షిరిడి **(611 km) :**

14.00, 15.00 (DSNR), 16.00 (JBS), 18.00 (DSNR).

శ్రీశైలం :

6.00, 7.00, 8.00, 10.00, 10.45, 11.00,12.00, 13.00, 14.00, 15.30, 16.30, 19.00, 21.30, 22.30.

తెనాలి :

VIA - NLG 9.30, 12.45

VIA - VIJ 21.00, 22.00, 22.45 (BHEL)

తిరుపతి :

[illegible] 15, 17.00, 17.30, 18.00, 18.30, 20.00

విజయనగరం :

18.30

విశాఖపట్నం :

15.45

విజయవాడ :

0.15, 0.30, 1.00, 5.00, 6.00, 6.30, 7.15, 7.30, 8.00, 8.10, 8.30, 9.00, 9.30 10.10, 11.00, 11.30, 12.00, 12.15, 12.30, 13.00, 13.15, 14.00, 14.15, 14.30, 14.45, 15.30, 16.00, 16.30, 17.30, 18.00, 18.45, 20.45, 21.00, 21.30, 21.45, 22.00, 22.15, 22.30, 22.45, 23.00, 23.15, 23.30, 23.40

## TRAIN TIMINGS

| Train Nos. | Description of the Train | Dep. | Arri. |
|---|---|---|---|
| 7406/7405 | Hyd-Tpt-Hyd Krishna Express | 06.00 | 20.20 |
| 1020/1019 | BBSR-Mumbai-BBSR Konark Exp. | 11.00 | 08.15 |
| 2723/2724 | Hyd - New Delhi - Hyd AP Exp. | 07.10 | 19.30 |
| 2704/2703 | Sec'bad-Howrah-Sec'bad Falaknuma Exp. | 16.00 | 11.00 |
| 8046/8045 | Hyd-Howrah-Hyd East Coast Express | 07.30 | 18.20 |
| 5089/5090 | Sec'bad-Gorakhpur-Sec'bad Weekly Exp. | 08.10 (Sun) | 18.00 (Sat) |
| 7008/7007 | Hyd-Waltair-Hyd Godavari Exp. | 17.45 | 05.05 |
| 2429/2430 | Bangalore-H.Nizamuddin-Bang, Bi-weekly Rajdhani Express | 06.45 (Tues) (Thu) | 19.05 (Sun) (Tue) |
| 2437/2438 | Sec'bad - H. Nizamuddin-Sec'Bad Rajdhani Bi-Weekly Exp. | 19.20 (Mon, Wed) | 13.30 |
| 5091/5092 | Bagalore-Gorakhpur-Bangalore Weekly Exp. | 08.10 (Thur) | 18.00 (Tues) |
| 2760/2759 | Hyd-Chennai-Hyd Charminar Exp. | 19.30 | 07.45 |
| 7048/7047 | Sec-bad-Kakinada-Sec'bad Gautami-Exp. | 19.50 | 07.00 |
| 7021/7022 | Hyd-H. Nizamuddin-Hyd Dakshin Exp. | 20.30 | 06.35 |
| 7202/7201 | Sec'bad-Guntur-Sec'bad Golconda Exp. | 13-45 | 12.30 |

| | | | |
|---|---|---|---|
| 7233/7234 | Sec'bad-Sirpurkhagaznagar-Sec'bad Bhagyanagar Exp. | 15.00 | 10.50 |
| 2714/2713 | Sec'bad-Vijayawada-Sec'bad Satavahana Exp. | 16.45 | 11.15 |
| 7006/7005 | Sec'bad-Guntur-Sec'bad Nagarjuna Exp. | 07.00 | 18.45 |
| 7030/7029 | Hyd-Cochin-Hyd Tri-weekly Express | 12.00 (Mon, Thur & Sat) | 12.15 (Tue, Fri & Sun) |
| 7091/7092 | Sec'bad-Varanasi Bi-weekly Exp. | 22.30 (Mon, Wed) | 04.30 (Thurs, Sun) |
| 7054/7053 | Hyderabad-Chennai-Hyderabad Express | 16.25 | 06.10 |
| 7424/7423 | Sec'bad-Tirupati-Sec'bad Narayanadri Exp. | 18.00 | 08.05 |
| 7016/7015 | Sec'bad-Palasa-Sec'bad Visakha Express | 17.05 | 07.30 |
| 7685/7686 | Sec'bad-Bangalore-Sec-bad Exp. | 19.30 | 06.30 |
| 7056/7055 | Hyd - Narasapur - Hyd Exp. | 22.00 | 05.15 |
| 325/326 | Sec'bad - Warangal - Sec'bad Kakatiya Exp. | 18.10 | 09.05 |
| 7018/7017 | Sec'bad - Rajkot - Sec'bad Weekly Express | 14.45 (Thur) | 11.10 (Fri) |
| 7664/7663 | Kacheguda-Manmad-Kacheguda Express | 18.00 | 09.00 |
| 349/350 | Kacheguda-Aurangabad-Kacheguda Passenger | 21.20 | 07.45 |
| 7607/7608 | Sec'bad-Kurnool Town-Sec'bad Tungabhadra Link Exp. | 07.45 | 19.35 |
| 7591/7592 | Sec'bad-Basar-Sec'bad Exp. | 07.30 | 20.20 |
| 7551/7552 | Sec'bad-Mudkhed-Sec'bad Ajantha Express | 13.00 | 12.35 |
| 7570/7569 | Sec'bad-Mudkhed-Sec'bad Jaipur Link Express | 21.30 | 06.15 |
| 573/574 | Sec'bad-Bodhan-Sec'bad Passenger | 11.40 | 15.15 |
| 593/594 | Sec'bad-Nizamabad-Sec'bad Passenger | 18.05 | 10.30 |
| 549/550 | Sec'bad-Shadnagar-Sec'bad Passenger | 05.45 | 09.00 |
| 351/352 | Sec'bad-Repalle-Sec'bad Passenger | 09.20 | 17.05 |
| 368/367 | Hyderabad-Kazipet-Hyd Passenger | 08.40 | 17.55 |
| | **FROM HYDERABAD** | | |
| 7406/7405 | Hyd-Tirupati-Hyd Krishna Exp. | 05.30 | 21.25 |
| 2723/2724 | Hyd-NewDelhi-Hyd AP Exp. | 06.40 | 20.15 |

| | | | |
|---|---|---|---|
| 8046/8045 | Hyd-Howrah East Coast Exp. | 07.00 | 19.05 |
| 7030/7029 | Hyd-Cochin-Hyd Tri-Weekly Express | 11.30 (Mon, Thur & Sat) | 13.00 (Tue, Fri & Sun) |
| 7008/7007 | Hyd-Visakhapatnam-Hyd Godavari Exp. | 17.15 | 05.45 |
| 2760/2759 | Hyd-Chennai-Hyd Charminar Express | 19.00 | 08.25 |
| 7021/7022 | Hyd-H.Nizamuddin-Hyd Dakshin Express | 20.00 | 07.15 |
| 7002/7001 | Hyd-Chatrapati Shivaji Terminus (Mumbai)-Hyd. H.Sagar Exp. | 14.30 | 13.10 |
| 7032/7031 | Hyd-Chatrapati Shivaji Terminus (Mumbai)-Hyd. Exp. | 20.40 | 06.05 |
| 7056/7055 | Hyd-Naraspur-Hyderabad Exp. | 21.30 | 05.55 |
| 7429/7430 | Hyd-Tirupati-Hyd Rayalaseema Exp. | 16.45 | 08.50 |

**SPECIALS FROM SEC'BAD**

| | | | |
|---|---|---|---|
| 7054/7053 | Hyd-Chennai-Hyderabad Express | 15.50 | 06.45 |
| 744 | Sec'bad-Rajkot Weekly Spl. on Wednesdays (upto 29th July '98) | 14.45 | ........ |
| 743 | Rajkot-Secunderabad Weekly Sp. on Fridays (upto 31st July '98) | .......... | 11.10 |
| 750 | Sec'bad-Tirupati Weekly Spl. on Saturdays (till further notice) | 19.00 | ......... |
| 749 | Tirupati-Sec'bad Weekly Spl. on Saturdays (till further notice) | ......... | 05.50 |

**FROM KACHEGUDA**

| | | | |
|---|---|---|---|
| 7685/7686 | Sec'bad - Bangalore - Secunderabad Express | 19.48 | 06.10 |
| 7664/7663 | Kacheguda-Manmad-Kacheguda (Manmad) Express | 17.30 | 09.30 |
| 7607/7608 | Secunderabad-Kurnool Town - Secunderabad Express | 08.00 | 19.10 |
| 7497/7498 | Kacheguda-Tirupati-Kacheguda Venkatadri Express | 18.30 | 08.00 |
| 349/350 | Kacheguda-Aurangabad-Kacheguda passenger | 20.50 | 08.20 |
| 360/359 | Falaknuma-Wadi-Falaknuma (Wadi) Passenger | 05.20 | 19.35 |
| 549/550 | Secunderabad-Shadnagar-Secunderabad Passenger | 06.06 | 08.35 |
| 523/524 | Kacheguda-Dronachellam-Kacheguda Passenger. | 05.10 | 21.50 |
| 571/572 | Secunderabad-Mahabubnagar-Secunderabad Passenger | 10.27 | 16.35 |

| | | |
|---|---|---|
| మధురై | 161 కి.మీ. | మనప్పారై 37, వడమధురై 41<br>దిండిగల్ 17, మధురై 66 |
| పళని | 152 కి.మీ. | మనప్పారై 37, వడమధురై 41,<br>దిండిగల్ 17, ఒడంచత్రం 30,<br>పళని 27 |
| కన్యాకుమారి | 441 కి.మీ | మనప్పారై 37, వడమధురై 41,<br>దిండిగల్ 17, మధురై 66, విరుదునగర్ 47,<br>తిరునల్వేలి 150, కన్యాకుమారి 83 |

**తిరుచ్చి నుంచి రామేశ్వరం వెళ్లేదారిలో వున్న క్షేత్రాలు:**

**రామనాడు :** దర్భశయనం నుండి 10 కి.మీ. దూరము. శ్రీ వివేకానంద స్వామి గుర్తుగా నాటించిన స్తంభం, శ్రీరామచంద్రులవారు గుహుని పట్టాభిషిక్తుని చేసిన శిల వుంది....

**దర్భశయనం :** ఈ ప్రదేశాన్ని రామేశ్వరం దర్శించిన తర్వాత చూడాలి. అప్పుడే యాత్రా ఫలం దక్కుతుంది. సీతమ్మవారి కోసం లంకమీదకు దండెత్తడానికి అనువుగా దగ్గరలో వున్న సముద్రాన్ని దారి ఇమ్మంటే ఇవ్వలేదు. అంత రామ ప్రభువుకి కోపమొచ్చి బాణం ఎక్కుపెడితే సముద్రుడు ప్రత్యక్షమై మార్గం చెప్పాడు అంత పవిత్ర ప్రదేశం. సముద్ర స్నానము చేసి వచ్చి శేష తల్ప శ్రీరాముని దర్శించండి.

ఆలయం పరిసరాల్లో రావిచెట్టు వుంది. ఈ చెట్టు క్రింద మునీశ్వరులు, ఋషులు తపస్సు చేసుకొనేవారు సత్యకాలంలో. ఇక్కడ సంతానం లేనివారు నాగ ప్రతిష్ట చేస్తారు.

**దేవ పట్టణం :** సముద్రానికి దగ్గరలో 9 పాషాణ స్తంభములున్నాయి. కోనేటిలో స్నానం చేసి నవగ్రహములకు పూజ చేయండి. ఉత్సాహం, భక్తి వున్న వారు పండాలచేత నవగ్రహపూజ చేయించుకోండి.

ఇక చతుర్ధామాల్లోని మొదటి థామంగా హిందువుల అత్యంత పవిత్ర పుణ్య ప్రదేశం అయిన రామేశ్వరం వెళదాం రామనాథ్ మీదుగా.

## శ్రీ రామేశ్వర జ్యోతిర్లింగం :

శ్రీ తామ్రపర్ణీజలరాశియోగే
నిబద్ధ్య సేతుం విశిఖైరసంఖ్యై
శ్రీరామచంద్రేణ సమర్పితం తం
రామేశ్వరాఖ్యం నియతం నమామి ।

ద్వాదశ జ్యోతిర్లింగములలో ఒకటి. భారత దేశములో నాలుగు మూలల వున్న నాలుగు ధామాలలో మొదటిది ఈ రామేశ్వరం, మిగతావి ద్వారకా, జగన్నాథ్, బదరీనాథ్. కాశీ నుంచి తెచ్చిన గంగా జలాన్ని యిక్కడ అభిషేకం చేయిస్తారు భక్తులు. ఈ రామలింగేశ్వరుని చూద్దామని, ఈ రామేశ్వర స్వామిని దర్శిద్దామని అనుకొని వెళ్ళకుంటే మహాపాపం. కాశీ వెళదామని వెళ్ళక పోయినా ఫర్వాలేదు. కాని ఈ రామేశ్వరం వెళదామని వెళ్ళకపోతే మహాపాపం. సముద్ర మధ్యంలో చిన్న ద్వీపం ఈ రామేశ్వర క్షేత్రం. అరేబియా, బంగాళఖాతం కలిసినచోటు కూడా యిక్కడే.

ఈ రామేశ్వర దేవాలయం నిర్మాణం క్రీ.శ. 12వ శతాబ్దంలో ప్రారంభించబడినది. సింహద్వారం 100 అ॥ ఎత్తున వుంటుంది. స్థల మహాత్యం ప్రకారం, శ్రీరామచంద్రుడు రావణాసురుడిని సంహరించి సీతమ్మవారిని విడిపించాక, లంకాధిపతి రావణుడుని చంపిన పాపానికి ప్రాయశ్చిత్తం కోసం పరితపించాడు. రావణాసురుడు బ్రాహ్మణుడు. గోహత్య కంటే బ్రాహ్మణ హత్య మహాపాతకం.

అందరిని సంప్రదిస్తే ఆ పాపం పోవటానికి శివలింగ ప్రతిష్ట చేయమని శ్రీరాములవారికి సలహా ఇచ్చారు. అప్పుడు హనుమంతుని ఆకాశ మార్గాన హిమాలయాల్లో గల కైలాసగిరిలోని శివలింగము తేవటానికి పంపారు. హనుమంతుని జాడ ఆలస్యమైంది.

ముహూర్తం దగ్గరపడటంతో సీతమ్మవారు స్వయంగా తన స్వహస్తాలతో సైకత లింగమును తయారుచేసింది. శ్రీరాముడిచేత ప్రతిష్టింపబడిన ఆ లింగమే ఈ జ్యోతిర్లింగము. ఆ తరువాత హనుమంతుడు తెచ్చిన విగ్రహాన్ని కూడా శ్రీరామ దంపతులు ప్రతిష్టించి పూజ జరిపారు. ఆ వాయుపుత్రుడు తెచ్చిన విగ్రహమే శ్రీ కాశీ విశ్వేశ్వర లింగము.

ఈ పరమ పవిత్ర పుణ్యక్షేత్రం ద్రావిడ శిల్పరీతిలో వుంటుంది. మూడు ప్రాకారాలున్నాయి.

మొదటి ప్రాకారంలో శ్రీరామచంద్రులవారు ప్రతిష్టించిన జ్యోతిర్లింగం వుంది. ప్రతిరోజు గంగా జలాభిషేకం జరుగుతుంది. రెండవ ప్రాకారంలో వాయు పుత్రుడు తెచ్చిన లింగము వుంది. ఈ రెండవ ప్రాకారంలోని కాశీ విశ్వనాథ లింగము ప్రాంగణంలోనే కోటి తీర్థము, సర్వతీర్థములున్నాయి.

ఇక 3వ ప్రాకారములో మండపాన్ని అద్భుతమైన శిల్పాలతో చెక్కబడి వుంటాయి. ఈ మంటపం పొడవు 4000... ఈ ప్రాకారంలో రామలింగ విగ్రహములు, శ్రీ కోదండరామస్వామి, సేతువ మాధవ స్వామి ఆలయం, కోనేరు వున్నాయి.

ఈ ఆలయంలో 22 తీర్థాలున్నాయి, ఈ దేవాలయంలోనివి కాక 21

తీర్థాలున్నాయి. చుట్టు ప్రక్కల ఆలయంలోని తీర్థాలలో స్నానం చాలా మంచిది. ఈ తీర్థాలలో (బావుల్లో) అనేక ఔషధాలు ఉన్నాయని చెబుతారు.

**ఆలయములోని తీర్థాలు :**

సర్వతీర్థం, మహాలక్ష్మి, సావిత్రి, గాయత్రి, సల్యామిత్ర, శివ, గయ, యమున, సరస్వతి, మాధవ, గంగ, చంద్ర, సూర్య, గవయ, నల, నీల, శంకర, శంక, బ్రహ్మహత్యా విమోచన, గంధమాధన, గవాక్ష...

ఈ తీర్థాలన్నింటిలో స్నానానికి టిక్కెట్ వుంటుంది 5 రూ. బావుల్లోంచి నీరుతోడి మీ వైపుగా పోస్తారు. అలా పోసినందుకు ఎంతో కొంత టిక్కెట్ కాకుండా యివ్వాలి. ఈ తీర్థాలలో స్నానం గురించి మాట్లాడేటప్పుడు అక్కడి "వారితో" విసిరికొట్టద్దు నిదానంగా పొయ్యమని చెప్పి పోయించుకోండి ఓ రూపాయి పోయినా...

ఇన్ని తీర్థాలు ఉండటంతో, వచ్చిన భక్తుల తల స్నానాల వల్ల గుడి మొత్తం తడి తడిగా వుంటుంది.

**క్షేత్ర వివరములు**

| | |
|---|---|
| విస్తీర్ణము | 61-8 కి.మీ. (34 చ.మైళ్లు) |
| జవాభా | 48,000 (1981 లెక్కల ప్రకారం) |
| సముద్రమట్టం | +2.74 మీ. |
| శీతోష్ణస్థితి | ఎక్కువ తక్కువ |
| చలికాలము | ఎండకాలము 98°C – 25°C |
| | చలికాము 30°C – 25°C |
| వర్షమానము | సాలు సగటున 50 చ.మీ. |
| దుస్తులు | Tropical |

## దేవాలయములోని తీర్థములు మరియు ఇతరములు

1. **మహాలక్ష్మి తీర్థము :**
ఆంజనేయుని గుడికి దక్షిణముప ధర్మరాజు ఇక్కడ స్నానము చేయుటవల్ల భాగ్యమును పొందెను.
2. **సావిత్రి తీర్థము :**
ఆంజనేయుని గుడికి పడమరగా కాశిబార్ మహారాజు శాపవిముక్తుడైన స్థలము.
3. **సేతు మాధవ తీర్థము :**
3వ మండపము వద్ద ఇచ్చటి స్నానము వల్ల లక్ష్మీదేవి కటాక్షము, హృదయము పరిశుద్ధమగును.

4. కవచ తీర్థము :
సేతు మాధవ గుడి సమీపమున ఇచ్చట జలమున తీసుకున్న నరకమునకు పోనవసరం లేదు.

5. గవయ తీర్థము :
సేతు మాధవ దేవళ సమీపమున ఇందలి నీటిలో మునిగిన కల్పవృక్షచ్ఛాయ ప్రాప్తించును.

6. నల తీర్థము :
సేతు మాధవ గుడి సమీపమున ఇందలి జలస్నానము వల్ల సూర్యతేజస్సు కల్గి, స్వర్గ ప్రాప్తి లభించును.

7. నీల తీర్థము :
సేతు మాధవ గుడి సమీపమునున్న ఇచ్చటి స్నానము వల్ల సమస్తయోగ, అగ్ని యోగములను పొందును.

8. శంఖర తీర్థము :
గుడి లోపలి మండపము వద్ద కృతఘ్నుడైన వత్సనాభముని తన పాపమును పోగొట్టుకొనిన దివ్య స్థలము.

9. చక్ర తీర్థము :
దేవళం లోపలి మండపము వద్ద సూర్యుని హస్తము బంగారుగా మారిన చోటు.

10. బ్రహ్మహత్యాపాతక విమోచన తీర్థము :
బ్రహ్మహత్యాపాతకము నివారణమగును.

11. సూర్య తీర్థము :
ఈ తీర్థస్నానమువల్ల భూత భవిష్యద్వర్తమానములను తెలుసుకోగల జ్ఞానము కలిగి వారికిష్టమైన లోకములకు ప్రయాణించగలరు.

12. చంద్రతీర్థము :
భూత భవిష్యత్ వర్తమాన జ్ఞానము కలిగి, వారికి ఇష్టమైన లోకములకు పయనించగలరు.

13. గంగా తీర్థము :
జ్ఞానశ్రుతి రాజు ఇచ్చట జ్ఞానవంతుడాయెను.

14. యమునా తీర్థము :
లోపలి మండప సమీపమున జ్ఞాన శృతిరాజు ఇక్కడనే జ్ఞాని అయ్యెను.

15. గయా తీర్థము

16. శివ తీర్థము :

నందీశ్వరునికి దక్షిణమున బురురూను చక్రవర్తి శాప విముక్తుడైన స్థలము.

17. **సత్యామృత తీర్థము :**

బురుగూను చక్రవర్తి ఇచ్చట శాపవిమోచనుడాయెను.

18. **సర్వ తీర్థము :**

సుదర్శనుడు తన పుట్టుకతో నున్న అంధత్వమును, రోగమును ముదిమిని పోగొట్టుకొన్న దివ్యస్థలము.

19. **కోటి తీర్థము :**

ఒకటవ మండపము వద్ద కంస సంహారము వల్ల కలిగిన పాపమును శ్రీకృష్ణుడు పోగొట్టుకొన్న పుణ్య క్షేత్రము.

## శ్రీరామేశ్వర క్షేత్రమందు చూడదగిన పుణ్యస్థలములు

**ఏ. దేవాలయము లోపల :**

శ్రీ విఘ్నేశ్వరుడు
శ్రీ రామనాథస్వామి
శ్రీ పర్వతవర్ధని
శ్రీ విశ్వనాథుడు
శ్రీ విశాలాక్షి
శ్రీ సేతుమాధవుడు
శ్రీ జ్యోతిర్లింగము
శ్రీ సహస్ర లింగము
శ్రీ వజ్రేశ్వరుడు
శ్రీ నటరాజు (మూడుచోట్ల)
శ్రీ పల్లికొండ పెరుమాళ్లు
శ్రీ ఆంజనేయుడు
శ్రీ నాయనమార్లు
శ్రీ శివదుర్గ
శ్రీ మహాలక్ష్మి
శ్రీ శివ ప్రాకారము
శ్రీ 2వ ప్రాకారము
శ్రీ తీర్థములు
శ్రీ వాహనములు

**బి. దేవాలయము బయట :**

అగ్ని తీర్థము

లక్ష్మణ తీర్థము

రామ తీర్థము

గంధమాదన పర్వతము

గంధమాదన పర్వతము

శ్రీకోదండరామ దేవాలయము

పాంబన్ వంతెన

ప్రయాణమార్గం :

తమిళనాడు రాష్ట్రంలోని ఈ క్షేత్రానికి చెన్నై వెళ్ళి, మద్రాస్ ఎగ్మోర్ స్టేషన్ నుండి రైల్లో వెళ్ళవచ్చు. ఇంకా మధురై, కోయంబత్తూరు, రామనాథపురం మున్నగు పట్టణాల నుండి రామేశ్వరానికి రైలు సౌకర్యం వుంది. బస్సులో పాంబన్‌వరకు వెళ్లి అక్కడి నుండి 34 కి.మీ. రైలులో ప్రయాణించి రామేశ్వరం చేరవచ్చును. బస్సులో ప్రయాణించేవారు నేరుగా రామేశ్వరం చేరుకునేందుకు వీలుగా సముద్రంపై వంతెన కూడా వుంది.

**ఈ రామేశ్వర పరిసరాలలో దర్శించదగ్గ యాత్రా పర్యాటక ప్రదేశాలు :**

**గంధమాధన పర్వతం :** రామేశ్వరం గుడి నుండి 2.5 కిలోమీటర్ల దూరంలో వుంది. ఇక్కడ రెండంతస్తుల దేవాలయం ఉంది. పై నుంచి రామేశ్వర ద్వీపం కనబడుతుంది. శ్రీరామచంద్రుడు రావణ సంహారం తర్వాత బ్రహ్మహత్య పోవటానికి మార్గం ఆలోచించింది యిక్కడ ఈ పర్వతం మీదనే.

**అగ్ని తీర్థం :** గుడికి దగ్గరలో ఉన్నది సముద్ర ప్రాంతం. యిక్కడ స్నానం చేస్తే సర్వ పాపాలు పోతాయని నమ్మకం. ఇక్కడ స్నానం చేసిన తర్వాతనే గుడికి వెళ్ళాలి. యిది తరతరాలుగా వస్తున్న ఆచారం. సముద్రపు వొడ్డున చక్కటి గవ్వలు దొరుకుతాయి. గవ్వల మీద మనకిష్టమయిన పేర్లు చక్కగా చెక్కుతారు. ఈ పరిసరాలలో.

**ధనుష్కోటి :** కోదండ రామస్వామి ఆలయం వుంది. చాలా వరకు తుఫానులో కొట్టుకుపోయింది. శ్రీరామ చంద్రుడిని విభీషణుడు శరణు వేడింది యిక్కడనే. భరద్వాజ మహర్షి చెప్పిన ప్రకారం వ్రతఫలం కలగాలంటే 36 సముద్ర స్నానాలు చెయ్యాలి. ఇక్కడ దానం చేస్తే కోటిరెట్లు ఫలం దక్కుతుందని ప్రతీతి. రెండు సముద్రాలు కలిసేచోట ఇసుకని తీసుకొని రామేశ్వరంలో పూజచేసి మిగలిన భాగాన్ని తీసుకెళ్లి త్రివేణి సంగమములో కలిపితే మంచి ఫలం దక్కుతుందని ఒక నమ్మకం.

**తలైమన్నార్ :** ఇక్కడ్నించే శ్రీలంకకు స్టీమర్లు వెళతాయి. ధనుష్కోటిపయిర్ వద్ద స్టీమర్లు ఆగుతాయి.

**రామేశ్వరంలో వసతి :** అలంకార్ టూరిస్ట్ హోం, సబరి లాడ్జి, దేవస్థానం కాటేజస్,

మహారాజాస్, 7 మిడిల్ స్ట్రీట్.

హోటల్ చోళా, టి.టి.డి.సి. యూత్ హాస్టల్, తిరుపతి గెస్ట్‌హౌస్, సంతనం లాడ్జి, ఇంకా హోటల్ తమిళనాడు, ఫోన్ : 21277 వుంది. ఇక్కడ రెంట్స్, డబుల్ రూమ్ ఎ/సి 350, సింగిల్ రూమ్ ఎ/సి 200. 3, 5, 6 పడకల గదులు కూడా దొరుకుతాయి. వరుసగా రెంట్ 210, 225, 240, టి.వి. చార్జీ రూ. 50 అదనం.

**రామేశ్వరం నుంచి వివిధ ప్రాంతాలకి దూరం కి.మీ లలో**

| గమ్యం | దూరం | రూటు |
|---|---|---|
| కన్యాకుమారి | 300 కి.మీ. | రామనాథపురం 37, టుటికొరిన్ 130 తిరుచెందూర్ 38, వల్లియూర్ 58, కన్యాకుమారి 37 |
| మధురై | 154 కి.మీ. | రామనాథపురం 37, పారమ గుడి 44, మనమధురై 27, మధురై 46. |
| తిరుచిరాపల్లి | 253 కి.మీ. | రామనాథపురం 37, కరైకుడి 118, పుదుక్కొటై 45, తిరుచిరాపల్లి 53, |
| కరైకుడి | 118 కి.మీ. | రామనాథపురం 37, దేవకొట్టయ్ 68, కరైకుడి 13 |
| రామనాథపురం | 37 కి.మీ. | డైరెక్టు |
| చెన్నై | 592 కి.మీ. | రామనాథపురం 37, కరైకుడి 118, పుదుకొట్టయ్ 45, తంజావూరు 58, పెరంబుదూర్ 68, విలుపురం 106, మధురాంతకం 68, చెంగల్పట్ 34, చెన్నై 58 |
| తిరుచెందూర్ | 205 కి.మీ. | రామనాథపురం 37, టుటికొరిన్ 130, తిరుచెందూర్ 38 |
| టుటికొరిన్ | 167 కి.మీ. | రామనాథపురం 37, టుటికొరిన్ 130 |
| తంజావూరు | 258 కి.మీ. | రామనాథపురం 37, కరైకుడి 118, పుదుకొట్టయ్ 45, తంజావూరు 58 |

## తిరుచ్చెందూరు

కనీసం వేయి సం॥ల క్రితం నాటి ఆలయం వుంది. ఆలయంలో ప్రాకారాలు శిల్పకళను చాటి చెపుతున్నాయి. తూర్పు వైపున సముద్రతరంగాలు ఆలయాన్ని తాకుతుంటాయి. ఇక్కడి స్వామి ఒక చేతిలో జపమాల, మరొక చేతిలో పుష్పమును ధరించి శాంతి, భక్తి మార్గమును బోధిస్తున్నట్టు వుంటుంది. ఈ ఆలయంలో 24

బావులున్నాయి. ఇందులో ప్రత్యేకమైనది నాలికబావి. ఈ బావిలో తీర్థము తియ్యగా వుంటుంది. మిగతా 692 తీర్థములలో ఉప్పు నీరే. ఇక్కడ కొట్టే కొబ్బరి కాయకు పీచులేకుండా పూర్తిగా తీసివేసి కొట్టాలి

ఇక్కడే మరో ఆలయం శివాలయం వుంది. ఇందులో వున్న 16 స్థంభాల మంటపంలో అనేక శాసనాలు వున్నాయి

తిరుచ్చెందూర్‌లో వసతికి హోటల్ తమిళనాడు ఉంది. దేవాలయానికి అతి దగ్గర. ఫోన్. 44268. 150 రూపాయల నుంచి 300 వరకూ గదుల చార్జీ ఉంటుంది.

**శ్రీధరముగమ్** : వానమామలై, నాంగునేరి అని పిలవబడే ఇక్కడ తోతాద్రినాథ ఆలయం వుంది. పుష్పవనంగల ఇక్కడ స్వామిని నూనెతో అభిషేకిస్తారు. ఆ నూనెని బయట అమ్ముతారు. ఈ నూనెను వాడితే కీళ్ళ నొప్పులు పోతాయని నమ్మకం. పక్కన జియ్యరు మఠం ఉంది.

**నాగేశ్వరుని ఆలయం** : నాగర్ కోయిల్‌లో వుంది. నాగరాజస్వామి ఇక్కడ భూమిలో స్వయంభువు. ఆలయం ఎదురుగా చిన్న కొలను వుంది. ఇందులో భక్తులు స్నానం చేసి నాగరాజస్వామిని దర్శిస్తారు. గర్భాలయంలో వూరు నీటివూటలోని నీటిని తీర్థంగా ఇస్తారు. ఈ నీటి ఊటలోని ఇసుక సంవత్సరంలో సగభాగం తెల్లగాను మిగలిన భాగం నల్లగానూ ఉంటుంది.

## శుచీంద్రము

ఈ శుచీంద్రం కన్యాకుమారి నుండి నాగరు కోయిల్‌కు పోయే బాటలో 8 మైళ్ళ దూరమున ఉంది. దీనికి జ్ఞాన వనక్షేత్రమనే పేరు కూడా కలదు.

ఇచ్చటకు త్రిమూర్తులు వచ్చి అనసూయదేవి పతివ్రతా ధర్మమును పరీక్షించుటకు భిక్ష యడిగిరి. అనసూయదేవి భిక్షము పెట్టెను. త్రిమూర్తులు నిర్వాణముతో భిక్షము పెట్టితేగాని అంగీకరించమని చెప్పినారు. అనసూయదేవి తన పతివ్రతా ధర్మ మహిమచే త్రిమూర్తులను బాలకులుగా చేసి భిక్షము పెట్టినట్లు పురాణం.

దేవేంద్రునికి ఇచ్చట మోక్షము సిద్ధించినదని చెబుతారు. ఈ ఆలయమున బ్రహ్మ, విష్ణు, శివుడు మొదలయిన వారికి ప్రత్యేక స్థానము గలదు.

ఈ ఆలయమున ప్రతిదినమును అర్ధరాత్రులందు దేవేంద్రుడు వచ్చి పూజ చేస్తాడని ఇతిహాసములు చెప్పుచున్నవి. దీనినే దేవేంద్రపూజయని చెప్పుదురు. ఈ గుడి ప్రాకారమున ఒక పెద్ద ఆంజనేయ విగ్రహము వున్నది. ఈ ఆలయమున ధనుర్మాసమునను, చైత్రమాసమునను పెద్ద ఉత్సవములు జరుగును. ధనుర్మాస

ఉత్సవమును రథోత్సవమని చెబుతారు. చైత్రమాస ఉత్సవమును తెప్పోత్సవమని చెబుతారు. ఈ ఆలయము బహు పునీతమయినది. ఇచ్చట నుండి నాగరు గుడికి టౌన్ సర్వీసు యున్నది. ఎలక్ట్రిక్ దీపములు వేయబడియున్నవి. ఈ స్థల పురాణమును భక్తితో చదివేవారును, శ్రవణించేవారును. వ్యాఖ్యానము చేసేవారును సర్వ పాప విముక్తులై సద్గతి పొందుతారు.

దేవేంద్రుడు తపస్సుచేసి పాపవిముక్తుడయిన ఈ దివ్య ప్రదేశములో స్థావేశ్వరాలయం ఉంది. భక్తులు చొక్కాలు తీసి స్వామిని దర్శించుకోవాలి. కళ్యాణమండపం, సంగీత స్థంభాలుగల ఈ ప్రదేశము దగ్గరలో అత్రి, అనసూయ తపస్సు చేసిన ప్రదేశాలున్నాయి.

**మరుత్తువమలై :** ఈ కొండ మీద అనేక దివ్యౌషధాలు లభిస్తాయి. ఈ ప్రదేశంలోనే హనుమంతులవారు సంజీవని పర్వతం తెస్తున్నప్పుడు ఓ ముక్క విరిగి పడింది.

# మధురై

తమిళనాడులో వున్న నగరాల్లో ఒకటి. 22 స్క్వేర్ కి.మీ. ఉన్న ఇక్కడికి విమాన సౌకర్యం చెన్నై, బెంగుళూరు, తిరుచిరాపల్లి నుంచి ఉంది. మీనాక్షిదేవి నివాసం గల ఈ మధురై వాతావరణం:

**వేసవి కాలం :** 37.1 డిగ్రీల C నుంచి 25.0 డిగ్రీల C వరకూ.

**చలికాలం :** 29.0 డిగ్రీల C నుంచి 20.0 డిగ్రీల C వరకూ.

వర్షపాతం సగటున 85 సెం.మీ.

**తమిళులు ఏలిన ఈ మధురైలో పర్యాటక ప్రదేశాలు :**

**మీనాక్షి దేవాలయం :** ఈ ఆలయంలో దేవత మధుర మీనాక్షిదేవి. ఇక్కడ అపూర్వమైన శిల్ప సౌందర్యం ఇమిడి వుంది. ఒకప్పుడు అందాలరాశి సుగుణ తల్లి అయిన మహిళ ఈ రాజ్యానికి మహారాణి అయింది. ఆమె కోసం దండెత్తిన రాజులను తన ఖడ్గదాటితో ఎదుర్కొని పూర్తిగా సంహరించగా ఒకే ఒకరు మిగిలారట.

అతనే శివుడు. ఆయన్ని చూడగానే ఆ అపరంజికి తన జన్మ రహస్యం గుర్తుకొచ్చింది, పార్వతి అంశ అయిన ఆమె శివుడిని వివాహం చేసుకుంది. ఆమే మీనాక్షి.

తల్లి ఆలయంలో శివాలయం ఉంది. ఈ శివాలయం పేరు సుందరేశ్వర ఆలయం. ఇక్కడ పద్మ సరోవరం ఉంది. ఈ నీరు తాగితే సరస్వతీదేవి కటాక్షిస్తుందట. పూర్వం కవులు వ్రాసిన కావ్యాలు తెచ్చి సరోవరంలో వేసేవారట. మునిగితే రాశి

ఉందిగాని వాసిలేదని, తెలితే వాశిగలవని తేల్చేవారట. రాతి స్థంభాలు అద్భుతమైన శిల్ప కళలు చూపిస్తాయి. వేయి స్తంభాల మంటపం. 9 గోపురాల్లో శిల్పకళ వాట్యమాడుతుందంటే అతిశయోక్తి లేదు.

**వందియార్ మరియమ్మ తిప్పకొళం :** ప్రతి సంవత్సరం తెప్పోత్సవం చేస్తారు. చెరువు మధ్య లంకలో నిర్మించిన ఈ దేవాలయం ఎత్తయిన ప్రాకారాలతో వుంటుంది. దీన్ని తిరుమల నాయకుడు కట్టించాడు.

**తిరుమల నాయకుని నవం :** టూరిజం డిపార్టుమెంటు వారు సౌండు అండ్ లైట్ షోలు నిర్వహిస్తారు. ఇండో సార్సనిక శైలిలో నిర్మించారు ఈ మహల్ని. దర్బారు మహలు, స్నానపు గదులు గల దీనికి స్వర్గ విలాసమని కూడా పేరు. పబ్లిక్‌కి లోపలికి ప్రవేశం ఉదయం 9 నుంచి సాయంత్రం 5 గంటల వరకూ. మధ్యలో రెండు గంటలు లంచ్ వదిలేస్తే ప్రవేశం 1 రూ. సౌండ్ అండ్ లైట్ షోకి రూ. 5/-, 3/- 2/-.

**గాంధీ మండపం :** పురాతన కాలంనాటి భవనం, గాంధీ గారి జ్ఞాపక చిహ్నాలున్నాయి. ప్రవేశం ఉదయం 10 నుంచి సాయంత్రం 5-30 వరకూ.

**తిరుప్ప కుండ్రం :** సుబ్రహ్మణ్యేశ్వర స్వామి ఆరు క్షేత్రాలల్లో ఒకటి. 48 స్తంభాల ప్రాంగణం వుంది. మధుర నుంచి 9 కి.మీ. దూరం ఈ ప్రదేశం.

**అళగర్ కోయిల్ :** మధుర నుంచి 21 కి.మీ. దూరం ఈ విష్ణువు ఆలయం. కొండమీద ఉష్ణనీటి కుండం వుంది. ఇక్కడ కోతులు విశేషంగా వుంటాయి. వీటికి భక్తులు తెచ్చుకున్నవి వేస్తారు.

**తిరువన్నామలై :** శ్రీ వెంకటేశ్వరుని దివ్యమంగళ స్వరూపం గల ఆలయం. శ్రీ విల్లిపుత్తూరు దగ్గర వుంది.

**వేయి స్తంభాల మండపం :** ఉదయం 6 నుంచి రాత్రి 8 వరకూ ప్రవేశం. కెమేరాకు రూ. 10. ఈ మండపంలో ప్రతి స్తంభం మీద అద్భుతమైన శిల్పకళ వుంది. ఆర్టు మ్యూజియం ఉంది ఇక్కడ.

**పఝు ముదిర్ సొలాల్ :** చిన్న కొండమీద సుబ్రహ్మణ్యేశ్వర స్వామి వేంచేసి వున్నాడు.

**మధురై పరిసరాల్లో :**

**వైగర్ డామ్ :** ప్రసిద్ధి పొందిన పిక్నిక్ స్పాట్. అందమైన ఉద్యానవనాలున్నాయి మధురైకి 70 కి.మీ. దూరంలో వుంది.

**పెరియార్ వైల్డు లైఫ్ శాంతువరీ :** మధురైకి 137 కి.మీ. దూరములో వుంది. క్రూర జంతువులను వొరిజినల్‌గా చూడచ్చు. ఇక్కడున్న కృత్రిమమైన సరస్సు వద్ద అక్టోబర్ జూన్‌లలో ఏనుగులు, పులులను చూడొచ్చు.

**మధురలో ఇంపార్టెంట్ టెలిఫోన్ నంబర్స్ :**

మీనాక్షి సుందరేశ్వర టెంపుల్ 22047 టూరిస్ట్ ఆఫీసు మధురై 33888

హోటల్ తమిళనాడు మధురై.

హోటల్ తమిళనాడు మధురై - 2 ఫోన్ : 42461

పాండ్యన్ రోడ్‌వేస్ కార్పొరేషన్ మధురై-1. ఫోన్ : 22297

తిరువళ్ళూరు ట్రాన్స్‌పోర్టు కార్పొరేషన్. ఫోన్ : 25354

రైల్వే ఎంక్వయిరీ. ఫోన్ : 23535

ఇండియన్ ఎయిర్‌లైన్స్ ఫోన్ : 22795

కారు కావలసినవారు ఈ నంబర్స్‌లో సంప్రదించగలరు.

సౌత్ ఇండియా ట్రావెల్ ఏజెన్సీ ఫోన్ : 22345

సోము ట్రావెల్స్ ఫోన్ : 26046.

**మధురైలో వసతి :** హోటల్ తమిళనాడు ఫోన్ : 42461 వెస్ట్ విల్లిస్ట్రీట్‌లో ఉన్న మరో తమిళనాడు హోటల్ ఫోన్ : 37470 హోటల్ మధురై అశోకా (ITDC) ఫోన్ 42531 తాజ్ మధురై ఫోన్ 88256 ఇంకా రైల్వే రిటైరింగ్ రూములు. రాణి మంగమ్మ చౌల్ట్రీ రైల్వే స్టేషను ఎదురుగా వుంది.

పాండ్యన్ హోటల్, అలగర్ కోయిల రోడ్ (L)

సంతనం లాడ్జి, టౌన్ హాల్ రోడ్

హోటల్ ప్రైమ్స్, 15-16 టౌన్ హాల్ రోడ్

సంగం, 20 కక్కథొప్పు ముదలి స్ట్రీట్, రాధాకృష్ణ లాడ్జి

హోటల్ తమిళనాడు, వెస్ట్‌వేలి స్ట్రీట్

**మధురైకి వివిధ ప్రాంతాల నుంచి దూరం కి.మీ.లలో**

| గమ్యం | దూరం | రూటు |
|---|---|---|
| కన్యాకుమారి | 232 కి.మీ. | విరుదునగర్ 45, తిరునల్వేలి 106 |
| | | నేగునేరి 31, కన్యాకుమారి 50 |
| కొడైకెనాల్ | 120 కి.మీ. | కొడైకెనాల్ రోడ్ 40, |
| | | కొడైకెనాల్ 80 |
| చెన్నై | 472 కి.మీ. | దిండిగల్ 63, తిరుచిరాపల్లి 79 |
| | | పెరంబుదూర్ 53, విల్లుపురం 106 |
| | | తిండివనం 37, మధురాంతకం 42 |
| | | చెంగల్పట్ 34, చెన్నై 58 |

పెరియార్ వైల్డ్ లైఫ్

| | | |
|---|---|---|
| శాంక్చుయరి | 136 కి.మీ. | ఉస్తంపట్టి 39. తేవి 35<br>పెరియారి (థిక్కిడి) 62 |
| రామేశ్వరం | 139 కి.మీ. | మనమధురై 47. రామనాథ్‌పురం 37.<br>రామేశ్వరం 55 |
| తిరుచెందూర్ | 205 కి.మీ. | విరుదునగర్ 45. తిరునల్వేలి 79<br>తంజావూరు 81 |
| తిరుచిరాపల్లి | 142 కి.మీ. | దిండిగల్ 63, మనప్పారై 56,<br>తిరుచిరాపల్లి 23 |
| తంజావూరు | 223 కి.మీ. | దిండిగల్ 63, తిరుచిరాపల్లి 79<br>తంజావూరు 81 |

**కుర్తాలం :** చిత్రానది నీరు 60 అడుగుల ఎత్తు నుండి కిందకు దుముకుతుంది. ఇక్కడి శివాలయంలో స్వామి కుర్తాళేశ్వరుడు, అమ్మవారు విరేణునరవాణి. ప్రశాంత వాతావరణంగల యిక్కడి జలపాతంలోని నీరు జిడ్డుగా ఉంటుంది, అనేక ఖనిజాలు కలవడం వల్ల. దగ్గరలోనే మౌనస్వామి ఆశ్రమం వుంది.

**తెన్‌కాశి :** దక్షిణ దిశలో వున్న శివక్షేత్రం. చిత్రానదీ తీరంలో వున్న కాశీ విశ్వనాథాలయం దర్శించదగ్గ పుణ్యక్షేత్రం. 15వ శతాబ్దంలో నిర్మించిన యీ ఆలయంలో చూడగల్గినంత శిల్పకళ వుంది.

**పాపనాశనం :** ఇక్కడ స్వామి పాపనాశేశ్వరుడు. తల్లి లోకేశ్వరి. ఊరిలో అగస్త్య మహర్షి దేవాలయం వుంది. అంబా సముద్రం దగ్గర నుండి ఈ పాపనాశనం దగ్గర. గుడిలోంచి మెట్లు నదిలోకి వుంటాయి.

**కళ్యాణ తీర్థ జలపాతం :** పాపనాశనం నుంచి 4 కి.మీ. 150 అడుగుల ఎత్తు నుంచి దూమికే జలపాతాన్ని చూడవచ్చు. పక్కనేవున్న గుహలో విఘ్నేశ్వర స్వామి వున్నాడు. పక్కనే సీతారామ లక్ష్మణులు, అగస్త్యతీర్థము, శివపార్వతుల రాతి విగ్రహాలున్నాయి.

**బాణాతీర్థ జలపాతం :** సుందర ప్రశాంతమైన ప్రదేశం, చుట్టూ ప్రపంచాన్ని మరపించే మనోహరమైన ప్రకృతి.

**దుర్గమారణ్యం :** స్వేచ్ఛగా తిరిగే అనేక జంతువులను చూడవచ్చు. చక్కని అడవి ప్రదేశం అని ఏమరుపాటుగా ఉండవద్దు.

**శ్రీవైకుంఠము :** వైకుంఠనాథ దేవాలయం ఉంది. సుమారు 4500 సంవత్సరాలనాటి ఆలయమిది.

**తిరునల్వేలి** : వేయి స్థంబాల మండపం ఉంది. మధురలోని దేవాలయాన్ని పోలివుండే ఇక్కడ సంగీత స్తంభములున్నాయి.

**ఆళ్వారు** తామ్రపర్ణి నది ఒడ్డున ఉంది. ఆలయం వెనుక చింత చెట్టు ఉంది. నమ్మాళ్వారు 12 సంవత్సరములు ఈ చెట్టు తొర్రలో సమాధిలో ఉన్నారట. యాత్రికులకు బెరడు చింతాకులు ప్రసాదంగా ఇస్తారు.

**కన్యాకుమారి** : దేశాన్ని మూడువైపులా కమ్మి ఉన్న మూడు సముద్రాలు కలిసే చోటు. ఈ రెంటినీ వేరు చేస్తూ హిందూ మహాసముద్రం తోసుకువస్తుంది. పౌర్ణమి రోజుల్లో సాయంకాలం అస్తమిస్తున్న సూర్యుడిని, ఉదయిస్తున్న చంద్రుడిని ఏకకాలంలో చూడగలం. ఈ అరుదైన అద్భుత దృశ్యాన్ని చూసేందుకు వేల సంఖ్యలో వస్తారు యాత్రికులు.

మూడు సముద్రాలు కలిసి ఎగిసి పడుతూ కనిపించే ఈ కన్యకుమారి 25.89 స్క్వేర్ కి.మీ.లలో వుంది. ఇక్కడ సగటున వర్షపాతం 102 సెం.మీ.

**వాతావరణం** : వేసవికాలం : 34.8 డిగ్రీ C నుంచి 21.6 డిగ్రీల C వరకూ.

**చలికాలం** : 33.8 డిగ్రీల C నుంచి 22.4 డిగ్రీల C వరకూ.

ఈ కన్యాకుమారికి అతి దగ్గరలో ఉన్న ఎయిర్‌పోర్టు 87 కి.మీలలో ఉన్న తిరువనంతపురం.

**టూరిస్ట్ ఇన్ఫర్మేషన్** : గవర్నమెంట్ ఆఫ్ తమిళనాడు టూరిస్ట్ ఆఫీసు, బీచ్‌రోడ్డు, ఫోన్ : 71276, ఇన్ఫర్మేషన్ సెంటర్, వివేకానంద రాక్ మెమోరియల్, 71250.

**ఇంపార్టెంట్ టెలిఫోన్ నంబర్స్** : రైల్వే స్టేషన్ 71247, బస్టాండ్ 71285, టూరిస్ట్ ఆఫీసు 71276

**ఈ కన్యాకుమారిలో ప్రదేశాలు** : కన్యాకుమారి ఆలయం కన్యగా మిగిలిపోయిన కన్యాకుమారి ఆలయంలో అమ్మవారికి నాగమణి ఉంది. పండుగలు, ఉత్సవాలప్పుడే ధరింపచేస్తారు. ఇప్పుడున్నది అసలు ఆలయం కాదు. పురాతన ఆలయం మీద పునర్నిర్మాణం జరిగింది. ఉవ్వెత్తున ఎగిసిపడే సముద్ర కెరటాలు అమ్మవారికి పాదపూజ చేస్తున్నాయా అనిపిస్తుంది. ఈ కన్యాకుమారికి విజయవాడ నుంచి డైరెక్టుగా ట్రైన్ వుంది. ఆలయ ప్రవేశం ఉదయం 4.30 నుంచి 11.30 వరకూ, తిరిగి సాయంత్రం 5.30 మంచి 8.30 వరకూ.

**దేవాలయ పూజా సమయాలు : ఉదయం 5 గంటలకు ప్రాతః సంధి పూజ, దేవి విశ్వరూప దర్శనమునకు, నిర్మాల్య దర్శనమునకు, సకల వెండి వాహనములకు దీపారాధనలు జరుగును.**

8 గంటలకు ఉదయ మార్తాండ పూజ.

10 గంటలకు మహాభిషేకము, అలంకారము

11-30 గంటలకు మధ్యాహ్న పూజ, దీపారాధన.

సాయంకాలమున 3 గంటలకు సన్నిధానము తెరచి 6 గంటల వరకు శాయరక్ష. 6 గంటల నుంచి 8 గంటల వరకు అర్చనలు. 8 గం॥కు పైన అర్ధజామ నివేదనమును, దీపారాధనను, దానికి పిదప అర్చన విగ్రహమును శ్రీ కేలిలో వుంచి మూడు ప్రదక్షిణములు మేళవాద్యములతో వచ్చి, తరువాత ఏకాంత దీపారాధనలో నిత్యపూజ పూర్తియగుచున్నది. (దేవిని తపస్సుకు పంపే వాడుక) ఇచ్చట దేవి ఈశ్వరసమేతముగా లేని దానివలన శయనగృహ దీపారాధనము లేదు.

**ఆలయమున దేవికి చేసెడి ప్రార్థనలు నివేదనములు**

1. పంచామృతము, 2. పొంగలి, 3. పాయసము, 4. వడలు, అప్పములు (రాత్రి సమయమున) 5. సర్వాంగ కవచము (గంధ కవచము), 6. అభిషేకము, 7. కన్యాభోజనం మొదలయిన ప్రార్థనలు. మనం చేయుటకు ఇష్టపడిన నివేదనములను దేవస్థాన ఆఫీసుకు పోయి వివరములు తెలుసుకొని, డబ్బుయిచ్చి నడిపించవచ్చును.

**ఈ దేవస్థాన అధీనమున నుండే ఇతర దేవాలయములు**

1. గ్రామమున నుండే ఒక శివాలయము
2. కన్నియంబలముననుండే విఘ్నేశ్వరాలయము
3. సముద్రతీరమున పరశురామునిచేత ప్రతిష్ఠ చేయబడిన పరశురామ విఘ్నేశ్వరాలయము.
4. మహాదేవాలయము.
5. ఉత్తర దిశలో కొంచెము దూరమున కాశీ విశ్వనాధుని ఆలయమును, దానికి సమీపమున చక్రతీర్థమనే యొక తీర్థ ఘట్టమును ఉన్నది. తీర్థము బహు పురాతనమైనదిగాను ముఖ్యమైనదిగాను వున్నది. బాణాసుర సంహారము చేసిన పిదప చక్రాయుధమును ఈ తీర్థమున శుద్ధముచేసిన దానివలన దానికి చక్రతీర్థమనే పేరు వచ్చింది.

**వివేకానంద రాక్ మెమోరియల్ :** సముద్రతీరం నుండి స్టీమరులో వెళితే చిన్న కొండ వస్తుంది. అక్కడే వివేకానందస్వామి ధ్యానం చేస్తూ గడిపారట. ఆ సుందర ప్రదేశంలోనే ఆయన గుర్తుగా స్మారక చిహ్నం వెలిసింది. ఈ స్మారకాన్ని 1970లో నిర్మించారు. 200 మీటర్ల ఎత్తులో (సముద్ర మట్టానికి) వున్న యిక్కడ టైమింగ్స్ ఉదయం 6 గంటల నుండి 11 గంటల వరకు, మళ్లీ మధ్యాహ్నం 2 గం॥ల నుండి 5 గంటల వరకు.

**గజేంద్రస్వామి టెంపుల్ :** 1000 సంవత్సరాలనాటి టెంపుల్. ఈ ఆలయాన్ని రాజరాజ చోళన్ నిర్మించాడు.

**గాంధీ మెమోరియల్ :** గాంధీగారి చితాభస్మాన్ని త్రివేణి సంగమంలో కలపటానికి ముందు ప్రజల దర్శనార్థం వుంచిన స్థలంలో కట్టిన స్మారక చిహ్నం. ఇక్కడ విశేషం - ఈ మెమోరియల్ చితాభస్మాన్ని వుంచిన ప్రదేశంలో ప్రతి సంవత్సరం ఒక్కసారి మాత్రమే సూర్య కిరణాలు పడతాయి. ఆ ఒక్కరోజు అక్టోబరు 2 ఆ రోజు గాంధీగారి జయంతి.

**కన్యాకుమారి పరిసరాలలో యాత్రా పర్యాటక ప్రదేశాలు :**

**నాగర్ కోయిల్ :** 19 కి.మీ. దూరంలో నాగరాజు గుడి వుంది.

**ఉదయగిరి :** మార్తాండ వర్మరాజు కట్టించాడీ కోటని. గన్స్ తయారు చేస్తారు ఇక్కడ.

**పద్మనాభపురం :** 1978 A.D. లో ట్రెవన్‌కోర్ రాజధాని ఈ పద్మనాభపురం. కోటలో అప్పటి కాలంనాటి వస్తువులని చూడవచ్చు.

**తిరుప్పరప్పు వాటర్ ఫాల్స్ :** మహాదేవుని గుడి వుంది. కన్యాకుమారికి 60 కిలోమీటర్ల దూరంలో వున్నాయి ఈ సుందర జలపాతాలు.

**కన్యాకుమారిలో వసతికి :** హోటల్ తమిళనాడు, బీచ్‌రోడ్ కన్యాకుమారి ఫోన్ : 71029 కేప్ హోటల్, కన్యాకుమారి 71257 ఈ హోటల్లో డబుల్ రూమ్ 275/-రూ., ఎ.సి. 375 రూ. ఇంకా కేరళ హౌస్, కోవలం రోడ్, హోటల్ సంగం మెయిన్‌రోడ్, హోటల్ ప్రియశంకర్ గెస్టుహౌస్, టౌన్‌షిప్ లాడ్జి, హోటల్ గంగా, మెయిన్‌రోడ్‌లోనే వున్నాయి. పయనీర్ లాడ్జి, గాంధీ మండపం వద్ద, వివేకానందపురం రెస్టుహౌస్ వున్నాయి. ఈ వివేకానంద హోటలులో 4 పడకల గది కూడా దొరుకుతుంది.

**యేర్కాటు :** సేలంకు 32 కిలోమీటర్ల దూరంలో ఉంది. పేర్వారాయిస్ కొండమీద 1600 మీటర్ల యెత్తులో సరోవరం ఉంది. సుందర అరణ్య ప్రదేశం, కాఫీ తోటలు ఎక్కువ. ఈ యేర్కాటులో చూడాల్సినవి హొగెన్నకల్ వాటర్‌ఫాల్స్ కిలియుర్ ఫాల్సు, బీర్స్‌కేవ్, పగోడపాయింట్, కావేరిపార్క్, లేడీస్ సీట్ మొదలగునవి.

**యేర్కాటులో వసతి :** యన్.జి.జి.ఒ. హాలిడే హోమ్, బస్‌స్టాండు ఎదురుగా ఉంది. శివరామ హిల్ రిసార్ట్, హాస్పటల్ రోడ్‌లో వుంది.

## కొడైకెనాల్

**ప్రిన్స్ ఆఫ్ హిల్ స్టేషన్ : 21.45 స్క్వేర్ కి.మీ.లలో 2,133 మీ లెవెలులో ఉన్న సుందర విశ్రాంతి ప్రదేశం. ఇక్కడ వర్షపాతం సగటున 165 సెం.మీ. వృక్షాలు నిండి వున్న ఈ పర్వత ప్రాంతాన్ని ఏప్రియలు నుంచి జూన్, సెప్టెంబర్ నుంచి అక్టోబరులో దర్శించి సేద**

తిరంపే. సంవత్సరం పొడవునా టూరిస్టులు వచ్చే పర్యాటక ప్రదేశం యిది. సీజన్‌లో వస్తే ఇక్కడి మనోహర దృశ్యాలను అందమయిన ప్రకృతి లావణ్యాన్ని ఆస్వాదించవచ్చు.

**అనేక పుష్పమాలంలతో నిండివున్న ఈ కొడైకెనాల్‌లో వాతావరణం :**

**వేసవి కాలం :** 19.8 డిగ్రీల C నుంచి 14.3 డిగ్రీల C వరకు

**చలికాలం :** 17.3 డిగ్రీల C నుంచి 8.3 డిగ్రీల C వరకు

మనస్సుకి హాయినిగొలిపే ఈ ప్రాంతానికి రావటానికి దగ్గరలో వున్న ఎయిర్‌పోర్ట్ మధురై 120 కి.మీ. దూరంలో వుంది. 135 కి.మీ. దూరంలో కోయంబత్తూరు ఉంది.

**రైలు మార్గం :** కొడై రైల్వే స్టేషను 80 కి.మీ.లలో పళని రైల్వే స్టేషను 64 కి.మీ. దూరంలో ఉంది.

**బస్సు :** ఇక్కడికి బెంగుళూరు, చెన్నై, పళని, మధురై, దిండిగల్, తిరుచిరాపల్లి, ఈరోడ్, కుయిలి నుంచి బస్సు సౌకర్యం ఉంది.

**ఇంపార్టెంట్ టెలిఫోన్ నెంబర్స్ :**

గవర్నమెంట్ హాస్పిటల్ ఫోన్ : 41292

టి.వి. రిలే మానిటర్ 41026

ప్రతి సంవత్సరము మే లో బోట్ రేస్‌లు జరుగుతాయి. అప్పుడే ఫ్లవర్ షో జరుగుతుంది. అద్భుతంగా ఉంటుంది ఈ పూల సంత. కొడైకెనాల్ నుంచి మధురై 120 కి.మీ., కొడైకెనాల్ రొడ్డు 80 కి.మీ., పళని 65 కి.మీ., కొయంబత్తూరు 78 కి.మీ., తిరుచ్చి 197 కి.మీ., దిండిగల్ 110 కి.మీ.

**షాపింగ్ :** ఖాది ఎంపోరియం, హాండ్లూమ్, కో-ఆపరేటివ్ స్టోర్, గవర్నమెంట్ సేల్సు ఎంపోరియం, మినీ సూపర్‌బజారు, స్పెన్సర్ అండ్ కంపెనీ.

**ఈ కొడైకెనాల్లో పర్యాటక ప్రదేశాలు :**

**లేక్ :** 60 ఎకరాల్లో ఉన్న ఆకర్షణీయమయిన లేక్. చుట్టూ పచ్చటి పొలాలు, బోటింగ్ సౌకర్యం TTPC వారు ఏర్పాటు చేశారు.

**బ్రయింటు పార్కు :** లేక్‌కి తూర్పు దిశలో ఉన్న సుందర పార్కులో మేలో హిస్టారికల్ షో జరుగుతుంది.

**సోలార్ ఫిజికల్ అబ్జర్వేటరీ :** 3.2 కిలోమీటర్ల దూరంలో ఈ ప్రదేశం కొడైలో ఎత్తయినది.

**కూకల్సువాక్ :** 1. కి.మీ. దూరం. తూర్పున లోతైన ప్రదేశంలో ఉన్న సుందర ప్రాంతం.

**అండవర్ టెంపుల్ :** 3.2 కి.మీ. దూరంలో ఉంది. మురుగన్ స్వామి ఈ ఆలయంలో కొలువై ఉంటారు. ఈ పాయింట్ నుంచి చూస్తే ఉత్తరాన ఉన్న పళని హిల్సు చూడవచ్చు.

**టెలిస్కోప్ హౌస్ :** ఇక్కడ రెండు టెలిస్కోప్ హౌసెస్ వున్నాయి. ఒకటి కురింజి అండవా టెంపుల్ దగ్గర ఏప్రియల్ నుంచి జూన్ వరకు తెరిచి వుంటుంది. రెండోది కూకల్సువాక్. ప్రవేశం ఒకరికి ఒక రూపాయి.

**గ్రీన్ వేలివ్యూ :** 5 కి.మీ. దూరంలో వున్న ఈవ్యూ నుంచి వైగైడామ్ కనిపిస్తుంది.

**ది పిల్లర్ రాక్స్ :** 7.4 కి.మీ. దూరంలో యిక్కడ నుంచి సుందర ప్రకృతికాంత సమస్త అందాలను చూడచ్చు. యిక్కడ సహజ సిద్ధమైన మూడు పొడవయిన శిలలు ఒకదానికొకటి ఆనుకొని 400 అడుగుల ఎత్తు కలిగి వుంటాయి.

**బీర్ షోలా ఫాల్సు :** 1.6 కి.మీ. దూరంలో వున్న బ్యూటీ ఫర్ పిక్నిక్ స్పాట్.

## కొడైకెనాల్ పరిసరాల్లో

**సిల్వర్ కాస్కేడ్ :** ఈ జలపాతాలు ఘాట్‌రోడ్ వద్ద ఉన్నాయి. కొడైకెనాల్ నుంచి 8 కి.మీ. దూరంలో ఉంది ఈ స్పాట్.

**మ్యూజియం :** 3. కి.మీ. దూరంలో వుంది. 1890లో స్థాపించబడిన ఒక కాలేజీ వారిచే ఈ పుష్పాల మ్యూజియం నిర్వహించబడుతోంది. మన దేశంలో వున్న ఆర్కిడోరియమ్స్‌లో ఇది ఒకటి. ఇందులో 300 జాతులకిపైగా మొక్కలు వున్నాయి.

**డేలు మెన్స్ సర్కిల్ :** 22 కి.మీ. దూరంలో ఉన్న పురాతన కాలంనాటి స్థలం.

**పెరుమాళ్ పీక్ :** 11 కి.మీ. దూరంలో గల ఈ ప్రదేశం 2,400 మీటర్ల ఎత్తున వున్న శిఖరం. ఈ ప్రయాణం పెరుమాళ్ మలాయ్ గ్రామం నుంచి ప్రారంభమవుతుంది. ఇక్కడి వాతావరణం చూస్తే ఈ ప్రాంతానికి వలస పోదామా అనిపిస్తుంది.

**బెరిజామ్ లేక్ :** 21 కి.మీ. దూరంలో గల ఈ ప్రదేశం సూపర్ పిక్నిక్ స్పాట్.

**కుక్కాళ్ కేవ్స్ :** గుహల్లో నివసించే మానవులు ఈ గుహాల్లో నివసించే వారు. ఇప్పుడిది విడిది.

**డాల్ఫిన్ నోస్ :** రాయి నిరాధారంగా కనబడుతూ చివరి భాగం ఆవలించిన నోరులా కనిపిస్తుంది.

**పళని :** హిందూ దేవాలయం వుంది. సుబ్రహ్మణ్యస్వామి ఆరు అవతారాల్లో ఒక మూర్తి అవతారం ఇక్కడ చూడచ్చు. పళని రేంజ్‌లో వెస్టర్న్ ఘాట్స్‌లో ఈ గుడి పర్వతం మీద వుంది. 64 కి.మీ. దూరంలో వుంది కొడైకెనాల్‌కి.

**కుంభక్కరై :** 12 కి.మీ. దూరంలో ఈ ప్రాంతం అద్భుతమైన పిక్నిక్ స్పాట్. అందమైన జలపాతాలు ఉన్నాయి.

**కొడైకెనాల్‌లో వసతికి : హోటల్ తమిళనాడు ఫోన్: 41336, డబుల్ రూమ్ 500 సీజన్ కానప్పుడు 250, ఫ్యామిలీ రూమ్ సీజన్‌లో 800 కానప్పుడు 450, యూత్ హాస్టల్,**

డబుల్ రూమ్ 375 రూ 225. మొదటి రేటు సీజన్‌లో

**కొడై ఇంటర్ నేషనల్** : లామ్స్ ఘాట్ రోడ్ ఫోన్ : 40767 కొడై రిసార్ట్ హోటల్. నాయిస్ రోడ్. ఫోన్ : 40632. గార్డెన్ మానర్. లేక్ రోడ్, ఫోన్ : 40462. హోటల్ ఎస్టోరియా. అన్నాశాలై ఫోన్ : 40524. యూత్ హాస్టల్. గ్రీన్ ల్యాండ్స్ ఫోన్ : 41009.

## మధుమలై అడవులు

ఊటీ నుంచి 67 కి.మీ. దూరంలో మైసూర్‌కు వెళ్లే దారిలో ఉన్నాయి. ఈ అరణ్యాలు. నీలగిరి మీద 3000 ఎత్తులో ఉన్న అరణ్యాలివి. ఇక్కడ చాలా సహజంగా ఏనుగులు, డీర్స్, పెద్దపులి, చిరుతలు చూడొచ్చు.

నక్కలు, కోతులు, ముంగిసలు, గండుపిల్లులు లాంటివి అనేకం అడుగడుగునా కనిపిస్తుంటాయి. ఏప్రిల్ నెలలో రాత్రిళ్ళు మిణుగురు పురుగులతో అడవి అంతా మెరిసిపోతుంటుంది.

ఈ అడవి మొత్తం చూడటానికి కారు లేదా తర్ఫీదు పొందిన ఏనుగు మీద గాని చూడొచ్చు. ఈ సౌకర్యాన్ని ఫారెస్ట్ డిపార్ట్‌మెంటు వారు కల్పిస్తారు. బెస్ట్ సీజన్ మార్చి - జూన్ మధ్య చూడటానికి అనువుగా వుంటుంది.

ఇక్కడికి దగ్గరిలో కార్ గుడిలో రెస్ట్‌హౌస్, టూరిస్ట్ లాడ్జి వుంది వసతికి. ఇంకా దగ్గరిలో బాంబూ బ్యాంక్స్ ఫామ్ గెస్ట్‌హౌస్, లాగ్ హౌస్, ముసిని గుడిలో తెప్పకడులో యూత్ హాస్టల్ వున్నాయి. ఈ ప్రదేశాలన్నీ మధుమలై వైల్డ్‌లైఫ్ శాంక్చువరీ పరిసరాలు.

## నీలగిరి (ఊటీ)

క్వీన్ ఆఫ్ హిల్ స్టేషన్. దీన్నే ఉదక మండలం అని కూడా పిలుస్తారు. ఇక్కడి కొండలు నీలంగా ఉండటంతో నీలగిరి అని కూడా అంటారు. సముద్ర మట్టానికి 7,500 అడుగుల ఎత్తులో 36 స్క్వేర్ కి.మీ.లలో ఉన్న ఈ పర్వతం అత్యంత ప్రసిద్ధి చెందిన వేసవి విడిది ప్రదేశం. సగటున 121 సెం.మీ. వర్షపాతం పడే ఈ ప్రాంతం వాతావరణం-

వేసవి కాలం : 25$^{0}$C

(మినిమమ్) చలికాలం : 21$^{0}$C

బెస్ట్ సీజను ఏప్రిల్, జూన్, సెప్టెంబరు, నవంబరు నెలలు

దగ్గరిలో వున్న ఎయిర్‌పోర్టు కోయంబత్తూరు ఊటీకి 100 కి.మీ. దూరంలో వుంది. ఈ ఊటీకి కోయంబత్తూరు నుంచి రైలు సౌకర్యం వుంది. ట్రైన్లో వస్తే అత్యంత సుందర ప్రదేశాలు చూడొచ్చు. ఈ ఊటీలో హిందూ దేవాలయములు, మురుగన్ టెంపుల్, వెంకటేశ్వర స్వామి, మరియమ్మ, సుబ్రహ్మణ్యేశ్వర ఆలయాలున్నాయి.

ఇక్కడ ఫిషింగ్ చేయవచ్చు. లైసెన్స్ తప్పనిసరి. కొంత ఫీజుతో అసిస్టెంట్ డైరెక్టర్ ఫిషరీస్, ఫిష్‌డాల్, ఉదకమండలం వారిని సంప్రదించాలి. ఈ ఆఫీస్ బస్‌స్టాండు దగ్గరుంది. బోట్‌రేస్ ఊటీలోయలో జరుగుతుంది. సమ్మర్ ఫెస్టివల్ కూడా అప్పుడే జరుగుతుంది. ఇంకా మే నెలలో ఫ్లవర్ షో, కూనూర్లో ఫ్రూట్ షో జరుగుతాయి.

**షాపింగ్స్ :** పుహార్ హ్యాండీ క్రాఫ్ట్, కైరలి హ్యాండీ క్రాఫ్ట్.

టూరిజం ఇన్ఫర్మేషన్, సూపర్ మార్కెట్ కాంప్లెక్స్, ఫోన్ : 43977లో సంప్రదించగలరు. **ఎయిర్ ట్రావెల్ ఏజంట్ :** M.B. ట్రావెల్స్, ఫోన్ : 42604. ఇంపార్టెంట్ టెలిఫోన్ నంబర్స్ : గవర్నమెంట్ హాస్పిటల్ 42212, కూనూర్ 421050, కోటగిరి 4309 ఇవి కూడా హాస్పటల్సే.

ఈ ఉదక మండలం నుంచి వివిధ ప్రాంతాలకి దూరం కి.మీ.లలో.

చెన్నై 535 కి.మీ., కూనూర్ 19 కి.మీ., కోటగిరి 29 కి.మీ., కాలికట్ 187 కి.మీ., మైసూర్ 160 కి.మీ., బెంగుళూర్ 290 కి.మీ., కొచ్చిన్ 281 కి.మీ., తిరుచ్చి 302 కి.మీ., కొడైకెనాల్ 265 కి.మీ., కోయంబత్తూర్, 90 కి.మీ., ముంబాయి 1,320 కి.మీ., కంచి 488 కి.మీ.

ఊటీకి కోయంబత్తూరు, తిరుచ్చి, బెంగుళూరు, మధురై, కన్యాకుమారి, పాలఘాట్, కాలికట్ నుంచి బస్సు సౌకర్యాలు ఉన్నాయి. చెన్నై నుంచి మెట్టుపాలెం వరకూ నీలగిరి ఎక్స్‌ప్రెస్ వుంది. ఇక్కడ్నించి 52 కి.మీ. దూరం ఊటీ.

**ఊటీలో వసతి :**

హోటల్ తమిళనాడు, ఫోన్ : 44370, 44010

| | | | | |
|---|---|---|---|---|
| సింగిల్ రూమ్ | సీజన్లో | 250 | ఆఫ్ సీజన్లో | 100 |
| డీలక్స్ డబల్‌రూమ్ | సీజన్లో | 425 | ఆఫ్ సీజన్లో | 225 |
| సూట్ | సీజన్లో | 650 | ఆఫ్ సీజన్లో | 400 |

ఇంకా యూత్ హాస్టల్ ఫోన్ : 43665

| | సీజన్లో | ఆఫ్ సీజన్లో |
|---|---|---|
| డబల్ రూమ్ | 350 | 200 |
| ఫ్యామిలీ రూమ్ 4 పడకలు | 450 | 325 |

హోటల్ మయూరి సుదర్శన్, ఫోన్ : 43828, సీజన్‌లో 180 ఆఫ్ సీజన్లో 120. నెహ్రూ టూరిస్ట్ హోమ్, ఫోన్ : 42457. సీజన్‌లో 350 వరకూ వున్న రూమ్ ఆఫ్ సీజన్‌లో 250కే వస్తుంది. ఇంకా దాస్ ప్రకాశ్, ఉడ్‌ల్యాండ్స్ రేస్‌కోర్స్ వద్ద ఆర్.కె. లాడ్జి కమర్షియల్ రోడ్‌లో, హిల్ క్రెస్ట్ గార్డెన్ రోడ్డులో వున్నాయి. ఊటీలో అడుగడుగునా హోటల్స్ వున్నాయి. ప్రతి హోటల్ నుంచి సైట్ సీయింగ్‌కి టిక్కెట్స్ అమ్ముతారు.

**ఈ ఉదక మండలంలో యాత్రా పర్యాటక ప్రదేశాలు :**

**బొటానికల్ గార్డెన్ :** ఊటీ స్టేషన్ నుంచి 2 కి.మీ. దూరం. ఈ గార్డెన్ 1847 మార్క్విస్ ఆఫ్ ట్యూడిల్‌చేత ఆరంభించబడింది. అద్భుతమైన పూల మొక్కలు, అరుదయిన పుష్పజాతులను చూడవచ్చు. ఇక్కడ "మే"లో ఫ్లవర్ షో జరుగుతుంది. ఈ గార్డెన్‌లో 20 మిలియన్ల సంవత్సరాలనాటి ఫాసిల్ చెట్టుని చూడవచ్చు.

**లేక్ :** 1.5 కి.మీ. దూరం ఉదకమండలం స్టేషన్ నుంచి. ఈ లేక్ 1824 లో కోయంబత్తూరు కలెక్టర్ మిస్టర్ జాన్ సిలివాన్ చేత నిర్మించబడినది. ఇక్కడ ఉదయం 8 గంటల నుంచి సాయంత్రం ఆరు గంటల వరకూ బోటింగ్ చేయవచ్చు. పిల్లలు ఆడుకోవటానికి చిల్డ్రన్స్ కార్నర్ ఉంది.

**గవర్నమెంట్ మ్యూజియం :** మైసూర్ రోడ్డులో ఉంది. అనంతమైన విద్యాలాభం ఈ మ్యూజియం ద్వారా పొందవచ్చు. పాతకాలంనాటి అనేక వస్తువులు ఉన్నాయి. టైమింగ్స్ 10 మంచి 1 వరకూ, తిరిగి 2 నుంచి 5 వరకూ. శుక్రవారం, రెండో శనివారం శెలవు దినములు.

ఇక్కడ ప్యాలెస్‌లు పర్మిషన్‌తో చూడాలి. ఆరన్మోర్ ప్యాలెస్, మైసూర్ ప్యాలెస్, బరోడా ప్యాలెస్. ది సెడార్స్ మరియు నవనార్ ప్యాలెస్‌లు ఉన్నవి. కూనూరు వెళ్ళేదారిలో టైగర్‌హిల్ చూడచ్చు. విల్సన్ ఫిష్‌ఫారమ్ స్టేషన్ దగ్గరలో ఉంది. నీలగిరి లైబ్రరీ, కల్‌హట్టిఫాల్స్, అంబరెల్లు చెట్టు (తోడా ట్రైబల్ విలేజి) మొదలగునవి.

**ఉదకమండలం పరిసరాల్లో :**

**కెట్టివ్యాలి వ్యూ :** కూనూరు వెళ్ళే దారిలో వుంది. కోయంబత్తూరు, మైసూరు మైదానాలలో ఉండే చిన్న గ్రామాలని ఇక్కడ్నించి చూడచ్చు.

**పైకర :** ఊటీకి 21 కి.మీ. దూరం, మైసూరు రోడ్డులో వుంది. రిజర్వాయరు, డ్యామ్ చూడదగ్గవి ఇక్కడ. ఫారెస్టు రెస్ట్‌హౌస్ వుంది ఇక్కడ.

**అప్పర్ భవాని :** కోరాకుందా నుంచి 10 కి.మీ. అవలంచి నుంచి 20 కి.మీ. గల ఈ ప్రదేశం సుందరమయం. భూలోకంలో స్వర్గలోకాన్ని ఇక్కడ చూడచ్చు. ఇక్కడ నిశ్శబ్దలోయ ఉంది.

**అవలంచి :** ఊటీకి 28 కి.మీ. దూరంలోగల చక్కని సరస్సు, చుట్టూ అడవి, ఈ అడవి ఎంత దట్టంగా ఉంటుందంటే సూర్యకిరణం నేలని తాకదు. ఈ ప్రదేశం ప్రేమికుల పాలిటి స్వర్గధామం.

**వెన్లక్ క్యాంప్‌మెంట్ :** 20 కి.మీ. దూరంలో వుంది. ఇక్కడ కొద్దిగా వేడిగా ఉంటుంది.

**డా॥ జె. జయలలిత వైల్డు లైఫ్ శాంక్చువరి :** నీలగిరి జిల్లాలో ఉంది. 1000 మీటర్ల ఎత్తులో 320 చ.కి.మీ. విస్తీర్ణంలో ఉంది. కేరళ, కర్ణాటక రాష్ట్రాలకు ఆనుకుని ఉంది ఈ క్రూర మృగ సంరక్షణ కేంద్రం. ఇందులో టేకు చెట్లు ఎక్కువగా ఉన్నాయి. ఏనుగులు, పులులు, కృష్ణ జింకలు, మొరిగే కుక్కలు, నీటి పక్షులు, కొండ చిలువలు గలవు. ఉదకమండలం నుంచి రెండు దారులున్నాయి. వయా కాలిట్టి మీదుగా 36 కి.మీ. దూరం. వయా గుడ్లూరు 67 కి.మీ. దూరం. ఈ శాంక్చువరీ నుంచి మైసూరు 91 కి.మీ. ఈ శాంక్చువరీ దగ్గరలో మోయర్ జలపాతం, ముఖ్యమంత్రి గడియార స్తంభం కలవు. ఇక్కడ పైలాన్ లాడ్జి వసతికి కలదు.

**దొడ్డబెట్ట :** నీలగిరిలో ఉన్న ఎత్తయిన శిఖరం. ఊటీ నుంచి 10 కి.మీ. దూరంలో ఉంది. T.T.D.C. టెలిస్కోపు ఉంది. ఈ టెలిస్కోపు నుంచి నీలగిరి అందాలమ చూడచ్చు. శిఖరం ఎత్తు 2623 మీటర్లు. ఈ దొడ్డబెట్ట వెస్ట్రన్‌ఘాట్, ఈస్ట్రన్‌ఘాట్ మధ్యలో ఉంది.

**కల్హట్టి ఫాల్స్ :** 13 కి.మీ. దూరం ఊటీ నుంచి, మైసూరు మార్గంలో ఉన్న ఇక్కడ మసింగుండి వాటర్ ఫాల్ కలదు. ఈ జలపాతం ఎత్తు 100 అడుగులు. ఈ అడవి ప్రాంతంలో దున్నపోతులు, కుక్కలు, జింకలు కలవు. రకరకాల పక్షులు కలవు.

**వెన్‌లాక్ డౌన్స్ :** క్లబ్ ఉంది. ప్రభుత్వ గొఱ్ఱెల పెంపకం, హిందుస్తాన్ ఫోటో కంపెనీ కలదు.

**వెక్ హిల్స్ :** ఉదకమండలం నుంచి నడవటానికి గంట పడుతుంది. ఊటీని, లవ్‌డెల్ వ్యాలి పరిసరాలని ఇక్కడ్నించి చూడచ్చు.

**ఫ్రాడెన్ పీక్ :** కొత్తగిరి రోడ్డులో ఉంది. మైసూరు అందాలను ఇక్కడ్నించి చూడచ్చు.

**కూనూరు :** కోయంబత్తూరు, ఊటీ మార్గంలో ఉంది. ఊటీ నుంచి 19 కి.మీ. దూరం. రెండవ అతిపెద్ద హిల్ స్టేషన్ నీలగిరిలో. దీని ఎత్తు 1858 మీటర్లు. మెట్టుపాలయం రైల్వే స్టేషన్ ఉంది. రెగ్యులర్ బస్సు సౌకర్యం ఊటీ నుంచి కోయంబత్తూరు నుంచి వున్నాయి ఈ కూనూరుకి.

**కూనూరు వాతావరణం :** వేసవికాలం : మినిమమ్ $10^{0}C$ చలికాలం మినిమమ్ $0^{0}C$

**డాల్ఫిన్స్ నోస్ :** కూనూరు నుంచి 12 కి.మీ. దూరం, ఇక్కడ క్రూర మృగాలను చూడచ్చు. గ్లీమ్ప్స మరియు కిదిరిన్ ఫాల్స్ కలవు.

**లాంబ్స్ రాక్ :** కూనూరు నుంచి 8 కి.మీ. దూరం, ఇక్కడ్నించి కోయంబత్తూరు మైదానాలు ప్రారంభమవుతాయి.

**లాన్ ఫాల్సు :** కూనూరు నుంచి 7 కి.మీ. దూరం. ఇక్కడున్న జలపాతం లోతు 180 అడుగులు.

**సెయింట్ కేథరిన్ ఫాల్సు :** 8 కి.మీ. దూరం కూనూరు నుంచి. అందమైన వృక్షాలు అనేకం.

**సిమ్సు పార్క్ :** బొటానికల్ గార్డెన్ కలదు. ఇక్కడ అనేక జాతుల పండ్లతోటలు కలవు.

**కోటగిరి :** 1983 మీటర్ల ఎత్తులో కలదు సముద్రమట్టానికి. ఊటీ నుంచి 28 కి.మీ. ఈ కొండ నుంచి 8 కి.మీ. దూరంలో కాథేరిన్ జలపాతం. ఇంకా 8 కి.మీ. లలో ఎల్క్ జలపాతం వుంది.

**కొడనాడ్ పాయింట్ :** కోటగిరి నుంచి 20 కి.మీ. దూరం, కాఫీ, తేయాకు తోటలు వున్నాయి. ఇక్కడ్నించి నీలగిరి పెరయార్ జిల్లాలు వేరవుతాయి.

అద్భుతమైన ప్రశాంతమైన ఈ నీలగిరి కొండలు 850 సంవత్సరాల క్రితం నీలంగా మారాయి. నీలగిరి పర్వతాలను పర్వతాలరాణి అంటారు.

అలాంటి ప్రదేశంతోబాటు పవిత్ర పుణ్యక్షేత్రాలయిన రామేశ్వరం, మధురై, తిరుచ్చిగల ఈ తమిళనాడు రాష్ట్రం అత్యంత ఉత్సాహభరితమైన పర్యాటక రాష్ట్రం. దక్షిణ భారతదేశంలో మరెక్కడా ఈ రాష్ట్రంలో వున్నన్ని గుడులు లేవు. భక్తికి హిందూమత సంప్రదాయాలకి పెట్టింది పేరు. అలాంటి ఈ రాష్ట్రాన్ని పరిపూర్ణంగా దర్శించాం.

ఇప్పుడు కర్నాటక వెళదాం. దానికి ముందుగా కూనూరు కోటగిరిలో వసతి. ముందుగా కూనూరు రిట్జ్ హోటల్, ఆరంజ్ గ్రోవ్ రోడ్, సిమ్సు పార్కు రెస్టు హౌస్ బ్లూహిల్స్, మౌంట్ రోడ్, కోటగిరిలో రమేష్ విహార్, హైవే టూరిస్టు బంగ్లా వున్నాయి.

# కర్నాటక

కర్నాటక (దక్షిణ భారత్) విస్తీర్ణం 1,91,791 చ.కి.మీ. ఇందు జనాభా 4.48,17,398 ఈ కర్ణాటక రాష్ట్ర రాజధాని బెంగుళూరు.

**ప్రధాన నగరాలు, పట్టణాలు :** బెల్గాం, బెంగుళూరు, బళ్ళారి, భద్రావతి, బీదర్, టుమ్‌కూర్, షిమోగా, రామ్‌చంద్, బీజాపూర్, చిక్‌మగుళూరు, మంగుళూరు, మైసూరు, చిత్రదుర్గ, దావణగెరె, మాండ్య, హుబ్లి, హసన్, దర్వాడ్, గుల్బర్గా మొదలగునవి.

**విహారయాత్రా పర్యాటక ప్రదేశాలు :** మైసూరు, శ్రీరంగపట్టణం, బేలూరు, హంపి, శ్రావణ బెళగొళ, హాళేబీడు, గోకర్ణం, మంగుళూరు, ఉడిపి మొదలైనవి.

**సరిహద్దులు :** తూర్పున ఆంధ్ర ప్రదేశ్, దక్షిణాన తమిళనాడు, కేరళ, వాయువ్యంలో గోవా, పశ్చిమాన ఆరేబియా మహాసముద్రం, ఉత్తరాన మహారాష్ట్రలు వున్నాయి.

విమానాలు, వాచీలు, టెలికమ్యూనికేషన్స్ సామాగ్రి విరివిగా తయారయ్యే ఈ కర్నాటకలో వాతావరణం.

వేసవి కాలం : 35$^{0}$C నుంచి 26$^{0}$C వరకూ

చలికాలం : 25$^{0}$C నుంచి 14$^{0}$C వరకూ

**బెస్ట్ సీజన్ :** అక్టోబరు నుంచి ఏప్రియల్ వరకూ.

**ఎయిర్ పోర్టు :** బెంగుళూర్, బెల్గామ్, మంగుళూరు, హుబ్లి, మైసూరు.

**టూరిజం ఇన్‌ఫర్మేషన్ కేంద్రాలు :** డిపార్టుమెంట్ ఆఫ్ టూరిజం, గవర్నమెంటు ఆఫ్ కర్నాటక, కె.జి. రోడ్ బెంగుళూరు ఫోన్ : 215489.

గవర్నమెంట్ ఆఫ్ ఇండియా టూరిస్ట్ ఆఫీస్ : 48 చర్చి స్ట్రీట్, బెంగుళూరు ఫోన్ : 579517

టూరిస్టు ఇండికేషన్ సెంటర్ బెంగుళూరు ఫోన్ : 211285

కర్నాటక స్టేట్ టూరిజం డెవలప్‌మెంట్ కార్పొరేషన్ 10 కస్తూరిబా రోడ్ బెంగుళూరు ఫోన్ : 579186

## బెంగుళూరు

50 లక్షలు పైనే ఈ బెంగుళూరు నగర జనాభా. 400 స్క్వేర్ కి.మీ. పరిధిలోగల ఈ పట్టణంలో చక్కటి ఉద్యానవనాలు, చక్కటి పర్యాటక ప్రదేశాలు వున్నాయి. ఈ నగరాన్ని 16వ శతాబ్దంలో కెంపగౌడ నిర్మించాడు. ఆ నగరంలో లాలుబాగ్, విధానసౌధ, నందీశ్వరాలయం, కబ్బన్‌పార్కు, టిప్పుసుల్తానుకోట,

మ్యూజియం, ఆర్టుగ్యాలరీ లాంటివి వున్నాయి. సిటి చూడటానికి (సైట్ సీయింగ్) మీరు దిగిన హోటలు నుంచి సౌకర్యం వుంటుంది. ప్రైవేట్ సైట్ సీయింగ్ బస్సులలో కాక గవర్నమెంటు (K.S.T.D.) వారిని సంప్రదించండి. ఫోన్ : 2212901

**లాలుబాగ్ బొటానికల్ గార్డెన్స్ :** 1760లో హైదర్ ఆలీచే నిర్మించబడి టిప్పు సుల్తానుచే మెరుగులు దిద్దుకుంది. 90 హెక్టార్ల వైశాల్యంతో అత్యంత రమణీయ సుందర ప్రదేశంగా కొనియాడబడుతుంది. ప్రవేశం ఉచితం. లోపల ఆక్వేరియం వుంది అనేక రకాల చేపలు 1రూపాయితో చూడచ్చు. 20 మిలియన్ల సంవత్సరాలనాటి FOSSIL (చెట్టు మొదలు) ఉంది. ఇంకా నేల మీద పడుకోబెట్టిన ఫ్లోర్ వాచ్ సమయాన్ని చూపిస్తుంది. సౌత్‌లో ఉన్న అతి పెద్ద బొటానికలు గార్డెన్స్ 3, మిగతా రెండు బృందావన్, ఊటీ బొటానికలు గార్డెన్స్. మొత్తం మీద రెండు కర్నాటకలోనే ఉన్నాయి. ఈ బొటానికలు గార్డెన్స్‌లో సుందరమైన లేక్ వుంది. గార్డెన్స్ మధ్య గ్లాస్ హౌస్ వుంది. జనవరి, ఆగష్టులో ఫ్లవర్ షో జరిగే ఇక్కడ సుందరమైన గులాబి తోట వుంది.

**విధాన సౌధ :** ఇండియాలోనే సుందరభవనం, సంప్రదాయ వాస్తు రీతిలో నల్లరాతితో కట్టబడి వుంది. భవనం మీద చక్కటి కొటేషన్ వుంటుంది.

**'ప్రభుత్వపు పని భగవంతుని పనితో సమానం'** అన్న వాక్యం ఇంగ్లీషులో వుంటుంది. ద్రవిడ భవన నిర్మాణ దక్షతకు అద్దం పట్టే ఇక్కడే సచివాలయం. ఇందు కాబినెట్ రూము తలుపు చందనముతోచేసి బిగించబడింది. లోపలికి ప్రవేశం ఉదయం 5.30 నుండి సాయంత్రం 6.30 వరకూ. లోపలికి పర్మిషన్ తప్పనిసరి, సెక్రటరీ లేదా, డిపార్టుమెంట్ ఆఫ్ పర్సనల్ ఎడ్మినిస్ట్రేటివ్ రిఫామ్స్ నుంచి అనుమతి పొందాలి.

**బెంగుళూరు ప్యాలెస్ :** విధాన సౌధ నార్తు వెస్ట్ హైగ్రౌండ్స్ లోని గార్డెన్ మధ్యనే వుంది ఈ ప్యాలెస్. ఇది లండన్‌లోని విండ్సర్. క్యాసిల్‌ని పోలి వుంటుంది.

**వెంకటేశ్వర ఆర్ట్ గ్యాలరీ :** ప్రవేశం 1 రూపాయి 18 A.D., 12 A.D. కి చెందిన అనేక శిల్పాలు వున్నాయి. వాట్య గణపతి, గణేష్, వైష్ణవీదేవి, కాలభైరవి, వేణుగోపాలుడి విగ్రహాలే కాక 2వ సెంచరీ A.D కి చెందిన సిద్ధార్థుని విగ్రహం కూడా వుంది.

**విశ్వేశ్వరయ్య మ్యూజియం :** ఇండస్ట్రియల్, టెక్నాలాజికల్ మ్యూజియం. లోపలికి ప్రవేశం రూ. 5, ప్రవేశ వేళలు 10 నుంచి సాయంత్రం 6 వరకూ సోమవారం పండుగ దినములు శెలవు.

ఇక్కడ ఈ మ్యూజియంలో ప్రతి వస్తువుని తాకచ్చు. ఎలా పనిచేస్తాయో స్వయంగా స్విచ్ నొక్కి మరీ చూడచ్చు. రైలు చక్రం ఎలా తిరుగుతుంది. వంద సంవత్సరాలనాటి టెలిఫోన్‌లు, అంతరిక్షంలోంచి వేవ్స్ భూమి మీదికి ఎలా వస్తాయి.

టెలిఫోన్‌లో మనం మాట్లాడే మాటలు ఎలా రూపాంతరం చెంది అవతల వారికి వినబడతాయి లాంటి వన్నీ కళ్ళకు కట్టినట్టు చూడచ్చు... ఇక్కడ అన్ని వివరంగా చూడాలంటే ఒక రోజు చాలదు. లోపలికి వెళితే ఆ వస్తువులను, అవి పనిచేసే విధానం చూస్తుంటే మనిషి మేధస్సు ఇంతా ? అని ఆశ్చర్యపోకమానరు ఎవరయినా. ఈ మ్యూజియం మూడు భాగాలుగా వుంటుంది. (గ్రౌండ్ ఫ్లోర్) ఆడిటోరియమ్ మొదటి అంతస్తులో ఎలక్ట్రానిక్, రెండో అంతస్తులో టింబర్ పేపర్ మెటల్స్, మూడో ఫ్లోర్‌లో పాపులర్ అండ్ పిల్లల సైన్స్.

**కబ్బన్ పార్కు :** ఇక్కడ పిల్లలకు సాయంత్రం 3 గంటల నుంచి 6 గంటల వరకూ టాయ్‌ట్రైన్ వుంది. హాయిగా సాయంత్రం పూట కుటుంబంతో బ్రహ్మాండంగా ఈ రైలులో చుట్టూ తిరుగుతూ ఎంజాయ్ చెయ్యొచ్చు. 1864లో నిర్మించబడిన ఇక్కడ రకరకాల పుష్పాలను చూడవచ్చు. 3000 ఎకరాల సుందరవనం యిది. లోపలున్న మ్యూజియంలో 5000 సంవత్సరాలనాటి సింధూ నాగరికతకు చెందిన వస్తువులను చూడవచ్చు.

**గవర్నమెంట్ మ్యూజియం :** ఇండియాలోనే అతి పెద్ద మ్యూజియం 1886లో నిర్మించారు. ఈ మ్యూజియంలో ఆర్కియాలజీ, ఇథనాలజి, జియాలజి మరియు న్యూమిస్మాటిక్స్ విభాగాలున్నాయి. (5000 బి.సి. నాటి) మొహంజదారో కాలంనాటి జ్ఞాపికలను చూడొచ్చు. ప్రతిరోజూ ఉదయం 8 గంటల నుంచి సాయంత్రం 5 గంటల వరకూ ప్రవేశం, బుధవారం పండుగలు సెలవు.

**టిప్పు ప్యాలెస్ :** 160 పిల్లర్స్ గల వుడ్‌కోట... మొత్తం భవనం 80 శాతం వుడ్.... టిప్పు సుల్తాన్ మంతనాలకీ, తన మంత్రులతో రహస్య చర్చలకు ఇక్కడికి వచ్చేవాడు. హైదర్ ఆలీ 1781లో ప్రారంభించిన ఈ భవనాన్ని టిప్పు సుల్తాన్ 1791లో పూర్తి చేశాడు. ప్రవేశ సమయం ఉదయం 6 గంటల నుంచి సాయంత్రం 6 గంటల వరకూ. ప్రవేశం ఉచితం.

**బాలాజీ టెంపుల్ :** టిప్పు భవనం ఆనుకునే వుంది. శ్రీ వెంకటేశ్వర స్వామి ఆలయం. 50 సంవత్సరాల నాటి ఆలయం ఇది.

**కోట :** టిప్పు ప్యాలెస్ దగ్గరలోనే వుంది. 1537లో కెంపగౌడ్ నిర్మించారు. కాలక్రమేణా హైదరాలి టిప్పు సుల్తాన్ అభివృద్ధి చేశారు. ఈ కోట లోపల గణేష్ ఆలయం వుంది.

**బుల్ టెంపుల్ :** 15 అడుగుల ఎత్తులో 50 అడుగుల పొడవు గల నంది

విగ్రహం వుంది. సౌత్ ఇండియాలోని నాలుగు బుల్ టెంపుల్స్‌లో ఇదొకటి. ఈ నంది విగ్రహాన్ని ఏకశిలతో నిర్మించారు. కెంపగౌడ దక్షిణాది శిల్పరీతులలో నిర్మించిన ఈ ఆలయం పరిసరాలలోనే గణేష్ టెంపుల్, శివాలయం ఉన్నాయి. టెంపుల్ బెంగుళూరులోనే అతిపురాతన దేవాలయం.

**వాచ్ టవర్స్ :** బుల్ టెంపుల్‌కి వెస్ట్‌లో నాలుగు వాచ్ టవర్స్ వున్నాయి. వీటిని కెంపగౌడ నిర్మించారు.

**శాశ్వతి మ్యూజియమ్ :** మహిళల విశిష్ట వస్తు ప్రదర్శనశాల. జయనగర్ ప్రాంతంలో వున్న ఈ మ్యూజియం 1974లో ఏర్పడింది. ఇందులో తాంబూల పేటికలు, దీపస్తంభాలు, అలంకరణ సామాగ్రి కన్నడ రచయితల రాతప్రతులు అముద్రిత గ్రంథాలు వున్నాయి. యేళ్ళ కాలంనాటి కుట్టు మిషన్లు, రాట్నం లాంటివి గల ఈ మ్యూజియం ప్రపంచంలోనే వున్న ఏకైక మహిళా మ్యూజియం.

**ఉల్సూరు సరోవరం :** బుధవారం సెలవు. ప్రవేశం ఉదయం 9 గంటల నుంచి సాయంత్రం 6 వరకూ, కంటోన్మెంట్ ఏరియాలో ఉన్న ఇక్కడ లేక్ వుంది యిక్కడ బోటింగ్ చేయవచ్చు. మోటారు బోట్స్, సైలర్ బోట్సు, ఫైబర్ గ్లాస్, రోయింగ్ బోట్స్ యిక్కడ విహరించుటకు లభ్యమవుతాయి.

## బెంగుళూర్ చుట్టు ప్రక్కల ప్రదేశాలు

**బన్నెర్‌ఘట్ట :** బెంగుళూరు నుంచి 21 కి.మీ. దూరంలో వుంది. ఇక్కడ లయన్ సఫారీ మరియు పార్కు 100 చ.కి.మీపైగా విస్తరించి వుంది. ఇది అతి తొందరలో వన్యమృగ సంరక్షణా కేంద్రంగా అభివృద్ధి చేయబడుతుంది. ఇక్కడ క్రొకోడైల్ మరియు స్నేక్ ఫారం ఉన్నాయి.

**వైట్ ఫీల్డు :** 25 కి.మీ. దూరంలో ఉంది. ప్రపంచంలోకెల్లా ప్రసిద్ధమైన శ్రీ సత్యసాయిబాబా ఆశ్రమం బృందావనాన్ని ఈ వైట్ ఫీల్డు అంటారు. ప్రతి సంవత్సరం వేల సంఖ్యలో భక్తులు ప్రపంచం నలుమూలల నుండి అక్కడికి వస్తారు.

**హెస్సర్‌ఘట్ట :** 30 కి.మీ. దూరంలో ఉంది. పెద్ద సరస్సుతో ప్రజలను ఆకర్షిస్తుంది. ఇండో-డానిష్ డైరీ ప్రాజెక్టు మరియు గవర్నమెంటు హార్టికల్చరల్ డైరీ ఫారములు వున్నాయి.

**తిప్పగొండన హళ్లి :** (35 కి.మీ.) ఈ యాత్రా స్థలాన్ని చామరాజసాగర్ అని కూడా అంటారు. ఇక్కడ వున్న పెద్ద రిజర్వాయరు బెంగుళూరు పట్టణానికి మంచి నీటిని సరఫరా చేస్తుంది.

**నందిహిల్స్ :** (60 కి.మీ.) సముద్రమట్టం నుంచి 5000 అ॥ ఎత్తులో ఉంది. ఇది వేసవి విడిది. వేయి సంవత్సరాల కాలం నాటి రెండు శివాలయాలు. ఒకటి నంది కొండలు మొదలున. రెండవది, నంది కొండల మీద ఉన్నాయి. ఈ కొండలపై టిప్పుసుల్తాను వేసవి విడిది కలదు. నిట్రముగా నుండి 2000 అ॥ ఎత్తులో ఒక కొండ వుంది. దాన్ని టిప్పు డ్రాప్ అంటారు. ఆ రోజులలో దోషిగా ఎంచబడిన నేరస్తులు ఈ శిఖరం నుండి క్రిందకు త్రోయబడేవారని చెబుతారు. యీ శిఖరం నుంచి నలుదిక్కులా వున్న గ్రామాలు దివ్యంగా కనిపిస్తాయి. నందిహిల్స్‌లో వాతావరణం వేసవికాలం 29°C నుంచి 23°C వరకు, చలి కాలం 21°C నుంచి 11°C వరకూ, నంది హిల్స్‌కు 28 కి.మీ. దూరంలో సుబ్రహ్మణ్యేశ్వర టెంపుల్ వుంది.

**కోలారు :** (96 కి.మీ.) ఇక్కడ బంగారు గనులు 8000 అ॥ లోతులో వున్నాయి. చాంపియన్ రీఫ్ అనబడే బంగారుగని 9,950 అ॥లోతు కలిగి ప్రపంచంలోకెల్లా లోతయిన గనిగా చెప్పబడుతుంది. ఈ గనులు చూడాలంటే ముందుగా అనుమతి పొందాలి. పది సం॥లోపు పిల్లలను అనుమతించరు.

**ఇతర ప్రదేశములు :** ముత్యాల మడువ జలపాతములు (44 కి.మీ), శివ గంగ వాటర్ స్ప్రింగ్ (160 కి.మీ.) గంగాధరుడు మరియు హన్నీదేవి దేవాలయాలు ఇంకా మెకెడాటు (95 కి.మీ.) మొదలగునవి వున్నాయి.

**ఈ బెంగుళూరు రావటానికి :**

**విమానం ద్వారా :** చెన్నై, ముంబాయి, గోవా, పూనా, అహ్మదాబాద్, న్యూఢిల్లీ, కలకత్తా, హైదరాబాద్, మంగుళూరు, కొచ్చిన్, తిరుపతి, మధురై, కోయంబత్తూరుల నుంచి విమాన సౌకర్యం ఉంది.

**రైలు మార్గం ద్వారా :** ముంబాయి, ఢిల్లీ నుంచి అహ్మదాబాద్ నుంచి, త్రివేంద్రం నుంచి డైరెక్టుగా ట్రైను సౌకర్యం వుంది. ఇంకా అనేక ఎక్స్‌ప్రెస్ సర్వీసుల ద్వారా వివిధ ప్రాంతాల నుంచి ఇక్కడికి రావచ్చు. కావేరి ఎక్స్‌ప్రెస్, నంది ఎక్స్‌ప్రెస్, బృందావన్ ఎక్స్‌ప్రెస్ మొదలగునవి. విజయవాడ, వైజాగ్‌ల నుంచి డైరెక్ట్ రైళ్ళు వున్నాయి.

**రోడ్డు :** ముంబాయి, గోవా, బెల్గామ్, బళ్ళారి, మంత్రాలయం, పుట్టపర్తి, విజయవాడ, ఉడిపి, కొచ్చిన్, చెన్నై, ఎర్నాకులం, కోయంబత్తూరు, సేలం నుంచే కాక ప్రఖ్యాత పట్టణాలు అన్నింటి నుంచి (సౌత్‌లో) ఈ బెంగుళూరుకి బస్సు సౌకర్యాలు, ప్రయివేట్ మరియు ప్రభుత్వ సంస్థల బస్సులున్నాయి.

# AIR TIMINGS
## INDIAN AIRLINES

| | | | DEP. | ARR. |
|---|---|---|---|---|
| IC 951/952 | Ahmedabad | (1,3,5) | 11.55am | 4.40pm |
| CD 537/538 | Kochi | (Daily) | 11.35am | 10.55am |
| IC 772/771 | Calcutta | (Daily) | 09.10 am | 08.15 am |
| IC 913/914 | Calicut | (3,5,7/2,4,6) | 1.15pm | 9.00am |
| IC 804/803 | Delhi | (Daily) | 6.50am | 9.20am |
| IC 903/904 | Delhi | (Daily) | 4.30 pm | 10.20 pm |
| IC 404/403 | Delhi | (Daily) | 7.45 pm | 8.00 pm |
| IC 915/916 | Hyderabad | (Daily) | 10.45am | 10.00am |
| IC 515/516 | Hyderabad | (Daily) | 5.40pm | 5.00pm |
| IC 917/918 | Pune | (1,3,4,5,7) | 11.40am | 3.10pm |
| IC 923/924 | Goa | (2,4,7) | 1.30pm | 4.05pm |
| CD 560/559 | Chennai | (2,4,6,7) | 9.40am | 6.40am |
| IC 914/913 | Chennai | (2,4,6,/3,5,7) | 9.40am | 12.35pm |
| IC 912/911 | Chennai | (1,3,4,7) | 7.00am | 4.45pm |
| IC 924/923 | Chennai | (2,4,6,7) | 4.45pm | 12.45pm |
| IC 952/951 | Chennai | (1,3,5) | 5.20pm | 11.15am |
| IC 106/105 | Mumbai | (Daily) | 8.35am | 7.45am |
| IC 110/109 | Mumbai | (Daily) | 1.50pm | 12.10pm |
| IC 108/107 | Mumbai | (Daily) | 8.45pm | 7.00pm |
| IC 610/609 | Mumbai | (1,4,6,/3,5,7) | 6.00am | 10.0 5 pm |
| IC 610/609 | Mumbai | (3,5,7/2,4,6) | 6.00am | 10.05pm |
| IC 935/936 | Trivandrum | (1,3,5) | 10.10am | 1.05pm |
| CD 559/560 | Mangalore | (2,4,6,7) | 7.10am | 9.05am |
| IC 655/656 | Singapore | (2,4,6/3,5,7) | 10.55pm | 4.10am |
| IC 961/962 | Sharjah | (3,5,7/1,4,6) | 11.00pm | 4.15am |
| IC 977/978 | Muscat | (2,4,6) | 12.05am | 2.40am |

**Days** :1 – Monday, 2 – Tuesday, 3 – Wednesday, 4 – Thursday, 5 –Friday, 6 – Saturday, 7 – Sunday.

**Tel No :** City Office – Reservations (10.00am to 5.35pm) – 141 (10.00am 7.05pm) 2211914, Airport 5.30am – 9.00pm – 140, 5266233

## AIR- INDIA

| | | | | |
|---|---|---|---|---|
| AI 443/111 | Mumbai/Delhi/ London/New York(1) | | 1.30am | - |
| AI 101 | Mumbai/London/New York(2) | | 2.20am | 3.15am |
| AI 101 | Mumbai/London/New York(5) | | 2.20am | 3.15am |
| AI 101/143 | Mumbai/Delhi/Paris (2) | | 2.20am | - |
| AI 440 | Singapore | (1) | 4.15am | 0.02am |
| AI 446 | Singapore | (4) | 4.15am | 1.10am |
| AI 101/123 | Mumbai/London/Chicago (2) | | 2.20am | 3.15 am |
| AI 721 | Dubai | (3) | 4.45am | 11.50pm |
| AI 627/101 | Mumbai/London/New York (6) | | 3.30am | 2.30am |

| | | | | |
|---|---|---|---|---|
| AI 101/127 | Mumbai/London/Chicago (2) | | 2.20am | - |
| AI 728/125 | Mumbai/London/Chicago (7) | | 1.00am | - |
| AI 728/111 | Mumbai/Delhi/ London/New York (7) | | 1.00am | - |
| AI 728/147 | Mumbai/Delhi/Paris (7) | | 1.00am | |

## JET

| | | | | |
|---|---|---|---|---|
| 9W412/411 | Mumbai | (Daily) | 8.30am | 8.00am |
| 9W442/441 | Mumbai | (Daily) | 8.00pm | 7.10pm |
| 9W444/443 | Mumbai | (Daily) | 3.00pm | 11.45am |
| 9W802/801 | Delhi | (Daily) | 8.15am | 9.10am |
| 9W812/811 | Delhi | (Daily) | 7.45pm | 7.30pm |
| 9W446/445 | Chennai | (Daily) | 4.50pm | 10.45am |
| 9W801/802 | Chennai | (Daily) | 9.45am | 7.45am |
| 9W486/485 | Chennai | (Daily) | 8.50pm | 8.20pm |
| 9W445/446 | Pune | (Daily) | 11.15am | 4.10pm |
| 9W443/444 | Mangalore | (Daily) | 12.15pm | 2.15pm |

**Tele Enquiries : 2276620/5550856/57/58**

## GUJARAT AIRWAYS

| | | | |
|---|---|---|---|
| G8 135 | Bangalore – Coimbatore (2,4,6) | 10.25am | 11.10pm |
| G8 136 | Coimbatore – Bangalore (2,4,6) | 11.40am | 12.25am |
| G8 134 | Bangalore – Belgaum (2,4,6) | 1.00pm | 2.25pm |
| G8 133 | Belgaum – Bangalore (2,4,6) | 08.35am | 9.55am |

## SAHARA

| | | | |
|---|---|---|---|
| S2 502 | Bangalore – Delhi | 10.05am | 12.45pm |
| S2 504 | Bangalore – Delhi | 8.50pm | 11.30pm |
| S2 902 | Mumbai – | 10.05am | 11.50am |

## DEPARTURE AND ARRIVAL OF TRAINS FROM BANGALORE CITY

| | | | |
|---|---|---|---|
| No.6231/Thanjavur – Mysore Express | (Daily) | 6.25am | 6.10am |
| No.1017/Kurla Express(Via Hubli) | (1,2,5,6) | 6.00am | 11.20pm |
| No.2678/Coimbatore Intercity | (Daily) | 6.00am | 9.15pm |
| No.229/Mysore Passenger | (Daily) | 5.30am | 11.40am |
| No.6222/Chennai – Mysore Express | (Daily) | 7.15am | 6.35am |
| No.434/Guntur Passenger | (Daily) | 8.15am | 4.35pm |
| No.2607/Lalbagh Express | (Daily) | 6.30am | 9.25pm |
| No.288/Harihara – Shimoga Passenger | (Daily) | 6.30am | 9.20pm |
| No.2430/Rajadhani Express | (1,3) | 6.35pm | 6.55am |
| No.255/Marikuppam Passenger | (Daily) | 6.45am | 5.10pm |
| No.6221/Kaveri Exp | (Daily) | 7.15am | 8.50pm |
| No.271/Salem Pass | (Daily) | 7.30am | 7.00pm |
| No.6338/Cochin – Rajkot Exp | (Sat) | 7.45am | 7.15am |
| No.6336/Nagarcoil – Gandhidham Exp | (Fri) | 7.45am | 7.15am |
| No.292/Hubli chitradurga Pass | (Daily) | 7.55am | 7.15pm |
| No.6023/Chennai Exp | (Daily) | 8.00am | 8.35pm |

| | | | |
|---|---|---|---|
| No.434/Dharmavaram Pass | (Daily) | 8.10am | 4.35pm |
| No.214/Tirupati-Mysore Fast pass | (Daily) | 8.10am | 7.25am |
| No.YS-1/Yelahanka Push-pull | (Except Sun) | 9.30am | 11.10am |
| No.95/Chennai Pass | (Daily) | 10.00am | 7.30pm |
| No.MS-1 Mysore Push-pul | (Except Sun) | 10.05am | 9.15am |
| No.2007/Chennai-Mysore Shatabdi | (Except Tue) | 10.55am | 10.45am |
| No.1014/Kurla Exp (Via) Guntakal | (Daily) | 12.10pm | 11.50am |
| No.1013/Coimbatore-Kurla Exp (Via Gunt) | (Daily) | 11.00pm | 10.05pm |
| No.TS-1 Tumkur pushpull | (Except Sun) | 12.10pm | 4.45pm |
| No.6501/Ahmedabad Exp | (Fri) | 2.00pm | 7.40am (Tue) |
| No.6205/Tippu Express | (Daily) | 2.25pm | 1.45pm |
| No.2639/Brindavan Exp | (Daily) | 2.30pm | 1.20pm |
| No.2726/Hubli Intercity Exp | (Daily) | 2.30pm | 1.50pm |
| No.6521/Quilon Exp | (Tue) | 3.45pm | 9.45am (Thu) |
| No.228/Birur Exp | (Daily) | 3.55pm | 11.25 am |
| No.5092/Ghorakpur Exp | (Wed) | 4.00pm | 10.10 am (Wed) |
| No.233/Mysore Pass | (Daily) | 4.10pm | 9.50pm |
| No.2008/Mysore Chennai Shatabdi. | (Except Tue) | 4.20pm | 4.05pm |
| No.7685/Kacheguda Exp | (Daily) | 5.05pm | 8.55am |
| No.253/Marikuppam Pass | (Daily) | 6.10pm | 9.20am |
| No.6215/Chamundi Exp | (Daily) | 6.15pm | 9.40am |
| No.224/Arsikere Pass | (Except Sun) | 6.15pm | 9.20am (Ex.Sun) |
| No.296/Chikballapur Pass | (Except Sun) | 6.10pm | 9.45am (Ex.Sun) |
| No.2628/Karnataka Exp | (Daily) | 6.25pm | 2.00 pm |
| No.294/Hindpur Exp | (Except Sun) | 6.45pm | 9.15 am |
| No.6337/Rajko-Cochin Exp | (Tue) | 6.40pm | 6.05pm (Tue) |
| No.6335/Gandhidham-Nagarcoil Express. | (Mon) | 6.40pm | 6.05pm (Mon) |
| No.MS-3/Mysore Push pull | (Except Sun) | 7.05pm | 5.45pm |
| No.6506/Swarnajayanthi Exp | (Thu) | 8.45am | 8.30am (Thus) |
| No.6505/Swarnajayanthi Exp | (Sat) | 9.30am | 6.45pm |
| No.8563/Vishakapatnam-Bng Exp | (Fri) | 2.00pm | 7.40am |
| No.6232/Mysore Thanjavur Exp | (Daily) | 7.35pm | 7.00pm |
| No.6590/Rani Chennamma Exp | (Daily) | 8.30pm | 7.25am |
| No.213/Mysore Tirupathi fast pass | (Daily) | 8.15pm | 8.00pm |
| No.6221/Mysore-Chennai Exp | (Daily) | 9.15pm | 8.50pm |

| | | | |
|---|---|---|---|
| No.6529/Udyan Exp | (Daily) | 8.30pm | 8.20am |
| No.6525/Kanyakumari Island Exp | (Daily) | 9.00pm | 4.45am |
| No.6731Madurai Exp | (Daily). | 9.30pm | 7.55am |
| No.6591/Hampi Exp | (Daily) | 10.00pm | 6.45am |
| No.284/Shimoga-Guntakal Pass | (Daily) | 10.10pm | 6.10am |
| No.6007/Madras Mail | (Daily) | 10.30pm | 5.25am |
| No.5626/Guwahati Exp | (1,4) | 11.30pm | 7.50pm (4,5) |
| No.235/Mysore pass | (Dailly) | 11.45 pm | 4.00am |

## BY-PASS TRAINS AT KRISHNARAJAPURAM

| | | | |
|---|---|---|---|
| No.6340/Nagarcoil-Mumbai-Nagarcoil | (2,4,6) | 1.10pm | (1,3,6) 9.45pm |
| No.6332/Trivandrum/ Mumbai/Trivandrum | (Sun) | 1.10pm | (Fri) 9.45pm |
| No.6334/Coimbatore- Rajkot-Coimbatore | (Sun) | 5.20pm | 8.00am (Thurs) |

TELEPHONE ENQUIRIES

General Enquiries .......................................................... 131,132

Recorded Enquiries .......................................................... 133

Contonment Enquiry .......................................................... 135

Interactive voice response system for reservation-related enquiries: 1361(English), 1362(Hindi), 1363 (Kannada)

# ROAD TRANSPORT

Bangalore Bus Station Enquiry .......................................... 2871261

BTS Control Room .......................................................... 2222722

## BANGALORE (CENTRAL) DN.

| | | |
|---|---|---|
| Bangalore-Thirupathi (Ultra-Deluxe) | 7.30am | 12.45pm |
| Thirupathi-Bangalore | 2.00pm | 7.15pm |
| Bangalore-Thirupathi (Ultra-Deluxe) | 10.45am | 4.00pm |
| Thirupathi-Bangalore | 5.00pm | 10.15pm |
| Bangalore-Thirupathi (Super-Deluxe) | 6.00pm | 11.15pm |
| Thirupathi-Bangalore | 7.00am | 12.15pm |
| Bangalore-Thirupathi (ultra-Deluxe) | 10.00am | 3.45pm |
| Thirupathi-Bangalore | 11.15pm | 5.00am |
| Bangalore-Thirupathi (Super-Deluxe) | 8.15am | 1.30pm |
| Thirupathi-Bangalore | 3.15pm | 8.30pm |
| Bangalore-Thirupathi (Super-Deluxe) | 10.40pm | 3.55am |
| Thirupathi-Bangalore | 10.15am | 3.30pm |
| Bangalore-Puttaparthy (Super-Deluxe) | 11.45am | 8.25pm |

| | | |
|---|---|---|
| Puttaparthy-Bangalore | 5.00pm | 7.15pm |
| Bangalore-Ooty (Ultra-Deluxe) | 5.45am | 10.00pm |
| Ooty-Bangalore | 8.30am | 4.15pm |
| Bangalore-Ooty (Ultra-Deluxe) | 10.00pm | 5.45am |
| Ooty-Bangalore | 5.45pm | 10.00am |
| Bangalore-Hyderabad-Bidar (Ultra-Del) | 5.30pm | 8.30am |
| Bidar-Hyderabad-Bangalore | 5.00pm | 8.00am |
| Bangalore-Ernakulam (Super-Deluxe) | 6.00pm | 8.30am |
| Ernakulam-Bangalore | 8.00pm | 11.00am |
| Bangalore-Ernakulam (Super-Deluxe) | 7.30pm | 10.00am |
| Ernakulam-Bangalore | 6.00pm | 8.30am |
| Bangalore-Manthralayam (Ultra-Deluxe) | 8.00pm | 4.30am |
| Manthralayam-Bangalore | 6.00pm | 7.15pm |
| Bangalore-Kolhapur (Super-Deluxe) | 8.15pm | 9.45am |
| Kolhapur-Bangalore | 4.00pm | 5.30am |
| Bangalore-Coimbatore (Ultra-Deluxe) | 10.00am | 7.00pm |
| Coimbatore-Bangalore | 10.30pm | 7.00am |
| Bangalore-Coimbatore (Ultra-Deluxe) | 6.30pm | 3.00am |
| Coimbatore-Bangalore | 6.30am | 3.30pm |
| Bangalore-Panaji (Super-Deluxe) | 3.30pm | 5.15am |
| Panaji-Bangalore | 3.30pm | 5.15am |
| Bangalore-Panaji (Super-Deluxe) | 4.45pm | 6.45am |
| Panaji-Bangalore | 5.30pm | 7.30am |
| Bangalore-Kodaikanal (Ultra-Deluxe) | 8.00pm | 7.55am |
| Kodaikanal-Bangalore | 6.00pm | 5.55am |
| Bangalore-Madurai (Super-Deluxe) | 7.30am | 12.45pm |
| Madurai-Bangalore | 2.00pm | 7.15pm |
| Bangalore-Hyderabad (Ultra-Deluxe) | 7.15pm | 6.45am |
| Hyderabad-Bangalore | 7.30pm | 7.00am |
| Bangalore-Chennai (Super-Deluxe) | 9.30pm | 5.15am |
| Chennai-Bangalore | 9.45pm | 5.30am |
| Bangalore-Chennai (Super-Deluxe) | 10.15pm | 6.00am |
| Chennai-Bangalore | 10.15pm | 6.00am |

## RENT-A-CAR

Apace Rent-a-car ........................................................ 5599645
Car Rental Service ........................................................ 2273733
Cauvery Car Rentals ........................................................ 2239054
Citicabs ........................................................ 2241907
Classic Caps ........................................................ 3334544
Comfort Travel links ........................................................ 3343233
Dial-a-car ........................................................ 5272622
Deepak Travels ........................................ 5544752/5544753
India Cabs ........................................................ 628205

| | |
|---|---|
| East West | 2203377 |
| Europcar | 2219502 |
| Hertz | 5599408 |
| Enterprises | 5273196 |
| Travel Aids | 568888 |
| Travel links | 2864141 |
| Wheels Rent-a-car | 2866847 |

Tourist Information

| | |
|---|---|
| KSTDC | 2212901 |
| City Railway Station | 2870068 |
| Govt. of India Tourist Office | 5585417 |
| India Tourism Dev. Corporation | 2261048 |

ఈ బెంగుళూర్ నుంచి వివిధ రాష్ట్రాలలోని ప్రాంతాలకి దూరం కి.మీ.లలో : అహ్మదాబాద్ 1,515 కి.మీ., అలహాబాద్ 1,650, అమృతసర్ 2,458, కలకత్తా 1,886, చండీఘర్ 2,270, కొచ్చిన్ 550, కోయంబత్తూరు 365, కటక్ 1,450, బెల్గామ్ 507, భోపాల్ 1,382, ముంబాయి 1,035, ఢిల్లీ 2020, డెహ్రాడూన్ 2,208, హైదరాబాదు 565, జైపూర్ 2050, జమ్ము 2600, లక్నో 1,905, చెన్నై 334, మధురై 435, మైసూర్ 138, మంగుళూర్ 345, నాసిక్ 1,035, నాగపూర్, 1,035, విశాఖపట్నం 1,005, వారణాసి 1,765, విజయవాడ 635, త్రివేండ్రమ్ 218, తిరుచ్చి 370, తిరుచూరు 470, తిరుపతి 260, తంజావూరు 425, సిమ్లా 2,390, శ్రీనగర్ 2,915, సేలమ్ 297, రామేశ్వరం 600, పాండిచ్చేరి 305, పూనా 840, పానాజీ 575, నెల్లూరు 390 కి.మీ.

**బెంగుళూరులో హిందూ దేవాలయములు**

బానాశంకరి ఆలయం
బుద్ధ విహార్
బుల్ టెంపుల్
మురుగన్ ఆలయం
పార్శి గుడి
రామకృష్ణ ఆశ్రమం
రామ మందిరం
శ్రీ ఆంజనేయస్వామి గుడి
ధర్మరాజ ఆలయం
జైన ఆలయం
మల్లిఖార్జునస్వామి ఆలయం
శ్రీ రాఘవేంద్ర స్వామి గుడి
శ్రీ వెంకటరమణ స్వామి స్వామి ఆలయం
శ్రీ సత్యనారాయణ ఆలయం
వరప్రసాద వేంకటేశ్వర ఆలయం

## కెమ్మనగుడి

ఈ కెమ్మనగుడి దగ్గరిలో వున్న ఎయిర్‌పోర్ట్ బెంగుళూరు (526 కి.మీ.) దగ్గరిలో రైల్వేస్టేషన్ తారికేరి 35 కి.మీ. ఇక్కడ్నించి భద్రావతి 55 కి.మీ. చిక్‌మగ్‌ళూర్

64 కి.మీ. ఈ కెమ్మనగుడిలో వాతావరణం వేసవికాలం 28°C నుంచి 20°C వరకు చలికాలం : 20°C నుంచి 8°Cల వరకు.

బెస్ట్ సీజన్ అక్టోబరు, జూన్ .... ఈ కెమ్మనగుడిలో దర్శించదగ్గవి.

**గార్డెన్స్ :** హార్టికల్చరల్ డిపార్టుమెంట్ వారిచేత లెక్కలేనన్ని రకాల కూరగాయలు మరియు పూల మొక్కల వనాలు పెంచబడ్డాయి. వాటిని యిక్కడ చూడవచ్చు. రాజభవన్ స్టోర్సులోని రోజ్ గార్డెన్లో వివిధ రకాలయిన గులాబీలను, మల్లెలను, ఇతర పూలను చూడవచ్చు.

**హెబ్బిఫాల్స్ :** కెమ్మనగూడి నుంచి 9 కి.మీ. ఈ వాటర్ ఫాల్స్ ఒకే ధారతో 120 మీటర్ల లోతులో పడుతుంది. ఇంకొక స్టేజీలో 60.5 మీటర్ల లోతులో ఇదే ధార పడుతుంది. జీపుపట్టే రోడ్డులో ఈ పాయింట్ వుంది. ఈ ఫాల్స్‌కి దారి సన్నని దారి, మరియు లోతయినది. ఈ పరిసరాల్లో దర్శించదగ్గవి Z వ్యూ పాయింట్ మరియు శాంతి ఫాల్స్ 3 కి.మీ. దూరములో వున్నాయి. మరో ఆకర్షణ మౌంటెన్సు దగ్గర్నించి పూతిల్స్ దగ్గరికి రోప్‌వే సిస్టమ్‌ని శ్రీ యం. విశ్వేశ్వరయ్య, ఆర్కిటెక్చర్ వారు డిజైను చేశారు. ఇక్కడ మంచి ఇనుము దొరికే ఖనిజాలు వున్నాయి. రోప్‌వే సిస్టమ్ ద్వారా మట్టితో కలిపిన లోహాన్ని తరలిస్తారు.

## కెమ్మనగుడి పరిసరాల్లో

**కెలహట్టిటి ఫాల్స్ :** కెమ్మనగుడికి 10 కి.మీ. దూరములో వున్నాయి. ఈ జలపాతాలు తారికేరి వెళ్ళేదారిలో వున్నాయి. అక్కడ నీరు చంద్రద్రోణ కొండ మీద నుంచి 45 మీటర్ల ఎత్తు నుంచి పడుతుంది. విజయనగర కాలం నాటి రాజు కృష్ణదేవరాయలచేత 16వ శతాబ్దంలో కట్టించిన వీరభద్రేశ్వర ఆలయం ముందు నుంచి యీ నీరు ప్రవహిస్తుంది.

**జాగర్‌వ్యాలి :** 11 కి.మీ. దూరం కెమ్మనగుడికి. 174 స్క్వేర్ కి.మీ. విస్తీర్ణములో శాంక్చువరి వుంది. ప్రమాదకరమైన జంతువులని చూడొచ్చు. సీజను నవంబరు నుంచి మే వరకూ. జీపు వెళ్ళటానికి 72 కి.మీ. రోడ్డు వుంది. ఆ దారిలో జీపులోవెళ్లి చూసి రావచ్చు ఈ శాంక్చువరిని.

**బాబాబుడన్‌రేంజి :** చిక్‌మగుళూర్ జిల్లాకి ఉత్తరం వైపున వుంది. అనసూయ, అత్రి ఈ ప్రదేశములోనే పాప పరిహారం చేసుకొని తపస్సు చేసుకున్నది. దగ్గరిలో గుహ వుంది.

కెమ్మనగుడిలో గణేష్ టెంపుల్, వీరభద్రేశ్వర ఆలయాలు వున్నాయి. వసతికి హార్టికల్చరల్ డిపార్టుమెంటు గెస్ట్‌హౌస్ వుంది. వసతి కావలసినవారు స్పెషల్ ఆఫీసర్,

కె.ఆర్.హిల్ స్టేషను, కెమ్మనగుడి. ఫోన్ : 26 నుంచి గాని, డైరెక్టర్ హార్టికల్చరల్, లాల్‌బాగ్, బెంగుళూరు. ఫోన్ : 602231 నుంచి గాని పొందవచ్చు.

ఇంకా టూరిస్టు హోం, "రాజ్‌భవన్" ఫోన్ : 34

# మైసూర్

బెంగుళూరు నుంచి 159 కి.మీ. ఈ నగరాన్ని చూడటానికి బెస్ట్ సీజను సెప్టెంబర్, అక్టోబరు. ఈ శాండిల్‌వుడ్ సిటీలో బ్రహ్మాండమైన భవనాలు, సుందర ఉద్యానవనాలు, ఆధ్యాత్మికమైన అనుభూతిని మిగిల్చే దేవాలయాలు వున్నాయి. 1827లో నిర్మించిన చాముండేశ్వరాలయము దర్శించదగ్గది. ఈ దేవాలయానికి ఒడయారు మహారాజు బంగారు నక్షత్రమాల సమర్పించారు. అక్కడే ఆ రాజు, రాణి విగ్రహాలను చూడొచ్చు.

**మహారాజావారి భవనం :** 1911-12లో ఇండోసార్సనిక్ నిర్మాణ శైలిలో నిర్మించబడినది. ఈ మహారాజ భవనం సముద్ర మట్టానికి 2,500 అడుగుల ఎత్తులో వుంది. ఈ భవనములో వెండి, బంగారు లోహాలను అనేకచోట్ల తాపడం చేశారు. సుందరమైన అద్దాల మందిరముంది. అప్పటి రాజులు వాడిన అనేక ఆయుధాలు, దుప్పటి, దుస్తులు, శిల్పాలు అనేకమున్నాయి. ఇది అప్పట్లో అంటే ఈ శతాబ్దం మొదట్లో 42 లక్షలు ఖర్చుపెట్టి నిర్మించారు. ఇక్కడ 200 కేజీల బంగారు సింహాసనము స్వచ్ఛమైన రాళ్ళను పొదిగి చేసిన దాన్ని చూడొచ్చు. ఆదివారము రోజు గొప్పగా ప్రకాశించేలా అలంకరిస్తారు ఈ భవనాన్ని.

**చాముండి హిల్స్ :** మైసూరు నుంచి రోడ్ ద్వారా 10 కి.మీ. కొండ ఎక్కి వెళితే 4 కి.మీ. ఇక్కడి దేవత చాముండేశ్వరి. ఈ చాముండేశ్వరి దేవాలయపు కొండ మీదకి ఎక్కటానికి 1000 మెట్లు వున్నాయి. దారిలో 16 అడుగులు ఎత్తు 25 పొడవుగల నంది విగ్రహం చూడొచ్చు. ఈ నంది విగ్రహాన్ని ఒకే రాతితో నిర్మించారు. చాముండేశ్వరి దేవికి తెప్పోత్సవం దసరా తర్వాత జరుగుతుంది. టెంపుల్‌ని దర్శించటానికి సమయం 9 నుంచి 12 వరకూ ఉదయం పూట సాయంత్రం 5 నుంచి 9 వరకూ. మైసూరు సెంట్రల్ బస్‌స్టాండు నుంచి ఈ దేవాలయానికి అనేక బస్సులున్నాయి.

**బృందావన్ గార్డెన్స్ :** మైసూరు సిటీకి 19 కి.మీ. దూరములో వున్నాయి. ఈ అద్భుతమైన వనాలు. ఈ బృందావన్ గార్డెన్స్ కృష్ణరాజసాగర్ డామ్‌వి మొదటి నుంచి అనుకొని వున్నాయి. ఈ డామ్ 24 అ॥ పొడవుతో 130 స్క్వేర్ కి.మీ. పరిధిలో ఇండియాలోవున్న పెద్ద డామ్‌లలో ఒకటి. ఈ బృందావన్ గార్డెన్స్‌లో అడుగడుగునా

పూలచెట్లు, ఫౌంటెనులు కానవస్తాయి. ఎటు చూసినా సుందర దృశ్యాలే. రాత్రిపూట మిరుమిట్లు గొలుపుతూ భూమి మీద వున్న స్వర్గమా లేక గంధర్వ లోకమా అని అనిపిస్తుంది. ఇక్కడ బోటింగ్ చేయవచ్చు. ఈ బృందావన్ గార్డెన్సులో మరో ఆకర్షణ మ్యూజికల్ ఫౌంటెన్ లోంచి నీరు వస్తుంటే. దానికి అనుగుణంగా వెనుక మ్యూజిక్ వస్తుంది.

వేల లైట్ల కాంతితో ఈ గార్డెను మెరిసిపోతూ వుండే సమయం మామూలు రోజుల్లో 7 నుంచి 8 వరకూ, శెలవు రోజుల్లో 7 నుంచి 9 వరకూ రాత్రి పూట.

**చామ రాజేంద్ర ఆర్టు గ్యాలరీ :** దీన్ని జగన్మోహన ఆర్టు గ్యాలరీ అంటారు దీనిలో ప్రఖ్యాతి చెందిన రవివర్మ చిత్రాలను చూడొచ్చు. ఏనుగుదంతం తోటి, శాండిల్ వుడ్‌తోనూ, మెటల్‌తోనూ చేసిన వస్తువులున్నాయి. అప్పటికాలం నాటి సంగీత వాయిద్య పరికరాలు కూడా వున్నాయి. ఇందులోకి ప్రవేశించటానికి సమయం ఉదయం 8 నుంచి 12 వరకూ తిరిగి లంచ్ తర్వాత 2.30 నుంచి ఆరు వరకూ.

**జ్యూయలాజికల్ గార్డెన్సు :** ఇక్కడ 2000 జంతువులున్నాయి. ఉదయము 7-30 నుంచి 12 వరకు తిరిగి లంచ్ తర్వాత 2-30 నుంచి 6 వరకూ ఇక్కడ అత్యంత ప్రమాదకరమైన విష జంతువు కింగ్ కో బ్రాని చూడొచ్చు.

**ఇతర ప్రదేశాలు :** గవర్నమెంట్ సిల్క్ ఫ్యాక్టరీ, శాండల్‌వుడ్ ఆయిల్ ఫ్యాక్టరీ, శ్రీ చామరాజేంద్ర టెక్నికల్ ఇనిస్టిట్యూట్, కావేరి ఆర్ట్సు అండ్ క్రాఫ్టు ఎంపోరియం. మానస గంగోత్రి మొదలగునవి.

ఈ మైసూరు నుండి సైట్ సీయింగ్ ట్రిప్పులు వుంటాయి. ఇక్కడ్నించి బేలూరు - హాళిబేడు, శ్రావణ బెళగోళ, ఊటీ లాంటి ప్రదేశాలను లోకల్ టూరిస్టు బస్సులలో ప్రయాణించి తిరిగి రాత్రికి మైసూరు చేరుకోవచ్చు.

## మైసూరు చుట్టు ప్రక్కల ప్రదేశాలు

**బండిపూర్ వన్యమృగ రక్షణ కేంద్రం :** 80 కి.మీ. దూరము. మైసూరు - ఊటీ రోడ్‌లో వుంది. ఇది తమిళనాడులోని మధుమలై శాంక్చువరిని, కేరళలోని పెరియారు శాంక్చువరిని పోలియున్నది. అడవిదున్న, దుప్పి, ఏనుగులు, పులులను, చిరుతపులులను చూడవచ్చు. ఈ శాంక్చువరి "ప్రాజెక్ట్ టైగరు" కి అంకితమివ్వబడింది. ఫారెస్టు డిపార్టుమెంటు వారు జీపులను, ట్రక్కులను, ఏనుగులను శాంక్చువరి లోపల తిరిగి చూచుటకు అవకాశము కల్పిస్తారు. ఇక్కడ బోటింగ్ సౌకర్యం కూడా వుంది. అక్టోబరు నుంచి మే వరకు చూడటానికి శ్రేష్టమైన సమయము. అక్కడ వసతి, ప్రయాణమునకు

కాంక్సువరి లోపల వున్న ఫీల్డు డైరెక్టరు, ప్రాజెక్ట్ టైగరు, గవర్నమెంట్ హౌస్ కాంప్లెక్స్, మైసూరు వారిని సంప్రదించవచ్చు. ఫోన్ : 20901.

**రంగనాధిట్టు పక్షుల రక్షణా కేంద్రం :** ఈ పక్షుల రక్షణా కేంద్రం 675 హెక్టార్ల స్థలమును ఆవరించి వున్నది. కావేరి నది యొక్క మూడు చిన్న దీవులలోని ఒక దీవిలో ఈ రక్షణ కేంద్రముంది. ఇది సంవత్సరం పొడుగునా చూడదగ్గ ప్రదేశమయినా, జూన్ నుంచి సెప్టెంబరు వరకు రకరకాల పక్షులను వీక్షించవచ్చు.

**ఇతర ప్రదేశములు :** బిలిగిరి రంగన్ కొండలు సముద్ర మట్టానికి 5,091 అడుగుల ఎత్తులో మైసూరు నుంచి 80కి.మీ. దూరంలో వున్నాయి. శివసముద్రము జలపాతాలు మైసూరు నుంచి 80 కి.మీ. దూరములో వున్నాయి.

## శ్రీరంగపట్నం

మైసూరు నుంచి 16 కి.మీ. దూరము. ప్రఖ్యాతి చెందిన రంగనాథస్వామి ఆలయముంది. ఇక్కడ స్వామి శ్రీరంగనాధుడు, ఆదిశేషుని మీద పవళించి వుంటారు. స్వామి పాదాల చెంత గౌతమి మహర్షి చిత్రముంది. కావేరినది పట్నం చుట్టూ ప్రవహిస్తుంటుంది.

ఇక్కడ టిప్పుసుల్తాన్ వేసవి విడిది భవనముంది. హైదర్ ఆలీ ఆయన భార్య సమాధులున్నాయి. ఇక్కడున్న దుర్గము లోపల బ్రిటీషు ఆఫీసర్లను ఉంచిన చెఱసాలను చూడచ్చు. 19వ శతాబ్దంలో ఫ్రెంచి బాటసారి అచ్చిదుబయిన్ యొక్క చిన్న గుడి వుంది. శ్రీరంగపట్నాన్ని 1120లో ఉదయాదిత్యుడు కట్టించాడు.

## సోమనాథ్‌పూర్

మైసూరు నుంచి 45 కి.మీ. దూరం. ఇక్కడ ఆలయము త్రిమూర్తులది. చెన్నకేశవస్వామి, జనార్ధనుడు, వేణుగోపాలస్వామి ఆలయాలున్నాయి. దేవాలయాల మీద అనేక చిత్రాలు చెక్కబడి వున్నాయి. రామాయణ, మహాభారత, భాగవతానికి చెందినవే కాక హోయసల రాజుల చరిత్ర కూడా అద్దంపట్టేలా హాళీబేడు, బేలూరు శిల్పకళను మరిపించేలా వుంటాయి శిల్పాలు.

## శివసముద్రం

ఇక్కడ పరవళ్ళు తొక్కే కావేరి రెండుగా చీలి 200 అడుగుల ఎత్తు నుండి క్రిందకు దుముకుతుంది. అప్పుడే రెండు పాయలుగా ఏర్పడుతుంది. ఆ రెంటి మధ్య వున్నదే శివ సముద్ర పట్టణం. గొప్ప జలవిద్యుత్ కేంద్రముంది. పర్మిషనుతో చూడవచ్చు.

# బేలూరు దేవాలయము

ఇప్పుడు బేలూరు కుగ్రామం. పురాతన కాలంలో ఇది పెద్ద రాజ్యానికి రాజధాని. ఆ కాలములో ఈ రాజ్యాన్ని యాదవరాజులు పరిపాలించారు. యాదవ రాజులు మొట్టమొదట చాళుక్యుల వారి ఆధీనంలో వుండేవారు. తర్వాత స్వతంత్రులైనారు. తర్వాత దక్షిణ భారతదేశంలో చోళులు మరియు పాండ్యులు యాదవులపై ఆధిక్యత పొందారు.

యాదవరాజుల్లోని విష్ణువర్ధనుడు చాళుక్యులను తుదముట్టించాడు. విష్ణు వర్ధనుడు చెన్నకేశవుని ప్రధాన ఆలయాన్ని నిర్మించాడని చెబుతారు. ఈ రోజుకి కూడా వేలాది భారతీయులు, మరియు విదేశీయులు ఈ దేవాలయం యొక్క శిల్ప కళను సందర్శించుటకు విచ్చేయుచున్నారు. ఈ దివ్య ప్రదేశమునకు -

ఆర్ట్స్ కాలేజి విద్యార్థులు ఈ అద్భుతమైన శిల్పకళను చూడక మానరు. ఒక్కోసారి వీరు కొన్ని వారాల పాటు ఆమూలాగ్రం ఈ శిల్పకళ గురించి తెలుసుకొనుటకు వుండిపోతారు.

పక్షులు, జంతువులు, నాట్యకత్తె మరియు ఇతర చిత్రములు పూర్తిగా అలంకరింపబడి జీవకళ వుట్టి పడుతున్నట్టుగా వివిధ భంగిమలలో వున్నాయి. ఇక్కడి శిల్పాలు.

తల్‌కండ మీద విజయం సాధించినందుకు గుర్తుగా విష్ణువర్ధనుడు ఈ ఆలయాన్ని నిర్మించారని అక్కడ వ్రాసిన శాసనాల ద్వారా చెప్పబడుతోంది.

అలాగే కొన్ని చోట్ల వ్రాయబడిన దాన్ని బట్టి విష్ణువర్ధనుడు శ్రీ రామానుజాచార్యుల సలహా మేరకు వైష్ణవ మతాన్ని స్వీకరించి అందుకు గుర్తుగా ఈ దేవాలయాన్ని నిర్మించారని కూడా చెప్పబడుతుంది.

లోపల అందంగా చెక్కబడ్డ స్థంభాలు, కప్పు మరియు మూడు ద్వారాలు విష్ణువర్ధమని కాలంలోనే చెక్కబడ్డాయి. గర్భ గృహం భాగము నక్షత్రాకారంలో ఇటుక మరియు సున్నముతో నిర్మించబడి దానిచుట్టూ వడ్రంగి పని మరియు బంగారపు పూతపూసిన రాగి రేకులతో అలంకరించబడి వున్నది. విజయనారాయణ అని పిలవబడే కేశవుని విగ్రహము క్రీ.శ 1117లో స్థాపించబడినది. విష్ణువర్ధనుని పట్టమహిషి అయిన శంతలాదేవి జైన మతమును అభిమానించినప్పటికీ వైష్ణవ సంప్రదాయాలతో నిర్మించబడుతున్న ఈ ఆలయపు పనుల్లో పాలుపంచుకునేది.

పిమ్మట రెండవ వీరబలుడు 1175 క్రీ.శ.లో వసుదేవ తీర్థ అనే చక్కని తటాకాన్ని ముఖ్య దేవాలయంనకు ఈశాన్యమున నిర్మించారు.

తుగ్లక్‌లు దండెత్తి ఈ రాజ్యంపై వచ్చినప్పుడు సింహద్వారమును తగలబెట్టారు. గంగాసలార్ తగలబెట్టిన ఈ ద్వారపు స్థలంలో రెండవ హరనాథ్ గారి జనరల్ గుండా క్రీ.శ. 1397 లో ఏడంతస్థుల గోపురాన్ని నిర్మించారు.

తూర్పు ద్వారం మొదలుకొని ఉత్తర దక్షిణ ద్వారాలకు వెళుతుంటే విగ్రహాలు ఆ పిట్టగోడలపై క్రిందనుంచి పైకి ఈ క్రిందరాసిన విధంగా చెక్కబడివున్నాయి.

వేల ఏనుగులు వివిధ భంగిమలలో చిత్రించబడ్డాయి. కాగితం చుట్టబడిన ఆకారంలో తీగలు తీగలుగా చుట్టబడి మధ్యలో గుండ్రని ఆకారంతో బొమ్మలు చెక్కబడివున్నాయి. శృంగారమైన భంగిమలు, మహాభారత రామాయణ చరిత్రను చెప్పే వివిధరకాల దృశ్యాలు మొదలగునవి ఇక్కడ వరుసగా చూడచ్చు.

**తూర్పు దిక్కున ద్వారం దగ్గరవున్న శిల్పాలు**

1117 శతాబ్దంలో ఈ ఆలయాన్ని నిర్మించిన విష్ణువర్ధనరాజు దర్బారుని, రాక్షసులరాజు బలి, వామనుడికి వరాలు ఇవ్వటం విష్ణువు అవతారం, కృష్ణుడి కాళింగ మర్దనము, విష్ణువు గరుడవాహనుడై వుండడం శివుడు నందిమీద వున్న వైనాన్ని, తూర్పు దిక్కున ఎడమవైపున వున్న ప్రహ్లాదుడి కథని శిల్పాలలో చూడచ్చు. ఇంకా విష్ణువర్ధనుడి కుమారుడి దర్బారు హాలు చూడచ్చు. ఇక్కడ అమృతం కోసం చేసిన సముద్ర మధనం, కృష్ణుడు కంసుని చంపే వైనం చుట్టుకొని వున్న పాము మీద శ్రీ రంగనాథస్వామి పరుండిన దృశ్యాన్ని చూడచ్చు.

గుడికి కార్నర్‌లో 42 శిల్పాలు దానిలో 38 ఆలయం బయటవైపుకి 4 లోపలవైపుకి ఉన్నాయి.

**బ్యూటీ మిర్రర్** : ఒక అమ్మాయి చేతిలోవున్న అద్దంలో తన అందాలను చూసుకుంటూ వుంటుంది.

**పెట్ పెరట్** : అమ్మాయి మోచేతి మీద చిలుక నుంచుని ఉంటుంది. ఆ దృశ్యం తన పెంపుడు చిలుకతో సంభాషించుచున్నట్లు వుంటుంది. ఓ సుందర అతివ తన అందాలను ఈకల కుంచెతో మరింత ద్విగుణీకృతం చేసుకున్నట్టు వుండే భంగిమ. చీర కట్టుకుంటున్న ఆమె చీర అంచుని కోతిలాగటం ఇంకా పిట్టని బాణంతో కొడుతున్న పల్లెపడుచు ఇంకో శిల్పంలో తల స్నానం తర్వాత జుట్టుని ఆరబెట్టుకోవటం ఆపై అలంకరణ సామాగ్రి, పుష్పాలను చెలికత్తెలు అందించే దృశ్యం త్రిభంగి నృత్యం చేస్తున్న భంగిమ ఈ భంగిమ చాలా కష్టమైనది. ఇప్పటికి ఏ నాట్యకత్తె అలాంటి భంగిమని చెయ్యలేదు, ఈ భంగిమలో ఆ అమ్మాయి వయ్యారంగా తన శరీరాన్ని మూడుచోట్ల వంచుతూంది.

మరో శిల్పం డ్రమ్స్ కొడుతున్న భంగిమ. ఈ భంగిమ చాలా నేచురల్‌గా కనిపిస్తుంది. ఇలా ప్రతి ఒక్కటీ అవి శిల్పాల్లా కాకుండా సజీవంగా వున్నట్టు అనిపిస్తుంది.

ప్రతి చెక్కడం జీవం పోసుకొని మనముందు వున్నట్లు అన్పించకమానదు. అప్పటి శిల్పకళ ప్రతిభకు ఈ ఒక్క శిల్పం చాలు. ఓ అమ్మాయి చిరునవ్వు చిందిస్తూన్న శిల్పంలో ఆమె పలువరసని కూడా చూడవచ్చు. ఇంకో శిల్పం తన జుట్టుని ముడిగా వేసుకుంటున్న భంగిమ. ఆ భంగిమని చూసినా ఆ శిల్పాన్ని చూసిన ఎవరికయినా గుర్తువచ్చేది. అప్పటి ఫ్యాషన్ పోనిటైల్..

ఇప్పటి నాగరికతను అప్పట్లో ఊహించిన వారి ప్రతిభ ఆ కళాకౌశలం అద్భుతం. అనితర సాధ్యం. బేలూరు శిల్పకళ గురించి చెప్పటంకంటే వ్రాసింది చదువుకోవటంకంటే ఈ రెండు కనులతో చూస్తేనే అక్కడి కళ మనసుని తాకుతుంది.

వసతికి గవర్నమెంట్ టూరిస్టు కాటేజి వుంది.

## హాళిబేడు

బేలూరు నుంచి 14 కి.మీ. దూరం. బెంగుళూరు నుంచి 185 కి.మీ. 12, 13 శతాబ్దాలలో కోసలరాజు కాలంలో ఈ హాళిబేడు రాజధాని, ఆలయ ప్రాంగణంలో ఆర్కియాలాజికల్ మ్యూజియం వుంది. ఇక్కడ ఆనాటి చిహ్నాలను చూపే ఎన్నో వస్తువులున్నాయి.

ఈ హాళిబేడులో దేవాలయాలు హోయసలేశ్వరాలయం. ఇది శివుని ఆలయం. ఇక్కడ అపూర్వమైన శిల్పకళ నాట్యం ఆడుతూ వుంటుంది.

స్టేట్ గవర్నమెంటు 30 సంవత్సరాల క్రితం అభివృద్ధి చేశారు. చక్కటి ప్రశాంత వాతావరణం, ఈ హోయసలేశ్వరాలయానికి బేలూరు, అరసకేరి నుంచి బస్సులున్నాయి.

ప్రపంచ ప్రఖ్యాతిచెందిన ఈ ఆలయాన్ని చూడటానికి దేశం నలుమూలల నుంచే కాక విదేశీయులు కూడా వస్తారు. యాత్రికుల కోసం ఆర్కియాలాజికల్ డిపార్టుమెంటు వారు గైడులను నియమించారు. అవసరమైన సంప్రదించవచ్చును ఆ డిపార్టుమెంటుతో.

దేవాలయం మీద వున్న శిల్పకళ శాస్త్రాలు వాటి ప్రాముఖ్యతను చాటి చెబుతుంది. ఒక మనిషి తన పరిధినిబట్టి ఇక్కడి శిల్పాలలోని విజ్ఞాన విషయ పరిధిని అవగాహన చేసుకోగలరు. వసతికి గవర్నమెంట్ టూరిస్ట్ కాటేజి వుంది.

**హోయసలేశ్వర టెంపుల్ :** ఈ ఆలయం చూపులను ఆకట్టుకొనే విధంగా వుంటుంది. ఆలయం ప్లాట్‌ఫాంపై నుంచుని చూస్తే దేవాలయంవైపుగా చూస్తున్న రెండు నందులు కనబడతాయి. తూర్పు దిక్కునవున్న గణేషుడి విగ్రహం కూడా కనిపిస్తుంది.

పెద్ద ఆలయంలో రెండు ఆలయాలు వున్నాయి. మొత్తం గుడికి నాలుగు ద్వారాలున్నాయి. ఇక్కడ ఆలయంలోని శిల్పాలు బేలూరు ఆలయంలో వాటికన్న పెద్దవి. కొన్ని శిల్పాలు రాతికి రెండు వైపులా రెండు విభిన్న భంగిమలతో చెక్కబడి కనిపిస్తాయి. బేలూరు ఆలయాన్ని దర్శించినవారు ఈ హళిబేడు ఆలయాన్ని తప్పక దర్శిస్తారు.

ఈ హళిబేడులో హిందూ దేవాలయాలు కేదారేశ్వర టెంపుల్, జైనమందిరం రంగనాథ్ ఆలయం. ఇది టౌను మధ్యలో వుంది. ఇక్కడి హోయసలేశ్వర ఆలయాన్ని విష్ణువర్ధనుడి మంత్రి కేతుమల్లు 1121 సం॥ నిర్మింపచేశాడు.

ఈ ఆలయాన్ని నిర్మించటానికి 105 సంవత్సరాలు పట్టింది. ఇప్పటికీ చెయ్యవలసిన పని ఈ ఆలయంలో వుంది. తూర్పు వైపున వున్న ఆలయంలో స్వామి సంతలేశ్వరుడు. దక్షిణవైపున ఆలయంలో హోయసలేశ్వరుడు. ఇక్కడ ఈ స్వాములు లింగాకారంలో వుంటారు. ఈ లింగాకారాల ముందు చిన్న చిన్న నందులున్నాయి. బైట మండపాల్లో పెద్ద నందులు వున్నాయి. ఈ నందుల మెడ చుట్టూ రాతి ఆభరణాలు వున్నాయి. చివర మండపంలో పెద్ద నంది వెనుక సూర్యనారాయణుడు ఏడు గుర్రాలను పట్టుకొని కనిపిస్తాడు.

ఈ మొత్తాన్ని కలిపి కేతుమల్లు ఒక ఆలయంగా చేశాడు. ఈ ఆలయం భారతదేశ వాస్తుకళకు అద్దం పట్టేలా శాస్త్ర ప్రకారం ఉంటుంది.

**కేదారేశ్వర ఆలయం :** ఈ ఆలయాన్ని అభినవకేతలాదేవి నిర్మించారు. ఈ ఆలయం పెర్గుసన్ అనే ఆయనచేత 'జమ్ ఆఫ్ ఇండియన్ ఆర్కిటెక్చరల్' అని కొనియాడబడింది.

**బసడిహల్లి :** (జైన మందిరం) హోయసలేశ్వర ఆలయానికి రెండు ఫర్లాంగుల దూరంలో మూడు జైన ఆలయాలు బసడిహల్లికి దక్షిణ దిక్కుగా ఉన్నాయి. ఈ ఆలయాల్లో అన్నింటికన్న పార్శ్వనాథస్వామి ఆలయం ముఖ్యమైనది. హళిబేడులో ఉన్న శిల్పకళ పనితనాన్ని ఈ ఆలయం కట్టిన విధానంలో చూడచ్చు. 12 పిల్లర్స్ వున్నాయి. ఈ కట్టుబడి ఆకర్షణీయంగా ఉంటుంది. మన నీడను ఆ పిల్లర్స్‌లో చూసుకోవచ్చు. నల్లరాతితో పార్శ్వనాథస్వామి విగ్రహాన్ని తయారు చేశారు. ఈ విగ్రహం ఎత్తు 14 అడుగులు. విగ్రహం తలమీద ఏడు తలలపాము వుంటుంది.

**శ్రీ రంగనాథస్వామి ఆలయం :** ఈ విగ్రహం 5 నుంచి 6 అడుగుల ఎత్తుతో చుట్టుకొనివున్న పాము మీద పడుకొనబెట్టి వుంటుంది. నాభిలోనించి బ్రహ్మపుట్టడం, కాళ్ళదగ్గర శ్రీదేవి కాళ్ళు వత్తుతున్నట్లు వుంటుంది. అష్టదిక్పాలకులని కూడా చూడవచ్చు.

## శ్రావణబెళగొళ

జైన భక్తులకు ఈ స్థలం ప్రఖ్యాతి గాంచినది. ఇది మైసూరు నుంచి (95 కి.మీ.) ఉత్తర దిక్కుగా వుంది. హస్సన్ నుంచి 52 కి.మీ. బెంగుళూరు నుండి 158 కి.మీ. 57 అ॥ ఎత్తు వున్న ఈ జ్ఞాని గోమటేశ్వరుడు (బాహుబలి) జైనుల ఆరాధకుడిగా పిలవబడతాడు. యీ బాహుబలి ఇంద్రగిరి కొండలమీద నిలువబడియున్నాడు. 1,800 సంవత్సరముల క్రితం చెక్కినది. అయినా ఇప్పటికీ స్వచ్ఛంగా వుంటుంది. నగ్నంగా వున్న ఈ స్థూపం సర్వం సన్యసించిన దానికి చిహ్నము. 12 యేళ్ళకి ఒక్కసారి యిక్కడ మహామస్తకాభిషేకం జరుగుతుంది. లక్షలాది మంది భక్తులు ఈ వేడుకలో పాల్గొంటారు. చివరి మహామస్తకాభిషేకం 1993లో జరిగింది.

**తుంగభద్ర డామ్ :** 162 అ॥ ఎత్తుగల ఈ డాము హోస్పేట్ నుంచి 6 కి.మీ. బెంగుళూరు నుంచి 350 కి.మీ. దూరములో వుంది. డాము, రిజర్వాయరు కలిపి 368 చ.కి.మీ. స్థలమును ఆవరించి ఉన్నది. 2 కి.మీ. గల ఈ డాము నుంచి మనం చుట్టు ప్రక్కల గ్రామాలను చూడవచ్చు.

**అగుంబి :** దక్షిణ ఘాట్లమీద వుంది. సూర్యాస్తమయాన్ని నవంబరు, డిసెంబర్ల మధ్య చూడవచ్చు. షిమొంగ జిల్లాలోని తిర్తహలి నుంచి 30 కి.మీ. దూరంలో వుంది. షిమొంగ లేక మంగుళూర్ల నుంచి ఇక్కడికి చేరవచ్చు.

**కొడగు :** 120 కి.మీ. మైసూరు నుంచి కాఫీ తోటలు వున్నాయి. చక్కటి లోయలు వున్నాయి. దగ్గరిలో మెర్కారా వుంది. సముద్ర మట్టానికి 4000 అడుగుల ఎత్తులో వుంది యీ ప్రదేశం. ఇక్కడ కోట, ఓంకారేశ్వర ఆలయం ఉన్నాయి. ఈ మెర్కారా కూర్గ జిల్లాలో వుంది. కూర్గ తేనెకు చాలా ప్రసిద్ధి.

**నాగర్‌హోల్ :** మైసూరు నుంచి 95 కి.మీ. మెర్కారా నుంచి 98 కి.మీ. దూరం. వన్యమృగ సంరక్షణ కేంద్రం ఉంది.

**తలకా వేరి :** మెర్కారా నుంచి 60 కి.మీ. దూరంలో సముద్ర మట్టానికి 4187 అడుగులపైన వుంది తలకావేరి. కావేరినది జన్మస్థలం. తులా సంక్రమణంలో ఇక్కడ పుష్కరం.

దగ్గరలో పర్వతారణ్య ప్రాంతంలో ఏలక, లవంగ, వక్కల తోటలను చూడచ్చు. స్నానఘట్టానికి దగ్గరిలో విశ్వనాథాలయం వుంది. వసతికి KSTDC టూరిస్టు హోమ్.

**శ్రీనగరి :** తుంగనది ఒడ్డున వున్న పుణ్యక్షేత్రం. యిక్కడ 12 రాశి చక్రాలుగల పిల్లర్లు వున్నాయి. సంవత్సరంలో ఒక్కోనెల ఒక్కో పిల్లర్ మీద ఎండపడుతుంది. అలా

సంవత్సరం పొడవున 12 పిల్లర్స్ మీద 12 నెలలు సూర్యకాంతి పడుతుంది. వసతికి PWD ట్రావెలర్స్ బంగ్లా, శ్రీనగరి మఠ్ గెస్ట్‌హౌస్ ఉన్నాయి.

## ధర్మస్థల

ప్రసిద్ధి చెందిన మంజునాథ ఆలయం వుంది. ఆలయం బహు పెద్దది. ఇక్కడ అబద్ధం చెబితే రౌరవాది నరకాలకి పోతారు. పరిసరాల్లో ఏ తగాదావచ్చినా ఇక్కడే పరిష్కరించుకుంటారు. పట్టణం చుట్టూ నేత్రావతి నది ప్రవహిస్తుంది. యాత్రికులకు వసతికి కావలసినన్ని హోటల్స్, యిక్కడ ఒకప్పుడు తప్పు చేస్తే, హిందూమతాన్ని కించపరిస్తే గుర్రాలతో తన్నించేవారు.

## గోకర్ణం

అంటే ఆవు చెవి. ఇక్కడి సముద్రతీరం. ఆవు చెవిని పోలి ఉండటంతో గోకర్ణం అని పేరు వచ్చింది. కర్‌వర్ నుంచి 55 కి.మీ. దూరం. యీ ప్రదేశంలో కోటతీర్థం వద్ద క్షురకర్మ చేయించుకుని పిండ ప్రదానాలు చేస్తారు. పరమ శివుడు రావణునికి ఆత్మలింగము ఇక్కడే ప్రసాదించారు. కాశీలోని విశ్వనాథ ఆలయం మహిమ తర్వాత ఈ గోకర్ణం మహాబలేశ్వర ఆలయమేనని చెబుతారు.

**కోడిమఠ్ :** ఇక్కడ మఠంలో హుట్టిగే అనే తాళపత్ర గ్రంథం వుంది. దాని ఆధారంతో భూత, భవిష్యత్తు, వర్తమాన కాలాలని చెబుతారు. మన ప్రధానులు ఇందిరా, పి.వి. కూడా యిక్కడికి వచ్చి మఠాన్ని దర్శించారు.

**కర్‌వర్ :** బ్రహ్మాండమైన బోటింగ్ సౌకర్యం వుంది. మోటార్ లాంచీల ద్వారా కాళీ నదిలో విహరించవచ్చు. ఈ ప్రదేశానికి గోకర్ణం నుండి గంటన్నరలో వచ్చేయవచ్చు. హుబ్లి నుంచి ఈ కర్‌వర్‌కి 160 కి.మీ. దూరం. ఈ దారిలో లోయలు, పర్వతాలు, సుందర దృశ్యాలను చూడచ్చు.

**దండేలి :** కర్‌వర్ నుంచి 40 కి.మీ. దూరం. ఇక్కడ అనేకమైన ఇండస్ట్రీలు ఉన్నాయి. పేపర్లు, ప్లయివుడ్, టేకువుడ్ వంటివి ఎన్నో వున్నాయి. వన్యమృగ సంరక్షణ కేంద్రం ఉంది. అనేక జలపాతాలు ఉన్నాయి. వసతికి KSTDC మయూర సహాయద్రి, కొగిబన్ ఫోన్ : 266.

**గోకక్‌ఫాల్స్ :** బెల్గాం నుండి 24 కి.మీ. దూరం. గాతప్రభ నది రాతి మీద ప్రవహిస్తూ 170 అడుగుల లోతులో పడుతూంది. ఇది చూడటానికి జూన్ నుంచి సెప్టెంబరు వరకు మంచి కాలం. వసతికి అనేక హోటళ్ళు, ఇన్‌స్పెక్షన్ బంగ్లా, టూరిస్టు రెస్టుహౌస్ వున్నాయి.

**భద్రావతి** : స్టీల్‌ప్లాంట్, పేపరు మిల్లు వున్నాయి. విశ్వేశ్వరయ్య ఐరన్ అండ్ స్టీల్ వర్క్సు. మైసూర్ పేపరు మిల్లు యిక్కడివే

**మంగుళూర్** : 345 కి.మీ. దూరంలో వుంది బెంగుళూర్‌కి. మెర్కారా నుంచి 115 కి.మీ. దూరంలో పశ్చిమ తీరంలో వుంది. ఇక్కడ నౌకా కేంద్రం. సుల్తాన్ బ్యాటరీ, లైటుహౌస్‌హిల్, మంగళాదేవి ఆలయం, మ్యూజియం వున్నాయి. దగ్గరిలో ముదబిద్రి 20 కి.మీ. దూరంలో వుంది. ఇక్కడ వేయిస్థంభాల మంటపముతోపాటు పురాతన కోట వుంది. ఉడిపికి వెళ్ళేదారిలో 60 అడుగుల ఎత్తులో గౌతమేశ్వరుని విగ్రహం వుంది. ఇక్కడే పద్మనాభస్వామిని చూడవచ్చు. మంగుళూరుకి 25 కి.మీ. దూరంలో వున్న సూరత్‌కాల్‌లోనూ 16 కి.మీ. దూరంలో వున్న ఉల్లైయిలోనూ సుందర బీచ్‌లు ఉన్నాయి.

**ఉడిపి** : బెంగుళూరుకి 350 కి.మీ. దూరం. ఉడిపి హోటల్స్ అనే పేరు చాలా చోట్ల చూసే వుంటారు. ఆ ఉడిపి, ఈ ఉడిపినే. ఫిలాసఫీలో ద్వైత సంస్కృత అధికారి శ్రీ మాధవాచార్యుల చేత 13వ శతాబ్దంలో ఈ ఆలయంలోని కృష్ణుడి విగ్రహం ప్రతిష్ఠించబడింది. ఆలయంలో 8 మఠాలున్నాయి. ఆచార్యులు వాడిన వస్తువులున్నాయి. దగ్గరలో సముద్రతీరం వుంది.

ఉడిపికి ఈశాన్యంగా మూకాంబిక క్షేత్రం 80 కి.మీ. దూరంలో వుంది. ఇక్కడ దేవి మూకాంబికాదేవి. ఇక్కడ దుర్గాదేవిని శ్రీ శంకరాచార్యులు ప్రతిష్ఠించారు. ఈ పరిసరాలలో గుహలు, ఆలయాలతోపాటు దగ్గరిలో అయిహోల (ఈ గ్రామంలో 70 ఆలయాలున్నాయి), బాదామి (రాతితో కట్టిన బావులు) ఉన్నాయి. ఈ బాదామి 120 కి.మీ. దూరంలో వుంది బీజాపూర్‌కి. ఈ బాదామి నుంచి అయిహోల 25 కి.మీ. (వివరంగా ముందు పేజీలలో)

**జోగ్ జలపాతాలు** : 1000 అడుగుల ఎత్తు నుంచి దూకుతూంటుంది. ఈ జలపాతం శరావతి నదిమీద వుంది. మహాత్మాగాంధీ హైడ్రో ఎలక్ట్రికల్ ప్రాజెక్టు వున్న ఈ ప్రదేశం బెంగుళూరు నుంచి 377 కి.మీ. తలగుప్ప రైల్వేస్టేషన్ ఇక్కడికి 16 కి.మీ. దూరంలో వుంది. రాజా, రాణి, కోరల్, రాకట్ జలపాతాల్ని కలిపి జోగ్ జలపాతాలంటారు.

**బీదరు** : 15వ శతాబ్దంలో బహమనీ సుల్తానుల రాజధాని ఈ బీదరు. కోటలో రంజనిమహల్, చీనీమహల్, టర్కిష్ మహల్ వున్నాయి. అలీబరీద్ సమాధి వుంది. ఈ సమాధిని గురునానక్ దర్శించారు. ఈ బీదరు గురునానక్ భక్తులకు పవిత్ర ప్రదేశం. వసతికి KSTDC మయూరి బిరిడ్ షాహి.

## హంపి - విజయనగరం

బెంగుళూరుకి 353 కి.మీ. దూరంలో వుంది ఈ హంపి... ఈ హంపిలో వాతావరణం వేసవికాలం 41 డిగ్రీల C నుంచి 37 డిగ్రీల C వరకు, చలికాలం 27 డిగ్రీల C నుంచి 24 డిగ్రీల C వరకూ.... ఈ హంపికి అతి దగ్గరి ఎయిర్‌పోర్టు బళ్లారికి 74 కి.మీ. దూరంలో వుంది. దగ్గరి రైల్వేస్టేషన్ 135 కి.మీ.లలో హోస్పేట్‌లో వుంది.

కాలచరిత్రలో కాలగర్భంలో కలిసిపోవటానికి సిద్ధంగా వున్నాయి ఇక్కడ ఎన్నో శిల్పాలు. అప్పటి కాలంనాటి విజయనగర సామ్రాజ్య శోభని, శ్రీ కృష్ణదేవరాయల కళావైభవాన్ని ఇక్కడి జ్ఞాపికలు ఇప్పటికీ చాటి చెబుతుంటాయి.

**విరుపాక్ష ఆలయం :** శిథిలమయిపోయిన దేవాలయాలలో ఒకటి అయినా నిత్యం పూజలు జరుగుతుంటాయి. ఈ ఆలయం శివుడికి అంకితమయినది. ఇక్కడ స్వామిని విరూపాక్ష లేదా పంపావటి అంటారు. డిసెంబరు, ఫిబ్రవరిలో ఉత్సవాలు జరుగుతాయి.

**గణేష్ ఆలయం :** విరూపాక్ష దేవాలయంలో రెండు గణేష్ విగ్రహాలు వున్నాయి. ఒకటి ఆలయంలో ప్రతిష్టించారు. మరొకటి ఆరు బయట వుంటుంది.

**కృష్ణ ఆలయం :** బాగా శిథిలమయిపోయింది. ఈ ఆలయాన్ని విజయనగరరాజు కృష్ణదేవరాయలు కట్టించాడు. ఆలయం 1513లో నిర్మించారు. ఇక్కడ స్వామి బాలకృష్ణుడు.

**నరసింహ :** ఏక శిలతో నిర్మించబడిన శ్రీ మహావిష్ణువు అవతారం నరసింహ అవతారపుమూర్తిని చూడొచ్చు. బాగా శిథిలమయిపోయింది.

**హజరరామ టెంపుల్ :** అభినవభోజుడుగా కీర్తించబడిన శ్రీ కృష్ణదేవరాయలు నిర్మించిన ఆలయం ఇది. 15వ శతాబ్దంలో యీ దేవాలయాన్ని నిర్మించారు. ఆలయ గోడలలో ఒంటెలు, ఏనుగులు, గుర్రాలు చెక్కబడి వుంటాయి. లోపల పురాణాలకి సంబంధించిన దృశ్యాలను శిల్పరూపాలలో చూడవచ్చు. ఈ ఆలయ స్థంభాలను పలు ధాతువులతో నిర్మించారు.

**ఏనుగుల కట్టులాయము :** పది చాంబర్స్‌గా విభజించిన ఏనుగులశాల... రాజ భవనాలు. ఇంకా ఇస్లామిక్ శైలిలో నిర్మించిన రాణివారు జలకమాడేచోటు, 16వ శతాబ్దంలో నిర్మించిన విఠల్ ఆలయము, అచ్యుతరామ ఆలయము, కోదండరామ ఆలయంతోపాటు ఆర్టు గ్యాలరీ, మ్యూజియం వున్నాయి. ఈ ఆర్టు గ్యాలరీ, మ్యూజియం కమలాపూర్లో (3 కి.మీ.) వున్నాయి.

17 కి.మీ. దూరములో తుంగభద్ర డామ్ వుంది. హాస్పేట్ నుంచి 15 కి.మీ. దూరం. ఈ డామ్ 590 మీటర్ల పొడవు. 49 మీటర్ల ఎత్తు. తుంగభద్రానది మీద కట్టిన ఈ డామ్ 1,32.59 మిలియన్ల క్యూబిక్ అడుగుల నీటిని నిలువచేసుకొనే కెపాసిటీని కలిగి వుంటుంది.

ఈ హంపికి హైదరాబాదు. మంత్రాలయం. మైసూరు. బాదామి. కమలాపూర్. హాస్పేట్. గుంతకల్. బెంగుళూరు నుంచి బస్సులున్నాయి.

ఈ హంపి నుంచి అయినహోల్ 156 కి.మీ. వయా హాస్పేట్ 13. హుంగుండ 121, అమ్మిగడ్ 12. అయినహోల్ 10.

బాదామి 180 కి.మీ. వయా హాస్పేట్ 13 - కుష్తగి 82, రాన్ 51, బాదామి 34.

బాదామి 202 కి.మీ. వయా హాస్పేట్ 13.. హుంగుండ్ 121, అమ్మిగడ్ 12, అయినహోల్ 10, పట్టడంకల్ 17, బాదామి 29

బెంగుళూరు 353 కి.మీ. వయా హాస్పేట్ 13, చిత్రగుండ 140, తుంకూర్ 130, బెంగుళూరు 70.

బళ్ళారి 74 కి.మీ. వయా హాస్పేట్ 13, బళ్ళారి 61.

గుంతకల్ 133 కి.మీ. వయా హాస్పేట్ 13, బళ్ళారి 61, గుంతకల్ 59.

హస్సాన్ 353 కి.మీ. వయా హాస్పేట్ 13, హరిదర్ 110, షిమాంగ్ 77, తారికెరి 39, బేలూరు 80, హస్సాన్ 34

హాస్పేట్ 13 కి.మీ. డైరెక్టు.

హుబ్లీ 151 కి.మీ. వయా హాస్పేట్ 13, కొప్పల్ 23, గడగ్ 62, హుబ్లీ 53.

తుంగభద్ర డామ్ 17 కి.మీ. డైరెక్టు.

## బీజాపూర్

ఈ బీజాపూర్‌కి అతి దగ్గర ఎయిర్‌పోర్టు బెల్గామ్ 205 కి.మీ. దూరములో వుంది. ఇక్కడి వాతావరణం వేసవికాలం 41 డిగ్రీల C నుంచి 28 డిగ్రీల C వరకూ, చలికాలం 30 డిగ్రీల C నుంచి 16 డిగ్రీల C వరకూ. ఇక్కడికి బెంగుళూరు, బెల్గామ్, షోలాపూర్, హుబ్లి నుంచి బస్సు సర్వీసులు వున్నాయి.

హిందూ రాజులు వైభవంగా ఏలిన ప్రదేశం. చరిత్ర అధ్యయనపరులకు కావలసినంత విషయ సేకరణ. ఇక్కడున్న కట్టడం ప్రపంచ ప్రఖ్యాతి చెందినది.

### బీజాపూర్‌లో దర్శించదగ్గవి

**గోల్ గుంబాజ్ :** 1 కి.మీ. దూరంలో వున్న ఈ కట్టడాన్ని 1627 నుంచి 55 వరకూ

నిర్మించారు. సాహిత్యపరంగా దీనిని గుండ్రని డోము అంటారు. ఇది మహమ్మద్ ఆదీషా యొక్క సమాధి. ఈ గోల్ గుంబాజ్ 1700 స్క్వేర్ మీటర్ల పరిధిలో 51 మీటర్ల ఎత్తుతో 38 మీటర్ల చుట్టుకొలతతో వుంటుంది. ఇక్కడి గోడలు 3 మీటర్ల మందంతో వుంటాయి. రోమ్‌లోని సెయింట్ పీటర్స్ డోమ్ తర్వాత ఇదే పెద్దది. స్తంభాల ఆధారం లేకుండా నిలబడి వుంటుంది. ఇక్కడ ఎంత చిన్నగా అంటే వాచ్ టిక్ మన్న శబ్దం కూడా పదిరెట్లు ఎక్కువగా వినబడుతుంది. ఆ బురుజు క్రింద, కూతురు, ఇద్దరి భార్యల సమాధులతోపాటు మనవడి సమాధి కూడా వుంది.

**జమి మసీదు :** 1 కి.మీ. దూరంలో వుంది. దీన్నే జుమ్మమసీదు అంటారు. బీజాపూర్‌లో మొదట కట్టబడినదే కాక, నగరంలోని కట్టడాలన్నింటిలోను పెద్దది.

**మెహతర్ మహల్ :** 1 కి.మీ. దూరంలో వుంది. ఇండోసార్సనిక్ నిర్మాణ శైలిలో నిర్మించబడినది. బాల్కనీలు మాత్రం హిందూ సంప్రదాయ రీతిలో నిర్మితమయి వుంటాయి. చక్కటి నగిషీలను ఈ మహల్లో చూడచ్చు.

**తాజ్‌బేడీ చెరువు :** తాజ్ సుల్తానాకి గుర్తుగా నిర్మించబడిన ట్యాంక్

**ఇబ్రహింరౌజా :** చక్కటి ఉద్యానవనం.

**మలిక్ ఐ మైదాన్ :** 1.5 కి.మీ. దూరంలో వుంది. 4.45 మీటర్ల పొడవు 1.5 మీటర్ల చుట్టుకొలత 55 టన్నుల బరువుగల బెల్ మెటల్ గన్ వుంది.

**గగన్‌మహల్ :** 5 కి.మీ. దూరంలో వుంది. అలీ అదిల్‌షాచే నిర్మించబడినది 1561లో, దర్బారుహాలు చూడదగ్గది.

**మ్యూజియం, ఆర్ట్ గ్యాలరీ :** గోల్ గుంబాజ్ ముందున్న ఈ మ్యూజియాన్ని ఇండియన్ ఆర్కియాలాజికల్ సర్వేవారు నిర్వహిస్తున్నారు. చెక్కతో తయారు చేయబడిన వస్తువులు, రాతితో తయారుచేసిన శిల్పాలతోపాటు అప్పటి ప్రముఖుల చేతి రాతకి సంబంధించిన కాగితాలున్నాయి.

**గార్డెన్స్ అండ్ పార్కులు :** గోల్ గుంబాజ్ గార్డెన్, ఝాన్సీ లక్ష్మీబాయి పార్కు, నేతాజీ పార్కులు వున్నాయి.

## బీజాపూర్‌లో వసతి

హోటల్ మయూర ఆదిల్‌షాహి, కర్నాటక స్టేట్ టూరిజం డెవలప్‌మెంట్ కార్పొరేషన్, ఆనందమహల్ రోడ్డు, ఫోన్ : 20934.

**రిజర్వేషన్లు :** మేనేజరు హోటల్ ఆదిల్‌షాహి, బీజాపూరు లేక KSTD 10/4 కుమార్పా బెంగుళూరు. ఫోన్ : 221299, 222541.

హోటల్ లలిత మహల్, బస్‌స్టాండు ఎదురు

మైసూరు రెస్టారెంటు, గాంధీచౌక్

హోటల్ ప్రసాద్, ఆజాద్ రోడ్డు

KSRTC గెస్టుహౌస్, సైనిక స్కూలు దగ్గర. ఫోన్ . 20448

PWD సర్క్యూట్ హౌస్, ఆథాని రోడ్డు, ఫోన్ : 21309.

PWD ఇన్స్‌పెక్షన్ బంగ్లా, స్టేషన్ రోడ్డు, ఫోన్ : 20153

రిజర్వేషన్లు : ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు, PWD. బీజాపూర్ డివిజను, ఫోన్ : 20045.

### బీజాపూర్ పరిసరాల్లో పర్యాటక ప్రదేశాలు

అయిహోల 129 కి.మీ దూరంలో బాదామి 132 కి.మీ. దూరంలో బాసవనబాగ్‌వడి 43 కి.మీ. దూరం. ఈ ప్రదేశమే కర్నాటకకి చెందిన ప్రముఖ వ్యక్తి బసవేశ్వర్ పుట్టిన ప్రదేశం. ఇక్కడున్న స్వామి శివుడిని సంగమనాథ్ అని పిలుస్తారు.

**గుల్‌బర్గ :** 159 కి.మీ. దూరంలోవున్న ఇక్కడ శరణ బసవేశ్వర ఆలయం వుంది. ఆలయం ప్రఖ్యాతి చెందినది.

**కుంతగి :** సరస్సుతోపాటు వాటర్ పెవిలియన్ వుంది.

**తోరవి :** నరసింహాలయం వుంది రామాయణాన్ని కుమార వాల్మీకి కన్నడంలో అనువదించారు. మొత్తం రచనంతా ఈ ఆలయం పరిసరాల్లోనే పూర్తిచేయటంతో తోరవి రామాయణంగా ప్రసిద్ధి చెందినది. ఆయన రాసిన రామాయణం.

## అయిహోల

ఈ అయిహోలకి అతి దగ్గర ఎయిర్‌పోర్టు బెల్గామ్ 180 కి.మీ. దూరంలో వుంది. ఈ ప్రదేశంలో దేవాలయాలు ఎక్కువ. 4 స్క్వేర్ కి.మీ. పరిధిలో గల ఈ పుణ్య ప్రదేశానికి రావటానికి బెస్టు సీజన్ అక్టోబరు నుంచి మార్చి లోపు. ఇక్కడి వాతావరణం వేసవికాలం 41 డిగ్రీల C నుంచి 28 డిగ్రీల C వరకూ చలికాలం 31 డిగ్రీల C నుంచి 20 డిగ్రీలC వరకూ.

హంపి 156 కి.మీ. వయా అమినాగడ్ 10 కి.మీ., హుంగుండ్ 12 కి.మీ., హోస్పేట్ 121 కి.మీ. హంపి 13 కి.మీ.

పట్టాదకల్ 17 కి.మీ. డైరెక్ట్.

**వసతి :** టూరిస్టు హోమ్ హుంగుండ్ తాలుక్, అయిహోల ఫోన్ 41. దీనికి రిజర్వేషన్లు మేనేజర్ టూరిస్టు హోమ్ అయిహోల లేక డైరెక్టరేట్ ఆఫ్ టూరిజం గవర్నమెంటు ఆఫ్ కర్నాటక 1వ ఫ్లోర్ F బ్లాక్, కావేరి భవన్ బెంగుళూరు.

**లేడీస్ స్పెషల్ :** ఇక్కడికి ఐకల్ 36 కి.మీ. దూరంలో వుంది. ఇక్కడి విశేషం ఆర్ట్ సిల్క్ చీరలు కావలసినన్ని వెరైటీస్ దొరుకుతాయి. మంచి ప్రసిద్ధి కూడా.

**అయిహోలలో పర్యాటక ప్రదేశాలు**

**దుర్గా టెంపుల్ :** ఈ టెంపుల్ పేరు దుర్గాగుడి అనే పేరు నుంచి వచ్చింది. ఇక్కడ విష్ణువును పూజిస్తారు. 6, 7, శతాబ్దపు కట్టడాల్ని గుర్తుకు తెచ్చే విధంగా వుంటుంది.

**లడ్‌ఖన్ ఆలయం :** చాళుక్యులు బాగా అభివృద్ధి చేశారు. దుర్గా ఆలయానికి దక్షిణ దిక్కుగా వుంది. ఈ ఆలయాన్ని 450 A.D., లో నిర్మించారు. ఈ టెంపుల్‌ని ఓ ముస్లిమ్‌రాజు తన నివాసంగా మార్చుకోవడంతో ఈ ఆలయానికి ఆ పేరు వచ్చింది.

**గౌడ ఆలయం :** లడ్‌ఖన్ ఆలయం సమీపంలో వుంది. ఇక్కడి స్వామి భగవతి, 16 పిల్లర్సుతో నిర్మించిన పురాతన ఆలయం ఇది.

**సూర్యనారాయణ ఆలయం :** లడ్‌ఖన్ టెంపుల్‌కి నార్త్ ఈస్టు దిక్కులో వుంది. 0.6 మీటర్ల ఎత్తుగల సూర్యుని విగ్రహం వుంది. ఉషః సంధ్యలతోపాటు, అశ్వాధారుడై వుండటాన్ని చూడచ్చు. 7, 8 శతాబ్దాలమధ్య నిర్మించిన ఆలయం ఇది.

**కొంటి ఆలయాలు :** బజారుకి మధ్యలో కట్టిన 5వ శతాబ్దపు ఆలయాలు.

**హుచ్చిమల్లి ఆలయం :** అయిహోలలోని ఆలయాలన్నింటిలోనూ పురాతనమయింది. టూరిస్టుహోమ్ వెనుక వుంది. ఈ దేవాలయం, నార్థరన్ శైలిలో నిర్మించిన రేఖాంగర టవర్ వుంది.

**మేగుటి ఆలయం :** 634 A.D. లో నిర్మించిన ఆలయం. కొండమీద ఈ ఆలయం శిథిలమైపోయింది.

**రవన్‌ఫాడి గుహ :** హుచ్చిమల్లి ఆలయానికి సౌత్, ఈస్టు దిక్కులలో ఉంది. 6వ శతాబ్దంలో నిర్మించిన ఏకరాతి కట్టడం. మహిషాసుర మర్దని శివుడు గణేషుడితో సప్తఋషులతో నాట్యం చేస్తున్న భంగిమను చూడచ్చు. లోపల లింగము వుంటుంది. మ్యూజియం ఆర్టుగ్యాలరీ వుంది.

**అయిహోల పరిసరాల్లో కూడలి సంగమం :** అయిహోలకి 45 కి.మీ. దూరం వుంది. నది ఒడ్డున శివుడి ఆలయం వుంది. యిక్కడి స్వామిని సంగమేశ్వరుడిగా సేవిస్తారు. ఆవరణలో బసవేశ్వరుడు, నీలమ్మ, నంది గణేషుల రాతి విగ్రహాలు చూడచ్చు.

**బాదామి**

6, 7 శతాబ్దాల కాలంనాటి చాళుక్యుల రాజధాని. ఇక్కడ అనేక ఆలయాలు వున్నాయి. ఈ బాదామికి పునాది ఒకటవ పులికేశన్ చేశారు. ఆయన కుమారుడు

ఒకటవ కీర్తివర్మన్ ఆలయాన్ని అభివృద్ధి చేశారు. ఒకటవ కీర్తివర్మన్ తమ్ముడు మంగళేశ గుహాలయాలను కట్టించి విష్ణుమూర్తిని ప్రతిష్టించాడు.

ఈ బాదామి ఏరియా 10.3 స్క్వేర్ కి.మీ. ఇక్కడి వాతావరణం వేసవి కాలం 38°C నుంచి 25°C వరకూ, చలికాలం 29°C నుంచి 15°C వరకూ. బెస్టు సీజను అక్టోబరు నుంచి మార్చి వరకూ. ఈ బాదామికి దగ్గరలో ఎయిర్‌పోర్టు 192 కి.మీ. దూరంలో వున్న బెల్గామ్. రైల్వేస్టేషను బాదామి టౌనుకి 4 కి.మీ. దూరంలో వుంది.

బాదామి నుంచి వివిధ ప్రాంతాలకి దూరం.

అయిహోల 46 కి.మీ. వయా పట్టాడకల్ 29 అయిహోల 17 కి.మీ.

బగల్‌కోట్ 66 కి.మీ. వయా కుల్‌గేరి 21 కి.మీ., బగల్‌కోట్ 45 కి.మీ.

బెంగుళూరు 502 వయా కుల్‌గేరి 21 నవల్‌గుండ్ 39 కి.మీ. హుబ్లీ 37 హరిహర్ 129 కి.మీ. చిత్రదుర్గ 78 కి.మీ. తుంకూరు 132 కి.మీ. బెంగుళూరు 66 కి.మీ.

బీజాపూర్ 132 కి.మీ. వయా కుల్‌గేరి 21 కి.మీ. గడ్డకేరి 35 కి.మీ. కొల్హార్ 28 కి.మీ. బీజాపూర్ 48 కి.మీ.

గడగ్ 70 కి.మీ. వయా రాన్ 34 కి.మీ. గడగ్ 36 కి.మీ.

హంపీ 180 కి.మీ. వయా రాన్ 34 కి.మీ. కుష్టగి 51 కి.మీ. హొస్పేట్ 82 కి.మీ. హంపీ 13 కి.మీ.

హొస్పేట్ 167 కి.మీ. వయా రాన్ 34 కి.మీ. కుష్టగి 51 కి.మీ. హొస్పేట్ 82 కి.మీ.

హుబ్లీ 97 కి.మీ. వయా కుల్‌గేరి 21 కి.మీ. నావల్ గుండు 39 కి.మీ. హుబ్లీ 37 కి.మీ.

పానాజి 284 కి.మీ. వయా కుల్‌గేరి 21 కి.మీ. నావల్‌గుండు 39 హుబ్లీ 37 కి.మీ. దర్వార్ 20 కి.మీ. లండా 61 కి.మీ. వండా 72 కి.మీ. పానాజి 34 కి.మీ.

పట్టాదకల్ 29 కి.మీ. వేరుగా

**బాదామిలో వసతి :** హోటల్ మయూర చాళుక్య, P.W.D.కాంప్లెక్స్ రామ్‌దుర్గారోడ్, ఫోన్ : 46. ఇంకా చాళుక్య లాడ్జి స్టేషను రోడ్, లక్ష్మివిలాస్ రోడ్, మార్కెట్ ఏరియా. P.W.D. ఇన్‌స్పెక్షన్ బంగ్లా రామ్‌దుర్గారోడ్ ఫోన్ : 82 వుంది. ఈ బంగ్లాలో వసతికి ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్‌ని బాదామిలో సంప్రదించగలరు.

**ఈ బాదామిలో యాత్రా ప్రదేశాలు :**

**బాదామి గుహలు :** ఒక కి.మీ. దూరం. బాదామి కోట ఎదురుగా వున్న కొండలో నాలుగు గుహాలయములు నిర్మింపబడ్డాయి. చాళుక్యరాజు, మంగలేశ ఈ

గుహాలయములు పూర్తిగా నిర్మించుటకు సహకరించారు. ఈ గుహలని చేరటానికి 200 మెట్లని ఎక్కాలి.

**మొదటి గుహ :** యీ గుహ శైవులది. ఇక్కడ ముఖ్యమైన చెక్కడాలు శివుని నృత్యం, రెండు చేతులు గల్గిన వినాయకుడు, మహిషాసురమర్ధిని, అర్ధనారీశ్వరుడు.

**రెండవ గుహ :** ఇది వైష్ణవాలయము సీలింగ్ మీద అనంతశయన, బ్రహ్మ, విష్ణు శివుడు మరియు అష్టదిక్పాలకుల చెక్కడాలను చూడచ్చు.

**మూడవ గుహ :** ఇంకొన్ని మెట్లు ఎక్కితే వచ్చే యీ గుహ అన్నింటిలో పెద్దది. ఈ గుహలో శైవుల, వైష్ణవుల చెక్కడాలను చూడచ్చు. ఇంకా ఇక్కడ స్థంభాల మీద చక్కటి బొమ్మలను చూడచ్చు. ఇక్కడ త్రివిక్రమ, నరసింహుడు, శంకర నారాయణ, భువరహ, అనంత శయన మరియు హరిహరులను చక్కటి ఫ్రేములలో మలచబడినవి చూడవచ్చును.

**నాలుగవ గుహ :** మూడవ గుహకి దక్షిణ దిక్కుగా వుంది. మహావీరుడు విగ్రహము ఉంది ఇంకా పద్మావతి మరియు త్రిథంకరుల చెక్కడములను చూడవచ్చు. రెండు మూడు గుహల మధ్యగా ఏటవాలుగా ఉన్న మెట్లని ఎక్కివెళితే దక్షిణ దిక్కుగా ఉన్న బాదామి కోటలో టిప్పు సుల్తానుచేత పెట్టబడిన పాతకాలం నాటి తుపాకి చూడచ్చు.

**బాదామికోట :** రెండు కి.మీ. దూరం. కొండపైన ఉన్నది యీ కోట. యీ కోటలో పెద్ద ధాన్యపు కొట్టములను ఖజాన, వాచ్‌టవరు మరియు చక్కటి ఆలయములను చూడవచ్చు. శివాలయము ఉంది. చాలా పురాతనమైనది. యీ ఆలయంలో శివుడిని ఆరాధిస్తారు.

ఇంకా మ్యూజియం మరియు ఆర్ట్ గ్యాలరీ భూతనాథ ఆలయం రోడ్డులో ఉంది. భారతదేశపు ఆర్కియాలాజికల్ సర్వేవారి చేత సంరక్షింపబడుతోంది.

**చుట్టు ప్రక్కల ప్రదేశములు :**

**బాణాశంకరి ఆలయం :** 50 కి.మీ. దూరంలో వుంది బాదామికి. బాణాశంకరిలో ఉన్న ఆలయంలో పార్వతీ మాత అంశ అయిన శంకాంబరి (లేక) బాణాశంకరిని పూజిస్తారు. మొదట చాళుక్యుల చేత నిర్మించబడినది. ఈ ఆలయం 17వ శతాబ్దానికి చెందినది. యీ మాత రూపము నల్లరాతితో చెక్కబడి సింహం మీద కూర్చున్నట్లు, కాలితో రాక్షసుడిని చంపుతున్నట్లు ఉంటుంది. ఈ ఆలయాన్ని ద్రావిడ బాణీలో నిర్మించారు. జనవరి, ఫిబ్రవరిలో పండుగ జరుగుతుంది.

**గులేద్‌గుడ్ :** దీనిని 'వలస వచ్చిన వారి' కొండ అని అంటారు. ఇక్కడికి కొంతమంది వలస వచ్చి కొండ పక్కగా నివాసం ఏర్పరచుకున్నారట. బీజాపూర్ ఇబ్రహీం ఆదిల్ షా 11లో ఆఫీసరయిన సింగప్ప నాయక్ దేశాయి ఇక్కడ 1580లో కోట నిర్మించారు. ఇక్కడ పలు ఆలయాలున్నాయి.

**లక్కుండి :** గదగ్ నుండి సౌత్ ఈస్ట్ దిశగా 22 కి.మీ. దూరం. చాళుక్యులు, కలాచురిలు, సేనాస్ మరియు హోయిసల కాలం నాటి 50 ఆలయములు 29 శిలాశాసనములను ఈ లక్కుండిలో విపరీతమైన ఉత్సుకతతో చూడవచ్చు. అతి పెద్ద పురాతనమైన జైన ఆలయం కూడా వుంది.

**మహాకుట :** బాదామి నుంచి 14 కి.మీ. శైవుల ఆచారానికి ప్రసిద్ధిగాంచిన ప్రదేశం. చుట్టూ కొండలతో ఉన్న అందమైన ప్రదేశం. ద్రవిడయన్ల శైలిలో నిర్మించిన ఈ మహాకుటేశ్వర ఆలయంలో శివుడిని ఆరాధిస్తారు. మత సంబంధమైన పవిత్రత వల్ల దీనిని తరచుగా దక్షిణ కాశి అంటారు.

**నాగనాథ్ ఆలయం :** మహాకూట అరణ్యంలో ఈ ఆలయం వుంది. చాళుక్యుల ఆలయములలో ఇది పురాతనమైనది. 10 కి.మీ. దూరంలో వుంది బాదామికి.

**పట్టాదకల్ :** 29 కి.మీ. దూరం బాదామి నుంచి మలప్రభనది ఒడ్డులో ఈ గ్రామం వుంది. ఇదే రాక్తపుర (రెడ్‌టౌన్) కాలక్రమేణ అయింది. విక్రమాదిత్య 11 రాజు ఆయన భార్యలు కంచీపురం నుంచి తక్షకుడిని ఇక్కడ రాతి మీద చెక్కుటకు పిలిపించారు. ఇక్కడ ముఖ్యమైన ఆలయములు.

**కడ సిద్దేశ్వర ఆలయం :** శివుడి చేతిలో పాము మరియు ఇంకొక చేతిలో త్రిశూలం పక్కన పార్వతీమాతతో ఉన్న చక్కటి శిల్ప విద్యను చూడవచ్చు.

**జంబులింగ ఆలయం :** ఇసుకరాతితో నిర్మించిన ఆలయం. ఇక్కడ టవర్ తూర్పున వున్న రేఖాంగర శైలిలో వుంటుంది. ఈ ఆలయం పూర్తిగాలేదు. శివుడు అంధకాసురుని చంపే దృశ్యాన్ని చూడచ్చు.

**సంగమేశ్వర ఆలయం :** ఈ పురాతన ఆలయం పట్టాదకల్‌లో విజయాదిత్య చేత 696-733 A.D. లో కట్టించబడినది. విజయేశ్వరుడుగా కొలిచే ఈ స్వామి కాలక్రమేణా సంగమేశ్వరుడుగా పిలవబడ్డాడు. ఈ ఆలయాన్ని ద్రవిడయన్ల శైలిలో నిర్మించారు. గోడల మీద చక్కటి ఉగ్రనరసింహం, నటరాజుల చెక్కడాలను చూడవచ్చు.

**మల్లికార్జున ఆలయం :** రెండవ విక్రమాదిత్యుని భార్య త్రియలోక్య మహాదేవి చేత నిర్మించబడిన ఈ ఆలయాన్ని త్రియలోకేశ్వర ఆలయమంటారు. దీనిని 734-745లో నిర్మించారు. ఇది విరూపాక్ష ఆలయాన్ని పోలి వున్నా ఆ ఆలయం కన్నా చిన్నది.

మామల్లాపురంలో వున్న శిల్పకళలాగానే ఇక్కడ వున్న మహిషాసురమర్దిని మరియు ఉగ్రనరసింహులను చూడవచ్చు. సీలింగ్ మీద గజలక్ష్మి నటరాజు మరియు పార్వతుల చెక్కడాలను చూడవచ్చు.

**విరుపాక్ష ఆలయం :** చాళుక్యులను ఓడించిన సందర్భంగా రెండవ విక్రమాదిత్యుని ఇద్దరు భార్యలు మల్లిఖార్జున మరియు విరూపాక్ష ఆలయములను నిర్మించారు. విరూపాక్ష ఆలయాన్ని లోకమహాదేవి నిర్మించినది. కాబట్టి దీనిని లోకేశ్వర అని పిలిచేవారు. ఈ ఆలయంలో లింగోద్భవం, నటరాజు, రావణానుగ్రహ మరియు ఉగ్రనరసింహుల చక్కటి శిల్పకళను చూడవచ్చు. ఈ ఆలయాన్ని ద్రవిడియన్ల శైలిలో నిర్మించారు.

**పాపనాథ ఆలయం :** ఈ ఆలయాన్ని 680 A.D. లో నిర్మించారు. రామాయణ మరియు మహాభారతముల దృశ్యాలను చూడవచ్చు.

**ఇక ఇక్కడ్నించి...**

లైమ్‌నైట్, మానజైట్, సిల్లంనైట్ ప్రధాన ఖనిజాలతో పర్వతాలు, సరస్సులు, పచ్చని వృక్ష సంపదతో చూడచక్కగా కనులకి ఇంపుగా సొంపుగా తమిళనాడుని అతి సన్నిహితంగా అనుకొని వున్న కేరళకి వెళదాం.

# కేరళ

కేరళ (దక్షిణ భారత్) విస్తీర్ణం 38,863 చ.కి.మీ. ఇందు జనాభా 2,90,11,237. ఈ రాష్ట్ర రాజధాని త్రివేంద్రం.

**ప్రధాన నగరాలు :** అలెప్పీ, కన్ననూర్, కొచ్చిన్, ఎర్నాకుళం, కాసరగోడ్, కల్పెట్ట, కోజికోడ్, కొట్టాయం, మలప్పురం, క్విలాన్, పాల్ఘాట్, త్రిచూర్, త్రివేంద్రం మొదలైనవి.

**యాత్రా పర్యాటక ప్రదేశాలు**

శబరిమలై, కోవలంబీచ్, పెరియార్ వన్యమృగ సంరక్షణ కేంద్రం, పద్మనాభపురం ప్యాలెస్, త్రివేంద్రం.

**విశ్వవిద్యాలయాలు :** తిరువనంతపురంలో కేరళ విశ్వవిద్యాలయం, కొచ్చిన్ యూనివర్సిటీ ఆఫ్ సైన్స్ అండ్ టెక్నాలజీ, తెంజప్పాలంలో కాలికట్ విశ్వవిద్యాలయం ఇంకా కొట్టాయం, త్రిస్సూర్‌లలో, మహాత్మాగాంధీ యూనివర్సిటీ, కేరళ విశ్వవిద్యాలయము కలవు.

పశ్చిమమాదివైపు 41 నదులు ప్రవహిస్తున్న ఈ కేరళ వాతావరణం 35°C నుంచి 21°C వరకూ. బెస్టు సీజన్ నవంబర్ నుంచి ఏప్రియల్ వరకూ.

**ప్రధాన భాషలు :** మళయాళం, తమిళం

**ఎయిర్‌పోర్ట్సు :** కొచ్చిన్, తిరువనంతపురం, కాలికట్.

కొన్ని నగరాల పేర్లని మార్పు చేశారు. అవి పాత పేరు త్రివేంద్రం, కొత్త పేరు తిరువనంతపురం. ఆ వరుసలో కొచ్చిన్‌ను కొచ్చిగానూ, కాలికట్‌ను కోజికోడ్, క్విలాన్‌ను కోలంగానూ, అల్లెప్పీను అలపుజ్జగానూ, త్రిచూర్ త్రిసూర్స్‌గానూ, పాల్ఘాట్‌ను పలక్కడ్‌గానూ మార్చారు.

**టూరిజం ఇన్‌ఫర్మేషన్ కేంద్రాలు :** డిపార్టుమెంట్ ఆఫ్ టూరిజం కేరళ - పార్క్‌వ్యూ తిరువనంతపురంలోనూ, గవర్నమెంటు ఆఫ్ ఇండియా టూరిస్టు ఆఫీసు, తిరువనంతపురం ఎయిర్‌పోర్టులోనూ, గవర్నమెంటు ఆఫ్ ఇండియా టూరిస్టు ఆఫీసు విల్లింగ్టన్ కొచ్చిన్ ఫోన్ : 340352 లోనూ కలవు.

## త్రివేంద్రం

**పద్మనాభస్వామి దేవాలయం :** ఇక్కడి స్వామి శ్రీ మహావిష్ణువు. ఈ పురాతన ఆలయాన్ని 1733 A.D.లో మార్తాండవర్మ పునరుద్ధరించారు. పట్టణానికి దక్షిణ దిక్కులో వున్న ఈ ఆలయంలో 68 వల్లరాతి స్తంభాల మోపుతో వసారాలున్నాయి. ఈ స్వామిని దర్శించటానికి 3 దారులున్నాయి. దక్షిణదిక్కుగా వున్న మొదటి ద్వారంవైపు ముఖం, తూర్పు వైపున ద్వారంవైపు ఆయన పాదాలు, మధ్య ద్వారంలో నాభి ప్రాంతం

దర్శనమిస్తాయి. ప్రవేశ సమయాలు : ఉదయం 4 గంటల నుంచి 5-15 వరకూ, 6-15 నుంచి 6-45 వరకూ, మళ్ళీ 8-45 నుంచి 9-30 వరకూ మరియు సాయంత్రం 5 గంటల నుంచి 7-15 గంటల వరకూ.

**నేపియర్ మ్యూజియం :** లోనికి ప్రవేశం ఉదయం 8 గంటల నుంచి సాయంత్రం 6 గంటలవరకూ, సోమవారం, బుధవారం ఉదయం పూట శెలవు. రాతితో చేయబడిన విగ్రహాలు, చెక్కతో చేయబడిన వస్తువులతోపాటు పురాతన కాలంనాటి వాయిద్యాలు చూడచ్చు.

**జూయలాజికల్ గార్డెన్స్ :** అడవి ప్రాంతంలో ఉంది. రోజులో సగంభాగం పడుతుంది ఈ ఉద్యానవనాన్ని చూడటానికి, జంతు ప్రదర్శనశాల గల గార్డెను సోమవారం శెలవు. ప్రవేశం ఉదయం 8 గంటల నుంచి సాయంత్రం 6 గంటల వరకు.

**చిత్రాలయ ఆర్టు గ్యాలరీ :** రాజా రవివర్మ చిత్రాలను ఇక్కడ చూడచ్చు. అనేక దేశాల నుంచి సేకరించిన అపురూప చిత్రాలను కూడా వీక్షించవచ్చు. ప్రవేశం ఉదయం 8 గంటల నుంచి సాయంత్రం 6 గంటలవరకూ, సోమ, బుధవారాలలో ఉదయం పూట శెలవు.

ఇంకా యిక్కడ వడియార్ ప్యాలెస్, ఆక్వేరియం, ఓరియంటల్ లైబ్రరీ, S.M.S.M. ఇనిస్టిట్యూట్ మొదలగునవి వున్నాయి.

ఈ త్రివేంద్రంకు భారతదేశంలోని ప్రధాన నగరాలన్నిటి నుంచి విమాన సౌకర్యం ఉంది. కొలంబో, మాల్దీవులు, దుబాయ్ నుంచి కూడా డైరెక్టుగా ఇక్కడికి వచ్చే సౌకర్యం వుంది.

**కోవలం :** త్రివేంద్రంకు దక్షిణ దిశగా 13 కి.మీ. దూరములో వుంది. చక్కటి ప్రశాంత వాతావరణం గల బీచ్‌గా ఇండియాలో ప్రసిద్ధి చెందింది. ఇసుక మైదానాలతో ఆహ్లాదంగా కనిపించే ఇక్కడ విశ్రాంతి కుటీరాలుకూడా వున్నాయి. కేరళ ఆయుర్వేద చికిత్సాలయంతోపాటు, యోగాభ్యాస కేంద్రం కూడా వుంది.

**క్విలన్ :** బోటులో ఇక్కడ్నుంచి అల్లెప్పీ ప్రయాణం చేయచ్చు. అష్టమదినదీ తీరంలో అరుదయిన చేపలను చూడచ్చు. త్రివేంద్రం నుంచి 72 కి.మీ. దూరం.

**వరక్కల్లమ్ :** త్రివేంద్రం నుంచి 51 కి.మీ. దూరము క్విలన్ నుంచి 20 కి.మీ. ఇక్కడ స్వామి జనార్థనస్వామి, అనాది ఆలయమైన ఈ ఆలయం సముద్రంలో కొట్టుకుపోతే తిరిగి నిర్మించారు. ఈ ప్రదేశం కణ్వమహర్షి తపస్సు చేసిన ప్రదేశంతోపాటు బ్రహ్మ యజ్ఞం చేసిన ప్రదేశం కూడా.

**అల్లెప్పీ :** క్విలన్‌కు వెళ్ళటానికి బోట్లున్నాయి. ఇక్కడ నెహ్రూకప్‌బోట్ రేస్, స్నేక్ బోట్‌రేస్ ఆఫ్ కేరళ ప్రతి సంవత్సరం ఆగష్టు రెండో శనివారం బ్రహ్మాండంగా జరుగుతాయి.

**పొన్‌ముడి :** త్రివేంద్రం నుంచి 60 కి.మీ. దూరములో వున్న కొండ ప్రాంతం. సముద్రమట్టానికి 2,925 అ॥ ఎత్తులో వుంది.

# కేరళ

కేరళ (దక్షిణ భారత్) విస్తీర్ణం 38,863 చ.కి.మీ. ఇందు జనాభా 2,90,11,237. ఈ రాష్ట్ర రాజధాని త్రివేంద్రం.

**ప్రధాన నగరాలు :** అలెప్పీ, కన్ననూర్, కొచ్చిన్, ఎర్నాకుళం, కాసరగోడ్, కల్పెట్ట, కోజికోడ్, కొట్టాయం, మలప్పురం, క్విలాన్, పాల్ఘాట్, త్రిచూర్, త్రివేంద్రం మొదలైనవి.

**యాత్రా పర్యాటక ప్రదేశాలు**

శబరిమలై, కోవలంబీచ్, పెరియార్ వన్యమృగ సంరక్షణ కేంద్రం, పద్మనాభపురం ప్యాలెస్, త్రివేంద్రం.

**విశ్వవిద్యాలయాలు :** తిరువనంతపురంలో కేరళ విశ్వవిద్యాలయం, కొచ్చిన్ యూనివర్శిటీ ఆఫ్ సైన్స్ అండ్ టెక్నాలజీ, తెంజప్పాలంలో కాలికట్ విశ్వవిద్యాలయం ఇంకా కొట్టాయం, త్రిస్సూర్‌లలో, మహాత్మాగాంధీ యూనివర్శిటీ, కేరళ విశ్వవిద్యాలయము కలవు.

పశ్చిమమాదివైపు 41 నదులు ప్రవహిస్తున్న ఈ కేరళ వాతావరణం 35°C నుంచి 21°C వరకూ. బెస్టు సీజన్ నవంబర్ నుంచి ఏప్రియల్ వరకూ.

**ప్రధాన భాషలు :** మళయాళం, తమిళం

**ఎయిర్‌పోర్టు :** కొచ్చిన్, తిరువనంతపురం, కాలికట్.

కొన్ని నగరాల పేర్లని మార్పు చేశారు. అవి పాత పేరు త్రివేంద్రం, కొత్త పేరు తిరువనంతపురం. ఆ వరుసలో కొచ్చిన్‌ను కొచ్చిగానూ, కాలికట్‌ను కోజికోడ్, క్విలాన్‌ను కోలంగానూ, అల్లెప్పీను ఆలప్పుజ్జగానూ, త్రిచూర్ త్రిసూర్స్‌గానూ, పాల్ఘాట్‌ను పలక్కడ్‌గానూ మార్చారు.

**టూరిజం ఇన్‌ఫర్మేషన్ కేంద్రాలు : డిపార్టుమెంట్ ఆఫ్ టూరిజం కేరళ - పార్క్‌వ్యూ తిరువనంతపురంలోనూ, గవర్నమెంటు ఆఫ్ ఇండియా టూరిస్టు ఆఫీసు, తిరువనంతపురం ఎయిర్‌పోర్టులోనూ, గవర్నమెంటు ఆఫ్ ఇండియా టూరిస్టు ఆఫీసు విల్లింగ్టన్ కొచ్చిన్ ఫోన్ : 340352 లోనూ కలవు.**

## త్రివేంద్రం

**పద్మనాభస్వామి దేవాలయం :** ఇక్కడి స్వామి శ్రీ మహావిష్ణువు. ఈ పురాతన ఆలయాన్ని 1733 A.D.లో మార్తాండవర్మ పునరుద్ధరించారు. పట్టణానికి దక్షిణ దిక్కులో వున్న ఈ ఆలయంలో 68 నల్లరాతి స్థంభాల మోపుతో వసారాలున్నాయి. ఈ స్వామిని దర్శించటానికి 3 దారులున్నాయి. దక్షిణదిక్కుగా వున్న మొదటి ద్వారంవైపు ముఖం, తూర్పు వైపున ద్వారంవైపు ఆయన పాదాలు, మధ్య ద్వారంలో నాభి ప్రాంతం

దర్శనమిస్తాయి. ప్రవేశ సమయాలు : ఉదయం 4 గంటల నుంచి 5-15 వరకూ, 6-15 నుంచి 6-45 వరకూ, మళ్ళీ 8-45 నుంచి 9-30 వరకూ మరియు సాయంత్రం 5 గంటల నుంచి 7-15 గంటల వరకూ.

**నేపియర్ మ్యూజియం :** లోనికి ప్రవేశం ఉదయం 8 గంటల నుంచి సాయంత్రం 6 గంటలవరకూ, సోమవారం, బుధవారం ఉదయం పూట శెలవు. రాతితో చేయబడిన విగ్రహాలు, చెక్కతో చేయబడిన వస్తువులతోపాటు పురాతన కాలంనాటి వాయిద్యాలు చూడచ్చు.

**జూయలాజికల్ గార్డెన్స్ :** అడవి ప్రాంతంలో ఉంది. రోజులో సగంభాగం పడుతుంది ఈ ఉద్యానవనాన్ని చూడటానికి, జంతు ప్రదర్శనశాల గల గార్డెను సోమవారం శెలవు. ప్రవేశం ఉదయం 8 గంటల నుంచి సాయంత్రం 6 గంటల వరకు.

**చిత్రాలయ ఆర్టు గ్యాలరీ :** రాజా రవివర్మ చిత్రాలను ఇక్కడ చూడచ్చు. అనేక దేశాల నుంచి సేకరించిన అపురూప చిత్రాలను కూడా వీక్షించవచ్చు. ప్రవేశం ఉదయం 8 గంటల నుంచి సాయంత్రం 6 గంటలవరకూ, సోమ, బుధవారాలలో ఉదయం పూట శెలవు.

ఇంకా యిక్కడ వడియార్ ప్యాలెస్, ఆక్వేరియం, వోరియంటల్ లైబ్రరీ, S.M.S.M. ఇనిస్టిట్యూట్ మొదలగునవి వున్నాయి.

ఈ త్రివేంద్రంకు భారతదేశంలోని ప్రధాన నగరాలన్నిటి నుంచి విమాన సౌకర్యం ఉంది. కొలంబో, మాల్‌దీవులు, దుబాయ్ నుంచి కూడా డైరెక్టుగా ఇక్కడికి వచ్చే సౌకర్యం వుంది.

**కోవలం :** త్రివేంద్రంకు దక్షిణ దిశగా 13 కి.మీ. దూరములో వుంది. చక్కటి ప్రశాంత వాతావరణం గల బీచ్‌గా ఇండియాలో ప్రసిద్ధి చెందింది. ఇసుక మైదానాలతో ఆహ్లాదంగా కనిపించే ఇక్కడ విశ్రాంతి కుటీరాలుకూడా వున్నాయి. కేరళ ఆయుర్వేద చికిత్సాలయంతోపాటు, యోగాభ్యాస కేంద్రం కూడా వుంది.

**క్విలన్ :** బోటులో ఇక్కడ్నుంచి అల్లెప్పీ ప్రయాణం చేయచ్చు. అష్టమదినదీ తీరంలో అరుదయిన చేపలను చూడచ్చు. త్రివేంద్రం నుంచి 72 కి.మీ. దూరం.

**వరక్కల్లమ్ :** త్రివేంద్రం నుంచి 51 కి.మీ. దూరము క్విలన్ నుంచి 20 కి.మీ. ఇక్కడ స్వామి జనార్ధనస్వామి, అనాది ఆలయమైన ఈ ఆలయం సముద్రంలో కొట్టుకుపోతే తిరిగి నిర్మించారు. ఈ ప్రదేశం కణ్వమహర్షి తపస్సు చేసిన ప్రదేశంతోపాటు బ్రహ్మ యజ్ఞం చేసిన ప్రదేశం కూడా.

**అల్లెప్పీ :** క్విలన్‌కు వెళ్ళటానికి బోట్లున్నాయి. ఇక్కడ నెహ్రూకప్‌బోట్ రేస్, స్నేక్ బోట్‌రేస్ ఆఫ్ కేరళ ప్రతి సంవత్సరం ఆగష్టు రెండో శనివారం బ్రహ్మాండంగా జరుగుతాయి.

**పొన్‌ముడి :** త్రివేంద్రం నుంచి 60 కి.మీ. దూరములో వున్న కొండ ప్రాంతం. సముద్రమట్టానికి 2,925 అ॥ ఎత్తులో వుంది.

**అరన్ముల :** ఎర్నాకులం నుంచి 122 కి.మీ. దూరము. పురాతనమైన కృష్ణుడి ఆలయముంది.

## కొచ్చిన్

చెన్నై, ముంబాయి, కోయంబత్తూరు, బెంగుళూరు నుంచి విమాన సౌకర్యము. భారతదేశంలోని ప్రధాన నగరాలన్నింటి నుంచి రైలు సౌకర్యముంది. 83.52 స్క్వేర్ కి.మీ. ఏరియా గల ఇక్కడి వాతావరణం వేసవికాలం 35 డిగ్రీల C నుంచి 22.5 డిగ్రీల C వరకు, చలికాలం 32.3 డిగ్రీల C నుంచి 20 డిగ్రీల C వరకు. బెస్ట్ సీజను అక్టోబరు నుంచి మార్చి.

ఈ కొచ్చిన్‌కి రోడ్ ద్వారా అనేక ప్రాంతాలకి దూరం కి.మీ.లలో అల్లెప్పీ 64 కి.మీ వయా షెర్థలాయి 39 అల్లెప్పీ 25.

కోయంబత్తూరు 223 కి.మీ. త్రిచూర్ 80, చెరుత్తురుత్తి 29, పాల్ఘాట్ 54, కోయంబత్తూరు 60.

గురువాయూర్ 109 కి.మీ. వయా త్రిచూర్ 80, గురువాయూర్ 29

**కొచ్చిన్‌లో పర్యాటక ప్రదేశాలు :**

**బాల్‌గట్టి ఐలాండ్ :** 1744లో డచ్చివారు కట్టించారు. ప్రస్తుతం ఇది హోటల్.

**డచ్ ప్యాలెస్ మతంచెరి :** 1557 A.D. లో పోర్చుగీసు వారు కట్టారు. దీన్ని కొచ్చిన్ రాజు వీరకేరళవర్మకి బహూకరించారు. పురాణ కథలకి సంబంధించిన చెక్కడాలున్నాయి. ఈ భవనంలో ఉదయం ప్రవేశం. 9 నుంచి 12-30 వరకూ మధ్యాహ్నం 2 నుండి 5-00 వరకూ.

ఇంకా కొచ్చిన్‌లో పోర్టు కొచ్చిన్, కొచ్చిన్ మ్యూజియం, విల్లింగ్టన్ ఐలండ్, ఆర్టు గ్యాలరీ మొదలగునవి చూడవచ్చును.

## పెరియార్ వైల్డ్ లైఫ్ శాంక్చువరి

కొట్టాయం నుంచి బస్సులో వెళ్ళవచ్చు. వసతికి పెరియార్ హౌస్ వుంది. అత్యంత దట్టమైన అడవి ప్రదేశం. ఈ అడవిలో ఏనుగులు, పులులు, మత్తగజాలు, అడవి దున్నలు, జాగిలాలు, చిరుత, పెద్దపులి, నల్లకోతులు చూడచ్చు.

## వన్యప్రాణి సంరక్షణ కేంద్రాలు - ప్రదేశాలు

| | | |
|---|---|---|
| బందీపూర్ నేషనల్ పార్క్ | - | కర్ణాటక |
| చంద్రప్రభ శాంక్చురీ | - | ఉత్తరప్రదేశ్ |
| కార్బెట్ నేషనల్ పార్క్ | - | నైనిటాల్ (యు.పి.) |
| డచ్చిగామ్ శాంక్చురీ | - | కాశ్మీర్ |
| గిర్ నేషనల్ పార్క్ | - | జునాగర్ (గుజరాత్) |

| | | |
|---|---|---|
| హజారీబాగ్ నేషనల్ పార్క్ | - | బీహార్ |
| జల్దపరా శాంక్చురీ | - | పశ్చిమబెంగాల్ |
| మెరైన్ నేషనల్ పార్క్ | - | కచ్ (గుజరాత్) |
| జల్లపరా శాంక్చురీ | - | పశ్చిమబెంగాల్ |
| కన్హా నేషనల్ పార్క్ | - | అస్సాం |
| ఘనా పక్షుల కేంద్రం | - | రాజస్థాన్ |
| మనాస్ శాంక్చురీ | - | అస్సాం |
| మోతీచూర్ శాంక్చురీ | - | హిమాచల్‌ప్రదేశ్ |
| మధుమలై శాంక్చురీ | - | కేరళ |
| బన్నారఘట్టా నేషనల్ పార్క్ | - | బెంగుళూరు |
| నఘరావ నేషనల్ పార్క్ | - | కర్నాటక |
| ఎర్నాకులం రాజమల్లి నేషనల్ పార్క్ | - | కేరళ |
| బంధవ్‌ఘుర్ నేషనల్ పార్క్ | - | మధ్యప్రదేశ్ |
| తదోబా నేషనల్ పార్క్ | - | చంద్రపూర్ (మహారాష్ట్ర) |
| పంచ్ నేషనల్ పార్క్ | - | నాగపూర్ |
| నయాగోన్ నేషనల్ పార్క్ | - | భండారా |
| బారివరీ నేషనల్ పార్క్ | - | మహారాష్ట్ర |
| రెబల్‌లమ్‌జో నేషన్ పార్క్ | - | మణిపూర్ |
| ఖాంగచంద్‌జా నేషనల్ పార్క్ | - | సిక్కిం |
| గుండి నేషనల్ పార్క్ | - | చెన్నై |
| దూంధ్వా నేషనల్ పార్క్ | - | యు.పి. |
| రాజాజీ శాంక్చురీ | - | హిమాచల్‌ప్రదేశ్ |
| రంగనాథితో శాంక్చురీ | - | కర్నాటక |
| సరోసిక శాంక్చురీ | - | రాజస్థాన్ |
| శిరపురి నేషనల్ పార్క్ | - | మధ్యప్రదేశ్ |
| వేదాంతగళ్‌బర్డ్ శాంక్చురీ | - | తమిళనాడు |
| వెలవదర్ నేషనల్ పార్క్ | - | గుజరాత్ |
| రోహ్లా నేషనల్ పార్క్ | - | హిమాచల్‌ప్రదేశ్ |

ఇక్కడున్న సరస్సులో ఏనుగులు జలకాలాడటం, పక్షులు చేపలను పట్టడం లాంటి దృశ్యాలను చూడచ్చు. 780 చ.కి.మీ.గల ఈ శాంక్చువరి కొచ్చిన్ నుంచి 70 కి.మీ. త్రివేంద్రం నుంచి 154 కి.మీ.

చొట్టవిక్కర : ఎర్నాకులం నుంచి గంట పడుతుంది. ఇక్కడ మంగళవారం, శుక్రవారం దెయ్యాలు పట్టినవారు వచ్చి మాతా రాజేశ్వరి దేవిని దర్శించి కొలుస్తారు. ఇక్కడ దేవిని ఉదయం సరస్వతి గానూ, మధ్యాహ్నం భద్రకాళిగా, సాయంత్రం దుర్గాదేవిగా పూజిస్తారు.

**త్రిప్పూర్ :** కొచ్చిన్ నుంచి 74 కి.మీ. దూరం. వడుక్కునాధన్ దేవాలయము వుంది. పురాతన దేవాలయం అయిన ఇక్కడ ఏప్రియల్, మేలో పూరం పండుగ ఆకర్షణీయంగా జరుగుతుంది. చక్కగా అలంకరించబడిన భద్రగజాలు స్వామికి వందనం చేస్తాయి.

**గురువాయూర్ :** ఎర్నాకులం నుంచి 1000 కి.మీ. దూరం. శ్రీ కృష్ణభగవానుడికి అంకితమైన దేవాలయంలోకి ప్రవేశం హిందువులకి మాత్రమే. ఫిబ్రవరి, మార్చిలో జరిగే పండుగలలో కథాకళి నాట్యాలను చూడచ్చు.

ఎర్నాకులం నుంచి K.T.D.C. వారు కండెక్టడ్ టూర్స్ నిర్వహిస్తారు. కన్యాకుమారి, గురువాయూర్, గోవా, ముంబాయి, తిరుపతి, కుర్తాళం, కొడైకెనాల్ ఇంకా కేరళలోని యాత్రా పర్యాటక ప్రదేశాలకి టూర్స్ వుంటాయి. పూర్తి వివరాలకి K.T.D.C. టూరిస్ట్ రిసెప్షన్ సెంటర్, షణ్ముగమ్ రోడ్, ఎర్నాకులం, కొచ్చిన్ ఫోన్ : 353234.

**కాలడి :** ఎర్నాకులం నుంచి 80 కి.మీ. దూరం. జగద్గురు శంకరాచార్యులు పుట్టిన ప్రదేశం. శంకరాచార్యుల దేవాలయం, శ్రీ శారదాదేవి ఆలయం, రామకృష్ణ మఠము వున్నాయి.

**మలంపూజ :** ఎర్నాకులం నుంచి 155 కి.మీ. దూరం. ఈ మలంపూజ రివర్ ప్రాజెక్టు. ఇక్కడున్న లేక్‌లో అరుదయిన చేపలను చూడచ్చు.

**కొట్టాయం :** ఎర్నాకులం నుంచి 76 కి.మీ. దూరం. కమర్షియల్ సెంటర్ రైల్వే బ్రేకింగ్ పాయింట్.

**కొట్టక్కల్ :** ఎర్నాకులం నుంచి 170 కి.మీ. దూరంలో వున్న ఈ పట్టణంలో ఆర్యవైద్యశాల ప్రసిద్ధి చెందినది.

**కొడంగలూరు :** ఇక్కడ దేవి భగవతి ఆలయం వుంది. జనవరి -మార్చి ఏప్రియల్‌లో తలపోలి, భరణి పండుగలు జరుగుతాయి.

**బెకల్ :** సముద్రానికి అనుకొని పురాతన కోట వుంది. వసతికి ట్రావెలర్స్ బంగ్లా వుంది.

**కెన్నమార్ :** పోర్చుగీసు కోట వుంది. కొచ్చిన్‌కి 285 కి.మీ. దూరంలో వుంది.

**మున్నార్:** కొచ్చిన్ నుంచి 135 కి.మీ. దూరం. టీ తోటలు అనేకం సముద్రమట్టానికి 1525 కి.మీ. ఎత్తులో వున్న యిక్కడ చక్కటి లోయలను కూడా చూడచ్చు. యిక్కడికి దగ్గరిలో దక్షిణ భారత దేశంలో కెల్లా ఎత్తయిన శిఖరం అన్నైముడి 2,695 మీటర్ల ఎత్తున వుంది.

**పాయిపడ్ :** కొచ్చిన్ నుంచి 95 కి.మీ. దూరంలో ఇక్కడ ఓనమ్ పండుగకి పాయపడ్ జలోత్సవం జరుగుతుంది.

**పీచి :** కొచ్చిన్ నుంచి 95 కి.మీ. త్రిస్సూర్ నుంచి 20 కి.మీ. గల ఇక్కడ బోటింగ్, స్విమ్మింగ్ చేయవచ్చు.

**కాలికట్** : జమొరిన్ రాజభవనం వున్న ఇక్కడే వాస్కోడిగామా మొదటిసారి 1498లో దిగారు. వస్త్రాలకు ప్రసిద్ధి.

**పాలఘాట్** : చూడాల్సినకోట వుంది.

**ఇల్వక్కోట** : ఆవైం అమ్మన్ దేవాలయం వుంది. కాలికట్ నుంచి కొచ్చిన్‌కు వచ్చేదారిలో వుంది.

## శబరిమల స్వామి 'అయ్యప్ప స్వామి'

'ఓం శ్రీ స్వామియే శరణం అయ్యప్ప - స్వామి శరణం అయ్యప్ప శరణం' అనుకుంటు స్మరించుకుంటూ శబరిమల కొండెక్కి, పద్దెనిమిది మెట్లెక్కి స్వామిని దర్శించుకుంటారు భక్తులు.

41 రోజుల కఠోర దీక్ష తర్వాత ఇక్కడికి దేశం నలుమూలల నుంచి వస్తారు, ఆడవారికి ప్రవేశం లేదు. చిన్న పిల్లలు వృద్ధులు రావచ్చు. కొట్టాయం నుంచి కొండకి వెళ్ళొచ్చు. తొలిసారిగా దీక్ష తీసుకున్నవారు ఎరుమేలి వెళ్తారు. అక్కడ్నించి ధర్మశాస్త్ర ఆలయం డెబ్బయి కిలో మీటర్లు, నల్లలుంగీ, నల్ల చొక్కా, నల్లటవల్ ధరించి మాలధారణ చేసిన అయ్యప్పలు దీక్ష పూర్తి చేసి పంపానదిలో స్నాన మాచరించి ఇరుముడితో స్వామి సన్నిధికి కష్టభూయిష్టమైన కొండదారిన వెళతారు.

ఇక్కడ మకర సంక్రాంతి రోజు మకర దర్శనం జరుగుతుంది. లక్షలాది భక్తులు ఆ దర్శనం కోసం విశేషంగా వస్తారు. స్వామి సన్నిధికి వెళ్ళటానికి మూడు దారులున్నాయి. ఒకటి ఎరుమేలి మార్గం (70 కి.మీ.) ఎరుమేలిలో పెట్టతుళ్ళీయ నృత్యం సంబరంగా చేసుకొని, కొండదారిని స్వామిని చేరుకుంటారు భక్తులు. మార్గం మధ్యలో అయ్యప్పస్వామి నడయాడిన ప్రదేశాలు వున్నాయి. రెండో మార్గం తేని, కంభలద్వారా.... ఇక్కడ్నించి నడక 45 కి.మీ. మూడోదారి కొట్టాయం నుంచి ఇక్కడ్నించి పంబ వరకూ బస్సులున్నాయి. ప్రతియేట డిసెంబర్‌లో మండలపూజ, మకర విలక్కు, విశు, చైత్రప్రథమ దినములందు భక్తులు స్వామిని దర్శించుటకు అధిక సంఖ్యలో వస్తారు. మకరజ్యోతిని దర్శించుట మహాద్భాగ్యము...

ఓం శ్రీ స్వామియే శరణం అయ్యప్ప... ఈ స్వామి దగ్గరకి వెళ్ళివచ్చిన తర్వాత శ్రీ వేంకటేశ్వరుని కటాక్షాలతోనూ ఇంత తృప్తినిచ్చిన పుస్తకాన్ని రాయగలుగుతున్నాను.

ఈ శబరి గిరీశుని దర్శించుటకు వనయాత్ర చేస్తారు భక్తులు. సాక్షాత్ స్వామి అయ్యప్ప నడిచి వెళ్ళిన పూంగా వనం, అదే పెరియపాదె - ఎరుమేలి మార్గం.

కొట్టాయం నుండి తిరువల్లా మార్గాన 78 కి.మీ. కొట్టాయం నుండి కాంజి రప్పళ్ళి మార్గము 54 కి.మీ. దూరంలోనూ, కొట్టాయం నుండి మణిమాల మార్గాన 52. కి.మీ. దూరంలోను చెంగనూరు నుండి చెంగచాశ్శేరి మణిమాల మార్గాన 66 కి.మీ. దూరంలో చెంగన్నూరు నుండి పత్తనంతిట్ట మార్గాన 63 కి.మీ. దూరంలోనూ, తిరువనంతపురం

నుండి పునలూరు. కొన్ని మార్గాన 176 కి.మీ. దూరాన కలదు.

ఇక్కడ నుండి భక్తాదులు కాలినడక నడుస్తారు. ఈ మార్గంలో ఎదురయ్యే క్షేత్రములు .

| | | | |
|---|---|---|---|
| 1) | కోట్టైయిప్పడి | - | ఇక్కడే వావరుస్వామి వెలిసినది. |
| 2) | కాళైకట్ట | - | ప్రాచీన శివాలయము వుంది. |
| 3) | అళుదానది | - | స్వామి మహిషిని వధించిన స్థలము |
| 4) | అళుదామేడు | - | 5 కి.మీ. ఎత్తయిన గుండ్రాళ్ళతో గూడిన కొండ. |
| 5) | కల్ ఇడుంకుండ్రు | - | వధించిన మహిషిని పైకి విసిరేయగ అదిపడిన స్థలము. |
| 6) | ఇంచిప్పారకోట్ట | - | శిధిలమయిన కోట కలదు. ఇక్కడే స్వామి ఉదయనుడు అనే బందిపోటుని హతమార్చారు. |
| 7) | కరిమలైతోడు | - | నిటారైన కరిమల శిఖరం ప్రారంభం. |
| 8) | కరిమలై ఉచ్చి | - | ప్రాచీనమైన దివ్య బావి కలదు. |
| 9) | వరియాన వట్టం | - | ఇచ్చట ఏనుగులు దాహశాంతి తీర్చుకుంటాయి. |
| 10) | శిరియాన వట్టం | - | ఇచ్చట భక్తులు వంటలు చేసుకొని విశ్రమిస్తారు. చిన్న ఏనుగులు దాహశాంతి చేసుకుంటాయి. |

**11) పావన పంబానది :** అనేక ఔషధమూలికల సారముతో ప్రవహించు పంబను దక్షిణ గంగయని కూడా అంటారు. ఆ శ్రీరామచంద్రులవారే ఇక్కడ స్నానమాచరించినట్లు పురాణాలు చెబుతున్నాయి.

**12) నీలిమల :** ఈ నీలిమల ఎక్కడం కరిమల కంటె కఠినం. రామాయణంలో దీన్ని మాతంగవనం అంటారు.

**13) అప్పాచ్చిమేడు :** ఇక్కడ్నించి శబరి పీఠము చేరుకుంటారు. దుర్దేవతల ప్రీతి కోసం బియ్యపు ఉండలను విసురుతారు.

**14) శబరి పీఠము :** ఇందులోనే పందళ్ రాజవంశీయులు విద్యాభ్యాసము నేర్చుకున్నారు.

**15) శరంగుత్తి :** యాత్రలో దీక్షా దండముగా భద్రపరిచి తెచ్చిన శరములను ఇక్కడే వున్న రావి వృక్షములో గుచ్చుతారు.

**16) పదినెట్టాంపడి :** ఇదియే ముక్తికి సోపానము. దీనినధిరోహించిన వేళ నెత్తిన ఇరుముడి వుండవలెను.

**17) సన్నిధానము :** ధ్వజ స్థంభము దర్శిస్తూ సన్నిధానం చేరుట, శ్రీ ధర్మశాస్త్ర వారిని కనులారా వీక్షించుట.

## దేవాలయం తీయు దినములు

**1)** అన్ని మళయాళ మాసపు మొదటి ఐదు దినములు.

**2)** మండలపూజకు నవంబర్ 16 నుంచి తెరువబడి వరసగా 41 దినములు తెరిచి

యుంచుదురు. ఆపై మకర విళక్కు ఉత్సవాలకు ప్రతి జనవరి 1 నుంచి 20 వరకు తెరిచి వుంచుతారు.

3) విష్ణు, కేరళ ఉగాది సందర్భముగా ఏప్రియల్ మాసపూజకు ముందుగా నాలుగు దినములు తెరుస్తారు.

4) మేలో 1 రోజు. ఆగష్టు నెలలో ఓణం పండుగ సందర్భంగా ఒక రోజు తెరిచి వుంచుతారు దేవాలయాన్ని.

**చాలామందికి తెలియని మరో మార్గం** ... స్వామి సన్నిధానం చేరుటకు కేరళలోని పీర్మేడు అనే ప్రదేశం నుండి 20 కి.మీ. దూరాన కొట్టాయం కుమిళి హైవేలో 96 కి.మీ. దూరాన వండిప్పెరియారు గలదు. ఇక్కడ నుండి శబరిమల 12 కి.మీ. దూరాన గల మౌంట్ ఎస్టేట్ వరకు జీపు వంటి వాహనములతో వెళ్ళవచ్చు. అచ్చట నుండి శబరిమలకి కాలినడకనే వెళ్ళాలి. ఇందులో మొదటి 2 కి.మీ. నిటారైన, ఎత్తయిన, దట్టమైన వనప్రాంతం. ఆపై 5 కి.మీ. వరకు సుమారు 4500 అడుగుల ఎత్తుగల ప్రాంతమంతా గడ్డి మొలిచి కనపడుతుంది. మిగిలిన 6 కి.మీ. వరకూ కొండ దిగ లేని అడవి మార్గం. తమిళనాడు నుండి బైలుదేరేవారు కుమిళి మార్గాన ఇచ్చటికి వచ్చి యీ బాటలో శబరిమల చేరుతుంటారు. ఈ దారిలో అళుదానది స్నానం, పంబానది స్నానం భక్తులకు లభించదు. కాని సులువైనది ఎరుమేలి నుంచే...

మధురై, చెంగొట్టై, పునలూరు నుంచి బస్సు రాకపోకలున్నాయి పంబ వరకూ. అక్కడ్నించి 6 కి.మీ. దూరం సన్నిధానం. ఇక్కడ్నించి ఎవరైనా కాలినడకనే వెళ్ళాలి వెళ్ళలేని అసహాయులకు డోలీలు వున్నాయి.

ఈ పవిత్ర ప్రదేశం దగ్గరిలోని రైల్వే స్టేషన్స్‌లో దేశంలోని చాలా వైపులకు ట్రైన్స్ వున్నాయి

6160 కొల్లం... చెన్నై మెయిల్... ఇది కొల్లం జంక్షన్ నుంచి బైలుదేరుతుంది. కొట్టారక్కర చేరి, పునలూరు, శింకోట్టైను, విరుదునగర్, కారైకుడి, తిరుచ్చిరాపల్లి మీదుగా చెన్నై ఎగ్మూరు చేరుకుంటుంది. (దూరం 780 కి.మీ.)

6320 తిరువనంతపురం... చెన్నై మెయిల్... చెంగన్నూరు, కొట్టాయం, ఎర్నాకుళము, తిరుచ్చూరు నుండి చెన్నైకి చేరుతుంది.

6048 అలప్పి... చెన్నై ఎక్స్‌ప్రెస్ ... ఎర్నాకుళం, తిరుచ్చూరు మీదుగా చెన్నై చేరుతుంది.

6017 హిమసాగర్ ఎక్స్‌ప్రెస్ ... ప్రతి శుక్రవారం... చెంగన్నూరు కొట్టాయం, ఎర్నాకుళం, తిరుచ్చూరు మీదుగా జమ్మూకు వెళుతుంది.

6321 తిరువనంతపురం... గౌహతి ఎక్స్‌ప్రెస్ (ప్రతి గురువారం) చెంగన్నూరు, కొట్టాయం, ఎర్నాకుళం, తిరుచ్చూరు మీదుగా గౌహతి వెళుతుంది.

కొచ్చిన్-హైదరాబాద్ ఎక్స్‌ప్రెస్.... ప్రతి శని, మంగళవారములు ఎర్నాకుళం

మీదుగా హైదరాబాద్ వెళుతుంది.

7057 కొచ్చిన్ - ఫిలాస్‌పూర్ ఎక్స్‌ప్రెస్... ప్రతి ఆదివారం...ఎర్నాకుళం, తిరుచ్చి, షొర్నూరు మీదుగా ఫిలాస్‌పూర్ వెళుతుంది.

6315 హౌరా ఎక్స్‌ప్రెస్ .. ప్రతి ఆది, బుధ.. ఎర్నాకుళం, తిరుచ్చూరు, చెన్నై మీదగా హౌరా చేరుతుంది.

6309 కొచ్చిన్ - పాట్నా ఎక్స్‌ప్రెస్ .... సోమవారం. 1082 కన్యాకుమారి ఎక్స్‌ప్రెస్ 2025 కేరళ-ఢిల్లీ ఎక్స్‌ప్రెస్, 6525 కన్యాకుమారి - బెంగుళూరు ఎక్స్‌ప్రెస్, కొట్టాయం, చెంగన్నూరు, ఎర్నాకుళం నుంచి కలవు.

ఇంకా 6349 పరశురాం ఎక్స్‌ప్రెస్ పై స్టేషన్స్ నుంచి మంగుళూరు వెళ్ళే ట్రైన్, ఇంకా మధురై నుండి 6800 తిరుపతికి మీనాక్షీ ఎక్స్‌ప్రెస్ కూడా కలదు.

**తిరువాభరణం :** మకర సంక్రమణ సాయం సంధ్యా దీపారాధన వేళలో పందళ రాజధాని నుండి పాదయాత్రగా సాగివచ్చిన శ్రీ స్వామి తిరువాభరణములు మకర సంక్రాంతి సాయంత్రం స్వామికి అలంకరిస్తారు. అదే సమయాన శబరిమలకు ఎదురు వున్న కాంతిమలై శిఖరాగ్ర భాగము నుండి శ్రీ స్వామి వారు జ్యోతి స్వరూపుడై భక్తులకు దర్శనమిస్తారు. అప్పుడు కొన్ని లక్షల మంది "అయ్యప్పా" అనే అముక్తకంఠంతో పిలిచితే ఆ శబ్దము వినవలసిందే తప్ప చెప్పుటకు, రాయుటకు సాధ్యపడదు... అదో అద్భుతం... అమోఘం... మానవజన్మలో వెళ్ళగలిగిన చూడగలిగిన వైకుంఠం.

# ఒరిస్సా

ఒరిస్సా (జ్యూయెల్ ఆఫ్ ది ఈస్ట్) విస్తీర్ణం 1,55,707 చ.కి. మీటర్లు. ఇందు జనాభా 1991 ప్రకారం 3,15,12,070.

**ప్రధాన నగరాలు, పట్టణాలు :** సుందర్ ఘర్, రూర్కెలా, సంబల్‌పూర్, పూరి, పలాబని, కటక్, చిత్తార్‌పురి, భువనేశ్వర్, బొలాంగిర్, బలేశ్వర్, బరిపాడ, బర్హంపూర్.

తూర్పున బంగాళాఖాతం, ఈశాన్యాన పశ్చిమ బెంగాల్, దక్షిణాన ఆంధ్రప్రదేశ్ - పశ్చిమాన మధ్యప్రదేశ్, ఉత్తరాన బీహార్ ఈ రాష్ట్ర సరిహద్దులు.

**వాతావరణం :** వేసవికాలం 49°C నుంచి 27°C వరకూ, చలికాలం 16°C నుంచి 5°C వరకూ.

**విశ్వవిద్యాలయాలు :** ఉత్కల్ విశ్వవిద్యాలయం భువనేశ్వర్లోనూ, సంబల్‌పూర్ విశ్వవిద్యాలయం సంబల్‌పూర్లోనూ, బర్హంపూర్‌లో ఆ పేరుతోనూ విశ్వవిద్యాలయాలు వున్నాయి.

**యాత్రా పర్యాటక ప్రదేశాలు :** భువనేశ్వర్ (అనేక ప్రాచీన దేవాలయాలు) గోపాల్‌పూర్ (పిక్నిక్ స్పాట్) పూరి (కోస్తా పట్టణమైన ఈ పూరీలో ప్రసిద్ధి చెందిన జగన్నాథ

దేవాలయం వుంది) సాక్షి గోపాల్ (పూరికి దగ్గరున్న ఈ క్షేత్రంలో బాలగోపాల దేవాలయం వుంది) కోణార్క్ (సూర్య దేవాలయం) చిల్కా సరస్సు (మనోహరమైన పిక్నిక్ స్పాట్) హీరాకుడ్ (మహానదిపై నిర్మించిన డామ్ ప్రత్యేక ఆకర్షణ) నందన్‌కానన్ (జులాజికల్ పార్క్, సరస్సులో నౌకా విహారం ఒక మధురాతి మధురమైన అనుభూతి) చాంద్‌పూర్ (సముద్ర తీర విశ్రాంతి ప్రదేశం, బెంగాల్‌లో ప్రవేశించే ముందు తగిలే ఆఖరి పట్టణం) ఇంకా అనేక విహారయాత్రా ప్రదేశాలు యీ లోపల పేజీల్లో.

ఈ విహారయాత్రా ప్రదేశాలన్నీ అక్టోబరు నుండి మార్చిలోపు చూడండి. చైనా యాత్రికుడు హ్యుయాన్‌సాంగ్ 7వ శతాబ్దంలో యీ ప్రాంతాన్ని దర్శించారు. తప్పనిసరిగా చూసి తరించాల్సినవి ఎన్నో దేవాలయాలున్న ఈ రాష్ట్రంలో ప్రధాన భాషలు : ఒరియా, హిందీ.

ఎయిర్ పోర్ట్స్... భువనేశ్వర్, రూర్కెలా.

### టూరిస్ట్ ఇన్ఫర్మేషన్ కేంద్రాలు

డిపార్టుమెంట్ ఆఫ్ టూరిజం, గవర్నమెంట్ ఆఫ్ ఒరిస్సా, జయదేవ్ మార్గ్, నియర్ పాంథ నివాస్, భువనేశ్వర్.

గవర్నమెంట్ ఆఫ్ ఇండియా టూరిస్టు ఆఫీసు, B/21, B.J.B. నగర్, కల్పన ఏరియా, భువనేశ్వర్ ఫోన్ : 54203.

ఒరిస్సా టూరిజం డెవలప్‌మెంటు కార్పొరేషన్, ఓల్డ్‌బ్లాక్, పాంథ నివాస్ లూయిస్ రోడ్, భువనేశ్వర్ ఫోన్ : 54727.

## భువనేశ్వర్

ఒకప్పుడు కళింగ పట్టణమని పిలవబడిన ఈ భువనేశ్వర్ ప్రస్తుతం ఒరిస్సా రాజధాని. ఈ పట్టణాన్ని క్రీ.శ 2వ శతాబ్దంలో జైనచక్రవర్తి పరిపాలించినట్టు ఇక్కడికి దగ్గరలో వున్న శిశుపాల గృహంలో తవ్విన తవ్వకాల్లో బయటపడ్డ ఆధారాలు చెబుతున్నాయి. ఒకప్పుడు ఎన్నోవేల దేవాలయాలున్న ఈ భువనేశ్వర్‌లో ఇప్పుడు కూడా 500 ఆలయాలున్నాయి. శిధిలావస్థలో వున్న ఈ ఆలయాలన్నీ ముక్కోటి దేవతలకి అత్యంత ప్రీతికరం. అన్ని ఆలయాలు బిందు సరోవరం చుట్టూ వుంటాయి. అన్ని పుణ్యనదుల్లో నీరు వక్కటిగా చేరి ఇక్కడ బిందు సరస్సుగా మారిందని స్థల మహత్యంలో తెలుస్తోంది ఇక్కడికి ధావులి కొండలు 8 కి.మీ. దూరం.

ఈ కొండ మీద 3వ శతాబ్దం నాటి అశోక చక్రవర్తి శాసనాలు వున్నాయి. ధావులి కొండలనుంచి ఉదయగిరి పద్దెనిమిది (18) కిలోమీటర్లు. ఖండగిరి 6 కిలోమీటర్లు ఇవి జంట పర్వతాలుగా పేరు. ఈ పర్వతాలలో జైనుల నివాసం కొరకు గుహలు తొలవబడ్డాయి. ఇక్కడ ఎలిఫెంట్ కేవ్‌లో కళింగ చరిత్రకు అద్దంపట్టిన శాసనాలు వున్నాయి.

మహాద్వారాలతో నిర్మించబడిన మరోకోట శిశుపాల నగర్, యిది కేవలం 5 కి.మీ. దూరంలో వుంది. ఈ కోట 300 సంవత్సరాల క్రితంది.

20 కి.మీ. దూరంలో నందనకానన్ బొటానికల్ జూలాజికల్ గార్డెనేకాక మంచి పిక్నిక్ స్పాట్ కూడా వున్నాయి.

యింకా భువనేశ్వర్ లో లింగరాజాలయం వుంది. ఇక్కడ ప్రవేశం హిందువులకే. ఇక్కడ వున్నది త్రిభువనేశ్వరుడు. ఈ దేవాలయం పునాది 1400 సంవత్సరాల క్రితం జరిగింది. 40 మీటర్ల ఎత్తువుండే యీ గంభీర హైందవ దేవాలయంలో అడుగడుగువా కనిపించే శిల్పాలు అబ్బుర పరుస్తాయి. ఇక్కడినుంచి కుడిపక్కగా వెళితే రాజారాణి ఆలయం వస్తుంది. యిక్కడ స్థంభాల మీద చెక్కిన శిల్పాలు శృంగారనైషధాన్ని గుర్తుకు తెస్తాయి. రమ్యంగా మలిచిన రసపూరిత జంటలు సజీవంగా వున్నట్లు అన్పించక మానదు. పరమాద్భుతాన్ని కలిగించే ముక్తేశ్వరాలయం, బ్రహ్మేశ్వరాలయం, వాసుదేవాలయం తప్పనిసరిగా చూడతగ్గవి ఒరిస్సా సంస్కృతికి అద్దంపట్టే అనేక తాళపత్రాలు, శిల్పఖండాలు అనేక ఆయుధాలు గల మ్యూజియం హోటలు కళింగ మరు వుంది. ఈ పట్నం నుంచి తిరుపతి, చెన్నై, కలకత్తా, ఢిల్లీలకు వెళ్ళటానికి కావలసినన్ని సూపర్‌ఫాస్ట్ ట్రైన్స్ వున్నాయి. పూరి నుండి వచ్చే అన్ని రైళ్ళు ఈ నగరానికి రావల్సిందే.

భువనేశ్వర్ నుండి కోణార్కు 64 కి.మీ. పూరి 56 కి.మీ. కలకత్తా 498 కి.మీ.

**గోపాల్‌పూర్:** ఈ సుందర సముద్రతీరం బర్హంపూరు నుంచి 18 కి.మీ దూరంలో వుంది. ఇక్కడనుండి 45 కి. మీ దూరంలో తప్తపానీ అనేచోట ఉష్ణ కుండం వుంది. ఆ హటకేశ్వరాలయాన్ని కూడా దర్శించి దగ్గరిలో వున్న స్టేషనుకి వస్తే పూరి, కోణార్కు వెళ్ళటానికి ట్రైను సౌకర్యం వుంది. గోపాల్‌పూర్‌లో వసతికి ఓబరాయ్‌పామ్ బిచ్ వుంది ఫోను: 23.

**చిల్కా సరస్సు:** కొన్ని మైళ్ళ (11005Sq Kms.) దూరం వ్యాపించి వున్న జలాశయం, ఇందులో జంటలు నౌకా విహారం చేయచ్చు. వెన్నెల రాత్రిలో యీ అద్భుతమయిన జలాశయంలో విహారం అత్యంత ఉల్లాసభరితం. యీ ప్రాంతానికి ఎన్నో వింత వింత పక్షులు వచ్చి పలకరిస్తుంటాయి. శీతాకాలంలో అయితే ఎంతో దూరంనుంచి అరుదయిన అందమయిన పక్షులు వస్తాయి. ఇక్కడికి వసతికి వరికుండ్ ప్యాలెస్ వుంది.

**కటక్:** కత్‌జోరి నదులతో చుట్టబడివున్న ఈ పట్టణం మూడువైపులా మహానది ప్రవహిస్తోంది. 13వ శతాబ్దంలో బాలాబతి కోట చూసి, కావలసినంతమేర షాపింగ్ చేసుకోవచ్చు. సిల్కు చీరల దగ్గర్నించి వెండి పాత్రల వరకూ బేరమ: శితే చౌకగా వస్తాయి. అలంకరణ సామాగ్రి కూడా దొరుకుతుంది. వుండటానికి కావలసినన్ని హోటళ్ళు మచ్చుకు కొన్ని... ఆనంద్, కెనాల్ బ్యాంక్ రోడ్డు టెలిఫోన్ 21396 తిరుమూర్తి

ఇంటర్నేషనల్, లింక్ రోడ్, టెలిఫోన్ 22918 ఇంకా YWCA హాస్టల్ వుంది.

రత్నగిరి: అనేక బౌద్ధ శిల్పాలు, బుద్ధుని విగ్రహాలు అనేకం వున్నాయి. గుప్తుల కాలంనాటి చరిత్రకు అద్దంపట్టే ఈ రత్నగిరి ఒకప్పుడు నిజంగా రత్నాలగిరే. కటక్ నుండి 65 కి.మీ దూరం.

**టికార్ పారా:** క్రొకొడైల్ శాంక్చువరి, అంగ్రూల్‌కి 58 కి.మీ. దూరంలో వుంది. ఇందు విశేషం భారతదేశంలో జీవించే రకరకాల మొసళ్ళు చూడటం మనకు మర్చిపోలేని అనుభూతిగా మిగులుతుంది.

**హీరాకుడ్:** దేశంలో అతి పెద్దదైన ఈ ఆనకట్ట మహానదిపై నిర్మించబడినది. ఇక్కడికి దగ్గరలోనే హ్యూమ నది పరిసరం, ప్రకృతి తమ సమస్త అందాలను ఇక్కడే పరిచిందా అన్నట్టు అన్పిస్తుంది. ఇక్కడే శివాలయం వుంది.

**ఓఢ్యాణము:** అమ్మవారి పద్దెనిమిది శక్తిపీఠాల్లో ఒకటి. ఇక్కడి గిరిజాదేవి అంటే భక్తులకు అపారమైన భక్తి.

**ఉషాకోటి:** కాకులు దూరని కారడవి, చీమలు దూరని చిట్టడవి అన్న పదాలకు అర్థం ఇక్కడే తెలుస్తుంది. విపరీతంగా పెరిగిన వృక్షజాతులు మధ్య, పులులు, సింహాలు, చిరుతలు, ఏనుగులు, వక్కటేమిటి అడవిలో వుండాల్సినవన్నీ వుంటాయి, స్వేచ్ఛగా తిరుగుతూ. ఈ ప్రాంతాన్ని అక్టోబరు నుండి జూన్‌లోపు చూడండి. వసతికి బద్రామ బంగాళా వుంది. తినటానికి వెళ్ళేటప్పుడు తీసుకెళ్ళండి.

**పూరి:** ఈ పూరినే జగన్నాథ్ పురి అంటారు. శక్తి పీఠములలో 17 వది అయిన ఈ జగన్నాథాలయం బంగాళాఖాత తీర ప్రాంతంలో వుంది. ఈ ఆలయంలో ప్రవేశం హిందువులకి మాత్రమే. స్వామికి తోడుగా బలరాముడు, చెల్లెలు సుభద్రల విగ్రహాలు ఈ ఆలయంలో వున్నాయి. 7వ శతాబ్దం ఏలిన గంగ వంశపు రాజు రెండవ మహాశివగుప్త యయాతి కట్టించాడు.

శంఖాకారంగా వున్న ఆలయ గోపురం 58 మీ. ఎత్తు వుంటుంది. ఈ గోపురం జెండామీద సుదర్శన చక్రం వుంటుంది. గరుడ స్తంభం ముందున్న ప్రధాన ద్వారానికి అటూ, ఇటూ రెండు రాతి సింహాలు గంభీరంగా ద్వారపాలకుల్లా వుంటాయి. ఈ ఆలయ నిర్వహణంలో ఎన్నో వేలమంది జీవనభృతి పొందుతున్నారు. ఈ ఆలయంలో అసలు విశేషం రథయాత్ర.

ఈ రథయాత్ర లోక ప్రసిద్ధం. ఆషాఢ మాసంలో జరిగే ఈ రథోత్సవాన్ని తిలకించటానికి ఎన్నో లక్షలమంది వస్తారు. గుండిచ మందిరం వరకూ జరిగే ఈ యాత్ర గోకులం నుండి మధుర యాత్రగా చెబుతారు.

పధ్నాలుగు మీటర్ల ఎత్తుండే ఈ రథానికి 16 చక్రాలుంటాయి. ఈ రథచక్రాన్ని కాలచక్రంతో పోలుస్తారు. ఈ రథాన్ని లాగటానికి వేలమంది కావాలి. ఒకసారి కదిలిన

ఈ రథం ఆగదు. ఏ సంవత్సరం రథం ఆ సంవత్సరమే. గమ్యం చేరిన తర్వాత తిరిగి ఆలయానికి తెచ్చి విడగొడతారు.

ఈ పూరి జగన్నాథ ఆలయంలో ఎన్నో మందిరాలున్నాయి. శ్రీ గుండిచా మందిరం, చక్ర తీర్థం, గోపీనాథాలయం, శ్రీ గంగా మఠం ఇంకా ఎన్నో. మహోదధి స్వర్గద్వార్ సముద్రతీరంలో వుంది. దీనికి తోడు నరేంద్ర తీర్థం అనే ఈ తీర్థంలో స్నానం చేయండి. చాలా మంచిది.

పూరిలో బ్రహ్మాండమైన ఛార్మింగ్ బీచ్ కూడా వుంది. ఈ బీచ్‌లో సన్‌రైజ్, సన్‌సెట్ చూడవచ్చు. సముద్రంలోకి వెళ్ళటానికి బోట్లువున్న ఈ బీచ్ హనీమూనర్స్ పాలిట స్వర్గమే. తెలుగువారికి ఇక్కడికి వెళ్ళటానికి తిరుపతి పూరి ఎక్స్‌ప్రెస్ వుంది. కలకత్తా మిగతావారు భువనేశ్వర్ దిగి ఇక్కడికి రావచ్చు. పూరికి 60 కి.మీ దూరములో (భువనేశ్వర్) ఎయిర్ పోర్టు వుంది.

## సాక్షిగోపాల్

కమనీయమైన కొబ్బరి తోటల మధ్యనున్న ఈ బాల గోపాలస్వామి దేవాలయం ఊరికి 17 కి.మీ దూరంలో వుంది. భువనేశ్వరం విమానాశ్రయానికి 67 కి.మీ దూరంలోవున్న ఈ దేవాలయములో ప్రభువు కన్నీటితో తడసిన గడ్డ ఇక్కడ వుంది. మందిరం చుట్టు ప్రదక్షిణంచేసి నిజమందిరంలో ప్రవేశించి స్వామిని దర్శించి ఇక్కడవున్న గరుడ స్తంభం కూడా చూచి తరించండి.

## కోణార్క్

క్రీ.శ. 13వ శతాబ్దంలో ఈ సూర్యదేవాలయాన్ని నరసింహదేవ నృపతి నిర్మించారు. ఈ ఆలయ శిల్పము అమోఘం. 70 మీటర్ల ఎత్తు వుండే ఈ గోపురం ఇంత పెద్ద ఆలయం, ఇసుక వేలలో వుంది. శాస్త్ర పరిశోధకులకి కూడా అంతుపట్టని మర్మం అది. ఇక్కడ మ్యూజియం కూడా వుంది. ఈ ఆలయాన్ని నిర్మించటానికి అప్పట్లోనే పన్నెండు సంవత్సరాలు పట్టిందట. ఆలయ గోపురం చాలా కాలం క్రితం వొరిగిపోయింది. లేకపోయితే దేశంలోనే పెద్ద దేవాలయంగా నిలిచేది. ఏడు అశ్వాలు రథాన్ని లాగుతుంటే సూర్యభగవానుడు నిలుచుని వుంటాడు. ఈ రథాకృతి చూచి తరించవలసినదే కాని చెప్పుట, వ్రాయుట తరముకాదు. సప్తాశ్వరథారూఢుడైన ఈ స్వామిని దర్శించటానికి పూరినుండి, సముద్రపు ఒడ్డున నుంచి రోడ్ వుంది. ఈ ఆలయంలో ప్రత్యేక ఆకర్షణ సుర సుందరుల విలువైన శిల్పాలు.

వసతికి అశోకా ట్రావెలర్స్ లాడ్జి టెలిఫోను: 23 OTDL పాంధనివాస్ టెలిఫోను: 231 వున్నాయి.

## ఇంకా ఒరిస్సాలో చూడదగిన యాత్రా కేంద్రాలు

**ఉత్తరాన ఖీచింగ్** : పురాతన నగరం. ఇక్కడ త్రవ్వకాల్లో అపురూపమైన వస్తువులు బైటపడ్డాయి. అన్నింటిని మ్యూజియంలో వుంచారు.

**సప్తసాజ్య:** ధాంకనాల్ పట్టణానికి 11 కి.మీ దూరములోవున్న సుందర ప్రదేశం దగ్గరలోనేవున్న బాగ్రాలోని జలపాతం చూడదగినవి.

**హరిశంకర్** : గంధ మాదన పర్వతంలో అమరి వుంది. ఉత్తరాన సానువుల్లో నృసింహనాథ ఆలయం వుంది. ఈ రెండు చూడాలనుకుంటే 16 కి.మీ పీఠభూమి ఎక్కాలి.

**బరిపడ** : అతి పురాతన కట్టడములు, అనేక దేవాలయాలు వున్నాయి. ఇక్కడికి పదిహేను కిలోమీటర్ల దూరములో హరిపూర్ వుంది. ఇందు శిధిలమైన అనేక గుళ్ళు వున్నాయి.

**బౌద్ధ్** : దేవాలయాలు, త్రవ్వకాల్లో బయటపడిన బుద్ధుడి కాలం నాటి చిహ్నాలు.

**జయపూర్** : పురాతన ప్రదేశాలున్న ఈ ప్రదేశంలో చేతి పనులు ద్వారా తయారయిన వస్తువులు దొరుకుతాయి. ఇక్కడికి దగ్గరిలోనే బోగ్రాల్ జల పాతాలు వున్నాయి. ఇరవై ఒక్క కిలోమీటర్ల దూరములోవున్న కొరాపుట్ చుట్టూ అడవులు, భక్తి ప్రాధాన్యత గల దేవాలయాలు కనిపిస్తాయి.

**పరదీప్:** ఇండియాలో అతి పెద్దదైన కోట ఇక్కడే ఉంది.

**రాణిపూర్:** ఝురియన్, శిధిలమైన దేవాలయాలు ఎన్నో ఉన్నాయి.

**రూర్కెలా:** కాంధదారి వాటర్ ఫాల్స్, పిక్నిక్ స్పాట్స్, అనేక పార్కులు ఇక్కడే స్టీల్ ప్లాంట్ కూడా ఉంది.

**సమ్లిపల్:** నేషనల్ వైల్డ్‌లైట్ పార్క్, జలపాతాలు వీటిని అక్టోబరు, జూన్ మధ్యలో చూస్తే బావుంటుంది.

**చాంద్‌పూరు:** పశ్చిమ బెంగాల్ రాష్ట్ర ముఖద్వారంగా ఉండే బాలసోరులో సముద్రతీర విశ్రాంతి కేంద్రముంది.

**జాజ్‌పూరు:** దుర్గమ్మవారి శక్తి పీఠాల్లో ఒకటి ఇక్కడే వుంది. ఇక్కడికి దగ్గరిలో అఖండలేశ్వర్, త్రిలోచనేశ్వర్ లింగేశ్వర్ ఆలయాలున్నాయి. ఇక్కడికి వైతరణి 20 కి.మీ దూరము. ఈ నదీ తీరంలో బ్రహ్మకుండం దగ్గర తీర్థ విధులు పెట్టవచ్చు.

# భారతదేశంలోని (12) జ్యోతిర్లింగాలు

**సోమనాథ్** : సౌరాష్ట్రంలో ఉంది. దేవపట్నం అనికూడా అంటారు. 1951లో పునఃప్రతిష్ఠించిన ఈ దేవాలయం తురుష్కదండయాత్రవల్ల దెబ్బతింది. రోగులు, అనేక బాధలు వున్నవారు ఈ సోమనాధుని దర్శిస్తే అన్ని బాధల నుండి విముక్తి.

**శ్రీశైల మల్లికార్జున స్వామి** : చంద్రావతి అనే మహారాణి పూజించడంతో మల్లిఖార్జునుడిగా ప్రసిద్ధికెక్కింది. ఆంధ్రప్రదేశ్‌లో కర్నూల్ జిల్లాలో ఉంది. ఈ ప్రసిద్ధి చెందిన శైవక్షేత్రం. ఇక్కడి శ్రీశైల శిఖరమును దర్శించిన పునర్జన్మ లేదు.

**శ్రీ ఓంకారేశ్వర్** : ఇక్కడ స్వామి మాంధాత పర్వతం మీద వెలిశారు. నర్మదా తీరంలో మాళ్వాప్రాంతంలో ఉజ్జయినికి 140 కి.మీ. దూరంలో వుంది ఈ ఓంకారేశ్వర్.

**శ్రీ మహాకాళేశ్వర్** : అన్ని తీర్థాలలోకెల్ల గొప్ప తీర్థము. ఉజ్జయినిలో ఉంది. శ్రీ మహాకాళేశ్వర్ షిప్రానది ఒడ్డున ఉన్నది.

**శ్రీ కేదారినాథ్** : ఉత్తరప్రదేశ్‌లో వుంది. నరుడు, నారాయణుడు హిమాలయాలలో తపస్సు చేసారు. వారి తపస్సుకి మెచ్చి శంకరుడు ఇచ్చట జ్యోతిర్లింగంగా వెలిసాడు. ఈ క్షేత్రమున జలము తాగినా పునర్జన్మలేదు.

**శ్రీ భీమశంకర్** : మహారాష్ట్రలోని పూనా నుంచి 50 కి.మీ. దూరంలో ఖేడ్ ప్రాంతంలో బోవాగిరిపైన ఉంది. ఇక్కడి విశేషం స్వామిలింగం నుంచి నీరు కారుతుంటుంది. ఇక్కడే భీమానది ప్రారంభమవుతుంది.

**శ్రీ విశ్వనాథ్** : ఇక్కడ శివుడిని విశ్వనాధుడిగా కొలుస్తారు. అన్నపూర్ణ మహాదేవి వెలిసిన ఇచ్చట శంకరుని శాశ్వత నివాసం. చాలా పురాతనమైన ఈ దేవాలయం ఎన్నో దాడులకి తట్టుకొని నిలిచి ఉంది. ఈ వారణాసి క్షేత్రమందు మరణించిన మరి జన్మలేదు.

**శ్రీ త్రయంబకేశ్వర్** : స్వయంభులింగం. నాసిక్ నుంచి 30 కి.మీ. దూరం నీటిమధ్యలో వున్న స్వామిలింగం గురించి పద్మపురాణంలో ప్రత్యేకంగా చెప్పబడి ఉంది.

**శ్రీ వైద్యనాథ్** : పశ్చిమ బెంగాల్ సంతాల్ పరగణాలో దేవోగర్ అన్నచోట ఉంది. ఇక్కడి లింగాన్ని రావణాసురుడు ప్రతిష్ఠించాడు.

**శ్రీ నాగేశ్వర్** : సుప్రియ అనే భక్తునికి శివుడు ప్రత్యక్షమై కాపాడింది ఇక్కడే. ద్వారక నుండి బెట్ ద్వారకకు పోయే దారిలో వుంది.

**శ్రీ రామేశ్వర్** : ఇక్కడి స్వామి రామలింగేశ్వరుడు. ఈ రామేశ్వర్ తమిళనాడులో వుంది. ఇక్కడి జ్యోతిర్లింగాన్ని స్వయంగా శ్రీరాముడు, రావణాసురుని

వధించాక విమోచన కోసం ఇక్కడ ప్రతిష్ఠించారు. ఇక్కడే సీతాదేవి ఇసుకతో చేసిన శివలింగాన్ని కూడా దర్శించవచ్చు. అతిపురాతనమైన ఇక్కడ గంగాజలంతో స్వామిని అభిషేకిస్తారు.

**శ్రీ గుషమేశ్వర్** : సుదేహ అనే భక్తురాలికి స్వామి ఇక్కడే ప్రత్యక్షమయింది. ప్రసిద్ధి చెందిన ఎల్లోరా గుహల వద్ద ఉంది ఈ శ్రీగుషమేశ్వర్.

## సప్తనదులు

గంగ, యమున, గోదావరి, సరస్వతి, నర్మద, సింధు, కావేరి.

## పంచ భూత లింగములు

**1) పృథివి** : మద్రాసుకి 90 కి.మీ. దూరంలో ఉన్న కంచిలో ఉంది. సప్త మహాక్షేత్రాలలో ఒకటైన ఈ కంచిలో శివ, విష్ణుదేవాలయాలున్నాయి. ఇక్కడున్న మామిడిచెట్టుకిందే పార్వతీదేవి శంకరుణ్ని ప్రసన్నం చేసుకోవటానికి తపస్సు చేసింది. ఆ ప్రదేశం వద్దే ఏకాంబరనాథుడిగా స్వామి వెలిశారు. 557 మీటర్ల ఎత్తుగల గోపురం గల ఈ ఆలయాన్ని దర్శించినవారు ధన్యులు. అష్టాదశ శక్తి పీఠాల్లో ఒకటి అయిన శ్రీ కామాక్షిదేవిని ఇక్కడే దర్శించవచ్చు.

**2) నీటి లింగాలు** : జంబూ వృక్షం కింద వెలిసింది. అందువల్లే స్వామిని ఇక్కడ జంబుకేశ్వరుడని సంబోధిస్తారు. ఇక్కడ లింగం చుట్టూ నీరు ఉంటుంది. ఎంత తీసినా వస్తుంది. ఈ ఆలయంలో మధ్యాహ్నం ఆడవేషం వేసుకొని పూజిస్తారు. తమిళనాడులో వున్న ఈ క్షేత్రంలో చోళ, పాండ్య, హోయసల శాసనాలున్నాయి. ఈ క్షేత్రం నుంచి శ్రీరంగం 10 కి.మీ. దూరం.

**3) తేజోలింగం** : చెన్నై నుండి 165 కి.మీ. దూరం. అరుణాచలంలో వున్న దీనిని తిరువణ్ణామలై అని కూడా అంటారు. శ్రీ రమణ మహర్షి ఇక్కడే సిద్ధి పొందారు. కార్తీకమాసంలో బ్రహ్మాండమయిన దీపాల పండుగ జరుగుతుంది. పార్వతీదేవి ఇక్కడ ఘోరతపస్సు చేసి శివునికి అర్థభాగమైంది.

**4) వాయులింగం** : మన ఆంధ్రప్రదేశ్‌లో తిరుపతికి అతి దగ్గిరలో శ్రీకాళహస్తిలో ఉంది. భక్తకన్నప్ప సేవించి, తరించిన ఈ వాయలింగం గర్భగుడిలో చిన్నకన్నంగాని, మరే ఇతర ప్రదేశాలనుంచి గాలి, వెలుతురు వచ్చే అవకాశంలేదు. అయినా కాంతి ఉంటుంది. అందువల్లే దీన్ని వాయులింగమంటారు.

**5) ఆకాశలింగం** : చెన్నైకు 220 కి.మీ. దూరంలో ఉంది చిదంబరం. అత్యంత ప్రాచీన దేవాలయం. ఇక్కడ వున్న లింగం నుంచి నటరాజు ప్రత్యక్షమై నాట్యం చేశారు. ఎందరో భక్తులు ఇక్కడ శివైక్యం పొందారు. విల్లుపురం నుంచి తంజావూరు వెళ్లే మార్గంలో వున్నదీ క్షేత్రం. విల్లుపురం నుంచి చిదంబరం 82 కి.మీ.

# అష్టాదశ శక్తి పీఠాలు
## (కాళికాపురాణం ఆధారంగా)

| | | |
|---|---|---|
| 1. శ్రీ శాంకరీదేవి | (త్రింకోమలీ) | శ్రీలంక |
| 2. శ్రీ కామాక్షీదేవి | (తమిళనాడు) | కంచి |
| 3. శ్రీ సింహళదేవి | (బెంగాల్) | ప్రద్యుమ్నం |
| 4. శ్రీ చాముండీదేవి | (మైసూర్) | కంస పట్టణం |
| 5. శ్రీ జోగుళాంబాదేవి | (కర్నూలుజిల్లా) | అలంపురం |
| 6. శ్రీ భ్రమరాంబాదేవి | (కర్నూలుజిల్లా) | శ్రీశైలం |
| 7. శ్రీ మహాలక్ష్మీదేవి | (మహారాష్ట్ర) | కొల్లాపురం |
| 8. శ్రీ ఏకవేణికాదేవి | (మహారాష్ట్ర) | మాహార్యాం |
| 9. శ్రీ మహాకాళీదేవి | (మధ్యప్రదేశ్) | ఉజ్జయినీ |
| 10. శ్రీ పురుహూతికాదేవి | (ఆంధ్రప్రదేశ్) | పిఠాపురం |
| 11. శ్రీ గిరిజాదేవి | (ఒరిస్సా) | ఓఢ్యాణం |
| 12. శ్రీ మాణిక్యాదేవి | (ఆంధ్రప్రదేశ్) | చిత్రకూటం |
| 13. శ్రీ కామరూపాదేవి | (అస్సాం) | హరిక్షేత్రం |
| 14. శ్రీ మాధవీశ్వరీదేవి | (ఉత్తరప్రదేశ్) | ప్రయాగ |
| 15. శ్రీ వైష్ణవీదేవి | (జమ్మూరాష్ట్రము) | జ్వాలాక్షేత్రం |
| 16. శ్రీ సర్వమంగళాదేవి | (గయవద్ద) | గయ |
| 17. శ్రీ విశాలాక్షిదేవి | (కాశీక్షేత్రమున) | వారణాసి (కాశి) |
| 18. శ్రీ సరస్వతీదేవి | (కాశ్మీర్) | కాశ్మీరం |

**పంచసరోవరములు** : 1) బిందు సరోవరము (సిద్ధపూర్) 2) నారాయణ సరోవరం (కచ్ఛి) 3) పంపా సరోవరం (కర్నాటక) 4) పుష్కర సరోవరం (రాజస్థాన్) 5) మానససరోవరం (టిబెట్).

**నవారణ్యములు** : 1) దండకారణ్యము 2) సైంధ వారణ్యము 3) పుష్కరారణ్యము 4) నైమిశారణ్యము 5) కురుజాంగలము 6) ఉత్పలావర్తకారణ్యము 7) జంబూ మార్గము 8) హిమవదరణ్యము 9) అర్బుదారణ్యము

# అష్టాదశ మహాపురాణములు

**బ్రహ్మపురాణం** : ఇందులో ఎన్నో క్షేత్రమహిమల గురించి చెప్పబడింది. 14,000 శ్లోకాలు, 245 అధ్యాయాలుగల ఈ పురాణంలో మరణానంతరం కలిగే అనేక అవస్థల గురించి చెప్పబడింది.

**పద్మపురాణం** : విష్ణువు గురించి చెప్పబడిన ఈ పురాణంలో 50,000 శ్లోకాలున్నాయి

**విష్ణుపురాణం** : 6,000 శ్లోకాలు మాత్రమే ప్రస్తుతం కలిగివున్న ఈ పురాణం 40,000 శ్లోకాలు కలది.

**వాయుపురాణం** : ప్రాచీన యోగ శాస్త్రానికి సంబంధించిన విషయాలతోపాటు సంగీత శాస్త్రానికి సంబంధించి అనేక విషయాలు విపులంగా ఉన్నాయి. ప్రాచీనమైన ఈ పురాణంలో 11,000 శ్లోకాలున్నాయి.

**శ్రీమద్భాగవతం** : 18,000 శ్లోకాలు ఏడు స్కంధాలుగా విభజించబడ్డాయి. పురాణాలకు ఉండవల్సిన ఐదు లక్షణాలేగాక భాగవతంలో చెప్పిన దశ లక్షణాలు కూడా ఉన్నాయి.

**నారదపురాణం** : వ్యాకరణ, నిరుక్త, జ్యోతిష్య చందః శాస్త్రాలకు సంబంధించిన విషయాలు కూడా గల ఈ పురాణంలో 25,000 వేల శ్లోకాలున్నాయి.

**మార్కండేయపురాణం** : 9,000 శ్లోకాలుగల పురాణం. వైదిక కర్మల ద్వారా కోరిన కోర్కెలను ఎలా పొందవచ్చో చెప్పబడింది.

**అగ్నిపురాణం** : దేవాలయాల ప్రతిష్ఠ, పూజావిధానాలతోపాటు జ్యోతిష్యశాస్త్ర, ధర్మశాస్త్ర, ఆయుర్వేద, వ్రతరాజనీతి, చందశాస్త్ర వ్యాకరణ అలంకార శాస్త్రాలకు సంబంధించి విపులంగా చెప్పబడింది. ఈ పురాణంలో అనేక తాంత్రికానుష్ఠానములను కూడా చర్చించటం జరిగింది.

**భవిష్యపురాణం** : 14,000 శ్లోకాలుగల ఈ పురాణంలో అనేక కాలాల [illegible] అనేక వ్యక్తుల గురించి, రాబోయే చరిత్ర గురించి తెలుపబడింది.

**బ్రహ్మవైవర్తపురాణం** : ఆయుర్వేదానికి సంబంధించిన విషయాలతోపాటు రాధాకృష్ణుల చరిత్ర గూడా వ్రాయబడింది. నాల్గు ఖండాలతో వున్న ఈ పురాణంలో కృష్ణజన్మ ఖండం పెద్దది. దీనిలో శ్లోకాల సంఖ్య 25,000.

**లింగపురాణం** : శైవమతానికి చెందిన తీర్థాలు, వ్రతాలు తెలుపబడిన ఈ పురాణంలో 11,000 శ్లోకాలున్నాయి. ఇందులో 163 అధ్యాయాలున్నాయి.

**వరాహపురాణం** : వివిధ లోహాలతో భగవత్ ప్రతిమ నిర్మాణము వాటి ప్రతిష్ఠ గురించి చెప్పబడిన ఈ పురాణంలో 11,000 శ్లోకాలున్నాయి.

**స్కంధపురాణం** : ఇందులో 81,000 శ్లోకాలున్నాయి. పురాణాలన్నింటి [illegible] పెద్దదయిన ఈ పురాణంలోనే శ్రీసత్యనారాయణ వ్రతకల్పము ఉన్నది. ఏడు [illegible]న్నాయి. ఈ పురాణంలో అనేక క్షేత్రాల గురించి వాటి మహాత్మ్యాలు గురించి [illegible]

వామనపురాణం : ప్రస్తుతం 6,000 శ్లోకాలు మాత్రమే అందుబాటులో ఉన్నాయి. వామనావతార వర్ణన ప్రధానంగా వున్న ఈ పురాణంలో మొత్తం ఉండవల్సిన శ్లోకాలు 10,000.

కూర్మపురాణం : శక్తిపూజకు ప్రాధాన్యమిచ్చిన ఈ పురాణంలో 18,000 శ్లోకాలున్నాయి. ప్రస్తుతం 6,000 శ్లోకాలుగల బ్రహ్మ సంహిత మాత్రమే అందుబాటులో ఉంది

మత్స్యపురాణం : కాశీప్రయాగ క్షేత్రాల గురించేకాక నర్మదానది పరిసర పుణ్యప్రదేశాల గురించి ఇందు చెప్పబడింది. 15,000 శ్లోకాలుగల ఈ పురాణంలో ప్రళయకాలంలో ఎన్ని నదులు నశించినా నర్మదానది నశింపదు అని చెప్పబడింది.

గరుడపురాణం : మనిషి మరణానంతరమున ఏ విధంగా లోకాంతరాలకు వెళతాడో, యమలోక మార్గం, ప్రేత లక్షణాలు, ప్రేతత్వవిముక్తి, యమలోక గర్భావస్థల గురించి ఎంతో విపులంగా చర్చించబడింది. ఈ పురాణంలో 18,000 శ్లోకాలున్నాయి.

బ్రహ్మాండపురాణం : 12,000 శ్లోకాలుగల ఈ పురాణంలో సమస్త బ్రహ్మాండము గురించి వర్ణించి చెప్పబడి ఉంది.

ఇంకా ఇవికాక పదునెనిమిది ఉపపురాణాలున్నాయి.

అవి వరసగా 1) ఆదిపురాణం 2) నరసింహ పురాణం 3) స్కాంద పురాణం 4) శివపురాణం 5) దూర్వాసపురాణం 6) నారదపురాణం 7) కపిలపురాణం 8) వామన పురాణం 9) ఔశనసపురాణం 10) బ్రహ్మాండ పురాణం 11) వరుణపురాణం 12) కౌశిక పురాణం 13) మహేశ్వరపురాణం 14) శాంబపురాణం 15) సౌరపురాణం 16) పరాశర పురాణం 17) మారీచ పురాణం 18) భాస్కరపురాణం

## సప్తసరస్వతులు

1) సుప్రభ (పుష్కరక్షేత్రమున) 2) కాంచనాక్షి (నైమిశారణ్యమున) 3) విశాల (గయాక్షేత్రమున 4) మనోరమ (ఉత్తర కోసలమున) 5) ఓఘవతి (కురుక్షేత్రమున) 6) సురేణు (హరిద్వారమున) 7) విమలోదక (హిమాలయమున)

## నాలుగు ధామాలు

ఈ అఖండ భారతావని నాలుగు మూలల నాలుగు ధామాలు వున్నాయి. గుజరాత్‌లో ద్వారక ధామం, తమిళనాడులో రామేశ్వర ధామం, ఉత్తరప్రదేశ్‌లో హరిద్వార్ వద్ద బదరీనాద్ ధామం, ఒరిస్సాలో జగన్నాథ్ ధామం.

1) రామేశ్వర ధామం : చైన్నై నుంచి ట్రెయిన్‌లోనూ బస్సులోనూ వెళ్లవచ్చు. ఇక్కడ శ్రీ కోదండరామస్వామి, సేతువ మాధవస్వామి ఆలయములున్నాయి. అరేబియా మహాసముద్రం, బంగాళఖాతం కలిసినచోట, సముద్రమధ్యలో ఓ అద్భుత చిన్నద్వీపం ఈ రామేశ్వరం. ఇక్కడ రామలింగేశ్వరుడిని కనులరా వీక్షించి సేవిస్తే కైవల్యం సునాయాసమని నమ్మిక.

2) బదరీనాథ్ ధామం : ఇక్కడ స్వామి శ్రీమహావిష్ణువు పద్మాసనాసీనుడై దర్శనమిస్తారు. ఉత్తరప్రదేశ్‌లోని హరిద్వార్ వద్ద వున్న బదరీనాథ్ చేరుటకు ఢిల్లీ, బొంబాయి లాంటి నగరాల నుంచేకాక వారణాసి, ఉజ్జయిని, కలకత్తాల నుంచి రైలు సౌకర్యం వుంది.

3) ద్వారకధామం : అరేబియా సముద్ర తీర ప్రాంతాన వున్నదీ ద్వారధామం. శ్రీ కృష్ణభగవానుడు సింహాసనాన్ని అధిష్టించి పరిపాలించిన పవిత్రప్రదేశం. గుజరాత్ రాష్ట్రంలో వున్న ఈ పుణ్యక్షేత్రంలో నారాయణ ఆలయం, రుక్మిణి ఆలయం వున్నాయి. ఇక్కడి స్వామి శ్రీకృష్ణభగవానుడిని దర్శించుకోవటానికి అహమ్మదాబాద్ నుంచి పూరిధామం నుంచి రైలు సౌకర్యం వుంది. అహమ్మదాబాద్ నుంచి ద్వారక 470 కి.మీ.

4) జగన్నాథ్‌ధామం : బంగాళఖాత తీరప్రాంతంలో ఒరిస్సారాష్ట్రంలో వుందీ ధామం. ఇక్కడి స్వామి జగన్నాథుడు. దీన్నే పూరి జగన్నాథ అనికూడా అంటారు. ఈ ఆలయంలో శ్రీకృష్ణుడు, బలరాముడు, సుభద్రల విగ్రహాలు ఉంటాయి. హిందువులకి మాత్రమే ప్రవేశమైన ఈ ఆలయంలో చక్రతీర్థం గోపినాథాలయం వున్నాయి.

## పంచారామాలు

దేవతలకు, రాక్షసులకు జరిగిన యుద్ధంలో శ్రీ కుమారస్వామి తారకాసురుడు అనే రాక్షసుడ్ని వధించి, అతని కంఠంలోని అమృత లింగాన్ని అయిదు ఖండాలుగా ఖండిస్తాడు. ఆ అయిదూ అయిదు ప్రదేశాల్లో పడతాయి. అవే పంచారామాలు. ఈ పంచారామాలు ఆంధ్రప్రదేశ్‌లోనే వున్నాయి.

అవి అమరారామము (అమరావతి), సోమారామము (భీమవరం), క్షీరారామము (పాలకొల్లు), ద్రాక్షారామము (తూర్పుగోదావరి జిల్లాలో), కుమారామం (సామర్లకోట).

1) అమరారామము : గుంటూరు నుంచి 27 కి.మీ. పవిత్ర కిష్టానదీ తీరమున నిలచిన శ్రీ అమరేశ్వరస్వామి మొదటిది. సుప్రసిద్ధ బౌద్ధ క్షేత్రముగా భాసిల్లిన ఈ క్షేత్రములో దేవేరి రాజ్యలక్ష్మి అమ్మవారిని కూడా దర్శించవచ్చు. ఇక్కడి స్వామి లింగము రోజురోజుకీ పెరిగిపోతుండటంతో శిరస్సున మేకు కొట్టగంతో ఆగిపోయింది. దాని తాలూకు గుర్తులు చూడవచ్చు. ఇక్కడ ఆర్కిలాజికల్ మ్యూజియం వుంది.

2) సోమారామము : ఇక్కడి స్వామి శ్రీ సోమేశ్వర జనార్ధనస్వామి. పంచారామాల్లో రెండోదయిన ఈ క్షేత్రంలో స్వామి లింగమును గోధుమ, నలుపు

వర్ణంలో వుంటారు. ఇక్కడ అమ్మవారిని, శ్రీ జనార్ధనస్వామిని దర్శించవచ్చు. భీమవరం నుంచి దగ్గర.

3) క్షీరారామము : పాలకొల్లులో వున్న ఈ క్షేత్ర స్వామి రామలింగేశ్వరస్వామి. పంచారామాల్లో మూడవదయిన ఇక్కడిస్వామి వెనుక భాగంలో చారలుంటాయి. ఇవి జడలని ప్రతీతి. ఇదే అమృత లింగానికి శిరోభాగం. నరసాపూర్ నుంచి 8 కి.మీ.

4) ద్రాక్షారామము : దక్ష ప్రజాపతి యజ్ఞాలు చేసిన ప్రదేశం. ఇక్కడి భీమేశ్వర లింగము 15 అడుగులుంటుంది. పై నుంచి అభిషేకాదులు చేస్తారు. తూర్పుగోదావరి జిల్లాలోని ఈ ద్రాక్షారామం పంచారామాల్లో నాలుగవది. ఇక్కడ అష్టాదశ శక్తిపీఠాల్లో ఒకటి అయిన మాణికాదేవిని కూడా దర్శించుకోవచ్చు. ఈ క్షేత్రము కాకినాడ, కోటిపల్లి వెళ్ళే మార్గంలో వుంది.

5) కుమారారామము : సామర్లకోట నుంచి అతిదగ్గర అలయాన్ని చాళుక్య భీముడు నిర్మించాడు. ఇక్కడ స్వామి లింగం ఎత్తయినది. పంచారామాల్లో చివరిదయిన ఈ క్షేత్రంలో బాలత్రిపుర సుందరీదేవినికూడా దర్శించుకోవచ్చు. ఇక్కడికి దగ్గరలో 12 కి.మీ. దూరంలో పిఠాపురంలో కుక్కుటేశ్వర లింగము వుంది. ఇక్కడే శక్తిపీఠం పురుహూతికదేవిని దర్శించవచ్చు.

**యాత్రలు చేస్తూ అనేక రాష్ట్రాలు తిరగవలసి వస్తుంది. ఆ సమయంలో భాష ఇబ్బంది తప్పనిసరి. అలాంటప్పుడు కొంత ఇబ్బంది తగ్గిస్తుంది ఈ నానా భాషా వాక్యములు.**

తె = తెలుగు, మ = మహారాష్ట్రం, గు = గుజరాత్, హిం = హిందీ, బెం = బెంగాలీ

తె : తమది యే యూరు ?

మ : అప్లాద కాంచ్ గావ్ ?

గు : తమె క్యాంవా రహేవాసీఛో ?

హిం : ఆప్‌కా క్యాగాంవ్ హై ?

బెం : ఆపని కోన్ దేశేర్ లోక్ ?

తె : ఇది యే యూరు ?

మ : ఏ కంచే గావ్ ?

గు : ఆజ గ్యామం నామ్ శుం ?

హిం : యహ్ క్యా గావ్ హై ?

బెం : ఏఇస్థా నేర్ నామ్‌కి ?

తె : దేవాలయ మెంత దూరమున్నది ?

మ : హిక్కడెహనూ కొడెదూర్ హై మందిర్ ?

ు మందిర్ కేరలుం దూర్‌చే ?

హిం మందిర్ కెత్‌నా దూర్ హై ?

మ మందిర్ కత్ దూర్ ఆఛే ?

తె . దేవాలయమునకు దారి యేది ?

మ : మందిర్‌లో కంచ బాజూలాదీ హై ?

. . మందిర్ మాంవానేరస్తోకయో ?

హిం : మందిర్ కో జానే కేలియే రాస్తా క్యా హై ?

బెం ' మందిరే జాయినార్ రాస్తా కోన్‌టి ?

తె : స్వామి దర్శన మెప్పుడగును ?

మ ' కంవ్యా భగవాన్‌సే దర్శన్‌హోతే ?

గు : కయే యే వఖతే శ్రీభగవాన్ నాందర్శన్ థాయేచే ?

హిం : భగవాన్‌కా దర్శన్ కబ్‌హోగా

బెం : రాకూర్ దర్శన్ కోన్ కోన్ సమయే హయ్

తె : ఇప్పుడెన్ని గంటలైనది ?

మ : ఆధా కెత్రి ఘంటావాజలా ?

ు : అన్యారే కేలాట్ వాగ్యా ?

హిం : అబ్ కితెనే బజే హై

బెం : వర్తమానే కటా బేజేచే ?

తె : మార్కెట్టు ఎక్కడ [illegible] ?

మ . ఇక్కెడె కంచావాట్ [illegible]

గు : బజార్కు ఇతరఫ్ [illegible] శకాయే ?

హిం : మార్కెట్ కహాఁహై ?

ఉస్కా రాస్తా క్యాహై ?

బెం : బజార్ కోన్‌దికే ఎపంజా ఇవార్ రాస్తా కోన్‌కు ?

తె : స్నానమునకు నది గలదా ?

లేక చెరువు గలదా ?

మ : హికడ్కా స్నానాలా నదీ హైకాయ్ ?

గు : స్నాన్‌కర్ వామాటెనదీ కే తలాక్ ఛేకే ?

హిం : క్యా నహానేకేలియే నదీ హై యా తలాబ్ హై ?

బెం : స్నానేర్ జన్యనదీ వా పుష్కరిణీ ఆఛే కి ?

తె : బావి యెంత దూరములోనున్నది

మ : హిక్కిత స్నాల్ ఘంటా కట్టీహై ?

గు : కూవా కేటలో దూర్‌ఛే ?

హిం : కుహాఁకిత [illegible]ూర్‌పర్ హై ?

బెం : కుయా[illegible] కత్‌దూర్ రాస్తాహ ఇవే ?

తె : ఏ సత్రము[illegible] [illegible] మంచిది ?

మ . కొంణా [illegible]త్రయా[illegible]ఖ్యహై ?

గు : తమోకఇ ధర్మశాళ మాటెభలా మణ్ కరోచో ?

హిం : కిన్ ముసాఫర్ ఖానేమే ‹ రహనా అచ్ఛాహై ?

బెం : ఆఫ్‌నికోన్ ధర్మశాలరి భాల్ మనేకరేన్ ?

తె . సత్రము ఎంతదూరములో ఉన్నది ?

మ : సత్రయిక్కడె హసుంకొడా దూర్ హై ?

గు : స్టేశన్‌థీ ధర్మశాలా కేటలీ దూర్ ఛే ?

హిం : ము[illegible] [illegible] ఖా[illegible] కిత్‌నే దూర్‌పర్ హై ?

బెం : స్టేశన్ [illegible]ఇనే ధర్మశాలా కత్ దూరే ఆఛే ?

తె : బండిబాడుగ ఎంత ? కూలి ఎంత ?

మ : గాడీచకిరాయ్ కొడా ? మజూరి కొడడాహై ?

గు : గాడీభాడుతా థాకులీ ఖర్చుకేట్ లుపడ్ రో ?

హిం : గాడీకా కిరాయా కిత్‌నా హై ?

బెం : గాడీభాడా ఓకులీఖర్చు కత్ లాగిలే ?

తె : వంటచెరుకు అమ్మెదుకాణం ఏది ?

మ : లాకడాకుట్టా మిల్తా ?

గు : కోల్‌సా తథాలాక్ [illegible]నీ వఖార్ క్యాంఛే !

హిం : రసోఈ కీలకడీ [illegible]నేకా [illegible]కాన్ కహాఁహై ?

బెం : కయలా వా[illegible]నేర్ [illegible]కాన్ [illegible]దాయ్ ?

తె : బియ్యము, పప్పు, [illegible] [illegible]డి ఎక్కడ కలదు ?

మ : తాందల్, దాల్ వగైరాచ [illegible] కుట్టా హై ?

గు : మోదీ (కరియాణా) నీ దుకాన్ క్యాంఛే ?

హిం : చావల్, దాల్ బేచ్‌నే దుకాన్ కహాఁహై ?

బెం : ముదీర్ దొకాన్ కాథాయ్ ?

దేవాలయ భాగములు : గర్భాలయం, అంతరాలయము, ముఖమండపం, ఆలయవిమానము, విమానకలశం, ధ్వజస్థంభము, ఆలయప్రాకారము, గాలిగోపురం, కళ్యాణమండపం, వాహనశాల, యజ్ఞశాల, ఆలయం బావి.

# 108 శక్తిపీఠములు

1) విశాలాక్షి (కాశీ) 2) లింగధారిణి (నైమిశారణ్యము) 3) లలిత (ప్రయాగ) 4) కామాక్షి (గంధమాదనం) 5) కుముద (మానససరోవరము) 6) విశ్వకాయ (అంబర్) 7) గోమతి (గోమంతపర్వతము) 8) కామచారిణి (మందరపర్వతము) 9) మదోత్కట (చైత్రరథవనము) 10) జయంతి (హస్తినాపురము) 11) గౌరి (కన్యాకుబ్జము) 12) రంభ (మలయ పర్వతము) 13) కీర్తిమతి (ఏకామరక్షేత్రం) 14) విశ్వేశ్వరి (విశ్వము) 15) పురుహూత (పుష్కరము) 16) మార్గదాయిని (కేదారము) 17) నంద (హిమవంతము) 18) భద్రకర్ణిక (గోకర్ణము) 19) భవానీ (స్థానేశ్వరము) 20) బిల్వపత్రిక (బిల్వకము) 21) మాధవి (శ్రీశైలము) 22) భద్ర (భద్రేశ్వరము) 23) జయ (వరాహశైలము) 24) కమల (తిరువారూర్) 25) రుద్రాణి (రుద్రకోటి) 26) కాళి (కాళంజరపర్వతము) 27) కపిల (మహాలింగము) 28) ముకుటేశ్వరి (మర్కోటము) 29) మహాదేవి (సాలగ్రామము) 30) జలప్రియ (శివలింగము) 31) కుమారి (హరిద్వారము) 32) లలిత (సంతాన క్షేత్రము) 33) ఉత్పలాక్షి (సహస్రాక్షము) 34) మహోత్పల (కమలాక్షము) 35) మంగళ (గంగాతటము) 36) విమల (పురుషోత్తమక్షేత్రము) 37) అమోఘాక్షి (విపాశాతీరము) 38) పాటల (పుండవర్ధనము) 39) నారాయణి (చినుపార్శ్వము) 40) భద్రసుందరి (వికూటము) 41) విపులేశ్వరి (విపులము) 42) కల్యాణీ (మలయాచలము) 43) కోటవి (కోటి తీర్థము) 44) సుగంధ (మాధవవనము) 45) త్రిసంధ్య (హృషీకేశము) 46) రతిప్రియ (గంగాద్వారము) 47) సునంద (శివకుండము) 48) నందిని (దేవికాతటము) 49) రుక్మిణి (ద్వారక) 50) రాధ (బృందావనము) 51) దేవిక (మధుర) 52) పరమేశ్వరి (పాతాళ) 53) సీత (చిత్రకూటము) 54) వింధ్య వాసిని (వింధ్యా చలము) 55) ఏకవీర (సహ్యాపర్వతము) 56) చంద్రిక (హరిశ్చంద్రము) 57) రమణ (రామతీర్థము) 58) మృగావతీ (యమునాతటము) 59) మహలక్ష్మి (కొవాలాపురము) 60) ఉమాదేవి (వినాయకక్షేత్రము) 61) ఆరోగ్య (వైద్యనాథము) 62) మహేశ్వరి (మహా కాళము) 63) అభయ (ఉష్ణతీర్థము) 64) అమృత (వింధ్యకందరము) 65) మాండవి (మాండవ్యము) 66) స్వాహ (మహిష్మతి) 67) ప్రచండ (ఛాగలాండము) 68) చండిక (మకరందము) 69) వరారోహ (సోమేశ్వరము) 70) పుష్కరావతి (ప్రభాసము) 71) దేవ మాత (సర్వస్వతీ సముద్రసంగమము) 72) మహాభాగ (మహాలయము) 73) పింగ ళేశ్వరి (పయోష్టీతీరము) 74) సింహిక (కృతశౌచము) 75) యశస్కరి (కార్తికేయక్షేత్రము) 76)లోల (ఉత్పలావర్తము) 77) సుభద్ర (శోణగంగా సంగమము) 78) లక్ష్మీదేవి (సిద్ధపురము) 79) అంగన (భరతాశ్రమము) 80) విశ్వముఖి (జాలంధరము) 81) తార (కిష్కింధా పర్వతము) 82) పుష్టి (దేవదారువనము) 83) మేధ (కాశ్మీరుమండలము)

84) భీమాదేవి (హిమాద్రి) 85) పుష్టి (విశ్వేశ్వరము) 86) శుచి (కపాలమోచనము) 87) మాత (కాయవరోహణము) 88) ధ్వని (శంఖోద్ధారము) 89) ధృతి (పిండారకము) 90) కాల (చంద్రభాగాతీరము) 91) శివకారిణి (అచ్ఛోదము) 92) అమృత (వేణాతటము) 93) ఊర్వశి (బదరీవనము) 94) ఓషధి (ఉత్తర కురుభూమి) 95) కుశోదక (కుశద్వీపము) 96) మన్మథ (హేమకూటము) 97) సత్యవాదిని (ముకుటము) 98) వందనీయ (అశ్వత్థము) 99) నిధి (అలకాపురము) 100) గాయత్రి (వేదములు) 101) పార్వతి (శివసన్నిధి) 102) ఇంద్రాణి (దేవలోకము) 103) సరస్వతి (బ్రహ్మముఖము) 104) ప్రభ (సూర్యమండలము) 105) వైష్ణవి (మాతృకలు) 106) అరుంధతి (పతివ్రతలు) 107) తిలోత్తమ (రమణులు) 108) బ్రహ్మకళ (శరీరులందలి చిత్రములు)

విశేషం

(దేవీ భాగవతము, మత్స్యపురాణము నుంచి)

పద్నాలుగు లోకాలు : ఊర్ధ్వ లోకాలు ఏడు, అధో లోకాలు ఏడు, భూలోకం (మనభూమి), భువర్లోకము (భూమికిపైన వున్నది), సువర్ణ లోకము (స్వర్గలోకం). ఈ మూడిటికి అవతల, ఏవననువర్ణలోకం, జనలోకం, తపోలోకం, సత్యలోకం, ఈసప్తలోకాలకి దిగువున వున్న అధోలోకాలు, అవి పాతాళం, మహాతలం, రసాతలం, తలాతలం, సుతలం, వితలం, అతలం. ఇవే చతుర్థశ భువనాలు....

## భారతదేశంలో ప్రాంతాలవారిగా ముఖ్యమైన హిందూ పండుగలు.

| పండుగ | నెలలు | ప్రదేశం | విశేషం |
|---|---|---|---|
| కొత్త సంవత్సరం | జనవరి-1 | గోవా, కేరళ మరియు మహానగరాలు | నూతన సంవత్సరం |
| రిపబ్లిక్ డే | జనవరి-26 | భారతదేశం | ఢిల్లీలో పేరెడ్ జరుగును. |
| సంక్రాంతి | జనవరి-14, 15 | తమిళనాడు, కర్ణాటక, ఆంధ్రప్రదేశ్ | పంటలు కోత ఈ పండుగ 4 రోజులు జరుగును. |
| బసంత్ పంచమి | జనవరి/ఫిబ్రవరి | పశ్చిమబెంగాల్, మధ్యప్రదేశ్ | హిందువుల పండుగ గాలిపటాలు ఎగురవేస్తారు. |
| ఫ్లోటె ఫెస్టివల్ | ఫిబ్రవరి | మధుర | రంగు రంగులుగా కన్పించుట |

| | | | |
|---|---|---|---|
| ఎడారి పండుగ | ఫిబ్రవరి | రాజస్థాన్ | విదేశీయులను కూడా ఆకర్షించును. |
| హోలి | ఫిబ్రవరి/మార్చి | ఉత్తర భారతదేశం | రంగునీళ్ళు చల్లుకొనుట, రంగులు పూసుకొనుట, పన్నీరు, అత్తరు చల్లుకొనుట |
| స్ప్రింగ్ ఫెస్టివల్ | మార్చి | జైపూర్, రాజస్థాన్, బెంగాల్, ఒరిస్సా | పార్వతీదేవి పండుగ మరియు, లలితకళల పండుగ |
| ఉగాది | ఏప్రియల్ | ఆంధ్ర, కర్నాటక, తమిళనాడు | హిందువుల నూతన సంవత్సరం |
| బైసఖి | ఏప్రియల్/మే | అమృతసర్ | సిక్కుల పవిత్ర పండుగ, బెంగాలి సంవత్సరం ప్రారంభం కూడా. |
| పూరం | మే | త్రిచూర్ | ఏనుగుల అంబారీలు, బాణాసంచా ప్రత్యేకత |
| బుద్ధపూర్ణిమ | మే | సారనాథ్, బుద్ధగయ | బుద్ధుని జన్మదినం |
| మీనాక్షి కల్యాణం | ఏప్రిల్/మే | మధుర | పూర్వకాలం నుండి వస్తున్న ఆచారం, దేవుని వివాహం |
| రథయాత్ర | జూన్/జులై | పూరి | దేవుడిని రథము మీద ఊరేగించుట |
| గురుపబ్ | నవంబర్ | అమృతసర్, పాట్నా | గురునానక్ జన్మదినం, పవిత్ర పండుగ |
| పుష్కర్ ఎయిర్ | అక్టోబర్ | అజ్మీర్ | ఒంటెల ప్రదర్శన |
| నాగపంచమి | ,, | జోధ్‌పూర్ | నాగులచవితి లాంటిది |
| గణేష్ చతుర్థి | ఆగస్టు/Sep | మహారాష్ట్ర | వినాయక పండుగ నవరాత్రులు చేసి నిమజ్జనం చేయటం |

| | | | |
|---|---|---|---|
| స్వాతంత్ర్య దినోత్సవం | ఆగస్టు-15 | భారతదేశం | ఆనందమైన ఉత్సవాలు |
| రక్షాబంధన్ | ఆగస్టు/సెప్టెంబరు | భారతదేశం | అన్నాచెల్లెళ్ళ అను బంధానికి గుర్తు |
| జన్మాష్టమి | ఆగస్టు/సెప్టెంబరు | భారతదేశం | కృష్ణుని పుట్టినరోజు |
| ఓనం | సెప్టెంబర్ | కేరళ | 4 రోజుల పండుగ, పడవల పందాలు |
| దసరా | సెప్టెంబర్/అక్టోబర్ | ఢిల్లీ, మైసూర్, పశ్చిమ బెంగాల్ U.P.A.P. | వస్తు ప్రదర్శనశాలలు |
| గాంధీజయంతి | అక్టోబర్-2 | రాజఘాట్, ఢిల్లీ | మహాత్మాగాంధీ జన్మదినం |

స్వార్థం : నాది నాకే, నీది నీకే.

అనర్థం : నాది నాకే వుంటుంది. నీది కూడా నాకే కావాలి.

పరార్థం : నీది నువ్ ఉంచుకో, అవసరం అయితే నాది తీసుకో.

పరమార్థం : నాదినీది ఏదీలేదు, మొత్తం అంతా పరబ్రహ్మమే.

**ప్రయాణంలో తీసుకోవాల్సిన ఆరోగ్య జాగ్రత్తలు మరియు ప్రథమ చికిత్సగా వాడే మందుల పేర్లు ......**

1. జ్వరము — శరీర ఉష్ణోగ్రత $98.6^\circ$ F కంటే ఎక్కువగా వున్న ఎడల జ్వరము తగ్గించుటకు చల్లని వస్త్రంతో శరీరమును తుడవవలెను. ధరించిన దుస్తులను వదులుగా ఉంచవలెను. జ్వరము తగ్గుటకు Crocin tablet వేయవలెను.
2. వాంతులు — కొన్ని గంటల వరకూ ఏ ఆహారము ఇవ్వరాదు. తరువాత బార్లీ నీటిని పంచదార కలిపి త్రాగించవచ్చును. వాంతులు తగ్గుటకు Avomine or Perinorm వేయవచ్చును.
3. విరేచనములు — ద్రవపదార్థములను ఎక్కువగా త్రాగించవలెను. ఉదా : మజ్జిగ, కొబ్బరినీరు, కొద్దిగా ఉప్పు కలిపిన పంచదార నీరు, అరటిపండు. విరేచనములు తగ్గుటకు Furaxone or lomotil tablet వేయవచ్చును.

| | |
|---|---|
| 4. చలి | వేడిగా ఉండు ద్రవపదార్థములు, తేలికగా జీర్ణమగు ఆహారము ఇవ్వవలెను. Room heaters ఉంచవలెను. |
| 5. గాయములు | ప్రమాదములందు గాయములైన వాటిని వేడి నీటిలో శుభ్రము చేసి Antibiotic ointment వ్రాయవలెను. (Antibiotic oint Eg Soframycin InjTetvac) చేయించవలెను. |
| 6. అగ్ని ప్రమాదములు | కాలిన మలిన వస్త్రములను తొలగించి, పలుచని, శుభ్రమైన వస్త్రములను కప్పి ఉంచవలెను. Acid వలన జరిగే ప్రమాదములలో వేగముగా పడు నీటితో గాయమును శుభ్రపరచవలెను. |
| 7. వడదెబ్బ | చల్లనిగాలి తగిలే ప్రదేశములో ఉంచవలెను. దుస్తులను వదులుగా ఉంచవలెను. కొద్దిగా ఉప్పు కలిపిన నీటినికాని, నారింజరసంగాని ఇవ్వవలెను. తేలికగా జీర్ణమగు ఆహారము ఇవ్వవలెను. |
| 8. ముక్కు నుండి రక్తస్రావము | 5 ని॥ ముక్కును గట్టిగా నొక్కి పట్టుకొనవలెను. చల్లని వస్త్రముతో ముక్కును కప్పి ఉంచవలెను. |
| 9. అజీర్ణము | వేడి వస్త్రమును పై పొట్టపై కప్పి ఉంచవలెను. |
| 10. తలకు గాయము | తల ఎత్తుగా ఉండునట్లు పడుకోపెట్టవలెను. చల్లని వస్త్రముతో తల కప్పి ఉంచవలెను. |
| 11. అల్సర్ (Stomach) | చల్లని పాలను ఇవ్వవలెను, లేక ఏదయినా Antacid ను ఇవ్వవచ్చును. |
| 12. పంటి నొప్పి | పిప్పిపన్నును దూదితో శుభ్రము చేసి లవంగ నూనెను వ్రాయవలెను. చల్లని గుడ్డను కప్పి ఉండవచ్చును. |
| 13. | ప్రయాణములో అనీజిగా వున్న నిమ్మకాయ వాసన పీల్చటముగాని, నిమ్మరసమును కొద్ది కొద్దిగా తీసికొనవలెను. |
| 14. | నీరసముగా వున్న పంచదార నీటిని లేదా కొబ్బరినీరు, మజ్జిగ, పాలు ఇవ్వవచ్చును. |

**NOTE :** ప్రథమ చికిత్స మాత్రమే పైవన్నీ. వెంటనే వైద్యుని సంప్రదించవలెను.

# తర్పణములు

యాత్రలు చేసేటప్పుడు అనేకచోట్ల కర్మవిధులు నిర్వర్తించి పూర్వీకులకు తర్పణములు విడవవచ్చు. అలాంటప్పుడు గోత్రాలు సమయానికి గుర్తుకు రాక పోవచ్చు. అలాంటి ఇబ్బంది లేకుండా పక్కనపేర్లు వ్రాసుకోండి. ఈ టూరిజం గైడ్‌ని చెంత వుంచుకోండి.

శ్లో. ఆదౌపితా, తథా మాతా, సాపత్నీజననీ తథా
మాతామహా స్వపత్నికా, ఆత్మపత్న్యా స్త్వనన్తరమ్,
సుత భ్రాత్న పితృవ్యాశ్చ, మాతులా స్సహ భార్యకాః
దుహితా భగినీచైవ, దౌహిత్రొ భాగినేయకః
పితృష్వసా మాతృష్వసా శ్యాలకో భావుకః స్నుషా
శ్వశురాచార్యగురవః స్వామినో గురురిక్థినః

| సంస్కృత పదము | వ్యవహార పదము | గోత్రము | స్వర్గస్థులైన వారి పేర్లు |
|---|---|---|---|
| 1. పితరం | తండ్రి | | |
| 2. పితామహర | తాత | | |
| 3. ప్రపితామహం | ముత్తాత | | |
| 4. మాతరం | తల్లి | | |
| 5. పితామహీం | తండ్రితల్లి | | |
| 6. ప్రపితామహీం | తాతతల్లి | | |
| 7. సాపత్నీ మాతరం | సవతితల్లి | | |
| 8. మాతామహం | తల్లితండ్రి | | |
| 9. మాతుః పితామహం | తల్లితాత | | |
| 10. మాతుః ప్రపితామహం | తల్లిముత్తాత | | |
| 11. మాతామహీం | తల్లితల్లి | | |
| 12. మాతుః పితామహీం | తల్లి తండ్రితల్లి | | |
| 13. మాతుః ప్రపితామహిం | తల్లి తాతతల్లి | | |
| 14.ఆత్మపత్నీం | తనభార్య | | |

| | | | |
|---|---|---|---|
| 15. సుతం | కొడుకు | | |
| 16. భ్రాతరం | అన్నలేక తమ్ముడు | | |
| 17. పితృవ్యం | పెదతండ్రి లేక పినతండ్రి | | |
| 18. మాతులం | మేనమామ | | |
| 19. దుహితరం | కూతురు | | |
| 20. భగినీం | అక్క లేక చెల్లెలు | | |
| 21. దౌహిత్రం | కూతురు కొడుకు | | |
| 22. భాగినేయంక | మేనల్లుడు | | |
| 23. పితృష్వసారం | మేనత్త | | |
| 24. మాతృష్వసారం | పెద్దతల్లి లేక పినతల్లి | | |
| 25. జామాతరం | అల్లుడు | | |
| 26. భావుకం | అక్కచెల్లెళ్ల భర్త | | |
| 27. స్నుషాం | కోడలు | | |
| 28. శ్వశురం | మామగారు | | |
| 29. శ్యాలకం | భార్యఅన్న లేక భార్యతమ్ముడు | | |
| 30. స్వామినం | మతగురువు | | |
| 31. గురుం | తండ్రి లేక ఉపనయనంచేసినవారు | | |
| 32. రక్షితం | తనచే సద్గతి నొందిన దిక్కులేనివారు | | |



# పశ్చిమ బెంగాల్

పశ్చిమ బెంగాల్ (పశ్చిమ భారత్) విస్తీర్ణం 88,752 చ॥కి.మీ. దీని జనాభా 1991 సం॥ లెక్కల ప్రకారం 6,79,82,732.

**ప్రధాన నగరములు, పట్టణములు :** అసన్‌సోల్, పురులియా, ముర్షిదాబాద్, బాహారంపూర్, బంకురా, కలకత్తా, మిడ్నాపూరు, డార్జిలింగ్, దుర్గాపూరు, హుగ్లి, హౌరా, ఖరగ్‌పూరు, కుచ్ బీహారు, కృష్ణానగర్, జల్పాయిగిరి.

ఉత్తరాన సిక్కిం భూటాన్, వాయువ్యాన నేపాల్, తూర్పున అస్సాం బంగ్లాదేశ్, దక్షిణాన బంగాళాఖాతం, పశ్చిమాన బీహార్, ఈ రాష్ట్ర సరిహద్దులు.

**యాత్రా పర్యాటక ప్రదేశములు :** బంకురా, బకరేశ్వర్, విష్ణుపూర్, బఖ్ఖాలి, కలకత్తా, చందన్‌నగర్, చిన్సురా, డార్జిలింగ్, డైమండ్ హార్బర్, డిఘా, గౌరు, జయరాంబాటి, కామర్పకురా, ముర్షిదాబాద్, శాంతినికేతన్, సుందర్ బాన్సు, తారకేశ్వరం, వైద్యనాథము, రాస్‌మంచ్, హాల్దియా ఇంకా అనేక విహారయాత్రా క్షేత్రములు కలవు.

పై యాత్రా ప్రదేశాలన్ని అక్టోబరు నుండి మార్చిలోపు చూడండి.

ఎన్నో నదులకు పుట్టినిల్లయిన ఈ రాష్ట్రంలో యాత్రా ప్రదేశాలకు లోటు లేదు. ఈ రాష్ట్ర ప్రధాన భాష బెంగాలి. కలకత్తాలో అంతర్జాతీయ ప్రసిద్ధి పొందిన డమ్ డమ్ విమానాశ్రయము వుంది.

**ఎయిర్ ఇండియా ఎయిర్‌లైన్ ఆఫీసు ఫోన్ నెంబర్లు :** 286012, 442356, ఎయిర్‌పోర్ట్ నంబర్స్ 569685 మరియు 569611 ఇండియన్ ఎయిర్‌లైన్సు నంబర్లు 260730, 263390.

**వాతావరణం :** 40°C నుంచి 24°C వరకూ

**చలికాలం :** 26°C నుంచి 7°C వరకూ

**టూరిజం ఇన్‌ఫర్‌మేషన్**

గవర్నమెంట్ ఆఫ్ ఇండియా టూరిస్ట్ ఆఫీస్, 'ఎంబస్సి', 4, షేక్స్‌పియర్ సరాని, కలకత్తా.

హిమచల్ ప్రదేశ్ టూరిజం, 25 కామత్‌స్ట్రీట్, కలకత్తా, ఫోను : 2476841.

ఇండియా టూరిజం డెవలప్‌మెంట్ కార్పొరేషన్, ఎవరెస్టు బిల్డింగ్, 46-C, J.L. నెహ్రూరోడ్, కలకత్తా. ఫోను : 220922.

# కలకత్తా

అత్యధిక జనాభా కలిగిన నగరం. విశ్వకవి రవీంద్రనాథ్ టాగూరు 1861లో ఇక్కడే జన్మించారు. మహోన్నత భవనాలు, వీటికి ధాటిగా మురికికూపాలు రెండూ సమపాళ్ళలో వుంటాయి. దౌర్జన్యం, కారుణ్యం, ప్రశాంతత అన్నీ వున్నాయి. లండన్‌కి ధీటయిన ఈ నగరము పశ్చిమ బెంగాలు రాష్ట్ర రాజధాని. ఈ కలకత్తాను హుగ్లీనది రెండుగా విభజిస్తుంది. ఇక్కడికి పది కిలోమీటర్ల దూరంలోనే వుంది. శ్రీరామకృష్ణ మిషను వారి ప్రధాన కార్యాలయం. 1887లో బేలూరులో ఈ మిషన్‌ను శ్రీ వివేకానందస్వామి స్థాపించారు. 1899లో ఈ మఠమును ప్రధాన కేంద్రంగా స్థాపించారు. శ్రీ రామకృష్ణ పరమహంస నడిచిన ఈ ప్రదేశంలో ఆయన వస్తువులన్నీ భద్రంగా ఉన్నాయి. మరో పదకొండు కిలోమీటర్ల దూరంలోనే వుంది దక్షిణేశ్వరం. గంగ కవతల పెద్ద గోపురాలతో కనపడుతుంది. రాణి రసమణీదేవి నిర్మించిన ఆలయం. ఇక్కడ కాళీమాత ఆలయం, రాధాకృష్ణాలయం శివాలయం ఉన్నాయి.

### ఇక కలకత్తాకి వస్తే

**హౌరా బ్రిడ్జి :** నదిలో తిరిగే వాహనాలకి రాకపోకలకి వీలుగా తెరిచి మూస్తుంటారు. బ్రిడ్జి పొడవు 2,150. ఒకేసారి 10 వాహనాల రాకపోకలకి వీలుగా 280 అడుగుల ఎత్తు ఉంటుంది. హౌరా స్టేషను చేరాలంటే ఈ హుగ్లీనది బ్రిడ్జి దాటవలసిందే.

నగరంలో విశాల పచ్చిక బయళ్ళు, రైటర్సు బిల్డింగ్, మ్యూజియం, బిర్లా ప్లానిటోరియం, విక్టోరియా మెమోరియల్, రేస్‌కోర్సు, ఈడెన్ గార్డెన్స్ ఇలా ఎన్నో వున్నాయి.

దక్షిణ కలకత్తాలో జులాజికల్ పార్కు, రవీంద్ర సరోవర్, హేస్టింగ్స్ భవనం, పురాతనమైన కాళీమాత ఆలయము వున్నాయి.

**విక్టోరియా మెమోరియల్ :** అద్భుతమైన చలువరాతి కట్టడం, రెండవ తాజ్‌మహలుగా పేరు. విక్టోరియా రాణి కంచు విగ్రహంతోపాటు ఎన్నో వేల పురాతన వస్తువులున్నాయి. రోజ్‌వుడ్‌తో తయారుచేసిన పియానో కూడా వుంది.

**ఇండియన్ మ్యూజియం :** ఈ మ్యూజియంలో అనేక రకాలైన వస్తు ప్రదర్శనని చూడవచ్చు. పాతకాలంనాటి జంతువుల కళేబరాలు, అస్థిపంజరాలు ఎన్నో వున్నాయి. కళాఖండాలు చారిత్రక విశేషాలు కోకొల్లలు.

**ది మార్బుల్ ప్యాలెస్ :** ఎన్నో రకాల పాలరాళ్ళని ప్రపంచం నాలుగు మూలల నుండి సేకరించి నిర్మించారు. ఇందు శిల్పాలు నయనానందకరంగా కనువిందు చేస్తాయి.

జులాజికల్ గార్డెన్స్ : చిత్ర విచిత్రమయిన ఎన్నో రకాల పక్షులు కనులకి ఇంపుగా దర్శనమిస్తుంటాయి.

బిర్లా ప్లానిటోరియమ్ : అతిపెద్దదైన నక్షత్రశాల. తప్పనిసరిగా చూడవలసిన ప్లానిటోరియమ్.

**కాళీఘాట్ ఆలయం** : 52 శక్తి పీఠాల్లో ఒకటి. ఈ కలకత్తా కాళీ గురించి తెలియనివారు భారతదేశంలో లేరంటే అతిశయోక్తి కాదు. అతి ప్రాశస్త్యం గల ఈ అమ్మవారిని దర్శించడానికి ప్రపంచం నలుమూలల నుంచి వస్తారు. కలకత్తా వచ్చి మాతను చూడకుండా ఎవ్వరూ తిరిగి వెళ్ళరు. చైత్రమాసంలో నవరాత్రోత్సవాలు బ్రహ్మాండంగా జరుగుతాయి.

**నేషనల్ లైబ్రరీ** : ఇటాలియను శైలిలో వుంటుంది. ఇది భారతదేశంలో అతిపెద్ద లైబ్రరీ. అనేక పురాతన తాళపత్ర గ్రంథాలు, వ్రాతప్రతులు ఉన్నాయి. కోట్ల పుస్తకాలు వున్నాయి.

**ఈడెన్ గార్డెన్స్** : బర్మావారి దేవాలయం ఇది ఉత్తర కోనల్లో వుంది.

ఎన్నో క్రికెట్ మ్యాచ్‌లు ఇక్కడ జరిగాయి. ఈడెన్ గార్డెన్సు సముదాయంలో ఎన్నో ఉద్యానవనాలు కూడా వున్నాయి. కలకత్తా పరిసరాల్లో బొటానికల్ గార్డెన్సు, సిటీలో ఫోర్టు విలియం, అపూర్వమైన కట్టడం షహిద్ మినార్ వున్నాయి.

కలకత్తాలో వసతికి ఎన్నో ఖరీదయిన, మధ్య తరగతి హోటళ్ళు వున్నాయి. సద్దరు స్ట్రీటులో తక్కువలో అనేక హోటళ్ళు వున్నాయి. సువార్టు లేన్‌లో మోడరన్ లాడ్జి, వెల్‌కమ్ వున్నాయి. ఇకపోతే కొద్దిగా ఖరీదయిన హోటళ్ళు ఆకాశగంగ, ఒరియంటిరో (పార్కు సర్కస్ మెయిడెను) ఫోను : 473341, 473640, గ్రేట్ ఈటర్న్స్, 1-3 ఓల్డు కోర్టు హౌస్ స్ట్రీట్, ఫోను : 282311, 282331; హిమాలయ, 134/1, M.G. రోడ్డు, ఫోను : 381951, 383530, హిందుస్థాన్ ఇంటర్నేషనల్ 235/1, ఆచార్య జగదీష్ చంద్రబోస్ రోడ్డు, ఫోను : 472394; హౌరా, 1, ముక్రమ్ కావోరియా రోడ్డు, ఫోను : 603877; తాజ్ బెంగాల్, 34 B. బెల్‌వెడెల్ రోడ్డు, ఆలిపోర్, ఫోను : 283939.

**బఖ్ఖాలి** : హుగ్లీ నదీ తీరానికి 132 కి.మీ. దూరములో వున్న విశ్రాంతి కేంద్రం. ఇక్కడి నుండి పడవలో జంబూ ద్వీపానికి కూడా వెళ్ళవచ్చు. వసతికి వెస్ట్ బెంగాలు టూరిస్టు లాడ్జి.

**డిఘా** : 185 కిలోమీటర్ల ఆగ్నేయంగా వున్న సముద్రతీరం. ఇక్కడికి దగ్గరిలోనే చందనేశ్వర ఆలయం వున్నది. వసతికి టూరిస్టు లాడ్జి, ఇంకా సీహాక్ వున్నాయి.

**డైమండ్ హార్బర్** : హుగ్లీ నది సిగ్గుపడుతున్న పల్లెటూరి పిల్లలా వంకర తిరిగి అద్భుతంగా కనిపిస్తుంది. అన్ని స్టీమర్లు ఇక్కడికి వచ్చిపోతుంటాయి. ఇక్కడున్న కోటను కూడా చూడవచ్చు. వెస్ట్ బెంగాలు టూరిస్టు లాడ్జి వుంది వసతికి.

**సుందర్‌బాన్స్** : గంగానది సాగర సంగమం చేసే చోటు. ఈ అటవీ ప్రాంతములో బెంగాలు టైగర్లు, లేళ్ళు, దుప్పిలు, చిరుతపులులు, కొండముచ్చులు, మొసళ్ళు చూడవచ్చు.

**గంగాసాగర్** : స్టీమరులో వెళ్ళాలి. అష్టాదశ శక్తి పీఠాల్లో ఒకటి. గంగ, సాగర సంగమం చేరే ప్రదేశం. మాఘమాసములో గొప్ప ఉత్సవము జరుగుతుంది.

**బాన్స్ బెరియా** : వాసు దేవాలయం, హంపీశ్వరి ఆలయాలున్నాయి.

**చంద్రనాగూర్** : కలకత్తాకి 39 కి.మీ. దూరములో వున్న ఇందులో భువనేశ్వరి, నందలాల్ ఆలయాలున్నాయి. ఫ్రెంచి సంస్కృతిని చాటి చెప్పే యీ చంద్రనాగూర్లో చేతి మగ్గాలు అనేకం.

**చిన్సురా** : డచ్‌వారి గోరీలు వున్నాయి. ఇక్కడనుంచి బాన్స్‌బెరియా 8 కి.మీ., 5 కి.మీ. దూరములో వున్న బందేల్ మంచి పిక్నిక్ స్పాట్. ఈ బందేల్ నుంచి 15 కి.మీ. దూరములో ఓంకార్‌నాథ్‌గారి ఆశ్రమముంది.

**జయరాంబాటి** : శ్రీరామకృష్ణ పరమహంస జన్మించిన ఊరు. వసతికి రామకృష్ణ మిషన్ గెస్టుహౌస్ వుంది.

**శాంతినికేతనము** : విశ్వకవి రవీంద్రుడు స్థాపించిన విశ్వభారతి విద్యాలయం ఇక్కడే వుంది. రకరకాల పక్షులున్న శాంక్చువరి వుంది. 3 కి.మీ. దూరములో శాంతినికేతన్‌లో చేతితో చేయబడిన వస్తువులు దొరుకుతాయి. ఉండటానికి యూనివర్శిటీ గెస్టుహౌస్, బోల్‌పూర్ ఇంకా యూత్ హాస్టలుంది.

**నవద్వీప్** : సువర్ణ గౌరంగ, నందకుమార్ మందిరమూ, భజనాశ్రమము వున్నాయి. బ్యాంక్ ఎదురుగా మాయాపూర్ గౌరంగ జన్మస్థలం.

**కెన్‌దురి** : అష్టపదులు వ్రాసిన జయదేవకవి జన్మస్థానం.

**బకరేశ్వర్** : రెండు వందల పైనే దేవాలయాలున్నాయి. ఇందులోని ప్రధాన శివాలయం శైవ పీఠాల్లో ఒకటి. W.B.T.D.C. టూరిస్టు లాడ్జి వుంది వసతికి.

**వైద్యనాథధామ్** : శివగంగ, జగదాంబ మందిరాలున్న యీ క్షేత్రం ద్వాదశ జ్యోతిర్లింగములలో పదకొండవది. లింగము శిరస్సుపై లంకాధీశుడు రావణాసురుడి వేలి గుర్తులున్నాయి. ఇక్కడికి హుబ్లీ నుంచి బస్సు ప్రయాణం సుఖం. మహారాష్ట్రలోని మన్మారు, మన్మాడు నుంచి పర్లీ-వైద్యనాథ్‌కి రైలులో చేరుకోవచ్చు.

**మదనమోహనుని ఆలయం** : పురాతన కాలంనాటి దుర్గామందిరము. మల్లరాజుల కాలంనాటి శిథిలాలు వున్నాయి.

**తారకేశ్వరం** : ఇక్కడ స్వామికి సేవలు చేస్తే రోగాలు పోతాయని ప్రతీతి. ఎందరోవచ్చి స్వామిని దర్శించి, సేవించి తరిస్తుంటారు.

**విష్ణుపూర్** : కలకత్తాకు 100 కి.మీ. టూరిస్ట్ లాడ్జి వసతి వుంది. ఫోను : 238271.

**జూన్‌పుట్** : బీచ్‌సెంటర్, ఇక్కడ సరదాగా చేపలు పట్టవచ్చు.

**కర్సియంగ్** : ఈ పర్వత ప్రాంతములో బౌద్ధుల సన్యాసిమఠం వుంది. అనేక పూలతోటలున్నాయి.

**కోచ్‌బిహార్** : అనేక రాజ సౌధములు - దేవాలయాలున్నాయి.

**తారాపీఠ్** : అనేక ఆలయాలున్న తీర్థయాత్ర ప్రదేశం.

# డార్జిలింగ్

హిమాలయ పాదాల చెంత నిలిచిన నగరం. అత్యంత గొప్ప వేసవి విడిది. ప్రపంచంలోకెల్లా ఎత్తయిన ఎవరెస్టు మౌంట్ ఇక్కడ నుంచి కనబడుతుంది. ఇక్కడే కాంచన గంగా శిఖరాలు మెరుస్తూ ఆహ్వానిస్తుంటాయి విహార యాత్రికులను. కలకత్తాకు 663 కి.మీ. దూరములో 2,134 మీ. ఎత్తువున్న ఇక్కడికి కలకత్తా నుండి, సీల్దా స్టేషన్ నుండి రైలు ద్వారా రండి. మధురమైన అనుభూతి మిగులుతుంది. ప్రతివారు తమ జీవితాల్లో ఒక్కసారయినా చూడాల్సిన ఈ ప్రదేశం నుంచి సిలిగురి వెళితే, అక్కడ్నించి ఖాట్మండు 564 కి.మీ.

**డార్జిలింగ్ పర్వత ప్రాంతాల్లో విశేషాలు :**

మొదట గుర్తువుంచుకోవాల్సింది అక్టోబరు నుండి నవంబర్‌లోపు ఇక్కడికి రావాలి. లేదా జూన్ 15 లోపు అత్యధిక ఉష్ణోగ్రత 72° ఫారెన్‌హీట్. చలికాలములో అయితే 105° నుండి 6° సెంటిగ్రేడు లోపలే. ఇక్కడ గొడుగు తప్పనిసరిగా వెంట ఉంచుకోవాలి. మహకాల్ ఆలయం వున్న ఈ డార్జిలింగులో చూడటానికి ఓపిక వుండాలే గాని అనేక ప్రదేశాలు.

**సందక్ పూ** : ఇక్కడికి వెళ్ళేటప్పుడు పర్వతారోహణకు కావలసిన సామాను తీసుకెళ్ళండి. ఎయిర్ పిల్లో, పరుపు, స్లీపింగ్ బ్యాగ్, కావలసినవన్నీ అద్దెకు దొరుకుతాయి.

**వంబాల్** : డార్జిలింగ్ నుండి 10 కి.మీ. దూరంలో వుంది. మంచి పిక్నిక్ స్పాట్.

**టైగర్ హిల్** : కాంచనగంగ శిఖరం నుంచి కనపడే అద్భుత దృశ్యం. ప్రపంచంలో ఎక్కడా కనుపించని అరుదైన దృశ్యం కనిపిస్తుంది. ఈ శిఖరం మీద సూర్యోదయం సమయంలో మంచు శిఖరం మీద కిరణాలు పడినప్పుడు ఆకాశంలో కొన్నివేల ఇంద్ర ధనస్సులు ప్రత్యక్షమైనట్టు అద్భుతంగా కనిపిస్తుంది.

**ఘూమ్** : మైత్రేయ బుద్ధుని విగ్రహం వున్న ఈ ప్రదేశం కేవలం ఆరు కిలోమీటర్ల దూరంలో వుంది.

ఇంకా జూలాజికల్ పార్క్, టీ తోటల మీదుగా వేయబడిన రోప్ వే, రేస్ కోర్సు వున్నాయి.

**డార్జిలింగ్‌లో వసతి** : మోహన్‌లాల్ ధర్మశాల వుంది తక్కువలో, చౌకల్ రైల్వే స్టేషన్ వద్ద కాదంబరి ఇంకా అనేక టూరిస్ట్ లాడ్జీలున్నాయి.

**కాస్త ఖరీదులో వసతి సౌకర్యాలు**

న్యూ ఎతగిన్, H.D. లంబరోడ్, ఫోను : 3314.
ఒబరాయ్ మౌంట్ ఎవరెస్టు, 29 గాంధీరోడ్, ఫోను : 2616.
WBTDC డార్జిలింగ్ టూరిస్ట్ లాడ్జి, మాల్ రోడ్, ఫోను : 2616/13.
WBTDC టైగర్ హిల్ టూరిస్టు లాడ్జి, సెంచల్ P O ఘూమ్, ఫోను : 2813.
WBTDC యూత్ హాస్టల్, 16, డా॥ జాకీర్ హుస్సేన్ రోడ్, ఫోను : 2290.
WBTDC మాపెల్ టూరిస్టు లాడ్జి, పాతకుఛంరోడ్, ఫోను : 2092.
ప్రధాన్స్ హోటల్ పొలినియ, H.D. లామారోడ్, ఫోను : 2816, 2628
విండమియల్, అబసర్వేటరి హిల్, ఫోన్సు : 2841, 2397.

పర్వతారోహణ చేయు ప్రదేశాలలో, యూత్ హాస్టల్, డాక్ బంగళా, ఇన్స్పెక్షను బంగళా, ఫారెస్టు బంగళాలున్నాయి. పర్వతాలు ఎక్కేవారు ఎక్కువ బరువు తీసుకెళ్ళకుండా ఆహారానికి రెడీమేడ్ ఫుడ్స్ తీసుకెళ్ళండి, ఓ ప్లానుగా పర్వతారోహణ చేసి ఆనందంగా తిరిగి రండి. ముఖ్యంగా నీరసం తగ్గటానికి గ్లూకోజ్, నొప్పులకు జనరల్గా వాడే టేబ్లట్స్ దగ్గర వుంచుకోండి.

**కాలింపాగ్** : డార్జిలింగ్కి 50 కి.మీ. దూరం పర్వతాల మధ్యనుంచి రోడ్డు ప్రయాణం బావుంటుంది. ఇక్కడ రెండు బుద్ధ విహారాలున్నాయి. పర్వతారోహణ మార్గాల గుండా ప్రయాణం చేసేవారు తప్పనిసరిగా, పర్వతారోహకుల అనుభవాలు, అనుభూతులు తెలుసుకోండి. యూత్ హాస్టల్లో లభ్యమవుతుంది సమాచారం. ఈ కాలింపాగ్ హిమాలయ పాదాల చెంత 1200 మీటర్లు ఎత్తున వుంది. వసతికి హిమాలయ హోటల్ ఫోను : 248. ఇంకా పార్క్ గెస్ట్హౌస్లు వున్నాయి.

**కుర్సియాంగ్** : డార్జిలింగ్కు 32 కి.మీ. దూరం. పగ్లాఘోరా జలపాతం వుంది. డాహిల్, యీగిల్స్క్రాగ్ అనే పర్వతాల నుంచి పర్వత శిఖరాలను నయనానందకరంగా చూడచ్చు. ఉండటానికి జీత్హెచ్ సిరోడ్, WUBTDC టూరిస్టు సెంటర్ వుంది.

ఈ పరిసరాల్లోనే కుచ్ బీహార్ (దేవాలయాలు) వన్యమృగ రక్షితకేంద్రం (ఏనుగుల మీద అడవిలో తిరిగి రావచ్చు ఇక్కడ)

**కలకత్తా నుండి వివిధ ప్రాంతాలకు దూరం (కి.మీటర్లలో)** కలకత్తా నుండి విశాఖపట్టణం 879 కి.మీ., విజయవాడ 1245 కి.మీ., తిరుపతి 1625 కి.మీ., మైసూర్ 2147 కి.మీ., హైదరాబాద్ 1516 కి.మీ. ఢిల్లీ 1442 కి.మీ.

ఇక్కడితో పశ్చిమ బెంగాల్ పూర్తి అయినట్టే. పర్వతాలకి, కలకత్తా కాళికి వోమారు ఇక్కడ్నించే నమస్కరించి, పశ్చిమబెంగాల్ నుండి ప్రవేశించటానికి అన్ని దారులూ వున్న సిక్కింకు వెళదాం.

# సిక్కిం

విస్తీర్ణం : 7,096 చ.కి.మీ.

జనాభా : 4,08,612.

ప్రధాన భాషలు : హిందీ, భూటియా, నేపాలీ, వెప్చా, వించు.

ప్రధాన నగరాలు, పట్టణాలు : గాంగ్‌టక్, మాంగన్, గ్యాల్‌హింగ్, నాంచి సరిహద్దులు. ఉత్తరాన చైనా, పశ్చిమాన నేపాల్, దక్షిణాన పశ్చిమ బెంగాల్, తూర్పున టిబెట్, భూటాన్ వున్నవి. పూర్తిగా పర్వతాలతో కూడుకున్న ఈ సిక్కిం రాజధాని గాంగ్‌టక్. 8579 మీటర్ల ఎత్తయిన కాంచనజంగ శిఖరం ఈ రాష్ట్రం నుండి పై కెగసింది. వృక్షశాస్త్రానికి సిక్కిం కేంద్రబిందువు. ఈ రాష్ట్రాన్ని మార్చి, సెప్టెంబరు, నవంబర్ మాసాల్లో దర్శించండి.

**పర్యాటక ప్రదేశాలు** : గాంగ్‌టక్, బక్కిం, యాక్సుం. ముఖ్యమైన విషయం సిక్కింలో విదేశీయులు సందర్శించకూడని ప్రదేశాలు వున్నాయి. ఈ రాష్ట్రంలో యాత్రికులను యెలాపడితే అలా అనుమతించరు.

భారతీయులకు ఎలాంటి షరతులు లేవు. విదేశీయులు తప్పనిసరిగా పర్మిషన్ తీసుకోవాలి. మినిస్ట్రీ ఆఫ్ హోమ్ ఎఫెయిర్స్, న్యూఢిల్లీ నుంచిగాని, డిప్యూటి కమీషనర్, డార్జిలింగ్, సిక్కిం టూరిస్టు నుంచిగాని అనుమతి తీసుకొని వారి సూచనమీద యాత్ర చేయాలి.

**టూరిస్టు ఇన్‌ఫర్‌మేషన్** : టూరిస్టు డిపార్టుమెంటు గవర్నమెంట్ ఆఫ్ సిక్కిం, లోవర్ సెక్రటేరియట్ గాంగ్‌టక్.

టూరిస్టు ఇన్‌ఫర్‌మేషన్ సెంటర్, M.G. మార్గు, గాంగ్‌టక్, సిక్కిమ్ ఫోను : 2064.

## గాంగ్‌టక్

రాణిపూల్ నది వొడ్డున అత్యంత సుందరంగా వుంటుందీ పట్టణం. ఇక్కడ్నించి కాంచనజంగా శిఖరాలు కనిపిస్తూ వుంటాయి. 5,800 అడుగుల ఎత్తున్న ఈ పట్టణంలో బౌద్ధమతానికి సంబంధించిన అనేక ప్రార్థనాలయాలు ఎక్కడ చూసినా కనిపిస్తుంటాయి.

చోగ్యార్ భవనం చూడదగ్గది. 23 కి.మీ. దూరంలో వున్న రూమ్ టెక్‌లో బౌద్ధ ఆశ్రమాలు వున్నాయి. గాంగ్‌టక్ నుంచి 24 కి.మీ. దూరం.

బక్కిం : పర్వతారోహకులకు మజిలీ, మంచి ఉద్యానవనం వుంది.

ఘుబ్ధి ఆశ్రమం : అతి పురాతనమైన ప్రశాంతమైన ఆశ్రమం.

యాక్సుం : ముగ్గురు లామాలు కలిసిన పవిత్ర ప్రదేశం. హిమాలయ పర్వతారోహకులకు ముఖ్యమైన ప్రదేశం.

తాష్‌డింగ్ : కాంచనజంగా శిఖరాలను కనులారా చూడచ్చు. గాంగ్‌టక్ నుంచి 9 కి.మీ. దూరం. ఇక్కడ్నించి శిఖరాలను చూస్తే సర్వపాపాలు పోతాయని ప్రతీతి.

పెమాయింగ్సే : అద్భుతమయిన శిల్పకళ వుంది. గేట్ వే ఆఫ్ వెస్టన్ సిక్కింకూడా. వసతికి గవర్నమెంట్ టూరిస్టు లాడ్జి వుంది.

ఇంకా ట్యుక్లా ఖంగ్, ఉత్తరాన ఫోడాంగ్, ఫెన్సాంగ్, తాహంగ్. ఇక్కడ మనిషి ఎముకలతో తయారుచేసిన కొమ్ము బూరాలు, రకరకాల వస్తువులు దొరుకుతాయి.

యంథాంగ్ (యాక్ కంట్రి) : లాచుంగ్ ఇక్కడ జలపాతాలతోపాటు చూడటానికి అందమైన ప్రదేశాలు వున్నాయి. డోంగ్‌క్యా శ్రేణి టిబెట్‌కు సిక్కింలకు అడ్డు గోడగా నిలిచి వుంది.

## గాంగ్‌టక్‌లో వసతి

టిబెట్, పాజ్‌లోర్ స్టేడియమ్ రోడ్, ఫోను : 2523, 2568.

ఓర్‌చంద్, నేషనల్ హైవే, ఫోను : 2381.

గ్రీన్, ఫోను : 2254.

సిక్కిమ్ గెస్టుహౌస్.

CPWD రెస్టు హౌస్, నార్తు సిక్కిమ్ హైవే.

మయూర్ ఫోను : 2558, 2752.

నార్-ఖిల్, ఫోను : 3186, 3187.

తాషి డెలెక్, MG మార్గ్, ఫోను : 2038, 2362, 2299.

టూరిస్టు లాడ్జి.

కాంచన్ వ్యూ P O తాజంగ్ ఫోను : 2086.

డెన్‌జాంగ్, ఫోను : 2263.

ఉన్నతశ్రేణి బంగారం, వెండి, కాపర్ నిల్వలను ఈ రాష్ట్రంలో యీ మధ్యనే కనుగొన్నారు. దేశంలో ఎక్కడా పండని అనేక కూరగాయలు యిక్కడ దొరుకుతాయి. ఇక్కడున్న అయిదు పర్వతాల్లో ఒకటైన కాంచనగంగ ప్రపంచంలోని ఎత్తయిన పర్వతాలలో మూడవది. ఇక్కడ్నించి మగధ సామ్రాజ్యానికి రాజధానిగా వున్న పాటలీపుత్ర నగరానికి అంటే నేటి బీహార్‌కి వెళదాం.

# బీహార్

బీహార్ (తూర్పు భారత్) విస్తీర్ణం 173. 827 చ.కి.మీ. ఇందు జనాభా 8,63,38, 853.

**సరిహద్దులు** : తూర్పున పశ్చిమాన ఉత్తరప్రదేశ్, నైరుతి దిశన మధ్యప్రదేశ్ వున్నాయి.

**ప్రధాన నగరాలు, పట్టణాలు** : ఔరంగాబాద్, బేగుసరాయ్, అద్రాహ్, బీహారు, చాప్రా, షరీఫ్, దర్భాంగ, కథియార్, వోహర్షగ, మధుబని, పాట్నా, రాంచి, పూర్ణిమా.

1936లో ఏర్పడిన బీహారులో ఎన్నో విశ్వవిద్యాలయాలు ఉన్నాయి. బీహారు విశ్వవిద్యాలయం ముజఫర్‌పూర్లోనూ, దర్భాంగలో కామేశ్వర్ జంగ్ సంస్కృత విశ్వవిద్యాలయం, మగధ విశ్వవిద్యాలయం బుద్ధగయలో, పాట్నా విశ్వవిద్యాలయం పాట్నాలోనూ ఇంకా రాంచిలో ఆ పేరుతో విశ్వవిద్యాలయం వుంది.

**వాతావరణం** : వేసవికాలం 47°C నుంచి 20°C, చలికాలం 28°C నుంచి 4°C.

**యాత్రా పర్యాటక ప్రదేశాలు** : బుద్ధగయ, రాజగిరి, నలందా, పాట్నా, వైశాలి గల ఈ బీహార్లో అక్టోబరు నుంచి మార్చిలోపు యాత్రా పర్యటనకు బెస్ట్ సీజను.

**టూరిజం ఇన్ఫర్మేషన్**

బీహారు స్టేట్ టూరిజం డెవలప్‌మెంట్ కార్పొరేషన్, టూరిస్టు భవన్.

బీహారు స్టేట్ టూరిజం ఇన్ఫర్మేషను సెంటరు, ఫ్రేసర్ రోడ్, పాట్నా.

గవర్నమెంట్ ఆఫ ఇండియా టూరిస్టు ఆఫీస్, టూరిస్టు భవన్.

బీర్‌చందు పటేల్‌పథ్, పాట్నా, ఫోను : 222622, 226721

## పాట్నా

అశోకుని రాజభవనం 4 చ. మైళ్ళు వైశాల్యాన్ని ఆక్రమించి వుంది. ఇక్కడ అశోకునిచే నిర్మించబడిన పవిత్ర స్థూపాలు అనేకం వున్నాయి. ఈ నగరం నుండి కలకత్తా, వారణాసి, ఖాట్మండు, ఢిల్లీలకు విమాన సౌకర్యాలు వున్నాయి. పాట్నాలోని మ్యూజియంలో మౌర్యులు, గుప్తుల కాలంనాటి శిల్పాలు, మధ్య యుగాలనాటి సమస్త సముదాయాలు కనిపిస్తాయి.

**పాట్నాలో వసతికి** : అప్సర, కాదమ్ కౌన్ : అవంతీ డాక్ బంగ్లా ఎదురు, ఫేసరు రోడ్, ఫోన్సు : 31851నుండి 31855; మమత, ఘాస్వరి;చంపపుర్, భక్తియార్ పుర్,

ప్రెసిడెంట్ ఆఫ్ ఫ్రేసర్ రోడ్ ఫోను : 31893; రిపబ్లిక్. లయలిస్ బిల్డింగ్, ఎగ్జిబిషన్ రోడ్; పోస్ట్‌బాక్స్ నెం. 33, ఫోను : 55021; సర్క్యూట్ హౌస్, గార్డినర్ రోడ్.

**గోల్‌ఘర్ :** ధాన్యపు నిల్వల కోసం కట్టించిన ఈ భవనం నుంచి, నగరాన్ని పావన గంగానదిని చూడవచ్చు.

**కుమ్రాహార్ :** బౌద్ధ విహారం; తవ్వకాలు జరిపిన ప్రదేశం కూడా చూడవచ్చు.

**జలాన్‌ఖిల్లా :** హర్‌మందిర్‌కి కిలోమీటరు దూరంలో వుంది. పచ్చల మీద పొదిగిన నగిషీలు, అనేక పురాతన వస్తువులు చూడవచ్చు.

**ఖద్రి-కి-హవేలి :** అనేక అముద్రిత గ్రంథాలు, పురాతన చేతివ్రాతలు అనేక దేశాలవారివి చూడవచ్చు.

**సోనాపూర్ :** అనేక దేవాలయాలు వున్న ఈ ప్రాంతంలో జరిగే సంతలో ఏనుగులని సైతం బేరానికి పెడతారు.

**మాంఘిర్ :** పురాతన అంగరాజ్యానికి ముఖ్య పట్టణం. ముచ్చటయిన హిందూ దేవాలయాలతోపాటు కోట కూడా వుంది.

పాట్నా పరిసరాలలో బెత్లా నేషనల్ పార్క్, పదాకల్ ఆశ్రమం, బయోలాజికల్ పార్కు వున్నాయి.

**గయ :** దీన్నే పితృగయ అని పిలుస్తారు. ఇక్కడ శ్రాద్ధం పెడితే జీవితమంతా శ్రాద్ధ విధులు నిర్వర్తించ అవసరం లేదు. హిందువులకు చాలా ముఖ్యమయిన స్థలం. పాట్నా నుండి 206 కి.మీ. దూరంలో వున్న ఈ గయ క్షేత్రం బౌద్ధులకు కూడా గొప్ప యాత్రాస్థలం. గయలో విష్ణు పాదాలయం ఫల్గునీ, మధుర స్వేదానదులు కలిసేచోట వుంది. ఈ ఆలయంలో ప్రవేశం హిందువులకి మాత్రమే. ఇండోర్ మహారాణి అహల్యాబాయి కట్టించిన 30 మీటర్ల గాలిగోపురం, రాతితో చేసిన విష్ణుపాదం ముద్రని వీక్షించి నది ఒడ్డున వున్న అనేక స్నాన ఘట్టాలని దర్శించండి. ఈ నది ఒడ్డున శవ దహనాలు చేస్తుంటారు.

**అక్షయ వటము :** ఇక్కడున్న వృక్షం క్రింద పితృకర్మలు చేయించి పిండప్రదానం చేస్తారు. అప్పుడే పితృ దేవతలకి శాశ్వత కైవల్యం వస్తుందని నమ్మకం.

**బుద్ధగయ :** ఇక్కడున్న చెట్టు క్రిందే బుద్ధుడు తపస్సు చేసింది. ఆయనకు జ్ఞానబోధ గలిగిన ఈ బోధివృక్షం క్రింద పిండములు వేస్తారు. బౌద్ధులు ప్రపంచం నలుమూలల నుండి వస్తారు ఇక్కడికి. ఇక్కడ వున్న రాతి ఫలకం మీద బుద్ధుడు కూర్చున్నాడని చెబుతారు. బుద్ధుడు స్నానం చేసిన నిరంజనానది పక్కనే ప్రవహిస్తుంటుంది.

వసతికి అశోక్ ట్రావెలర్స్ లాడ్జి (ITDC) గయజిల్లా, ఫోను : 22708, BTDC టూరిస్టు బంగ్లా 1 అండ్ 2, సర్క్యూట్ హౌస్, డాక్ బంగ్లా - గవర్నమెంట్ రెస్ట్ హౌస్.

**బోధి ఆలయం :** పెద్ద బుద్ధ విగ్రహం వుంది.అనేక దేశాల నుంచి తెచ్చిన విగ్రహాలు కూడా వున్నాయి. గంగా తీరంలోని శివాలయాన్ని చూసుకుని సిద్దేశ్వర ఆలయానికి రండి, గయ నుండి 20 కి.మీ. దూరం. ఎత్తయిన పర్వత శిఖరం మీద వుందీ ఆలయం. ఇక్కడ సిద్దేశ్వర లింగమును రాత్రియందు పూజిస్తారు. కొండ క్రింద గుహలున్నాయి. పక్కనే పాతాళగంగ నది ప్రవహిస్తూ వుంటుంది.

**గయలో ఉండటానికి వసతి**

అజాతశత్రు, స్టేషన్‌రోడ్, ఫోను : 1514.

అజిత్ రెస్టు హౌస్, రైల్వేస్టేషన్ దగ్గర, స్టేషన్‌రోడ్.

**పాట్నా నుండి వివిధ ప్రాంతాలకు రోడ్ మార్గం కి.మీ.లలో**

**బుద్ధగయకి :** గయ-భక్తియారుపూర్ మీదుగా 184 కి.మీ.

**వారణాసికి :** బిక్రంగంజ్ మీదుగా 270 కి.మీ.

**రాజగిర్‌కి :** బీహారు-నలందా మీదుగా 327 కి.మీ.

**వైశాలికి :** ముజఫర్‌పూర్ దుర్గాపూరు - గాల్చి మీదుగా 608 కి.మీ.

**రాంచికి :** భక్తియారుపూరు నవీడా మీదుగా 328 కి.మీ.

వారణాసి నుండి హైద్రాబాద్‌కి 1197 కి.మీ.; బెంగుళూరు 1763 కి.మీ. - కలకత్తాకి 667 కి.మీ. - ఢిల్లీ 765 కి.మీ. - చెన్నై 1901 కి.మీ. - తిరుపతి 1807 కి.మీ. - లక్నో 286 కి.మీ. - ఆగ్రా 525 కి.మీ.

**వైశాలి :** జైనదేవాలయాలు, విశాలరాజు ప్రాసాదం, మ్యూజియం, పురాతన సరస్సులు వున్న ఈ వైశాలి 527 సంులో తీర్థంకరులు జన్మించిన స్థలం. క్రీ.శ. 383 సంులో ఇక్కడే రెండవసారి బౌద్ధ సమావేశం జరిగింది. ఇక్కడ ఉన్న ఆమ్రపాలి ఉద్యానవనం నుంచే బుద్ధుడు ప్రజలకి సందేశం అందించింది.

**షరాప్‌నాథ్ కొండ :** 24 మంది జైనతీర్థంకరులలో 21 మంది ఇక్కడే నిర్యాణం పొందారు. 1365 మీటర్ల ఎత్తున పర్వతంమీద అనేక జైనాలయాలతో పాటు చక్కని వనాలున్నాయి. ఇంకా దక్షిణ బీహారులో రాంచీ (వేసవి కేంద్రం జగన్నాథుని ఆలయం), ననరామ్ (కొండల మధ్య సరస్సు), జమ్‌షెడ్‌పూర్ (స్టీల్ సిటీ), తీవై యాడామ్ రిజర్వాయరు (పచ్చటికొండల మధ్య అమరియున్న డామ్) హజారబాగ్ (2000 అడుగుల ఎత్తున వున్న వేసవి కేంద్రం, ఇక్కడే నేషనల్ పార్కు కూడా వుంది. అనేక పుష్పాలు లభ్యమవుతాయి ఇక్కడ)

**భాగల్పూర్** : రాయిని తొలిచి కట్టిన దేవాలయాలు ఉన్నాయి.

**రాజరప్ప** : శివుని జటాజూట రౌద్రాగ్ని కీలమంటల్లో లేచిన సతిదేహాన్ని గిరగిర తిప్పేటప్పుడు శిరోభాగం ఇక్కడే పడింది. 51 శక్తి పీఠాల్లో ఒకటిగా వున్న ఈ ప్రాంతం తప్పనిసరిగా దర్శించదగ్గది.

**రాజగిర్** : కొండల నడుమునవున్న రాజగిర్ నలందాకు 19 కి.మీ. దూరంలో వుంది.ఇక్కడ ప్రవహించే నదిని సరస్వతి నది అంటారు. ఇదే కొంత దూరం పోయాక వైతరణి నది అవుతుంది. బౌద్ధస్థూపం కూడా ఉంది. వసతికి BTDC టూరిస్ట్‌బంగ్లా, సెంటూర్ హోకి, ఫోను : 31, 45 ఫారెస్ట్ రెస్ట్ హౌస్, యూత్ హాస్టల్.

**బెట్ల** : బ్రహ్మాండమైన నేషనల్ పార్కు వుంది.

**బక్సర్** : అనేక హిందూ దేవాలయాలున్నాయి.

**చిత్తరంజన్** : మంచి ఇండస్ట్రియల్ సెంటర్. ఇక్కడికి 55 కి.మీ. దూరంలో మసంజోర్ మంచి పిక్నిక్ స్పాట్.

**డెహరీ** : ఈ ఇండస్ట్రియల్ సెంటర్ దల్మాయనగర్‌లోనే వుంది. ఇండియాలో అతిపెద్దదైన బ్రిడ్జి.

**రాజమహల్** : ఇక్కడ ప్రాచీనకాలపు కోట వుంది.

**రోతాస్** : తప్పనిసరిగా చూడాల్సిన భవనం వుంది. ఇందు అనేక ప్రాచీన వస్తువులు వున్నాయి.

**తిలయ్యా** : ఉల్లాసంగా గడపాలనుకునేవారికి, మంచి పిక్నిక్ స్పాట్. ప్రకృతి అందాలు ఇక్కడ అణువణువున దర్శనమిస్తుంటాయి. బౌద్ధులకు ముఖ్యమైన ప్రదేశంగా వున్న "విహార్" అనే పేరుతో చాలాకాలం పిలవబడిన యీ బీహార్‌ని విక్రమాదిత్యుడు క్రీ.పూ. నాలుగవ శతాబ్దం కాలంలో పరిపాలించాడు. అంతటి ప్రశస్తి కలిగిన యీ వేదభూమి నుంచి అద్భుత శిల్పసౌందర్యంతో పర్వతాలమయమైన మధ్యప్రదేశ్‌కి వెళదాం.

# మధ్యప్రదేశ్

మధ్యప్రదేశ్ (మధ్య భారత్) విస్తీర్ణం 4,43,466 చ.కి.మీ. ఇందు జనాభా 6,61,35,862. రాజధాని భోపాల్.

**ప్రధాన నగరాలు, పట్టణాలు :** అంబికాపూర్, విదీప, ఉజ్జయిని, శివపురి, రాహుఘర్, రాజగృహ, బర్హంపూర్, దర్గ్, గుణ, ఇండోర్, గ్వాలియరు, బిలాస్‌పూర్, బింద్ మొదలయినవి.

**సరిహద్దులు:** తూర్పున బీహార్, ఒరిస్సా, ఉత్తరాన రాజస్థాన్, ఉత్తరప్రదేశ్, పశ్చిమాన గుజరాత్, దక్షిణాన ఆంధ్రప్రదేశ్, మహారాష్ట్ర వున్నవి.

**వాతావరణం :** వేసవికాలం 48 డిగ్రీలసెంటీగ్రేడ్ నుంచి 22 డిగ్రీల సెంటీగ్రేడ్ వరకూ, చలికాలం 23 డిగ్రీల సెంటీగ్రేడ్ నుంచి 4 డిగ్రీల సెంటిగ్రేడ్ వరకూ.

**విశ్వవిద్యాలయాలు :** విక్రమ్ విశ్వవిద్యాలయం (ఉజ్జయిని), శివాజీ విశ్వవిద్యాలయం (గ్వాలియర్), అవదేష్ ప్రతాప్ విశ్వవిద్యాలయం (రౌతా), బరకతుల్లా విశ్వవిద్యాలయం (భోపాల్), దేవి అహల్య విశ్వవిద్యాలయం ఇండోరులో వున్నాయి.

**ప్రధాన భాషలు :** హిందీ, ఉర్దూ, మరాఠి.

**యాత్రా పర్యాటక ప్రదేశాలు :** ఖజురహో, ఉజ్జయిని, ప్రఖ్యాతి గాంచిన సాంచిస్థూపం, ఇండోర్, కాన్హా.

**ఎయిర్‌ఫోర్ట్స్ :** భోపాల్, గ్వాలియర్, ఇండోర్, జబల్‌పూర్, ఖజురహో.

**బెస్ట్‌సీజను :** అక్టోబరు నుండి ఏప్రియల్, మే...........

**టూరిస్టు ఇన్‌ఫర్మేషన్ కేంద్రాలు**

గవర్నమెంట్ ఆఫ్ టూరిస్టు, ఆఫీసు, ఖజురహో ఫోను : 2047.

మధ్యప్రదేశ్ టూరిస్టు ఆఫీసు, టూరిస్టు బంగ్లా కాంప్లెక్స్, ఖజురహో.

మధ్యప్రదేశ్ టూరిజం డెవలప్‌మెంట్ కార్పొరేషన్, గంగోత్రి, టి.టి.నగర్, భోపాల్, ఫోను : 554340.

## భోపాల్

అద్భుతమైన రెండు సరస్సులున్నాయి. బోటింగ్ కూడా చెయ్యొచ్చు. అందమైన ఉద్యాన వనాలు ఎన్నో వున్నాయి. వాటిలో ముఖ్యమయినవి కమలా పార్కు, అయుబ్‌బాగ్, మార్‌బాగ్.

అరేరా కొండమీద లక్ష్మీనారాయణ ఆలయం వుంది. ఇంకా నవాబుల ఆడిటోరియం, ఆర్కియలాజికల్ మ్యూజియం, భారతీయ విద్యాభవనం చూడవల్సిన స్థలాలు.

**భోజాపూర్ :** భోపాల్‌కి 28 కి.మీ. దూరంలో వుంది. భోజరాజు కట్టించిన సోమనాథ ఆలయం వుంది.

**చిక్‌తోడ్ :** భోపాల్‌కి 45 కి.మీ. దూరంలో వుంది. సుందర వనాలతో, సరస్సులతో, పర్వతాలతో కడు రమ్యంగా వుంటుంది. ఇక్కడే మారుతీ ఆలయం కూడా వుంది.

**దులవాడి :** 63 కి.మీ. దూరంలో వున్న యీ ప్రాంతం మంచి ఫారెస్ట్ పిక్నిక్ స్పాట్.

**ఇస్లామ్ నగర్ :** అనేక గార్డెన్స్, సుందర భవనాలు వున్నాయి.

**జిన్నూర్ ఘర్ కోట :** విశేషంగా చిలుకలు వున్న ఈ కోట పెద్ద కొండ మీద వుంది.

**రాయ్‌సేన్ :** సాంచికి ఇరవై రెండు కిలోమీటర్ల దూరంలో వున్న ఈ ప్రాంతంలో ఒక కీలకమయిన కోట వుంది. ఈ కోటని క్రీ.శ. 1200లో నిర్మించారు. చూడవల్సిన అద్భుత దుర్గం.

**భింబేత్క :** పర్వతాల నడుమున 680 గుహాశ్రమాలు వున్న ఇక్కడ పాత రాతి యుగపు కాలపు నాటివి అనేక వస్తువులు ఇక్కడే కనుగొనబడ్డాయి.

**సాంచి :** అనేక బౌద్ధస్థూపాలు వున్నాయి. పద్మ శిల్పం, ధర్మచక్రంలాంటి గొప్ప స్థూపాలు ఇక్కడ చూడచ్చు. పురాతన వస్తు ప్రదర్శనశాల కూడా వుంది.

**పిపాలియా :** సాంచికి 12 కి.మీ. దూరంలో వున్న ఇక్కడ పురాతన కాలపు స్థూపాలు వున్నాయి. పది కిలోమీటర్ల దూరంలో వున్న సత్‌ధర్మలో కూడా పిపాలియాలో లానే నాశనమైన స్థూపాలు అడుగడుగునా కానవస్తాయి.

**ఉదయగిరి :** 7 కి.మీ. దూరంలో వున్న ఈ ఉదయగిరిలో గుహలున్నాయి.

**ఉజ్జయిని :** పన్నెండు సంవత్సరాలకి ఓసారి కుంభమేళా మహోత్సవం జరుగుతుంది. ముఖ్యమయిన స్థూపనగరాలలో ఒకటి ఈ ఉజ్జయిని.

**గోపాల మందిరం :** వెండి విగ్రహంతో చేయబడిన కృష్ణుడి విగ్రహం వుంది. అతిపురాతనమైన నక్షత్రశాల వుంది. 18వ శతాబ్దములో నిర్మించిన ఈనక్షత్ర మేధశాల పెద్ద జంతర్‌మంతరే.

**భర్తృహరి గుహ :** భర్తృహరి సుభాషితాలు తెలియనివారు తెలుగునాట లేరనటంలో అతిశయోక్తి లేదు. ఆయన నివశించిన గుహని 11వ శతాబ్దమునాటి శివాలయపు శిధిలాలను కూడా వీక్షించవచ్చు ఇక్కడ.

**మహాకాల్ టెంపుల్** : 13వ శతాబ్దములో నాశనము చెయ్యబడిన పురాతన శివుడి ఆలయం. ఇక్కడే శ్రీకృష్ణ భగవానుడు విద్యాభ్యాసము చేసినట్టు పురాణ ఆధారాల్లో తెలుస్తోంది.

**ఇండోర్** : పురాతన రాజుల ప్రాసాదములు, మ్యూజియమ్‌లు, అనేక సుందర ఉద్యానవనాలు. ఇక్కడున్న కాంచన మందిరములో నరకములో పడే బాధలు గురించి (చిత్రాలలో) వ్రాసివున్న మందిరము. ప్రతివారు వక్కసారన్నా చూడదగ్గది. మ్యూజియంలో మాల్వా ప్రదేశములో దొరకబడిన నాణాలు, శిల్పఖండాలు, అనేకము వున్నాయి. ప్రతి పన్నెండేళ్ళకు కుంభమేళ జరుగుతుంది. ఉజ్జయనికి 52 కి.మీ. దూరంలో వున్న ఈ ఇండోర్ నుంచి రోడ్డు, రైలు ప్రయాణము ద్వారా అన్ని వైపులకి వెళ్ళచ్చు.

**కాన్హా** : దేశంలోనే అతి గొప్ప వన్యమృగ సంరక్షణ కేంద్రము ఈ కాన్హాలోనే వుంది. ఏప్రియల్ నుంచి జూన్ లోపలగాని నవంబరు నుంచి జనవరి లోపుగాని ఇక్కడికి వెళ్ళండి.

**మాండు** : రాజ ప్రాసాదాలు, భవనాలుగల అత్యంత రమ్యమైన సుందర ప్రదేశము, దేవదాసు-పార్వతి విషాద ప్రేమలానే ఇక్కడి అమర ప్రేమికులు రాణీ రూపమతి - నాజ్ బహదూర్‌ల ప్రణయ ప్రేమగాథ విషాదమయ్యింది. మాండులో చూడవల్సిన వాటిలో ముఖ్యమైనవి.

**జహాజ్ మహల్** : 15 మీటర్ల వెఱల్పు 110 మీటర్లు పొడవు కల్గిన ఈ మహల్ రెండు కొలనుల మధ్య నిలిపిన పాత్రలా వుంటుంది.

**హిందోళ్‌మహల్** : అప్పట్లో ఈ మహల్లోకి ఏనుగులు ఎక్కి వచ్చేవారు అప్పటి రాజులు.

**చంపాబోలి** : దీని ప్రత్యేకత బయట యెంత యెండగావున్న లోపలకెళ్ళేసరికి చల్లగా ఎ.సి.లో వున్నట్టు వుంటుంది. ఇంకా రాణీ రూపమతి భవనాలు నీలకంఠ మహాదేవ ఆలయం చూడదగ్గవి. మాండు పరిసరాల్లో ఓంకారేశ్వర్ వుంది. ద్వాదశ జ్యోతిర్లింగములలో ఒకటి. ఇది ఇండోర్‌కి 80 కి.మీ. దూరములో వున్న ఓంకారేశ్వర్‌కి భక్తులు అనేక మంది వస్తారు.

**మహేశ్వరాలయం** : నర్మదా తీరములో వున్న ప్రసిద్ధి చెందిన శివాలయం.

**ధార్** : ఇక్కడున్న కోటలో సంస్కృత భాషలో రాసిన వ్రాతలున్నాయి. ఒకప్పుడు మాళవదేశానికి చెందిన రాజధానే ఇప్పటి ఈ ధార్.

**ఖజురహో** : ఇక్కడున్న ప్రతి దేవాలయం మీద రస ప్రబంధాలు చూసిన వాత్సాయనుడు గుర్తుకు రాకమానడు. ఈ దేవాలయపు శిల్ప సోయగాలు కనులతో చూస్తే నరాలు జివ్వున లాగుతాయి తియ్యగా. ఈ ఖజురహోలో 9 నుండి 12 శతాబ్దాల మధ్యకాలంలో నిర్మించిన అపూర్వమైన దేవాలయాలు 22 వున్నాయి.

**కందరీయ మహదేవుని ఆలయం** : కామ రసోద్దీపనం వున్న అనేక శిల్పాలు.... లెక్కిస్తే వెయ్యికి తక్కువ వుండవు. అనేక శిల్ప సముదాయములున్న ఈ ఆలయములో మైధున జంటల శిల్పాలు మనసుని పక్కదారి పట్టించకుండా వుండవు. ఇలాంటి శృంగారలీలలను ప్రతిబింబించే మరో ఆలయం, జగదాంబాలయం ఇక్కడ కాళిమాత విగ్రహము నల్లరంగులో వుంటుంది.

**చిత్రగుప్త ఆలయం** : సూర్య భగవానుడి విగ్రహం వున్న ఈ ఆలయం స్వత: సిద్ధంగా విష్ణుమూర్తి ఆలయంగా మలచబడిందని స్థానికులు చెబుతారు.

**విశ్వనాధుని ఆలయం** : మతంగేశ్వర ఆలయం, లక్ష్మణాలయం, ఆర్కియలాజికల్ మ్యూజియం తప్పనిసరిగా చూడదగినవి. తూర్పు విభాగంలో పార్శ్వనాధాలయం వుంది. అద్భుతమైన కళారూపాలువున్న ఈ ఆలయం జైనదేవాలయలన్నింటిలోకి పెద్దది. ఇక్కడ ఆదినాధుని వృషభ సింహాసనము వుంది.

**మండై** : జైనదేవత అష్టభుజియై కనిపించే ఈ ఆలయము బాగా శిథిలమయిపోయి వుంది.

**వామనునికి దేవాలయం** : గుడి చుట్టూ శిల్పాలు చిత్రవిచిత్రమైన భంగిమలతో వుంటాయి. అందమైన స్త్రీకి నిర్వచనం ఇక్కడ విగ్రహాల్లో చూడవచ్చు.

**బ్రహ్మదేవుని ఆలయం** : అరుదైన ఆలయం. కారురాయితో కట్టబడిన ఈ ఆలయం శ్రీ మహావిష్ణువు కోసము కట్టినది.

దక్షిణ విభాగంలో దలలాదేవ్ ఆలయము వుంది. మూడు మీటర్ల ఎత్తులో వున్న శ్రీ మహావిష్ణువు విగ్రహం వుంది. ఈ ఆలయంలో శృంగార శిల్పాలు కోకొల్లలు. శృంగారపు భంగిమలు అడుగడుగునా దర్శనమిస్తుంటాయి. ఖజురహోకి 63 కి.మీ.దూరములో మహోబాలో కీర్తి సాగరం మదీన సాగరము వున్నాయి. పడమరన గోకార పర్వతం వుంది. ఇక్కడ భైరవ విగ్రహం, చీకటి గుహలు వున్నాయి. మహోబాకు కొద్ది దూరంలోనే సూర్యుని దేవాలయం వుంది.

**కాలాంజనగిరి** : నీల కంఠ మహాదేవుని ఆలయం వుంది. భరతుడు తపస్సు చేసిన ప్రదేశం కూడా ఇదే.

**జబల్‌పూర్** : రాణి దుర్గావతి మ్యూజియం వుంది, ఇక్కడికి 23 కి.మీ. దూరంలో మార్బుల్ రాక్స్ చూడాలంటే పున్నమిరాత్రే చూడాలి. నర్మదానది ఇక్కడి రాళ్ళమీద తుళ్ళి తుళ్ళిపడి ఓ సుందర జలపాతాన్ని నిర్మించింది. ఇక్కడికి వచ్చే దారిలోనే మదన్‌మహల్ ఆలయం వుంది. జబల్‌పూరుకి 20 కి.మీ. దూరంలో గౌరీశంకర వుంది. ఇదే నర్మదా సరస్వతి నదుల సంగమస్థానం. ఆలయం క్రింద వున్న గుహల్లో మంత్ర తంత్ర శాస్త్రములకు సంబంధించిన విగ్రహాలు వున్నాయి.

పంచమర్హి : పర్వత విశ్రాంతి కేంద్రం. కొద్దిదూరంలోనే మహా దేవాలయంతోపాటు పాండవులు నివసించిన గుహలున్నాయి.

విరాట్‌పూర్ : పాండవులు 11 సం॥ అరణ్యవాసం తర్వాత అజ్ఞాతవాసం చేసింది ఇక్కడే. పాండవులు ఆయుధాలు దాచిపెట్టిన చెట్టుకూడ చూడచ్చు.

**కపిలధార** : మహాకవి కాళిదాసు మేఘసందేశం రచనకు ప్రారంభం ఇక్కడే.

**అమర్‌కంటక్** : నర్మదానది జన్మస్థలం.

**గాయత్రికుండు** : రావణాసురుడు తపస్సు చేసిన ప్రదేశం.

**ఝాన్సీ** : జోన్ ఆఫ్ ఆర్క్‌గా కీర్తించబడిన ఝాన్సీరాణి గుర్తుకు రాకమానదు ఆమె సాహసం పోరాట పటిమ అందరికి ఆదర్శం. ఇక్కడి నుండి ఖజురహోకి బస్సులుంటాయి. ఇక్కడికి 16 కి.మీ. దూరంలో జర్బాకోట వుంది.

**గ్వాలియర్** : బ్రహ్మాండమయిన కోటవుంది. 100 మీటర్ల ఎత్తుగల కొండ మీద 3 కి.మీ. పొడవున్న ఈ కోట చుట్టూ 11 మీటర్ల ఎత్తున గోడ కట్టబడి వుంటుంది.

**మాన్‌సింగ్ భవనము** : ఈ భవనపు గోడల మీద ఆశ్చర్యంగా కనిపించే రంగురంగుల చిత్రాలున్నాయి. ఉత్తరకొనన జోహార్ సరస్సు వుంది అత్తాకోడళ్ళ దేవాలయాలున్నాయి ఇక్కడ.

గ్వాలియర్‌లో జయవిలాస ప్రసాదంలో శృంగార నాయికా శిల్పం చలువరాతితో చెక్కినది వుంది.

**గ్వాలియర్ పాతపట్టణంలో** : తాన్‌సేన్ సమాధి వుంది. ఇక్కడున్న చింతచెట్టు చిగురు తింటే స్వరానికి మాధుర్యం పెరుగుతుందని గాయకుల నమ్మకం.

ఈ పరిసరాల్లోనే ముచికుంద తీర్థం, చందేపురి, శివపురి (వేసవి విశ్రాంతి కేంద్రం) ఝాన్సీకి 50 కి.మీ. దూరంలో వుంది ఈ శివపురి.

## మధ్యప్రదేశ్‌లో చూడదగ్గ కొన్ని ముఖ్యమైన యాత్రా ప్రదేశాలు

**ఖైరాగర్హ్** : ఏషియా మొత్తంలోనే ఉన్న ఏకైక మ్యూజిక్ యూనివర్సిటి "ఇందిరా కళా సంగీత విశ్వవిద్యాలయం" ఇక్కడ వుంది.

**ముక్తగిరి** : జైన్ టెంపుల్స్‌తోపాటు అనేక హిందూ దేవాలయాలు వున్నాయి.

**సౌగాంగ్** : పురాతన వస్తువులు, మ్యూజియం, అనేక జ్ఞాపక చిహ్నాలు వున్నాయి.

**పచ్‌మరి** : హిల్ రిసార్ట్ ఇది. గుహలు, జలకాలాడే సరస్సులు వున్నాయి.

**పన్నా** : వజ్రాల గనులున్న ప్రదేశం.

**రేవా** : రాజసౌధాలున్న ఈ ప్రదేశం తెల్ల చిరుతల జన్మస్థలం. ఇక్కడికి 32 కి.మీ. దూరంలో చచాయేలో అందమైన ప్రకృతి మధ్య సుందర జలపాతాలు వున్నాయి.

### భోపాల్ నుండి రోడ్డు మార్గాలు కి.మీ.లలో

విశాఖపట్టణం 1221 కి.మీ., విజయవాడ 1084 కి.మీ., వారణాసి 79 కి.మీ., తిరుపతి 1423 కి.మీ., మైసూర్ 1514 కి.మీ., చెన్నై 1517 కి.మీ., హైదరాబాద్ 813 కి.మీ., ఢిల్లీ 741 కి.మీ., కలకత్తా 1456 కి.మీ. ముంబాయి 789 కి.మీ., గ్వాలియర్ 422 కి.మీ., ఆగ్రా 540 కి.మీ., మాండు 290 కి.మీ., సాంచి 68 కి.మీ., ఉజ్జయిని 189 కి.మీ. ఖజురహో 387 కి.మీ.

గ్వాలియర్ నుండి విజయవాడ 1405 కి.మీ. తిరుపతి 1744 కి.మీ., విశాఖపట్టణం 1542 కి.మీ. వారణాసి 555 కి.మీ.. మైసూర్ 1835 కి.మీ., చెన్నై 1838 కి.మీ., హైదరాబాద్ 1134 కి.మీ.

**రైలు మార్గం :** ఢిల్లీ-ముంబాయి మెయిన్‌లైన్‌లో వుంది. ఈ గ్వాలియర్ ఢిల్లీకి 317 కి.మీ. ఆగ్రా నుండి 118 కి.మీ., ముంబాయి 1225 కి.మీ.

### మధ్యప్రదేశ్ యాత్రా పర్యాటక ప్రదేశాల్లో వసతి....

**ముందుగా భోపాల్ :**

మధ్యతరగతి వారికి గోయెంక ధర్మశాల, సింధి ధర్మశాల, రైల్వే రిటయిరింగ్ రూములు. ఇంకా ఖరీదులో

**మదీనా :** సుల్తానియా రోడ్.

MPSTDC పంచవన్; కొత్త మార్కెట్; TT నగర్ ఫోను : 63047, 67247.

జహాన్‌నూమా సౌధము; శమ్లా పర్వతాలు ఫోను : 540100, 76080, 76190, 76050.

గుల్షన్, హమీడియా రోడ్, ఫోను : 3506.

క్వాలిటీస్ మోటల్ షిరాజ్ ఏరియా కాలనీ, ఫోను : 64513.

మయూర్, బిరేశియా రోడ్, ఫోను : 77094-98.

**బిలాస్‌పూర్ :**

ఇంపీరియల్ సబ్, పాలెస్ గ్రౌండ్స్, ఫోను : 2738, 3881.

చంద్రిక, లింక్ రోడ్, ఫోను : 3281.

సువిధ; పాత బస్‌స్టాండు, ఫోను : 3542.

**గ్వాలియర్ :**

మధ్యతరగతి వారికి స్టేషన్ దగ్గరలో చాలా హోటల్స్ వున్నాయి, ఖరీదులో.

గుజ్రిమహల్ హైకోర్టులేన్, ఫోను : 23492.

MPSTDC తాన్‌శేన్ హోటల్, గాంధీమార్గ్. ఫోను : 21568.

టూరిస్టు బంగ్లా, గాంధిమార్గ్, రైల్వేస్టేషన్ ఎదురుగా. ఫోను : 22491.

సఫారి, స్టేషన్‌రోడ్, లాష్కార్ ఫోను : 24638.

వివేక్ కాంటినెంటల్, టోపి బజార్, ఫోను : 27016.

**ఇండోర్ :**

ఇండోటెల్ మానోర్‌హౌస్, కంచన్, 12/2 సౌత్ టకోగర్జ్, ఫోను : 32122,

మయూర్, 39 చోటీ గ్వాలూహ్.

శ్రీమాయా, 12/1, ఆర్.ఎన్. టాగూరుమార్గ్, ఫోను : 34151.

సుందర్, 17/2, సౌత్ టకోగంజ్, యూనివర్శిటి ఎదురు, ఫోను : 38128.

సెంట్రల్, 70-71, రాంపురవాలా బిల్డింగ్స్, ఎం.జి. రోడ్, ఫోను : 32131 - 32041.

లాన్‌తరన్, 28, యశ్వంత్ నివాస్‌రోడ్, ఫోను : 30369, 30371.

**జబల్‌పూర్ :**

ఆరోక్, రైట్ టౌను, ఫోను : 22167, 22267, 22371, 21616

జాక్సన్స్ సివిల్ లైన్సు, ఫోను : P.B.X. 21320.

రాజన్స్, క్రిస్టియన్ హైస్కూల్ ఎదురుగా, నేదేరా బ్రిడ్జి, ఫోను : 2495.

MPSTDC టూరిస్టు బంగ్లా.

ఎమ్‌బేసిడర్, రూసెల్ క్రాసింగ్, నేషియర్ టౌను, ఫోను : 21771.

**ఖజురహో :**

తాజ్ చందీలా, ఫోను : 2054, 2101, 2102.

MPSTDC రాహి.

MPSTDC టూరిస్టు బంగ్లా.

ఖజురహో అశోక్ (ITDC).

జాస్ ఒబరాయ్, బై-పాస్ రోడ్, ఫోను : 66,85-89.

MPSTDC పాయత్.

**మాండు :**

అశోక్ ట్రావెలర్స్ లాడ్జి (ITDC), ధార్ జిలా.

MPSTDC టూరిస్ట్ హట్స్.

ARCH, Dept. గెస్ట్‌హౌస్.

**సాంచి :**

మహాబోధి బుద్ధిస్టు గెస్టుహౌస్.

అశోక్ ట్రావెలర్స్ లాడ్జి (ITDC), రాయ్‌సేన్ జిల్లా.

సర్క్యూట్ హౌస్.

**శివపురి :**

ఫారెస్టు రెస్టుహౌస్ (నేషనల్ పార్క్ లోపల)

MPSTDC చింకారా మోటల్, ముంబాయి రోడ్డు.

సర్క్యూట్ హౌస్.

**ఉజ్జయిని :**

MPSTDC షిప్రి మోటల్, యూనివర్సిటి రోడ్డు, ఫోను : 4862.

సర్క్యూట్ హౌస్.

**రసోద్దీపణ కావించే అనేక సుందర పద్మిని జాతి స్త్రీల శిల్పాలు మహాద్భుతమైన స్థూపాలున్న ఈ మధ్యప్రదేశ్ అనుభూతులను మోసుకుంటూ కొన్నివేల గుడులు వున్న ఉత్తరప్రదేశ్‌కి వెళదాం.**

# ఉత్తర ప్రదేశ్

ఉత్తరప్రదేశ్ (ఉత్తర భారత్) విస్తీర్ణం 2,94,411 చ॥కి॥మీ. ఇందు జనాభా 13,87,60,417....

ప్రధాన నగరాలు, పట్టణాలు : ఆగ్రా, అలహాబాదు, ఆలీఘర్, బలియా, ఫత్‌నూర్, ఫైజాబాదు, ఫత్‌నగరు, ఎటావా, డెహ్రాడూన్, బారబండి, బరేలి, బులంద్ షహర్, గర్వాల్, గోరఖ్‌పూరు, ఘజియాబాద్, ఝాన్సీ, మథుర, మీరట్, మీర్జాపూరు, సీతాపూరు, ఉన్నత్, షాజహాన్ నగరు, ఉత్తరకాశి, వారణాసి, నైనిటాల్, రాయ్‌బరేలి, ముజఫత్ నగరు మొదలగునవి.

**యాత్రా పర్యాటక స్థలాలు :** యమున, గంగోత్రి, కేదార్‌నాథ్, బదరీనాథ్, హిమకలంద్, వారణాసి, ప్రయాగ, హరిద్వార్, ఆగ్రా, అయోధ్య, సారనాథ్, మథుర, కుశినగరు, కేశాంబి, ప్రముఖమైన స్థలాలకు ఉత్తరప్రదేశ్‌లో కొదువలేదు. పవిత్రస్థలాలు.... పుష్పాల లోయలాంటి సుందరలోయలకి అన్నింటికి ఈ ఉత్తరప్రదేశ్ ప్రసిద్ధి.

సరిహద్దులు : తూర్పున బీహార్, దక్షిణాన, నైరుతిన మధ్యప్రదేశ్, పశ్చిమాన రాజస్థాన్, హర్యానా, ఢిల్లీ, ఉత్తరాన టిబెట్, నేపాల్ వాయువ్యాన హిమాచల్ ప్రదేశ్ వున్నవి.

**ప్రధాన భాషలు :** హిందీ, ఉర్దూ.

**వాతావరణం :** వేసవికాలం 45°C నుంచి 11°C డిగ్రీల సెంటిగ్రేడు, చలికాలం 32°C నుంచి 2°C వరకూ.

**వర్షాకాలం :** జూన్ నుంచి సెప్టెంబరు.

**చలికాలం :** సెప్టెంబరు, అక్టోబరు. మే ........., జూలై.

**విశ్వవిద్యాలయాలు :** ప్రసిద్ధి పొందిన బెనారస్ హిందూ విశ్వవిద్యాలయంతో పాటు ఇరవై ఒక్క విశ్వవిద్యాలయాలు ఉన్నాయి.

**బెస్ట్ సీజన్ :** అక్టోబరు నుంచి మార్చి వరకూ.

**ఎయిర్‌పోర్ట్స్ :** ఆగ్రా, కాన్పూరు, లక్నో, గోరఖ్‌పూరు, అలహాబాదు, వారణాసి, డెహ్రాడూన్, ఝాన్సీ, నైనిటాల్, రాయ్‌బరేలి.

**టూరిస్ట్ ఇన్ఫర్మేషన్ కేంద్రాలు**

గవర్నమెంట్ ఆఫ్ ఇండియా, టూరిస్టు ఆఫీసు 191, ఆదిమాల్, ఆగ్రా, ఫోను : 36377, 363959.

గవర్నమెంట్ ఆఫ్ ఇండియా టూరిస్టు ఆఫీస్, 15-బి, దిమాల్, వారణాసి, ఫోను : 43744.

ఉత్తరప్రదేశ్ టూరిజం దిమాల్, ముస్సోరి, ఫోను : 2883.

యు.పి. గవర్నమెంట్ టూరిస్టు ఆఫీస్, దిమాల్ మల్లితల్, నైనిటాల్, ఫోను : 2337.

యు.పి. గవర్నమెంట్ టూరిస్టు ఆఫీస్, స్టేషన్‌రోడ్, లక్నో, ఫోను : 246205.

## లక్నో

చరిత్రలో లక్ష్మణపురిగా పిలవబడిన ప్రదేశం. నేటి ఉత్తరప్రదేశ్ రాజధాని. ఇక్కడి యాత్రాస్థలాలు :

**చోటా ఇమాంబారా :** ఉద్యానవనం, తాజ్‌మహల్ నమూనాలని ఇక్కడ చూడచ్చు. ఇందులోనే రజత సింహాసనం వుంది నవాబుగారిది. దీని ఎదురుగానే "సాత్‌ఖండ్" ఏడు అంతస్తుల గోపురం వుంది. అయితే ఈ గోపురం పూర్తికాలేదు. 1840లో దీన్ని కట్టించాలనుకున్న ఆలీషా చనిపోవటంతో ఈ కట్టడము అసంపూర్తిగా ఆగిపోయింది.

**లక్ష్మణ తిన్నె :** శ్రీరామచంద్రుడు తన సోదరుడు లక్ష్మణస్వామికి బహుమతిగా ఇచ్చిన ప్రదేశం.

**గడియార స్థంభం :** 1880లో నిర్మాణం ప్రారంభించిన ఈ గడియార స్థంభం ఎత్తు 226 అడుగులు. హుస్సేనాబాదు టాంకు ఎదురుగా వుందీ స్థంభం.

**సికిందర్ బాగ్ :** చారిత్రాత్మక స్థలం, బొటానికల్ రిసెర్చి ఇన్‌స్టిట్యూట్ వుంది.

**వారన్ మహల్ :** లక్నోలో పురాతన భవనాల్లో ఒకటి. అక్బరు రాజప్రతినిధి సమాధి వుంది.

**కైసరు బాగ్ :** చక్కటి ఉద్యానవనం. ఆర్కియలాజికల్ మ్యూజియంలో కొన్ని అద్భుత వస్తువులను చూడవచ్చు.

**రెసిడెన్సీ :** శిథిలమై జీర్ణావస్థలో ఉన్న భవనాల్లో గోడల మీద చిత్రించిన లతాగుచ్ఛములున్నాయి. నేలమాళిగ గదులు, ఉద్యానవనాలు ఈ భవనపు శోభని తెలియచెబుతాయి. ఈ రెసిడెన్సీ ఎదురుగా వున్న గోమతీ నదీ తీరంలో స్వాతంత్ర్య సంగ్రామంలో అసువులు బాసిన అమరవీరుల స్మారక చిహ్నం వుంది.

**మ్యూజియం :** 1921లో స్థాపించబడిన ఈ జంతు ప్రదర్శనశాల పెద్ద గార్డెన్లో వుంది. భారతదేశంలోని జంతుజాలాలన్ను ఇక్కడ చూడవచ్చు దీనితోపాటు లక్నో స్టేట్ మ్యూజియం కూడా వుంది. ఇందులో గుప్తుల స్వర్ణయుగాలనాటి చారిత్రక వస్తువులు ఎన్నో చూడవచ్చు.

లక్నో పరిసరాల్లో చూడదగ్గ ప్రదేశాలు : 14 కి.మీ. దూరంలో చినీహట్ ప్రినిక పెవిలియన్ వుంది. ఇదో చూడచక్కని సరస్సు.

**నవాబ్ గంజ్ బర్డ్ శాంక్చువరీ :** ఇక్కడికి శీతాకాలంలో వెళ్ళండి. వలసవచ్చే అనేక పక్షులను చూడవచ్చు. కాన్పూర్ హైవేలో 44 కి.మీ. దూరంలో వుంది.

**లక్నోకు రావటానికి మార్గం :** వారణాసి నుండి, ఆగ్రా నుండి, గోరఖ్‌పూర్ నుండి రైలుమార్గం వుంది. ఇక్కడ నుంచి 12 గంటల్లో నేపాల్ సరిహద్దుకి కూడా వెళ్ళవచ్చు. అమౌసి ఎయిరుపోర్టు నగరానికి 12 కి.మీ. దూరములో వుంది.

## లక్నోలో వుండటానికి వసతి

అవథ్, టిలోయ హౌస్, 1, రామమోహన్‌రాయ్ మార్గ్, ఫోను : 43821.

కాపూర్, 52, హజరత్ గంజ్, ఫోను : 243958, 247262.

కార్లటన్ షనాజఫ్ రోడ్డు, ఫోను : 244021, 242439, 242443, 242413, 242451.

సెంట్రల్, అమిన్‌దాబాద్, ఘుందవేలా పార్కు, ఫోను : 44558.

గవర్నమెంట్ గెస్టహౌస్, జవహర్‌లాల్ భవన్ వెనుక, ఫోను : 40164, 46168.

గుల్‌మర్గు, అమినున్‌దల పార్కు, అమిన్‌దాబాద్, ఫోను : 31227.

హిందుస్థాన్ చార్‌బాగ్, ఫోను : 50851.

మధువన్, 55, హెవెత్ రోడ్డు, శివాజిమార్గు.

మోహన్, చార్‌బాగ్, ఫోను : 52251, 53397, 53492, 51502, 55768.

టూరిస్టు, విశ్వేశ్వరనాథ్ రోడ్డు, ఫోను : 45313.

UPSTDC హోటల్ గోమతి 6, సాప్రుమార్గు, ఫోను : 34282, 34284.

విష్ణుగోపాల్, 19, హెవిత్ రోడ్డు, ఫోను : 44216.

కోహినూర్, పి.ఒ. బాక్స్ 334, 6, స్టేషను రోడ్డు, ఫోను : 35421, 31734.

డీప్, హుసేన్‌గంజ్ క్రాసింగ్, ఫోను : 32637, 49207.

చౌదరి, 3, విధాన్‌సభ మార్గ్, ఫోను : 32654.

**హరిద్వారము :** ఐదు మోక్షదాయక పురాణాల్లో ఒకటి. హిందువులకి అతి పవిత్రమయిన ఈ హరిద్వారము సముద్రమట్టానికి 1000 అడుగుల ఎత్తులో వుంది. పావన గంగానది, పర్వతలోయల గుండా మార్గం సుగమనం చేసుకొని హరిద్వారం వద్ద సమతల ప్రదేశంలోకి ప్రవేశించి, ఈ పేరుని సార్థకం చేసింది. ప్రతి పన్నెండు సంవత్సరాలకి గంగా పుష్కర సమయంలో కుంభమేళ జరుగుతుంది.

బ్రహ్మకుండు : చనిపోయినవారి అస్థికలు ఇక్కడ నిమజ్జనం చేస్తారు. ఈ గంగానది తీర స్నానఘట్టాల నుంచి యాత్రికులు జలాలను పట్టుకొని వస్తారు. పవిత్రంగా..... ఇక్కడ చాలా దేవాలయాలున్నాయి.

**కన్‌ఖాల్** : చాలా పురాతనమైన ఈ కన్‌ఖాల్ హరిద్వార్ స్టేషనుకి 4 కి.మీ. దూరంలో వుంది. దక్ష ప్రజాపతి ఆలయం, సతీకుండంతోపాటు మహా వీరాంజనేయ ఆలయం వుంది. స్థలమహత్యం ప్రకారం.... దక్షప్రజాపతి యజ్ఞాన్ని తలపెట్టి అందరినీ పిలిచి, తనని వ్యతిరేకించి వెళ్ళిన కూతురు సతీదేవిని, అల్లుడు శివుడ్ని పిలవకుండా యజ్ఞాన్ని ప్రారంభించాడు. పుట్టింటి మీద మమకారంతో శివుడు వద్దంటున్నా వెళ్ళిన సతీదేవికి భంగపాటే జరిగింది. తండ్రి ఆగ్రహించి అల్లుడయిన శివుడ్ని ఘోరంగా దూషించాడు. అది విని భరించలేక యజ్ఞకుండంలోకి దూకింది సతీదేవి.అది తెలిసి శివుడు కాలరుద్రుడై యజ్ఞాన్ని ధ్వంసంచేసి మృతురాలైన సతీ దేహాన్ని తీసుకొని శోకతప్త హృదయుడై తిరగటంతో లోకాలు అల్లకల్లోలమయ్యాయి. ఆ ప్రళయాన్ని ఆపే ఉద్దేశ్యముతో శ్రీమహావిష్ణువు చక్రాయుధాన్ని ప్రయోగించాడు. అప్పుడే సతీదేవి దేహం 52 శకలాలుగా చేధించబడింది.

ఆ ప్రదేశాలే నేటి 52 శక్తిపీఠాలు.

**భీమగోడా** : పాండవులు అంతిమయాత్ర చేసింది ఇక్కడినుంచే. హరిద్వారానికి చాలా కొద్ది దూరంలో వుంది. హరిద్వార్‌కి పడమరగా చిన్నకొండ మీద బిల్వమాంతరంగా అమరివున్న ఆలయం, గౌరికుండం వున్నాయి. ఇక్కడ గుహాంతరంలో దుర్గాదేవి కొలువై వుంది.

గంగానది అవతలి తీరంలో భయంకరమైన అడవిలో చండి పర్వతం వుంది. క్రూర మృగాలు అనేకం సంచరిస్తుంటాయి ఈ పర్వతం పరిసరాల్లో, చుట్టుప్రక్కల చాలా ఆలయాలు, మందిరాలు వున్నాయి.

**ఋషికేష్** : పర్వతారోహకులికి మంచి ప్రదేశం. పేరుకి తగ్గట్టు సాధువులకి నిలయం.

**త్రివేణి ఘాట్**: గంగ, యమున, సరస్వతి నదులు కలిసేచోటు. ఈ ఘాట్‌లో భరత మందిరం, ఋషికుండం, గీతా భవనం వున్నాయి. ఋషికుండంలో స్నానంచేసి రఘునాథాలయాన్ని దర్శించండి.

**లక్ష్మణ ఝూలా** : ఋషికేష్‌కి అయిదు కిలోమీటర్ల దూరంలో వుంది. కాలి నడకన వెళుతూ భరత, లక్ష్మణ రామ మందిరములను దర్శించుకోవచ్చు.

కార్బట్ నేషనల్ పార్కు : ఏనుగులమీద ఎక్కి తిరగొచ్చు. చక్కని ఆహ్లాద వాతావరణం. ఈ వన్యమృగ సంరక్షణ కేంద్రంలో చిరుతలు, సింహాలు, పెద్దపులులు, లేళ్ళు, దుప్పులు లాంటివి అనేకం చూడవచ్చు.

**ఋషికేష్‌లో విడిదికి :**

బేసర 1, ఘాట్‌రోడ్, ఫోను : 767.

బిర్లా గెస్ట్‌హౌస్, సర్క్యూట్ హౌస్

మందాకిని ఇంటర్నేషనల్ 63, హరిద్వార్ రోడ్. ఫోను : 781, 1081, 1281.

మేనక, UPSRTC బస్‌స్టాండ్ వద్ద, ఫోను : 288.

ఇంద్రలోక్, రైల్వేరోడ్, ఫోను : 555.

GMVN టూరిస్టు బంగ్లా, ముని-కి-రేతి నటరాజ్, డెహ్రా-డూన్-రోడ్, ఫోను : 1099, 1262.

**ఆల్మోరా :** పర్వత శిఖరాల మధ్యవున్న చిన్న పట్టణం. గోడాము స్టేషన్ నుండి మనోహరమైన రోడ్డు వుంది. సముద్ర మట్టానికి 1650 మీటర్ల ఎత్తువున్న ఈ ప్రదేశం ఒకప్పుడు నేపాల్ రాజ్యంలో భాగంగా వుండేది. ఈ ప్రాంతానికి ఢిల్లీ నుండి బస్సులున్నాయి. నైనిటాల్‌కి 68 కి.మీ. దూరంలో వున్న ఈ ఆల్మోరాకి 5 కి.మీ. దూరంలో కాశీనాథ్ ఆలయం వుంది. ప్రకృతి కన్య తన సమస్త పరువులని పరిచిందా అన్నట్టు వున్న ఇక్కడ్నించి కిలోమీటరు దూరంలో కేసరదేవి ఆలయం వుంది. ఆల్మోరా బస్‌స్టాండ్‌కి దగ్గరలోవున్న బ్రైటన్‌కార్నర్‌కి తప్పనిసరిగా వెళ్ళి సూర్యోదయ, సూర్యాస్తమయ మొ॥ కమనీయ దృశ్యాలను చూడండి.

**ఉండటానికి వసతి :**

సర్క్యూట్ హౌస్, ఫోను : 2292.

ఫారెస్టు హౌస్, ఫోను : 2065.

నీలకంఠ, ఫోను : 2032.

టూరిస్టు కాటేజ్, ఫోను : 2012.

**కవుసాని :** ఆల్మోరాకి 63 కి.మీ. దూరంలో వుంది. ఇది పర్వతశ్రేణి. ఇక్కడనుంచే అద్భుత శిఖరాలను చూడచ్చు. రాణీఖేట్ నుండి రామ్‌నగరు వెళ్ళే బస్సు ఎక్కండి. వసతికి టూరిస్టు బంగ్లా వుంది.

**నైనిటాల్ :** కాట్‌గోడాము నుంచి అద్భుతమైన రోడ్డు మార్గం ద్వారా ప్రయాణం చేయండి. కుమావీవన్ పర్వత సముదాయము అయిన ఈ నైనిటాల్ ప్రసిద్ధమైన వేసవి మకాం. పాడవయిన పర్వతాల మధ్యవున్న నైనిటాల్ సముద్రమట్టానికి 6,400 అడుగుల ఎత్తున వుంది. ఇక్కడ ఓ అందాల సరస్సు వుంది. ఇక్కడున్న ఈ సరస్సు ప్రపంచంలోని అందాల సరస్సుల్లో ఒకటి.

**చైన్ పేక్** : హిమాలయ పర్వతాలు మంచు కిరీటాలు ధరించి కనపడతాయి. ఇక్కడ సరదాగా జంటలు బోటింగ్ చేయచ్చు. అత్రి. పులస్య మహా మునులు తపస్సు చేసిన పవిత్ర ప్రదేశం కూడా ఇది. ఉండటానికి యూత్ హాస్టల్ వుంది.

**రాణిఖేట్** : ఇదో చక్కని వ్యూపాయింట్. ఈ ప్రదేశం నుండి హిమాలయ శిఖరాలను చూడచ్చు.

**వసతికి :**

KMVN టూరిస్టు బంగ్లా, మూన్, సదర్ బజారి, ఫోను - 58.

వెస్ట్‌వ్యూ M.G. రోడ్, ఫోను - 61, 196.

ఫారెస్ట్ రెస్టుహౌస్, ఫోను - 1.

**గద్వాల్ హిమాల్** : పర్వతారోహులకి ఉత్సాహం - స్ఫూర్తినిచ్చే శిఖరాలు ఎన్నో వున్నాయి. అతి పవిత్రస్థలం పావన గంగ జన్మస్థలం. అప్పటి మునులు నివసించిన ఆశ్రమాలు ఎన్నో మనకి అడుగడుగున కనిపిస్తాయి.

**ముఖ్యగమనిక** : ఇక్కడ విపరీతమైన చలి... వేడి ప్రదేశం నుండి వచ్చినవారు చాలా జాగ్రత్తగా వుండాలి. చలి తట్టుకోవడానికి కావలసిన సరంజామా ముందే సిద్ధం చేసుకొని బయలుదేరండి.

# కేదార్‌నాథ్

ఋషికేశ్ నుంచి 250 కి.మీ. దూరంలో 11,500 అడుగుల ఎత్తులో వుంది. గంగోత్రి నుంచి కూడా నిరంతరం మంచుతో కప్పబడి వుండే ఈ కేదార్‌నాథ్‌కు వెళ్ళవచ్చు. ఈ కేదార్‌నాథ్ కొండను పురాణాల్లో సుమేరు పర్వతాలుగా పేర్కొంటారు. 7 మీటర్ల పొడవు 70 సెం.మీ., వెడల్పుగల శిలమీద 4 మీటర్ల ఎత్తున వున్న స్వయంభు లింగము. పావన మందాకినీ తీరంలో వున్న ఈ పవిత్రస్థలంలోని స్వామిని తాకి దర్శించుకోవచ్చు. పంచనదీ సంగమ స్థానము. సంవత్సరంలో 6 మాసాలు మాత్రమే భక్తులు దర్శించుకోవటానికి అవకాశం. ధర్మరాజు తప్ప పాండవులందరూ అంతిమ శ్వాస వదిలిన ప్రదేశం.

ఆలయం మూయబోయే ముందు జ్యోతి వెలిగిస్తారు. తిరిగి ఆరునెలల తర్వాత ఆలయం తెరిచేవరకు ఈ జ్యోతి వెలుగుతూ వుంటుంది. ద్వాదశ జోతిర్లింగములలో తొమ్మిదవదయిన ఈ కేదార్‌నాథునకు భక్తులు గంగోత్రి, యమునోత్రిల నుంచి ఉదకమును అభిషేకం కొరకు తెస్తారు.

లయకారకుడైన ఈ మహాదేవుని సమక్షంలో ద్వాదశ జోతిర్లింగ స్తోత్రం మననం చేసుకోవటం ఎంతయినా పుణ్యఫలం.

## ద్వాదశ జ్యోతిర్లింగ స్తోత్రము

శ్లో॥ సౌరాష్ట్రే సోమ నాథంచ
శ్రీ శైలే మల్లికార్జునం
ఉజ్జయిన్యాం మహాకాళం
ఓంకారే అమరేశ్వరమ్॥
కేదారం హిమవత్ పృష్ఠే
ఢాకిన్యాం భీమశంకరమ్
వారణాస్యాంతు విశ్వేశం
త్ర్యంబకం గౌతమీ తటే॥
వైద్యనాథం చితాభూమౌ
నాగేశం దారుకావనే
సేతు బంధేచ రామేశం
ఘృశ్నేశం చ శివాలయే॥
ద్వాదశైతాని నామాని ప్రాతరుత్థాయ యః పఠేత్
సర్వపాప వినిర్ముక్తః సర్వసిద్ధిఫలం లభేత్ ॥

**ఈ కేదార్ నుంచి వివిధ ప్రదేశాలకి దూరం కి.మీ.** దేవప్రయాగ 134 కి.మీ. రుద్రప్రయాగ 77 కి.మీ., గుప్తకాశి 39 కి.మీ., జ్యోషి మఠం 129 కి.మీ., రామ్‌నగర్ 259 కి.మీ., బదరీనాథ్ 161 కి.మీ., నందప్రయాగ 97 కి.మీ., కర్ణప్రయాగ 115 కి.మీ.

**ఈ కేదార్‌నాథ్ యాత్ర చేసేవారు ముఖ్యంగా గుర్తుంచుకోవలసినవి :**

1) రాత్రులు గాలి పలుచగా వుంటుంది.
2) కావలసినంత గాలి వుండదు. రగ్గులు, చలికోట్లు తప్పనిసరి.
3) రక్తపుపోటు, షుగర్ వున్నవారు జాగ్రత్తగా వుండాలి.
4) రగ్గుని నిండా కప్పుకోకూడదు. గాలి ఆడే విధంగా కప్పుకోవాలి.
5) షుగర్ వున్నవారు మెడికల్ సామాగ్రి చెంత వుంచుకోవాలి.

ఈ కేదార్‌నాథ్ ఆలయ సమీపంలో తప్తకుండు వుంది. దానితోపాటు స్వర్గధామము వుంది. తప్పక దర్శించండి. పాండవులు ద్రౌపదితోపాటు స్వర్గానికి నడిచిన ప్రదేశం. ఇక్కడ వారి పాదచిహ్నాలను చూడవచ్చు.

ఆలయంలో పాండవ పుత్రుల విగ్రహాలతోపాటు కుంతి విగ్రహం కూడా వుంది.

గౌరికుండం నుంచి కేదార్‌నాథ్ స్వామిని దర్శించుటకు యాత్రికులు త్వరలం చేరతారు. నడక అయితే ఎనిమిది, తొమ్మిది గంటల్లో వెళ్ళవచ్చు. లేదా గుర్రంపై అయితే నాలుగు గంటలు. దారి మొత్తం అత్యంత రమణీయంగా, లోయలతో ఒళ్ళు జలదరించేలా వుంటుంది. గుర్రం మీద వెళుతున్నప్పుడు పక్కకి చూస్తే కనపడే లోయ

మనకి కళ్ళుబైర్లు కమ్మిస్తుంది. వెంటనే నారాయణ, నారాయణ అనుకోవటం పరిపాటి. క్రింద నుంచి వెళ్ళే గుర్రాలు ఎంతో చాకచక్యంతో, అనుభవంతో వెళతాయి. పక్కనే ట్రైనీ వుంటాడు.

ఒక్కోసారి మంచువర్షం కురుస్తుంది. అప్పుడు దేవాలయంలో వుండవచ్చు. ఈ హిమాలయ యాత్రలను చెయ్యటానికి ఎప్పుడూ వెనకడుగు వేయవద్దు. చాలామంది అన్నీ అయిపోయాక, అన్ని బాధ్యతలూ తీరిపోయాక చేస్తాము అంటారు. దానికంటే కాస్త వయసులో వుండగానే చూస్తే అక్కడి స్వామి వైభవం, ఆ స్వామిని కనులారా చూడవచ్చు కదా! పరమేశ్వరుణ్ణి చూడటానికి వెళుతూ భయపడితే ఎలా? ఆ స్వామే రక్ష! ఆ వెండికొండ మహాదేవుని మహాత్మ్యం అంతా ఇంతా కాదు. పంచ కేదారాల స్వామి అయిన కేదార మహాత్మ్యం మహిమాన్వితం, ఆ స్వామి మహాత్మ్యం.

**కేదార మహాత్మ్యం :**

శ్లో॥ కథయన్వ మహాదేవ విస్తరా న్మమ క్షేత్రకమ్
కేదార నామ యత్రోక్తం స్వర్గ మోక్ష ప్రదాయకమ్ ॥

పార్వతి శివునితో - నాథా! తమరు స్వర్గమును, మోక్షమును ఇచ్చే కేదారక్షేత్రము గురించి వివరించమనగా, అందుకు ఆ మహాదేవుడు ఈ పవిత్ర క్షేత్రం స్వర్గప్రాప్తిని, మోక్షమును కలిగిస్తుంది. ఇక్కడ భూమి పాదాల తాకిడికే జలదరించును. కేదార క్షేత్రముగా ప్రసిద్ధి చెందిన ఈ క్షేత్రం అన్ని తీర్థములలోకెల్ల ఉత్తమమైనది. ఈ క్షేత్రం అన్నింటికన్నా నాకు ప్రియమైనది. ఈ తీర్థమున మృత్యువు సంభవించినవారు ఖచ్చితంగా శివరూపము దాలుస్తారు.

అంత అర్ధనారీశ్వరి పార్వతి ఇక్కడున్న తీర్థముల గురించి వివరించమనగా..... పార్వతీ! ఇక్కడ స్నానాదులు గొప్ప ఫలితమునిచ్చును. కేదార భవనమునకు దక్షిణమున రేతఃకుండము వుంది. అందులోని నీరుత్రాగితే మానవుడు మహనీయుడవుతాడు. ఈ రేతఃకుండము మామూలు కుండం కాదు. గొప్ప మహిమాన్వితమైనది. ఈ కుండము క్రిందిభాగములో శివలోకప్రాప్తి కలిగించే శక్తివంతమైన శివకుండం వుంది. ఇక్కడ ఈ కుండము వద్ద ఏడు రోజులు వ్రతమాచరించి ధ్యానము చేసిన వారికి (కేదారనాథ ధ్యానము, వ్రతం కింద) ఇక్కడ ప్రాణం విడిచిన వారికి కైలాసప్రాప్తి, ముక్తి కలుగుతుంది. అలాగే మందాకినీ నదికి పైన వున్నది. దాని పేరు భృగుకుండం. గోవులను చంపినవారు, నమ్మినవారికి ద్రోహం చేసిన నీచులు, బ్రహ్మహత్యా పాతకులు ఇక్కడ ప్రాణములు వదిలిన పరబ్రహ్మభావము వస్తుంది. దానికి రెండు యోజనముల దూరంలో రక్తవర్ణముతో పొంగుచున్న జలము బైటికి వచ్చే ప్రదేశం వుంది.

దానిని తాకినంతనే, స్పర్శించినంతనే అన్ని లోహములు బంగారముగా

మారుతాయి. దానికి ఉత్తరంగా స్ఫటికముతో చేయబడిన శివ విగ్రహం వుంది. దానిని పూజించినవారు కైలాసవాసమునకు అర్హులు. దానికి తూర్పుగా వహ్నితీర్థము కలదు. అచ్చట వహ్నిమయ జలము మంచురూపంలో వుంటుంది. అక్కడ నేతితో ఆహుతినిచ్చి, పూజిస్తే అగ్ని దేవుడు సంతృప్తి పొంది కోరిన కోరికలు తీరుస్తాడు. దానికి ఉత్తరముగా ఆశ్చర్యకరమైన పైభాగం నుంచి భూమిపై నీరు పడుతుంది. అక్కడ నుంచి పడిన నీటి బిందువులు వెనువెంటనే మంచిముత్యాలుగా మారుతాయి.

ఆ ప్రదేశమందే భీమసేనుడు నన్ను ముత్యాలతో పూజించాడు. అక్కడికి పుణ్యపురుషులు మాత్రమే పోగలరు. దాని తర్వాత మహానంది వుంది. అక్కడికి వెళ్ళిన మానవులకు ఏ విచారం, ఏ రోగాలు, రొష్టులు వుండవు. తర్వాత పాలసముద్రం మందాకినీ నదిలో కలిసినచోట బ్రహ్మయను తీర్థం వుంది. అందులో స్నానం పరమ పవిత్రం.... ఇక్కడే పాండవులు మహాయుద్ధముచేసిన బ్రహ్మగుహ వుంది. ఇక్కడ నవధాన్యములు లభిస్తాయి. బ్రహ్మతీర్థము నుంచి దక్షిణముగానున్న బుడగలవంటి నీరు సముద్రజలము, కేవలం ఆ నీటిని తాకినంతనే శుభదాయకము, దానికి ఎడమవైపున పురందర పర్వతము అనే సుందరమైన పర్వతము వుంది. తనకు ప్రతిష్ట కలుగుటకై ఇంద్రుడు మునీ పర్వతము మీద భక్తిగా నన్ను పూజించాడు. అక్కడున్న విగ్రహం చూసినంతనే మోక్షం. ఉత్సవ మందిరమునకు పదిగజాల దూరమున హంసకుండమనే తీర్థం వుంది. అది పితరులకు మోక్షమునిచ్చు స్థానము. ఈ ప్రదేశానికి బ్రహ్మ హంస రూపంలో వస్తారు. అక్కడ పితరులకు శ్రాద్ధము పెట్టువాడు పరమ వైభవగతిని పొందును. నరకములో వున్న అతని పితరులు కూడా శివస్వరూపులగుదురు. దానికి ఎదుట ఉదక కుండలం వుంది. దీనిలో స్నానముచేసి ఆచమమాచరించి కేదారేశ్వరమును దర్శించిన వారి హృదయము శివరూపంతో సమానం.

పార్వతీ, కేదారేశ్వరమునకు వెళ్ళాలనే సంకల్పాన్ని ప్రతిదినము చెప్పు పురుషుడు, స్త్రీ వీరు ధన్యులు. వెళ్ళకనే వెళ్ళిన ఫలం. అతని పితరులు మూడువందల వంశములతో సహా నిస్సందేహంగా శివలోకము వెళతారు.

అలాగే ఇంకో విషయము విను గౌరి, మహాభారతమున కురుక్షేత్రానంతరము పాండవులు సగోత్రహత్య పాపమును పోగొట్టుకొనుటకు నా కోసం వెతకగా వారికి ఈ కేదార క్షేత్రంలోనే గోచరించాను. వారినిచూచి నేను దూరంగా పోగా, నా వెంటపడ్డారు. నేను దగ్గరగా వచ్చిన పాండవులను చూసి నేను ఎట్లూ పాలుపోక భూమిలోకి చొరపడ్డాను. అప్పుడు వారికి నా వీపుభాగము కనపడింది. వెంటనే నన్ను ఆ ప్రదేశమున

తాకినారు. ఆ స్పర్శకే వారికి స్వగోత్రహత్య పాపాలు మటుమాయం అయ్యాయి.

పార్వతీ నా వెనుక భాగము పూర్వమువలే అక్కడే వుంది. నా శిరస్సు పశుపతి నామముతో నేపాల్‌లో వుంది. అక్కడవున్న నా రూపానికి అన్ని ద్రవ్యములతో మర్ధించి, నా ఛాతిని తాకినవారికి పాపములన్ని పాండవులకు వలె తొలగిపోవును. ఇది దర్శించినవారికే కాదు విన్నవారికి, చదివినవారికి పలుమారులు విన్పించినవారికి మోక్షం కలుగుతుంది.

## కేదారేశ్వరస్వామి వ్రత అథాష్టోత్తర శతనామ పూజ

ఓం శివాయ
ఓం మహేశ్వరాయ
ఓం శంభవే
ఓం పినాకినే
ఓం శశిశేఖరాయ
ఓం వాసు(మ)దేవాయ
ఓం కపర్దినే
ఓం విరూపాక్షాయ
ఓం నీలలోహితాయ
ఓం శంకరాయ
ఓం శూలపాణయే
ఓం విష్ణువల్లభాయ
ఓం ఖట్వాంగినే
ఓం విశిష్టాయ
ఓం అంబికానాథాయ
ఓం శ్రీకంఠాయ
ఓం భక్తవత్సలాయ
ఓం భవాయ
ఓం శర్వాయ
ఓం త్రిలోచనాయా
ఓం శితికంఠాయ
ఓం శివప్రియాయ
ఓం ఉగ్రాయ
ఓం కపర్దినే
ఓం కామారయే
ఓం త్రిపురాన్తకాయ
ఓం వృషాంకాయ
ఓం భస్మోద్ధూళిత విగ్రహాయ
ఓం వృషభారూఢాయ
ఓం సామప్రియాయ
ఓం సర్వమయాయ
ఓం త్రయీమూర్తయే
ఓం అనీశ్వరాయ
ఓం సర్వజ్ఞాయ
ఓం పరమాత్మనే
ఓం సోమసూర్యాగ్ని లోచనాయ
ఓం హవిషే
ఓం యజ్ఞమాయాయ
ఓం సోమాయ
ఓం పంచవక్త్రాయ
ఓం సదాశివాయ
ఓం విశ్వేశ్వరాయ
ఓం వీరభద్రాయ
ఓం గణనాథాయ
ఓం ప్రజాపతయే
ఓం హిరణ్యరేతసే
ఓం దుర్ధర్షాయ
ఓం గిరిశాయ
ఓం జగద్వ్యాపినే
ఓం జగద్గురవే
ఓం వ్యోమకేశాయ
ఓం మహాసేనజనకాయ
ఓం చారువిక్రమాయ
ఓం రుద్రాయ
ఓం భూతపతయే
ఓం స్థాణవే
ఓం అహిర్బుధ్న్యాయ
ఓం దిగంబరాయ
ఓం అష్టమూర్తయే
ఓం అనేకాత్మనే
ఓం సాత్వికాయ
ఓం శుద్ధవిగ్రహాయ
ఓం శాశ్వతాయ

ఓం ఖండపరశవే
ఓం పాపవిమోచనాయ
ఓం అజాయ
ఓం స్కందాయ
ఓం మృడాయ
ఓం పశుపతయే
ఓం మహాదేవాయ
ఓం దేవాయ
ఓం అవ్యయాయ
ఓం హరయే
ఓం అంధకాసుర సూదనాయ
ఓం లలాటాక్షాయ
ఓం కాలకాలాయ
ఓం కృపానిధయే
ఓం భీమాయ
ఓం పరశుహస్తాయ
ఓం మృగపాణయే
ఓం జటాధరాయ
ఓం కవచినే
ఓం కైలాసవాసినే
ఓం కఠోరాయ
ఓం అనఘాయ
ఓం గిరీశాయ

ఓం భుజంగభూషణాయ
ఓం భర్గాయ
ఓం గిరీధ్వనినే
ఓం కృత్తివాసాయ
ఓం గిరిప్రియాయాయ
ఓం పురారాతయే
ఓం సామప్రియాయాయ
ఓం ప్రమదాధిపాయ
ఓం మృత్యుంజయాయాయ
ఓం సూక్ష్మతనవే
ఓం పూషదంతభిదే
ఓం అవ్యగ్రాయ
ఓం ధక్షాధ్వరహరాయ
ఓం హరాయ
ఓం భగన్నేత్రభిదే
ఓం అవ్యక్తాయ
ఓం సహస్రపదే
ఓం సహస్రాక్షాయ
ఓం అపవర్గప్రదాయ
ఓం అనంతాయ
ఓం తారకాయ
ఓం పరమేశ్వరాయ

## పంచకేదారములు

**రుద్రనాథ్ క్షేత్రం** : పాండవుల ప్రస్థాన మార్గమిదే. ఇక్కడే వారికి ముఖం దర్శనమిచ్చినది. ఇక్కడున్న విగ్రహం మహిష ముఖముతో వుంటుంది. ఈ రుద్రనాథ మహాత్మ్యమును శివుడు పార్వతికి ఇట్లు చెప్పెను -

దేవీ! నేనిప్పుడు నా చతుర్థ స్థానమును వర్ణిస్తాను. అన్ని తీర్థములలోకెల్ల ఉత్తమమైనది రుద్రాలయము. ఈ రుద్రనాథ్ క్షేత్రం. దీని మహాత్మ్యములను వినిన మానవులు తప్పక పాప విముక్తులగుదురు. పరమ పవిత్రమైన ఈ ఆలయాన్ని నేను

ఎన్నటికీ విడువజాలను. ఇంత ఉత్తమ ప్రదేశం ఏ దివ్యలోకాలలోనూ లేదు. ఇక్కడ చూడముచ్చటైన శివలింగం వుంది. దానిని చూసినంతనే ముక్తి. ఇచ్చట పితరులకు పుణ్యలోకములు కల్గించు వైతరణీ నది వుంది. ఆ వైతరణిలో పిండ ప్రదానం చేయుట వలన అనంతమైన ఫలము లభిస్తుంది. దానికి పశ్చిమాన గోలస్థిమగు తీర్థం వుంది. అదియే గోపేశ్వరము. అక్కడ నీతో ఎల్లప్పుడూ కలిసే వుంటాను. భక్తసులభుడనగు నేను విశ్వేశ్వరునిగా అచ్చటనే పిలవబడతాను. అక్కడ నా త్రిశూలపు చిహ్నం అత్యంత ఆశ్చర్యకరమైనది. ఎవ్వరైనా బలంగా కదిలించాలని చూస్తే కదలదు. భక్తితో నన్ను స్మరించి తాకినంతనే కదులును. అక్కడున్న పొదిరిల్లులో ఎల్లవేళల పుష్పములు వుండును. గోపేశ్వర తీర్థమున అయిదు రాత్రులు జపము చేసినచో దేవతలకు సాధ్యముకాని ఎన్నో మహిమాన్వితమైన శక్తులు అబ్బును.

**మధ్యమేశ్వర (మహాత్మ్యం) క్షేత్రం :** ఈ క్షేత్రం గురించి పార్వతి శివుణ్ణి అడిగింది - స్వామీ, దేవాదిదేవా! స్వర్గప్రాప్తిని, మోక్షమును కలిగించే కేదార క్షేత్రము గురించి చెప్పితిరి. నేనిప్పుడు శివక్షేత్ర మహాత్మ్యము గురించి వినవలెనని కుతూహల పడుతున్నాను. దానికి శివుడు - దేవీ! కేదార క్షేత్రమున దక్షిణమునకు పోవు మార్గంలో మూడు కరములోనూ రహస్యముగా నుండిన మధ్యమేశ్వర క్షేత్రం కలదు. దానిని దర్శించిన శివభక్తులు శివలోకం పోవుదురు.

ఈ క్షేత్రం ఉఖీ మఠమునకు 20 కి.మీ. దూరంలో వుంది. ఈ క్షేత్రాన స్వామి మహిషము నాభి రూపమున దర్శనమిస్తాడు. ఇక్కడ శివలింగము మహిషనాభివలె వుంటుంది. ఈ మధ్యమహేశ్వరాలయములో ప్రాచీన కాలంలో వాడిన నాణెములు వున్నాయి. అవి చూడవచ్చు. ఇక్కడ శివునికి ఇష్టమైన బ్రహ్మకమలాలు దొరుకుతాయి. భక్తులు వాటితో పూజ చేయటానికి ఇష్టపడతారు.

**శ్రీ తుంగనాథ (మహత్మ్యము) క్షేత్రం :** ఈ క్షేత్రమహత్మ్యం శివుడు పార్వతితో ఇలా చెప్పారు. ఓ ఉమా! ఈ తుంగనాథ క్షేత్రం మూడవ కేదారునిగా పిలవబడుతుంది. ప్రసిద్ధి చెందిన తుంగేశ్వరుని మహత్మ్యం వినుటకు సిద్ధంగా వుండు, మానధాతువను క్షేత్రమునకు దక్షిణ దిక్కులో మూడు యోజనముల పొడవు, రెండు యోజనములు వెడల్పును కలిగిన శ్రీ తుంగనాథ క్షేత్రం మానవ కోరికలన్నింటిని తీర్చును. ఇది అన్ని పాపములను పోగొట్టును. దీనిని దర్శించినంతనే పాపములు పోయి, శివసాన్నిధ్యము కలుగును. తుంగనాథుని దర్శానంతరమున సర్వ పాపాలు అగ్నిలో వేసిన నేయిలా కరిగిపోతాయి.

ఈ క్షేత్రమున మొదట భైరవుని పూజించి క్షేత్రంలోకి ప్రవేశించాలి. ఆ తర్వాత శ్రీ

తుంగనాధుని పూజించాలి. పూజించిన పుణ్యఫలంవల్ల ముల్లోకాలలోనూ అసాధ్యమైనది లేదు. ఆ క్షేత్రమున బ్రహ్మాదిదేవతలు పూజిస్తారు. ఇక్కడున్న శివలింగంపై నీరు చల్లితే నాపై ఎన్ని నీటిబిందువులు పడునో, అన్నివేల సంవత్సరాలు ఆ మానవుడు శివలోకంలో నా చెంత వుంటాడు. అచ్చట వున్న నా లింగముపై భక్తిపూర్వకంగా బిల్వపత్రములు, అక్షితలు జల్లి దక్షిణ అర్పించినవారికి కొన్నివేల జన్మల వరకూ ఈతిబాధలు, దరిద్రబాధలుండవు. అన్ని నైవేద్యములతో నన్ను పూజించువాడు కోట్లకొలది కల్పములు వరకూ నా వశమందు వుంటాడు.

నాకు బ్రహ్మకమలములతో పూజ అత్యున్నత ఇష్టం. వాటితో పూజ చేసిన వారు నాకు అత్యంత ప్రీతి పాత్రులవుదురు.

(బ్రహ్మ కమలములతోనే పంచకేదారములలోనూ కేదార్‌నాధ్, మధ్యమేశ్వర్, శ్రీ తుంగనాధ్, రుద్రనాధ్, కపిలేశ్వర్ ఆలయాల్లో నిత్యం ఈ పూలతోనే పూజిస్తారు. 300 మీటర్ల నుంచి 500 మీటర్ల ఎత్తుగల పర్వతాల్లో కాశ్మీర్, సిక్కింలాంటి ప్రదేశాల్లో ఈ బ్రహ్మకమలాలు దొరుకుతాయి. సగం విచ్చిన కమలమువలె వుండే ఈ పూలు శివునికి అర్పించుటకు అత్యంత వ్యయప్రయాసలతో పర్వతాలు ఎక్కి మరీ కోస్తారు భక్తులు.)

ఓ గౌరీ! అంతటి పుణ్య ప్రదేశం ఈ తుంగనాథ్ క్షేత్రం. ఈ మహత్మ్యం వినువారికి, చదివినవారికి నిస్సందేహముగా పుణ్యం లభించును. ఈ క్షేత్ర దర్శనము దొరుకుతుంది.

**కల్పేశ్వర (మహత్మ్యము) క్షేత్రం :** ఈ కల్పేశ్వర మహత్మ్యము గురించి శివుడు, తన అర్ధాంగి పార్వతితో ఇలా చెప్పాడు. దేవీ! నా పంచమ కేదార క్షేత్రము యొక్క విశిష్టత వినుము. ఇది అన్ని పాపములను నాశనము చేసే పవిత్ర ప్రదేశం. అగ్ని ఎండిన వారును ఎంత వేగంగా దహించివేస్తుందో అంతలా ఈ క్షేత్రం పాపాలను కడిగివేస్తుంది. పూర్వము దుర్వాసుని కోపాగ్నికి బలైన దేవేంద్రునికి అన్ని సంపదలతోపాటు, పదవి పోయింది. అంద విహీనుడైన ఇంద్రుడు ఈ కల్పక్షేత్రమున మున్న నన్ను పూజించి శరణు వేడెను. ఆ పిదప నీతోసహా నన్ను పూజించి కల్పవృక్షమును పొందినాడు. ఈ కారణమువల్లే నన్ను ఇక్కడ కల్పేశ్వరుడిగా పిలుస్తారు భక్తులు.

ఈ ప్రదేశమున అనేకచోట్ల శివలింగములు కలవు. ఆ లింగములన్నింటిని పూజించినను లేక దర్శించినను శివకరము పొందుదురు. అత్యంత భక్తి చేష్టలతో నన్ను ఆరాధించి ఈ కల్పేశ్వర క్షేత్రం మహత్మ్యం వినినవారు, అన్ని తీర్థములలోనూ స్నానము చేసిన ఫలితం పొందుతారు.

ఇక్కడకి దగ్గరిలో అలకనందకు ఉత్తరంగా వైద్యాశ్రమములో బదరీశ్వరుని గుడి

వుంది. పర్లఖండాశినికి దగ్గరిలో విష్ణుకుండముంది. అదియే ఆణిమఠమని అంటారు. అలాగే పంచబదిరిలో వృద్ధ బదిరీశుని దేవాలయం వుంది. ఇక్కడికి దగ్గరిలో జ్యోతిర్మఠము వుంది.

**ఈ హిమాలయ పర్వతాల పరిసరాల్లో అనేక దేవాలయములు, భూలోక శివసాన్నిధ్యాలు, భూలోక వైకుంఠాలు వున్నాయి. అలాంటి ప్రదేశాల మహత్యం తెలుసుకోండి ఆయా క్షేత్రాల గురించి ముందు పేజీల్లో ముందుగా దేవాలయాల మహత్యాలు.**

**జ్యోతిర్మఠ మహత్యం :** ఈ జ్యోతిర్మఠము గురించి శివుడు పార్వతితో, దేవీ! ఈ జ్యోతిర్మఠమున ముక్తినిచ్చు నరసింహరూపము కలదు. మోక్షమునకు ఈ తీర్థమంతటి తీర్థంలేదు. ఇక్కడ నవదుర్గ, వాసుదేవులు వున్నారు. ప్రహ్లాదుడు వీరిని స్మరిస్తూ వుంటాడు.

ఎదురుగా విష్ణువునకు అత్యంత ప్రీతిపదమయిన తీర్థం ఒకటి వుంది. దేవాలయ మఠమునకు మధ్యన దండధారమను తీర్థం మొదట కలదు. ఇక్కడ చేసిన ప్రతి పనికి కోటిరెట్లు ఫలితం వచ్చును.

భక్తిపూర్వకంగా, మనోసిద్ధితో, నిర్మలమైన మనస్సుతో నరసింహుని పూజించినవారు విష్ణు తుల్యులవుతారు. ఈ జ్యోతిర్మఠమునకు దక్షిణంవైపున అతి పురాతన దేవాలయం వుంది. ఈ దేవాలయమునకు ఒక క్రోసు దూరంలో అలకనందా, ధవళ నదుల సంగమస్థానము. ఈ సంగమ స్థానము వద్దే విష్ణు ప్రయాగ తీర్థం వుంది. విష్ణుప్రయాగ తీర్థంలో స్నానమాచరించి, సేవించినవారు వైకుంఠ ప్రవేశానికి అర్హులు. జపముతో. భక్తితో నారాయణున్ని స్తుతించినవారు ధన్యులు. జయ విజయులగు వైకుంఠ ద్వారపాలకులను పూజించి గాని బదరీ క్షేత్రమునకు వెళ్ళరాదు.

విష్ణుప్రయాగకు ఉత్తరముగా వున్న బదరీవనము గురించి ముఖ్యమయిన విషయం చెబుతాను విను దేవి. విష్ణుభగవానుడు, గంగానది భూమండలము వున్నంత వరకూ ఈ బదరీనాథ్ వుంటుంది. ఆ పిదప అదృశ్యమవుతుంది. విష్ణుభగవానుడు తపస్సు చేసే రూపంలో వుంటాడు.

**ఋషిగంగ, కూర్మధార ప్రహ్లాద ధారాల మహోన్నత మహత్యం :** ఋషిగంగలో స్నానం చేసినవారికి బ్రహ్మత్వము సిద్ధిస్తుంది. కూర్మధారలో ఆచమానము చేసి బదరీక్షేత్రంనకు వెళితే మంచిది. పక్కనే వున్న ప్రహ్లాద ధారలో స్నానంచేస్తే శరీరంలోని క్రోధం, మదమాశ్చార్యాలు నశిస్తాయి. భక్తి, జ్ఞానం పెరుగుతాయి.

**నారదకుండ మహత్యం :** అలకనందా నది వొడ్డున వున్న ఈ నారదకుండ

పుల్లోకాలలోనూ లేదు. ఈ కుండానికి ఎంతో శక్తి వుంది. ఇందులో యాభైకి పైనే విష్ణు విగ్రహాలున్నాయి. ఈ తీర్థంలో స్నాన, జపాలు-చేసి ముక్తి పొందవచ్చు. దానములు చేసిన వారికి ఫలము లభిస్తుంది. ఇక్కడున్న పంచశిలకు భక్తితో నమస్కరించి స్వామి అనుగ్రహం పొందవచ్చు.

**తప్తకుండ మహాత్మ్యం :** పూర్వము ఋషులందరు సభ నిర్వహిస్తుండగా అగ్ని ప్రవేశించి అడిగాడు. బ్రహ్మజ్ఞానులలో శ్రేష్టులయిన ఋషులారా! నేను సర్వభక్షణ చేస్తాను. నాకు దయా, జాలి లేదు. ఎంతవరకు అవకాశం వుంటే అంతవరకు భక్షణ చేస్తాను. ఆహుతి చేస్తాను. అది పాపము. దానికి నరకము తథ్యం. నావిధి నేను చేసినా పాపమే, దానికి విముక్తి సెలవివ్వండి. ముక్తినొందుటకు మార్గం తెలపమని వేడుకొనగా, వేదవ్యాసుడు ప్రసన్న వదనముతో, కరుణావీక్షణములతో అగ్నిని చూసి, అగ్నిదేవా, సర్వపాపాలను హరించేది బదరీక్షేత్రం, అక్కడ అన్ని పాపాలను హరించే తప్తకుండమున్నది. ఆ బదరీ నారాయణుడే నీ పాతకములను పోగొట్టు శక్తిగలవాడు అని చెప్పాడు.

అప్పుడు అగ్నిదేవుడు ఉత్తరదిశగా బైలుదేరి, గంధమాధన పర్వతము మీదకి వెళ్ళి గంగలో శుచిగా స్నానంచేసి, బదరీ నారాయణుని స్తుతించాడు. అగ్నిభక్తికి మెచ్చిన ఆ నారాయణుడు "నీ స్తోత్రములకు ప్రసన్నుడైనాను, కావలసిన వరమును కోరుకొమ్మని సెలవివ్వగా, అంత అగ్నిదేవుడు తన మనసులోని వ్యథని చెప్పగా, చూడచక్కని దరహాసం చేసి స్వామి, అగ్నికి ఇలా శెలవిచ్చాడు. "యీ క్షేత్రమును దర్శించినంతనే సర్వపాపాలు నశిస్తాయి. అన్ని బాధలు పటాపంచలవుతాయి. నా అనుగ్రహం వల్ల నీకు ఏ పాపమూ అంటదు. అందువల్లే అగ్ని బదరీక్షేత్రమున అగ్ని తీర్థములో వేడి నీటి రూపమున నున్నాడు.

యీ కుండమున స్నానము చేసిననూ, యీ పుణ్యకథ వినినను, నిస్సందేహముగా అగ్ని తీర్థములో స్నానం చేసిన ఫలితం పొందగలరు.

ఈ క్షేత్రము గురించి తపస్సుచేసి పవిత్రుడైన అగ్ని ఇక్కడే తీర్థత్వము పొందాడు. ఇక్కడున్న పండితుల ఆశీర్వాదం వల్ల మంచి పుణ్యఫలం పొందాడు.

శ్లో॥ బ్రాహ్మణ భోజయి వాస్మిన్ యధావిభవ సంభవై ।
దరిద్రతా కలౌతేషా, న కదాఛిత్ ప్రలాయతే ॥

శ్లో॥ తత్రయః స్నాతిమనుజో, ముక్తి మాప్నోతి దుర్లభామ్ ।
దదాతి స్వర్ణ రత్నాని తస్యాంతం ఫలం భవేత్ ॥

(ఇక్కడ బ్రాహ్మణులకు భోజనం పెట్టిన వారికిని, లేనివారికి దానములు

చేసినవారికిని విష్ణువు చల్లని చూపులతో దీవిస్తాడు. పూజారులను, పండితులను సంతృప్తి పరచండి. తర్పణములు, పూజలు, యాగాలు జరుపవలెను. అగ్నితీర్థములో మూడు రోజులు స్నానం చేసినవారు అగ్నివలే తేజస్సుతో వెలిగిపోతారు)

**పాండుకేశ్వర మహత్యము :** పాండు మహారాజు తపస్సు చేసిన ప్రదేశం. అందువల్లే పాండుకేశ్వరమని పేరు. చాలాకాలం క్రితం ఒక ముని పుంగవుడు భార్యాసమేతుడై మృగరూపము ధరించి అడవిలో తిరుగుచు సరససల్లాపంలో తేలి ఉంటాడు. ఆ సమయంలో అటుగావేటకై వచ్చిన పాండురాజు ఆ మృగాన్ని మృగమనే తలచి బాణముతో కొడతాడు. బాణం దెబ్బకి మరణపు చివరి మజిలీకి చేరుకోవటంతో ఆ ముని పాండురోజుతో, నీవు కూడా నీ భార్యతో సంభోగం జరిపితే మరణిస్తావనితన తపోబలంతో శాపం ఇస్తాడు. దానితో పాండు మహారాజు భయభ్రాంతుడై తపస్సు చేస్తాడు. తపస్సుకి మెచ్చి భగవంతుడు ప్రత్యక్షమయి "పాండురాజా! దిగులు చెందకు. ధర్మదేవత వరముల వలన నీకు పుత్రులు జన్మిస్తారు. వారు మహా పరాక్రమవంతులవుతారు. అన్ని విద్యలలో ప్రవీణులవుతారు అని దీవించి అదృశ్యమైపోగానే పాండురాజు సంతృప్తుడై సంతోషిస్తాడు. ఆ ప్రదేశమే పంథీశ్వరుడు వున్న ప్రదేశం.

ఇక్కడికి మూడు క్రోసుల దూరంలో వైఖానసాది అనే ఆశ్రమ ప్రదేశం వుంది. ఇక్కడున్న యజ్ఞభూమిలో స్నానము చేయునప్పుడు కాల్చబడిన నువ్వులు, యవలు, బొగ్గులు కన్పిస్తాయి. తర్వాత కాంచన గంగలో స్నానంచేసి, దేవతలు, గంధర్వులు పూజించే భైరవుని పూజించుట మన కుటుంబ మంతటికీ శ్రేయస్కరం. దగ్గరలో వున్న కుబేర శిలకి పూజ పునస్కారాలు చేయుట ద్వారా లేమి అన్నది వుండదు. అన్ని దరిద్రాలు తీరిపోతాయి.

**సత్యవధ తీర్థమహత్యము :** సర్వపాపాలని హరించే సత్యవధ తీర్థము మూడు కోణములు కలిగిన క్షేత్రం. పాపములను పోగొట్టుకొనుటకు మూడు కోణములతో ప్రకాశించు, ఏడు లోకములను ఇచ్చే సత్యవధ తీర్థము దర్శించుటయే మార్గం, ధైర్యవంతుడిని, పరాక్రమవంతుడిని చూసి భీరులు ఎలా పారిపోయెదరో, ఈ తీర్థం దర్శించిన వారి నుంచి పాపములు అలా వెడలిపోవును. ఇక్కడ జపము, తపము, స్తోత్రం చేయువారికి విష్ణు సన్నిధానం లభించును.

**శ్రీవసుధారా మహత్యము :** సరస్వతి నదికి పశ్చిమపు వైపునవున్న ఒక అందమయిన అద్భుత ప్రదేశం. అదే త్రిలోకాల్లోనూ, దుర్లభమైన గొప్ప మహిమగల ప్రదేశం. అదే వసుధారా. ఇక్కడ అష్టావసువులు వేల సంవత్సరాలు తపస్సు చేశారు. అప్పటినుంచి

వసుధారా అని ప్రీతితో పిలవబడుతున్నది. ఈ వసుధారలో స్నానముచేసి పూజ చేయుటవలన శరీర మలినంతోపాటు మనస్సుకి అంటిన మలినం కూడా తొలగిపోతుంది. ఈ వసుధారా జలమునకు మధ్యలో ఒక జ్యోతి కనపడును. దానిని దర్శించిన పుణ్యవంతులకు మరుజన్మ వుండదు. ఇక్కడే ధర్మశిల వుంది. దీనిలో వసుధారా పడుతుంది.

పాపాత్ములు, నీచులు, కఠినమనస్సులు, అపవిత్రులగు వారందరి తలలపై ఈ నీరు పడదు. ఇంతటి మహిమ కలిగిన ఈ వసుధారా చుట్టూ ప్రదిక్షిణం గావించి అష్టాక్షరీ మంత్రము జపించిన వారు జీవన్ముక్తులవుతారు. వారి జన్మ చరితార్ధమవుతుంది.

**శ్రీ అయోధ్యపురీ ఆలయపు మహత్యము :** ఇక్కడున్న స్వామిని దర్శించిన వారికి వైకుంఠప్రాప్తి కలుగుతుంది. స్వర్గద్వార తీర్ధములో స్నానము చేసి శ్రీ రఘునాధునితోపాటు ఆయన నలుగురి సోదరులను దర్శించిన వారికి గొప్ప పుణ్యఫలం, మనఃశాంతి.

**హేమకుండ మహత్యము :** ఇక్కడున్న లోకపాలకమనే తీర్థం పురాతనమైనది, గొప్ప మహత్తు కలది. ఈ తీర్థం స్వర్గలోకమనిపిస్తుంది. ఆ వైకుంఠ నారాయణుడే స్వయముగా తన దండము సహాయంతో పర్వతమును రెండుగా చీల్చి, వాటి మధ్యనుంచి నీటిని ప్రవహింపచేశారు. ఒక అందమైన సరోవరాన్ని కూడా నిర్మించారు స్వామి. ఇక్కడ దేవతలు స్నానం చేస్తారు భార్యలతో సహా.... ఈ సరోవరం చుట్టూ ఎన్నో పుష్పాలు కనిపిస్తాయి. కనువిందు చేస్తాయి.

**కర్ణప్రయాగ మహత్యము :** మహాభారతంలోని కర్ణుడు తపస్సు చేసిన ప్రదేశము. అలకనంద, పిండర గంగల సంగమస్థానము వద్ద దీక్ష చేపట్టి తపస్సు చేసిన ప్రదేశం. కర్ణుడు తపస్సు చేయునప్పుడు వేద పఠనము చేయుటకే వామదేవాది దేవతలు స్వయముగా విచ్చేశారు. కర్ణుడు సూర్యభగవానుడిని గురించి తపస్సు చేశాడు. ఇక్కడే కర్ణుడు చేసిన తపస్సుకిమెచ్చి సూర్యభగవానుడు కర్ణునికి అభేద్యమైన కవచము ఇచ్చాడు. దానితోపాటు అంబులపొది కూడ ఇచ్చి ఆశీర్వదించాడు.

**నంద ప్రయాగ మహత్యము :** ఈ నంద ప్రయాగనే కణ్వాశ్రమమని కూడా అంటారు. ఇక్కడ్నుంచి నందగిరి వరకూ పరమ పవిత్ర ప్రదేశం. కోరిన కోర్కెలను తీర్చే కామధేనువు. ఈ నందప్రయాగలోనే నంద మహారాజు బ్రహ్మాండమైన యాగాన్ని చేశాడు. అందుకే ఈ పేరు వచ్చింది. ఈ ప్రయాగలో స్నాన దానములు చేసినవారి పితరులకు ముక్తి కలుగుతుంది. ఆ లోకాల్లోవున్న వారి పెద్దలు సంతసిస్తారు. ఆశీర్వదిస్తారు.

**శ్రీ ద్వారకా మహత్యము** : దేవతలు ఈ ప్రదేశాన్ని స్వర్గద్వారమంటారు. ఈ ద్వారక శుభకరమైనది. ఈ పుణ్యతీర్థం చూసినవారు నారాయణుడి కృపకు పాత్రులవుతారు. ఇక్కడ మరణించినవారు స్వర్గప్రవేశానికి అర్హులు. ఇక్కడ చేయు నామస్మరణ సాక్షాత్తు శ్రీ మహావిష్ణువు ముందుచేసినట్టే.

**జగన్నాథపురీ మహత్యము** : ఈ జగన్నాథపురి మహత్మ్యాన్ని సూతముని శౌనకాది మునులకి వర్ణించి చెప్పిన విధం అనిర్వచనీయమైన వర్ణన. ఒరిస్సాలో నీల పర్వతముపై వున్న జగన్నాథక్షేత్రం దర్శించిన వారికి గొప్ప పుణ్యఫలం. ఈ భూమిపై తీర్థములన్ని ఏకకాలంలో దర్శించిన ఫలం. సముద్రపు వొడ్డున వున్న ఈ జగన్నాథపురీ నివాసి, జగన్నాథుడు, బలరామ సుభద్రలను కూడా దర్శించి స్మరించినవారికి సర్వపాపాలు నశిస్తాయి. వైకుంఠాన్ని చేరుకుంటారు. ఈ బలరామ సుభద్రలతో వేంచేసివున్న స్వామి వద్ద ఒక్కరాత్రి జాగరణతో, స్మరణతో స్వామిని మెప్పిస్తే కోటిరెట్లు ఫలం కలుగుతుంది. ఒక ఘడియసేపు వుంటే శ్రీరాముడు చేసిన అశ్వమేధయాగఫలం కలుగుతుంది. భూలోక వైకుంఠాలుగా ప్రసిద్ధి పొందిన క్షేత్రాలలో ఈ జగన్నాథపురి ఒకటి.

**రామేశ్వర (సేతుబంధ) మహత్యము** : సాక్షాత్తు నరుడుగా పుట్టిన నారాయణుడు ఆ శ్రీరాముడు స్వయంగా నిర్మించిన ప్రదేశం, ఇక్కడున్నది శివ లింగము. శివునికి అత్యంత ప్రీతికరమైనది. అన్ని తీర్థాలకన్నా మిన్న అయినది ఈ రామసేతువు దర్శించినవారికి ప్రాపంచిక సంబంధాల నుండి విముక్తి కలుగుతుంది. ఇక్కడి స్వామిని భక్తి శ్రద్ధలతో పూజించి తరించినవారికి, వారి తల్లిదండ్రులకు శంభులోకము నుండి విముక్తి లభించును.

**శ్రీహరిద్వార మహత్తు (మాయాపురి)** : గంగా ద్వారముగా పిలవబడే ఈ క్షేత్రం స్మరించినంతనే పాపాలు నాశనమగును. ఈ ప్రదేశమునుంచి ఉత్తరం వైపున్న దానిని స్వర్గభూమి అంటారు. దీనినే భోగభూమి అని కూడా అంటారు. అన్ని సంసార బంధనాలనుంచి విముక్తులవుతారు ఈ క్షేత్ర దర్శనానంతరం. ఋషులు, దేవతలు, గంధర్వులు, కిన్నెరలు, యక్షులు ప్రతిరోజు ఈ ప్రదేశానికి వచ్చి దర్శనమిస్తారని స్థల పురాణం చెబుతుంది. బ్రహ్మహత్యలాంటి మహాపాతకాలను కూడా ఇది హరించి వేస్తుంది, మోక్ష ప్రదాయిని. సర్వశుభమంగళకరమైనది ఈ ప్రదేశ స్నానం.

**సౌమ్యవారణాసీ మహత్యము** : ఉత్తర కాశిగా పిలవబడే ఈ ప్రదేశంలోనే, అసీ, వరుణ నదులు ప్రవహిస్తున్నాయి. వారణావర్త పర్వతం మీదున్న స్వామిని బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు నిత్యం ఆరాధిస్తారు. ఇదే కాశీ... ఇక్కడ మహాభద్ర పూజచేస్తే మంచిది. ఈ వారణాసిలో స్నానంచేసి, పితరులకు శ్రాద్ధ తర్పణములు విడవటం బహు మంచిది. ఇక్కడ జపం, హోమము, శివుని పూజ చేసిన వారికి మోక్షం. భక్తి పూర్వకంతో కాశీ

మహత్మ్యం ఎవరు చదువుతారో వారు స్వామి దయకు పాత్రులవుతారు. వరుణ, అసీనదుల మధ్యవున్న ఈ కాశీ అత్యంత ప్రసిద్ధి పొందిన క్షేత్రం.

**త్రియుగీ నారాయణ మహత్మ్యము :** రెండు నదుల సంగమ స్థానం నుంచి యజ్ఞ అనే పర్వతంపై ఈ నారాయణ క్షేత్రం వుంది. పార్వతి పరమేశ్వరుల వివాహ మండపం ఈ ప్రదేశం. లక్ష్మీనారాయణులున్న ఈ ప్రదేశంలో అగ్ని ఎప్పుడూ మండుతూనే వుంటుంది. ఎన్నటికీ ఆరిపోదు. ఇక్కడే విష్ణువునాభినుంచి పరమ పవిత్రమైన సరస్వతి నది ప్రవహించుట మొదలవుతుంది. స్వామిని జపించి 'ఓం నమో నారాయణ' అని తలుచుకున్న వారికి, నదీ జలమును తాగిన వారికి వారితో పాటు వారి వెనుక పది తరముల వరకూ మోక్షం పొందుతారు. అంతటి మహిమ గల పుణ్యక్షేత్రం. ఇక్కడ అష్టాక్షర నారాయణ మంత్రముతో యాగం చేయుట శుభకరం, ఇక్కడే బ్రహ్మకుండమనే తీర్థం వుంది. ఈ పవిత్రమైన కుండంలోని నీరు పసుపురంగులో వుంటుంది. చిన్న చిన్న పాములుంటాయి. అవి మనుష్యులని కరవవు, మనుష్యులని చూచిన వెంటనే పారిపోతాయి.

దక్షిణాన విష్ణు తీర్థం వుంది. ఈ తీర్థంలో స్నానం చేస్తే అశ్వమేధయాగం చేసిన ఫలం వస్తుంది, ఇంకా ఇక్కడున్న త్రివిక్రమా, మందాకినీల సంగమము వద్ద కాళీశ్వరుడు వున్నారు. ఈ స్వామి లింగమునకు పూజ పునస్కారాలతో పాటు స్వామిని జపించిన కైలాసప్రాప్తి లభించును.

**గౌరీకుండ తీర్థ మహత్మ్యము :** సోనాగం నుండి దక్షిణం వైపున నాలుగు క్రోసుల దూరం వెళితే కోరికలన్ని తీర్చే కామధేనువు వంటి గౌరీ కుండం వస్తుంది. ఈ ప్రదేశంలోనే కార్తికేయుని జననముకై ఋతుస్నానం చేసిన గౌరీ తీర్థం. ఇక్కడ నీరు తీక్షముగా వుంటుంది. వేడిగానూ వుంటుంది. ఇక్కడ స్నానము చేసి సింధూర వర్ణములో వుండే ఇక్కడి మన్నును తిలకంగా ధరిస్తే సంతృప్తుడనవుతానని శివుడు పార్వతితో చెప్పినట్లు పురాణాలు చెబుతున్నాయి.

ఈ గౌరీతీర్థం నుండి కుడివైపున క్రోసుడు దూరంలో వైనాయక అనే ద్వారము వుంది. ఆ ప్రదేశమునే పార్వతి నలుగుపిండితో వినాయకుడిని చేసింది. ఆ వినాయకుడి శిరస్సును శివుడు ఖండించి శివక్షేత్రములో విసిరాడు. ఆ తర్వాత పార్వతి ద్వారా అంతా విని ఏనుగు తలని తెచ్చి అతికిస్తారు. అప్పట్నించే గజాననుడయింది.

ఇక్కడ వున్న వినాయకుడికి పూజ జరిపిన తర్వాత కేదారేశ్వరము వస్తారు భక్తులు. ఈ కేదారేశ్వరము వెళ్ళిన ప్రతి ప్రాణికి శివరూపం వస్తుంది.

దగ్గరలో భైరవాలయం వుంది. ఈ భైరవ, చేరవాసులు కేదార క్షేత్రమును రక్షిస్తుంటారు. ఇక్కడ భక్తులు వారికి వస్త్రములు ఇచ్చి సేవిస్తారు. అలా భైరవునికి ఇవ్వకుంటే కేదార క్షేత్రం దర్శించిన ఫలం లాగేస్తాడని స్థల మహత్మ్యం చెబుతోంది. ఈ పర్వతం పైనే దుఃఖములను పోగొట్టు కాళీమాత అలయం కలదు.

**దేవ ప్రయాగ మహాత్మ్యము :** దేవ ప్రయాగ మహాత్మ్యము గురించి నారదుడు శివుడ్ని అడిగాడు. అంత శివుడు నారదుడితో ఈ దేవ ప్రయాగ తీర్థం యొక్క దర్శనము చేస్తేనే కాదు. పేరు ఉచ్ఛరించినంత మాత్రమునే మహాపాతకాలు సమసిపోతాయి. రౌరవాది నరకాల నుంచి విముక్తి. ఇక్కడ రాముడు, సీత, లక్ష్మణుడు, సుగ్రీవులున్నారు. వీరితోపాటు అనేకమంది ఋషి గణములు ఉన్నారు. ఎవ్వరైతే బ్రహ్మచర్య వ్రత మాచరించి నాల్గు నెలల వరకూ ఓం నమో నారాయణ అనే మంత్రాన్ని జపిస్తారో వారికి మోక్షము తథ్యము. ఇక్కడ క్షీరాదికర్మలు, పిండదానాలు చేయుట మంచిది. ఇక్కడే రఘునాధుని శ్యామవర్ణపు రాతి విగ్రహము వుంది. ఇక్కడ బ్రహ్మతీర్థం, వశిష్ట కుండం, వరాహతీర్థం, సూర్య తీర్థం, పుష్పమాలా, యింద్రద్యుమ, భిల్వతీర్థం లాంటి అనేక తీర్థములు కలవు దగ్గరిలో సూర్య కుండం వుంది. ఇక్కడ స్నానము చేసి దానములు, తర్పణములు చేసినవారికి అనంతమైన పుణ్యఫలం లభిస్తుంది.

**గంగోత్రి యమునోత్రి మహాత్మ్యము :** క్రోధము వలన దగ్ధమయిన తన పితరులకు పుణ్యలోకాలు కల్పించుటకై భగీరధ మహారాజు గంగను గురించి ఘోర తపస్సు చేస్తాడు. కపిలముని క్రోధం వలన తనకి జరిగిన అపకారం గురించి తపస్సు చేస్తున్న భగీరధ మహారాజు గంగ సంతోషించి అతనికి ప్రత్యక్షమైంది. కావలిసిన వరాన్ని కోరుకోమంది. అప్పుడు భగీరధుడు వినయ విధేయతలతో తన పితరులను పుణ్యలోకాలకు పంపమని వేడుకుంటాడు. దానికి గంగ భగీరధునికి అభయహస్తం ఇచ్చి తప్పక అతని పితరులను పుణ్యలోకాలకి పంపుతాను. తిరిగి కలియుగంలో రెండవ పాదమందు పాతాళ లోకానికి వెళాతానని చెప్పింది. ఈ వార్త తెలిసిన ఆదిశేషుడు గంగను ఓడించి ఆమెను పాతాళలోకమునకు తీసుకెళ్ళటానికి అడవులు, పర్వతాలు, వృక్షాలు కాలుస్తూ అనేక నాగసేనతో వెళ్ళి ఆమెను పాతాళలోకానికి తీసుకు రావటానికి ప్రయత్నిస్తాడు. జరుగుతున్నది గమనించిన భగీరధుడు భగవంతుడ్ని ప్రార్థించి, కర్తవ్యం గ్రహించి భక్తితో ఆదిశేషుడిని వేడుకుంటాడు. భగిరధుని స్తోత్రానికి మెచ్చిన ఆదిశేషుడు గంగను విడిచి పెడతాడు.

ఆ తర్వాత భగీరధుడు అడవిలో తిరుగుతుండగా ఇద్దరు అప్సరసకన్యలు కనిపిస్తారు. ఆశ్చర్యచకితుడై ఎవరు మీరు ఇటువంటి నిర్జన ప్రదేశంలో ఇలా ఏకాంతంగా తిరుగుతున్నారే అని అడిగాడు.

అంత ఆకాంతలు నేను గంగను, ఈమే యమున, భగీరధుని కోరిక మన్నించుటకై మేం ఇలా తిరుగుతున్నాం. ఈ యమున సూర్యుని కుమార్తె. ఈమె పతితులను సహితం పవిత్రులుగా మారుస్తుంది. నేను పది ధారలతో హిమాలయం నుంచి ప్రవహిస్తాను. ఈ పది ధారలలో పెద్దదైన జేష్టమైనది నీతో వచ్చును. అని పలకగా భగీరధుడు ఆనందచకితుడై వెడలిపోయెను.

గంగ ప్రవహించటం ప్రారంభించింది. అదే దేవతలతో సహితము సేవించబడుతున్న గంగోత్తరీ తీర్థం. దాని ఎడమ భాగంలో యమునోత్తరీ తీర్థం పుట్టినది. ఈ రెండు సాటిలేని సర్వోత్తమ తీర్థములు, ఎవరైతే ప్రాతఃకాలమున లేచి రెండు తీర్థములు స్మరిస్తారో వారి దుఃఖములన్ని భగీరధుని దుఃఖముల వలే పోవును. ఆ నిర్మలమైన గంగవలన భగీరధుని డెబ్బదివేల మంది పితరులు కపిలమునిచే శపించబడ్డ సగర పుత్రులు మోక్షం పొందారు. అంతటి మహిమగల ఈ రెండు తీర్థములలో స్నానం మనతోపాటు మన పితరులకి కూడా పుణ్యఫలం సాధించి పెడుతుంది.

**గంగోత్రి** : శివుని ఝుటాఝూటం నుండి గంగ దివి నుండి భువికి దిగినచోటు. ఋషీకేశ్ నుండి 247 కి.మీ. దూరం, ముస్సోరి నుండి 212 కి.మీ. దూరంలో వున్న ఈ గంగోత్రి సముద్రమట్టానికి 3,140 మీటర్ల ఎత్తు వుంది. ఇక్కడ తర్పణములు, శ్రాద్ధ విధులను ఆచరించవచ్చు.

ఇక్కడికి 24 కి.మీ. దూరంలో భాగీరధి శిఖరాల మధ్య 4,225 మీటర్ల ఎత్తున వుంది గోముఖ తీర్థం... దారిలో చాలా జాగ్రత్తగా వుండండి. మంచుపెళ్లల మధ్య ప్రయాణం. ఇదే గంగావతరణ పుణ్యస్థలం. మంచుతో కప్పబడి వున్న యీ ప్రదేశమే అలకాపురి.... కుబేరుని స్థానం. ఇది దేవభూమి. ఇక్కడి హిమ పర్వతాలు కరిగి అలకనందా, మందాకిని నదులుగా ఏర్పడ్డాయి. గోముఖం అవతల ఋషిపుంగవులు తపస్సు చేసుకునే నందనవనం వున్నదని అంటారు.

గంగోత్రి-కేదార్‌నాధ్ మార్గమధ్యంలో చాలా పుణ్య ప్రదేశాలు వున్నాయి. రుద్రప్రయాగకు సుమారు 20 కి.మీ. దూరంలో అగస్త్య మహాముని తపస్సు చేసిన ప్రదేశం వుంది. కేదార్‌నాథ్‌కు వెళ్ళేదారిలో, రుద్రప్రయాగకు మధ్యలో గుప్తకాశీ వుంది. ఇక్కడ స్ఫటిక విగ్రహం వున్న విశ్వనాధాలయం వుంది. ఈ శైవక్షేత్రంలో నీటికుండు తప్పనిసరిగా చూడండి. విడిదికి ధర్మశాలలు, GMVN టూరిస్టు గెస్టుహౌస్, PWD లాగ్‌కాబిన్, PWD ఇన్స్పెక్షన్ హౌస్, ట్రావెలర్స్ లాడ్జి, టూరిస్టు బంగ్లా, ఫారెస్టు రెస్ట్‌హౌస్ వున్నాయి.

**త్రిజోగి నారాయణం** : పార్వతీదేవి పెండ్లి జరిగినచోటు, యాత్రికులు ఇక్కడ భస్మాన్ని పవిత్రంగా తీసుకుంటారు.

**గౌరీకుండం** : 6,500 ఎత్తులో వున్న ఈ గౌరీకుండమే పార్వతిమాత జన్మస్థలం. బ్రహ్మాండమైన చలితో మంచుగడ్డలతో వున్న ఈ ప్రదేశంలో పొగలుకక్కే ఉష్ణకుండం వుంది. ఈ ఉష్ణకుండంలోనే పార్వతీదేవి స్నానం చేసేదట... యాత్రికులు ఇక్కడ స్నానం చేస్తారు. వసతికి GMVN CBRI హట్స్, ట్రావెలర్స్ లాడ్జి, GMVN టూరిస్ట్ రెస్టు హౌస్ వున్నాయి.

**బాలగణేష్** : రామ్‌పూర్ చట్టి దగ్గరనుంచి 3 కి.మీ. దూరంలో వుంది ఈ గణేష్ ఆలయం. ఇక్కడికి 8 కి.మీ. దూరంలో దుర్గాచట్టి వుంది. మహిషాసుర మర్ధనీదేవిని చూడవచ్చు ఇక్కడ.

**నారాయణకోట చట్టీ** : వీరభద్రేశ్వర, భస్మాసుర ప్రాచీన దేవాలయాలు వున్నాయి.

**ఉఖీమఠం** : కేదారనాథ దేవాలయం మూసివుంచే నెలల్లో కేదారనాథున్ని ఇక్కడ నుంచే దర్శించేది. ఈ మఠంకి 6 కి.మీ. దూరంలో గ్వాలియర్ రాజులు కట్టించిన ధర్మశాలలు వున్నాయి.

**వ్యాస్‌ఘాట్** : ఋషీకేశ్ నుండి 55 కి.మీ. దూరంలో వున్న ఈ ప్రదేశములోనే వ్యాసభగవానుడు తపస్సు చేసింది.

**బదరికాశ్రమం** : బ్రహ్మకపాలం వెళ్ళటానికి ముందు ఇక్కడ శ్రాద్ధవిధులను ఆచరిస్తారు.

**జోషిమఠ్** : గులాబీలు విశేషంగా దొరుకుతాయి. కేదార్‌నాథ్ ఆలయంలాగానే బదరీనాథాలయం కూడా సంవత్సరంలో సగ భాగం మూసి వుంటుంది. ఆ మూసివున్న సమయంలో బదరీనారాయణునికి అర్చనాదులు ఇక్కడే నిర్వహిస్తారు. 6000 అడుగుల ఎత్తు వున్న ఈ ప్రదేశంలో గణేష్, నృసింహ, పార్వతీ ఆలయాలు వున్నాయి. వసతికి ధర్మశాలలు, కామత్‌లాడ్జి, నీలికంఠ హోటల్, PWD ఇన్స్పెక్షన్ బంగ్లా, ట్రావెలర్స్ లాడ్జి వున్నాయి.

**విష్ణుప్రయాగ** : పాండుకేశ్వరమని మరో పేరు వుంది. వాసుదేవ, బదరీ ఆలయాల్లోని స్వామి విగ్రహాలు పాండు మహారాజు ప్రతిష్ఠించారు.

# బదరీనాథ్

శ్లో॥ బహూనిసంతి తీర్థాని దివి భూమౌ రసాయిచ
బదరీశ దృశం తీర్థ ననభూతం నభవిష్యతి॥

స్కంధ పురాణంలోని ఈ శ్లోకానికి అర్థం, పరమార్థం ఏమిటంటే, స్వర్గ, మర్త్య, పాతాళములయందు ఎన్నో పుణ్యక్షేత్రాలున్నాయి. కాని ఈ బదరీనాథ్ తీర్థము వంటిది ఈ భువిపై, ఆ దివిపై లేదు. ఇకముందు వుండదు.

నందప్రయాగ నుండి సరస్వతీ, గంగా నదుల పర్యంతము ముక్తిని, భక్తిని ఇచ్చు శ్రీ బదరీ క్షేత్రము వుంది. ఈ మహిమాన్వితమైన పుణ్యక్షేత్రం ధర్మార్థకామ మోక్షములనెడు నాలుగు పురుషార్థములు భక్తులకు కలుగచేస్తుంది. ఈ కలియుగమున కలికి కాలమైన ఈ యుగమున ఈ బదరీవన క్షేత్ర దర్శనము పొందినవారు ధన్యులు. ఇక్కడ విష్ణు ధ్యానములో నిమగ్నమైన బ్రహ్మాది దేవతలు వుంటారు.

గంధమాదన, బదరీ క్షేత్రము, నరనారాయణాశ్రమము, వరాహ శిల, కుబేరశిల, నారద శిల, గరుడ శిల, మార్కండేయ శిల అను అనేక తీర్థములు కలవు.

దగ్గరిలోనే వున్న తప్తకుండు అనే పేరుతో పిలువబడే అగ్నితీర్థము వుంది. అక్కడ్నించి ప్రవహించే నీరు బదరీలో పడుతుంది.

ఈ బదరీనాథుని మనస్సులో స్మరించిన వారికి ఘోరమైన తపస్సు చేసిన ఫలము కలుగుతుంది. దర్శించి తరించిన వారికి భూమినంతటినీ దానము చేసిన ఫలితము కలుగుతుంది. ఈ పుణ్య ప్రదేశాన, దేవతలు నిరంతరం దర్శించు ఈ క్షేత్రమున బంగారము, వెండి దానము చేసినచో కొన్ని వేల జన్మల వరకూ దరిద్ర, ఈతి బాధలుండవు.

మూడు యోజనముల వెడల్పు, పండ్రెండు యోజనముల పొడవు కలిగి పాపులను క్షమించి, అష్టయిశ్వర్యములను కలిగించే ఈ క్షేత్రమున వస్త్రములు, భోజనము దానము చేసిన వారికి వేయి అశ్వమేధముల ఫలము కలుగుతుంది.

ఈ బదరీ క్షేత్రము నాలుగు విధములుగా ప్రసిద్ధిచెంది వుంది. (1) స్థూలమైనది (2) సూక్ష్మమైనది (3) అత్యంత సూక్ష్మమైనది (4) శుద్ధమైనది. నందప్రయాగ నుండి గరుడ గంగ వరకూ స్థూలమనియు, గరుడ గంగ నుండి విష్ణు ప్రయాగ వరకూ సూక్ష్మమనియు, అక్కడి నుండి కుబేర శిల వరకూ అతిసూక్ష్మ బదరీ అనియు, కుబేర శిల నుండి సరస్వతి నది వరకూ శుద్ధబదరీ అని పిలుస్తారు.

ఈ క్షేత్రమున మరొక వరం, లక్ష్మిదేవి స్వహస్తములతో వండిన నైవేద్యమును నారాయణుడు భుజించును. అట్టి నైవేద్యమును చేతులతో తాకినచో సమస్త దోషములు, పాపాలు పోవును.

ఇక్కడికి దగ్గరలోనే బ్రహ్మశిరస్సు పడినచోట, బ్రహ్మకపాల తీర్థం కలదు. ఇక్కడ పితరులకు పిండ ప్రదానము చేసినచో పితరుల రుణాన్ని తీర్చుకున్నవారు అవుతారు.

**నైవేద్య మహిమ :** ఈ నైవేద్య మహిమను శివుడు కార్తికేయునితో చెప్పెను. ఈ మహాప్రసాదాన్ని దేవతలు, నారదాది మునులు సేవిస్తారు. శ్రీలక్ష్మీదేవి స్వయంగా తయారుచేసినదాన్ని స్వామి భుజిస్తారు. మరణం తప్ప వేరే ప్రాయశ్చిత్తములేని పాపము కూడా ఈ ప్రసాద స్వీకారం ద్వారా తొలగును. ఈ ప్రసాదాన్ని తిరస్కరించినవాడు సర్వధర్మముల నుండి వెలివేయబడ్డ ఛండాలుని కంటే తక్కువవాడు. భగవంతుని నైవేద్యము తీసుకున్నవారు అన్ని లోకములలోనూ బ్రహ్మస్వరూపులగుదురు.

**ఈ బదరీ నరనారాయణుల పుణ్యకథ :**

స్కంధ పురాణములో బదరీ క్షేత్రమునకు నాలుగు పేర్లు. కృతయుగములో "ముక్తిప్రద", త్రేతాయుగములో "యోగసిద్ధిద", ద్వాపరయుగములో "విశాల" కలియుగములో బదరీ ఆశ్రమము.

సృష్టి ప్రారంభంలో బ్రహ్మదేవునికి పదిమంది కుమారులు కలిగెను. వారు మరీచి

అత్రి. అంగీరసుడు. పులస్త్యుడు. పులహుడు, క్రతువు, భృగువు. దక్షుడు, భరద్వాజుడు, నారదుడు.

దక్షుడు మనువు కుమార్తె అయిన ప్రసూతిని వివాహమాడెను. ఆమెకు 16 మంది కుమార్తెలు కలిగారు. వారిలో పదమూడవ కుమార్తెకు నరనారాయణులు జన్మించిరి. వారిరువురూ తల్లిని శ్రద్ధతో పూజిస్తారు. అందుకు తల్లి కొడుకులను మెచ్చుకొని ఏమి వరం కావాలో కోరుకోమనెను. అందుకు వారిద్దరూ తపస్సు చేసుకోవటానికి అనుమతి ఇవ్వవల్సిందిగా కోరారు.

ఇచ్చిన మాట కోసం ప్రసూతి అంగీకరించెను. ఇద్దరు కుమారులూ నైమిశారణ్యమునకు వెళ్ళి ఘోర తపస్సు చేయటం ప్రారంభించారు. అప్పుడే ప్రహ్లాదుడు తీర్థయాత్రలు చేయుచు ఆ ప్రదేశానికి వచ్చాడు. వారిద్దరినీ చూసి, రాక్షసబుద్ధితో తపస్సు చేస్తున్నారనే అపోహతో యుద్ధానికి దిగుతాడు. వెయ్యి సంవత్సరముల వరకూ ఆ యుద్ధం సాగుతుంది. ఎవరూ పరాజయం పొందరు.

ప్రహ్లాదుడు భగవంతుని ధ్యానించగా అసలు విషయం తెలుస్తుంది. అప్పుడు వారిని క్షమించమని వేడుకొంటాడు.

ఆ తర్వాత నరనారాయణు లిద్దరూ ఆ ప్రదేశము మంచిది కాదని తలచి బదరీ ఆశ్రమము చేరి ఘోర తపస్సు చేస్తారు.

ఇంద్రుడు వారి తపస్సుకు చలించి అప్సరసలను పంపిస్తాడు.

అప్సరసలందరూ అందవిహీనులుగా మారతారు. దేవతలందరూ దేవదేవుణ్ణి ప్రార్థిస్తారు. ఈ నరనారాయణుల తపస్సు యొక్క పరమార్థం తెలుపమని వేడుకుంటారు. ఈ బదరీ వనములోనే సాక్షాత్తు భగవంతుడు ఈ నరనారాయణుల రూపంలో తపస్సు చేసినట్టు దేవతలకి సెలవిస్తారు. సేవించు అదృష్టం మాకు, మానవులకు ఈ భూమి వున్నంతవరకూ ఇమ్మనగా....

కలియుగములో నా అసలు రూపమున దర్శింపలేరు. నారద క్షేత్రములోని నా దివ్య విగ్రహమును తెచ్చి బదరీ వనమున ప్రతిష్ఠించమని సెలవిచ్చెను.

(నారద పురాణమందు 67వ అధ్యాయములో 35-39 శ్లోకములలో నారద క్షేత్రము నుంచి విగ్రహాన్ని బైటకు తీయుట వర్ణించబడినది.

అలాగే స్కంధ పురాణంలో 23వ శ్లోకములో గూడా తెలువబడింది. ద్వాపరయుగంలో బ్రహ్మాది దేవతలు, నారదక్షేత్రము నుంచి విగ్రహమును తీయించి బదరీలో ప్రతిష్ఠించారు. విశ్వకర్మ దేవాలయాన్ని నిర్మిస్తాడు. నారదముని ఆలయానికి ప్రధాన అర్చకుడిగా వుంటారు.)

బదరీ అనగా రేగుచెట్టు అని అర్థము. ఈ రేగిచెట్టు లక్ష్మీదేవికి నివాస స్థలమగుటచే ఆ భగవంతునకు కూడా ప్రియమైనది. ఆ నీడలోనే శ్రీ మహావిష్ణువు తపస్సులో నిమగ్నమై వున్నారు. అందువలననే ఈ క్షేత్రమునకు బదరీ క్షేత్రమని పేరు.

ఈ క్షేత్రానికి నారదుడు అర్చకుడిగా వుండటంవల్ల నారద క్షేత్రమని కూడా అంటారు.

ఇప్పటి దేవాలయము 15వ శతాబ్దములో వరదరాజాచార్యులు గద్వాల రాజుచే నిర్మింపచేశారు. ఈ విషయాన్ని ప్రయాగలోని రఘునాథస్వామి దేవాలయము నందున్న శిలాశాసనము ద్వారా ధ్రువపర్చుకోవచ్చు.

పురాతన మందిరము శిథిలమయిపోతే, రామానుజాచార్యులు బదరీనాథుని విగ్రహాన్ని తప్తగుండు వద్ద ప్రతిష్టించారు.

ఆ తర్వాత ఇప్పుడున్న దేవాలయాన్ని గద్వాల రాజు కట్టించారు. ఆ రాజు నిర్మించిన తర్వాత ఇందూరు రాణి, అహల్యాబాయి దేవాలయంపై బంగారపు కలశాన్ని తయారుచేయించి ఇచ్చారు.

**బదరీనాథ్ స్వామి విగ్రహం :** నాభివద్ద గుండ్రని ఆకారములో ఎరుపు రంగుతో కూడిన గంధపుబొట్టు, రెండు తొడలపైన చిన్న తిలకపు బొట్టుతో, నాభికి పై భాగమున విశాల వక్షస్థలమందు శ్రీవత్స, భృగులతల చిహ్నములతో మనోహరముగ్ధకారిణియగు మెరిసే కంఠహారముతో పద్మమువంటి మొహంతో స్వామి దర్శనమిచ్చును. ముఖానికి రెండువైపులా వ్రేలాడుచున్న వెంట్రుకలు చూస్తే ఆ కైలాసనాథుడానిపించకమానదు. ఒక్కసారి భద్రకాళి అని కూడా అనిపించును. అలా ఎవరి ఇష్టదైవాన్ని వారు ఆ బదరీనాథుని విగ్రహంలో చూసుకోవచ్చు.

**నారద విగ్రహం :** బాలబ్రహ్మచారి నారద విగ్రహం బదరీనాథుని వామభాగములో కలదు. మార్గశిర మాసములో దేవాలయం మూసివేసినపుడు ఆ దేవర్షి నారదుడే స్వయంగా స్వామి సేవచేసి పూజిస్తారు. ఇక్కడ స్వామికి పూజ చేయుటకు బ్రహ్మచారులు మాత్రమే అర్హులు. 2300 అ. ఎత్తుగల ఈ అద్భుత ఉత్తుంగ పర్వత శిఖరాల మధ్యనున్న ఈ ఆలయంలోని స్వామిని పూజించే అధికారం వైశాఖ మాసం నుండి కార్తీకమాసము వరకూ మానవులకు, మార్గశిరము నుండి వైశాఖం వరకూ నారదునకు కలదని శాస్త్రములు చెబుతున్నాయి.

**నారాయణ విగ్రహం :** నారదునికి ఎడమవైపున శంఖ, చక్ర, గదా, పద్మములతో చతుర్భుజములతో, శ్యామ వర్ణముతో పద్మాసనము వేసి తపోస్థితిలోనున్న నారాయణ విగ్రహం వుంది. స్వామి కుడిభాగాన శ్రీదేవి, ముఖమున భూదేవి, ఎడమవైపున లీలావతి తొడపై ఊర్వశీలను చూడవచ్చు.

**నరుని విగ్రహం :** నరనారాయణుల విగ్రహాలు ఒకే రాతిపై కలవు. ప్రపంచ కళ్యాణం కోసం తపస్సు చేయు నరుని విగ్రహం కూడా కలదు.

**కుబేర విగ్రహం :** బదరీనాథుని కుడిభాగమున చెవులకు కుండలములు

ధరించినవాడు, విశాలమైన నగుమోము కలవాడు. దేవతల కోశాధ్యక్షుడైన కుబేరుని విగ్రహం కలదు.

**చరణ పాదుకలు :** ఇక్కడే సుదర్శన చక్రము వెండి ఆకులతో కప్పబడి వుంటుంది. స్వర్ణపాదుకల సింహాసనములో ఉద్ధవుని విగ్రహంనకు ఎదురుగా చరణపాదుకలు వుంటాయి.

**గరుడ విగ్రహం :** బదరీనాథుని దక్షిణ భాగములో చేతులు జోడించుకుని నిలబడ్డ గరుడ విగ్రహాన్ని చూడచ్చు.

**ఉద్ధవ విగ్రహం :** శ్రీకృష్ణుడు వైకుంఠం వెళ్ళుటకు ముందు తన నవరత్న ఖచిత బంగారు పాదుకలను పరమభక్తుడైన ఉద్ధవునికిచ్చి బదరీనాథములో తపస్సు చేయమని చెబుతారు స్వామి. ఇక్కడున్న ఈయనే బదరీనాథుని ఉత్సవమూర్తి, ద్వారములు మూసివేసినప్పుడు పాండుకేశ్వరము వెళ్ళి పూజ చేస్తాడు.

**అఖండజ్యోతి :** బదరీనాథుని ఎడమవైపున సంవత్సరం పొడవునా ఆరని దివ్యజ్యోతి కలదు. ద్వారములు మూసివేయునప్పుడు ఆ జ్యోతిని అలాగే వుంచి మూయుదురు. మంచుతో సర్వం కప్పబడినను, ఎన్నోరోజుల తర్వాత ద్వారములు తెరిచినప్పుడు కూడా ఆ అఖండ జ్యోతి వెలుగుతూ వుంటుంది. ఆ అద్భుత మహాత్మ్యాన్ని తనివి తీరా దర్శించి, తరించేందుకు ఆ రోజున వేలమంది యాత్రికులు వస్తారు.

సముద్రమట్టానికి 10 వేల అడుగుల ఎత్తున వున్న ఈ బదరికాశ్రమం నందు ఊర్వశి యొక్క సిద్ధపీఠము, భైరవి చక్రము, నారద క్షేత్రాలు వున్నాయి.

**లక్ష్మీదేవి దేవాలయం :** ఇక్కడ ఆ తల్లి తపం స్థితిలో వుంటుంది. స్వామికి ప్రసాదము తయారుచేయుటకు వుండును.

ఇంకా బదరీనాథుని వాహనశాలలో వెండితో తయారు చేసిన చతుర్భుజ విగ్రహం కలదు.

**భవిష్య బదరీ మహత్మ్యం :** జ్యోతిర్మఠమునకు ఆరుక్రోసుల దూరంలో ధవళానది వొడ్డున భవిష్య బదరీక్షేత్రం కలదు. ఇక్కడే అగస్త్యముని తపస్సు చేసింది. ఆ ముని తపస్సుకి మెచ్చి, ఘోర కలికాలంలో ఇప్పటి బదరీక్షేత్రం పాపులైన ప్రజలకు కనపడదు. ఇదే బదరీగా చెలామణి అగునని వరం ఇచ్చారు స్వామి.

**తప్తకుండము :** సంవత్సరములో ఆరుమాసాలు మంచుతో కప్పబడి వుండే ఈ బదరీనాథుని ఆలయానికి దగ్గరిలోనే అలకనందనానుకొని వుంది. ఇక్కడి నీటి ఉష్ణోగ్రత 125 డిగ్రీలు, నీరు పొగలు కక్కుతుంటుంది. ఇక్కడే పితృతర్పణము చేయాలి.

**బ్రహ్మకపాల శిల :** అలకనందా నదీ తీరంలో 120 మీటర్ల దూరంలో వుంటుంది. బ్రహ్మశిరస్సులలో ఒకదానిని శివుడు తెగవేయగ దాని నివారణకై బ్రహ్మహత్య పాతకము

నుండి నాకెలా విముక్తి అని విష్ణువును ప్రార్థించగా సర్వతీర్థములు తిరిగి రమ్మని విష్ణువు చెప్పెను. శివుడు సర్వతీర్థములు సేవించి చివరకు ఈ బదరీకాశ్రమమునకు వచ్చెను. అక్కడ శివుని చేతికి అంటివున్న బ్రహ్మశిరస్సు నేలబడెను. దానితో తనకు బ్రహ్మహత్య పాతకము వీడినందువల్ల బ్రహ్మ తల తన చేతి నుండి విడివడిందని శివుడు కైలాసానికి వెళ్ళెను. అంతటి పవిత్ర ప్రదేశం. పితరులకు ఇచ్చటనే శ్రాద్ధములు పెట్టాలి. అలకనందా తీరంలో తర్పణలు విడవవచ్చు. ఈ బ్రహ్మకపాల మందు పితరుల పేరుతో పిండదానములు చేసి తర్పణములు వదలిన వారికి గయలాంటి పుణ్యక్షేత్రాల్లో పిండదానము చేయవలసిన అవసరము లేదు. ఇక్కడ చేసిన పిండ ప్రదానం వల్ల కోట్ల రెట్లు ఎక్కువ పుణ్యఫలం వస్తుంది. బదరీక్షేత్రములో పితరుల నుద్ధరించుటకు బ్రహ్మకపాల మంతటి సర్వోత్తమ తీర్థం మరొకటిలేదని శివుడు స్కంధునికి బ్రహ్మకపాల మహత్యంలో ప్రత్యేకించి వివరిస్తారు.

**వ్యాస గణేశ గుహలు :** ఇక్కడకి దగ్గరలోనే కేశవప్రయాగ వుంది. ఇక్కడే సరస్వతీ అలకనందుల సంగమస్థానం. మహాభారత రచన జరిగింది ఈ గుహలోనే. వ్యాసుడు చెబుతుంటే గణేషుడు ఘంటం ఎత్తకుండా భారతం రాసింది ఇక్కడే. ఆలయం నుండి 4 కి.మీ. దూరంలో వున్న ఈ గుహలో నారదుడు, శుక్రుడు, భృగు మహర్షి ముచికుందుడులాంటి మహాత్ములు ఎందరో ఇక్కడే ఈ గుహలోనే తపస్సు చేశారు. శ్రీ శంకరా చార్యులు వారు కూడా నివశించిన ఈ గుహలు సరస్వతి నదీతీరాన వున్నాయి.

**మాతామూర్తి ఆలయం :** సరస్వతి నది అవతల వుంది. నదికి 5 కి.మీ. దూరంలో వుంది మాతామూర్తి ఆలయం.

**గౌడపాద శిల :** శంకరాచార్యులు సిద్ధాంత సూత్రములు ఉపదేశించిన ప్రదేశం. అలకానది అవతలవైపు వుందీ ఈ గౌడపాదశిల.

**మానాదేవి :** దీన్నే మణిభద్రపురమని కూడా అంటారు. కన్యాకుమారి దక్షిణపుకొస అయితే, ఉత్తరపు కొస ఈ 'మానా'. ఇక్కణ్ణుంచే మానస సరోవరం వెళ్ళాలి. కాని అక్కడికి వెళ్ళుట అసాధ్యం. మానవులు వెళ్ళలేనిది.

**వసుధార :** బదరీ నుంచి 10 కి.మీ. దూరం. 230 అడుగుల ఎత్తు నుంచి పడే అద్భుత జలపాతం ఇక్కడుంది. ఇక్కడికి రావటం కష్టం. మంచులో కప్పబడి వున్న నేలపై నడవాలి. శివుని జటాజూటము నుండి గంగ భువికి దిగి రెండు పాయలై ఒకటి గోముఖం నుంచి రెండవ పాయ ఇక్కడ్నుంచి వెలువడిందని స్థలపురాణం చెబుతుంది. ఈరెండు దేవప్రయాగలో కలుస్తాయి. అద్భుత శోభాయమానమగు ఈ జలపాతంపైకెక్కి కూడా స్నానం చేయొచ్చు.

**ద్రోణగిరి :** దీన్నే సంజీవినీ పర్వతము అని కూడా అంటారు. రామరావణ యుద్ధంలో లక్ష్మణుడు మూర్ఛిల్లితే హనుమంతుడు సంజీవిని తెచ్చింది ఇక్కడ్నించే. ఇప్పటికీ ఇక్కడ సంజీవిని చెట్లు వున్నాయని నమ్మకం. ఈ ద్రోణగిరిపై అనేక

మూలికలున్నాయి. ఎంతోమంది ఆయుర్వేద వైద్యులు ఇక్కడ అన్వేషణ సాగిస్తారు.

**లక్ష్మీవనము :** లక్ష్మీదేవి చెలికత్తెలతో విహరించు వనము. మనమింత వరకూ చూడని అనేక పుష్పములు ఇక్కడ చూడవచ్చు.

**మానాదేవి గుడి :** వసుధారకుపోవు మార్గాన వుంది.

**చంద్రతీర్థము :** చిన్న కొలను చూడ చక్కగా వుంటుంది. లక్ష్మీదేవి వనమునకు 3 కి.మీ. దూరంలో వుంది. చంద్ర తీర్థమునకు దగ్గరిలో సూర్యచంద్ర కుండులు పక్కపక్కనే వున్నాయి.

**స్వర్గారోహణ పర్వతం :** పాండవుల చివరి యాత్ర స్వర్గారోహణ ప్రారంభము ఈ పర్వతంనుంచే. ఈ పర్వతం సంజీవిని పర్వతం తర్వాత వుంటుంది. దీన్నే నిచ్చెన పర్వతం అంటారు.

**అలకాపురి :** బదరీకి 20 కి.మీ. దూరంలో వున్న ఈ అలకాపురిలో వేకువ జామున లక్ష్మీదేవి ముందు దేవకన్యలు వేణువీణారవములతో నాట్యం చేస్తారని ప్రతీతి. ఇక్కడ ఆ సమయంలో మృదువీణారవ సంగీతము విన్పిస్తుంది. గజ్జెల చప్పుడుకి రకరకాల భాష్యాలు చెబుతారు.

## హిమాలయ పర్వతాల ప్రదేశములలో కొన్ని పుణ్యక్షేత్రాలు

## ఎత్తు (అడుగులలో)

| | పేర్లు | అడుగులు |
|---|---|---|
| 1. | మానస సరోవరం | 14,950 |
| 2. | దేవ ప్రయాగ | 1,700 |
| 3. | త్రియుగీనారాయణ | 6,000 |
| 4. | యమునోత్రి | 10,500 |
| 5. | బదరీనాథ్ | 10,350 |
| 6. | తుంగనాథ్ | 12,072 |
| 7. | కేదారనాథ్ | 11,750 |

## అలాగే మరికొన్ని ముఖ్య క్షేత్రాలు

| | పేర్లు | అడుగులు |
|---|---|---|
| 1. | పాండుకేశ్వర్ | 6,450 |
| 2. | వసుధార | 13,000 |
| 3. | గౌరీకుండు | 6,500 |
| 4. | రుద్రనాథ్ | 11,670 |

| | | |
|---|---|---|
| 5. | గంగోత్రి | 10,300 |
| 6. | యమునోత్రి | 10,500 |
| 7. | జోషిమఠ్ | 6,150 |
| 8. | ఉత్తర కాశి | 3,500 |
| 9. | ఉఖిమఠ్ | 4,500 |
| 10. | రంభర | 9,000 |
| 11. | మధ్ మహేశ్వర్ | 11,474 |
| 12. | తుంగనాధ్ | 12,070 |
| 13. | అనసూయదేవి | 6,500 |
| 14. | హనుమాన్ చెట్టి | 8,000 |
| 15. | రూప్‌ఖండ్ | 16,000 |
| 16. | సూర్‌కుండ్‌దేవి | 8,000 |
| 17. | గర్వాల్ | 5,500 |
| 18. | గోముఖం | 12,770 |
| 19. | వైదిని | 12,000 |

## పై ప్రదేశాల్లోని కొన్ని పుణ్యక్షేత్రాల దూరం కి.మీ.లలో

| | పేరు | కి.మీ. |
|---|---|---|
| 1. | గౌరికుండ్ నుంచి బదరీనాథ్‌కు | 233 |
| 2. | హరిద్వార్ నుంచి బదరీనాథ్‌కు | 333 |
| 3. | హరిద్వార్ నుంచి గౌరికుండ్‌కు | 247 |
| 4. | హరిద్వార్ నుంచి హనుమాన్‌చెట్టికి | 252 |
| 5. | హరిద్వార్ నుంచి గంగోత్రికి | 295 |
| 6. | హరిద్వార్ నుంచి గోవింద్‌ఘాట్‌కు | 308 |
| 7. | హరిద్వార్ నుంచి డల్హౌసికి | 59 |
| 8. | హరిద్వార్ నుంచి నైనిటాల్‌కు | 217 |
| 9. | ఋషికేశ్ నుంచి బదరీనాథ్‌కు | 301 |
| 10. | గంగోత్రి నుంచి బదరీనాథ్‌కు | 433 |
| 11. | గంగోత్రి నుంచి గౌరికుండ్‌కు | 349 |
| 12. | హనుమాన్ చెట్టి నుంచి బదరీనాథ్‌కు | 349 |
| 13. | హనుమాన్ చెట్టి నుంచి గంగోత్రికి | 223 |
| 14. | హనుమాన్ చెట్టి నుంచి గౌరికుండ్‌కు | 300 |

15. రామ్‌నగర్ నుంచి గౌరికుండ్‌కు 318
16. రామ్‌నగర్ నుంచి గోవింద్ ఘాట్‌కు. 311
17. ఋషికేశ్ నుంచి డల్వాసికి 35
18. ఋషికేష్ నుంచి గోవింద్‌ఘాట్‌కి 276
19. ఋషికేష్ నుంచి గంగోత్రికి 260
20. ఋషికేష్ నుంచి హనుమాన్‌చెట్టీకి 220

ఉత్తరప్రదేశ్‌లోని అనేక పుణ్యక్షేత్రాల్లోని ప్రదేశాలకు ఒక క్షేత్రం నుంచి మరో క్షేత్రం వరకూ దూరం..... మార్గమధ్యంలో తగిలే పుణ్యప్రదేశాల వివరాలు.

## హరిద్వారం నుండి ఋషికేశ్ వరకు రైలుమార్గం (దూరం - మైళ్ళు)

| | |
|---|---|
| ఋషికేశ్ నుండి లక్ష్మణఝూలా వరకు | 3 |
| లక్ష్మణఝూలా నుండి పూలవాడీ వరకు | 4 |
| పూలవాడీ నుండి నాఈ మోహన్ వరకు | 4 |
| నాఈమోహన్ నుండి కుండము వరకు | 7 |
| కుండము నుండి మహాదేవము వరకు | 6 |
| మహాదేవము నుండి ఆస్పత్రి వరకు | 6 1/4 |
| ఆస్పత్రి నుండి వ్యాసఘాట్ వరకు | 4 1/2 |
| వ్యాసఘాట్ నుండి ఉమరాసూ వరకు | 5 |
| ఉమరాసూ నుండి దేవప్రయాగ వరకు | 4 |
| దేవప్రయాగ నుండి రామపురము వరకు | 11 |
| రామపురము నుండి విల్లకేదారము వరకు | 5 |
| విల్లకేదారము నుండి శ్రీనగరము వరకు | 3 |
| శ్రీనగరము నుండి భట్టీసేరా వరకు | 7 1/2 |
| భట్టిసేరా నుండి నరకోటా వరకు | 5 1/2 |
| నరకోటా నుండి గులాబరాయ్ వరకు | 3 1/2 |

### శ్రీనగరమునకు ఋషికేశ్ నుండి (దూరం మైళ్ళు) - 67

| పేరు | (దూరము) మైళ్ళు |
|---|---|
| ఋషీకేశము నుండి రుద్రప్రయాగ | 88 |
| గులాబరాయ్ నుండి రుద్రప్రయాగ | 2 |
| రుద్రప్రయాగ నుండి అగస్త్యముని | 11 |

| | |
|---|---|
| అగస్త్యముని నుండి భేరీ | 7 |
| భేరీ నుండి గుప్తకాశీ | 7 |
| గుప్తకాశీనుండి నాలా (నడచి) | $1\frac{1}{2}$ |
| నాలానుండి వ్యూంగ | 3 |
| వ్యూంగ నుండి ఫాటా | 3 |
| ఫాటా నుండి రామపురము | 5 |
| రామపురము నుండి త్రియుగీ నారాయణ | 5 |
| త్రియుగీ నారాయణ నుండి సోమ ద్వారా | $2\frac{1}{2}$ |
| సోమద్వారా నుండి గౌరీకుండము | $2\frac{1}{2}$ |
| గౌరీకుండము నుండి జంగలచట్టీ | 2 |
| జంగలచట్టీ నుండి రామవాడా | 2 |
| రామవాడా నుండి కేదారనాథ్ | 3 |
| కేదార్‌నాథ్ నుండి గుప్తకాశీ (నడచి) | 27 |

## కేదారనాథ్ నుండి బదరీనాథ్ - 105 మైళ్ళు

| పేరు | (దూరము) మైళ్లు |
|---|---|
| గుప్తకాశీ నుండి ఊఖీమఠము | 7 |
| ఊఖీమఠము నుండి గణేశచట్టీ | $3\frac{1}{2}$ |
| గణేశచట్టీ నుండి గ్వాలియా | $1\frac{1}{2}$ |
| గ్వాలియా నుండి పోథీవాసా | 3 |
| పోథీవాసా నుండి వణియాకుండము | 2 |
| వణియాకుండము నుండి చోపతా | 1 |
| చోపతా నుండి తుంగనాథ్ | 3 |
| తుంగనాథ్ నుండి పాంగరవాసా | 4 |
| పాంగరవాసా నుండి మండల్ | 4 |
| మండల్ నుండి గోపేశ్వర | 6 |
| గోపేశ్వర నుండి చమోలీ | 3 |
| చమోలీ నుండి పీపలకోటి (మోటారుద్వారా) | 11 |
| చమోలీ నుండి తైదలమఠము | 2 |
| మఠము నుండి సియాసేణ్ | 5 |
| సియాసేణ్ నుండి పీపలకోటి | 3 |

| | |
|---|---|
| పీపలకోటీ నుండి వరుచి | 4 |
| వరుచి నుండి గరుడగంగ | 4 |
| గరుడగంగ నుండి టంగనీ | 2 |
| టంగనీ నుండి పాతాళగంగ | 2 |
| పాతాళగంగ నుండి గులాబ్‌కోటీ | 2 |
| గులాబ్‌కోటీ నుండి కుమ్హారచట్టీ | 3 |
| కుమ్హారచట్టీ నుండి ఝరకపుర్ | 3 |
| ఝరకపుర్ నుండి జ్యోతిర్మఠము | 3 |
| ధర్మశాల, నవదుర్గా, వాసుదేవ, బదరీ దర్శనము, | |
| జ్యోతీశ్వర శివదర్శనము జ్యోతీర్మఠము నుండి విష్ణుప్రయాగ | 2 |
| విష్ణుప్రయాగ నుండి ఘాట్ | 4 |
| ఘాట్ నుండి పాండుకేశ్వరము | 2 |
| పాండుకేశ్వరము నుండి లామాగడ్ | 3 |
| హనుమాన్ చట్టీ నుండి బదరీనాథ్ | 5 |

జ్యోతిర్మఠము నుండి బదరీవరకు మోటారు కూడా కలదు.

**బదరీనాథము నుండి వసుధారా (6 మైళ్ళు)**

| | |
|---|---|
| బదరీనాథ్ నుండి మాణా (మోటారు మార్గము) | 2 |
| మాణా నుండి వసుధార (నడచి) | 3 |
| బదరీనాథ్ నుండి సతోపంథ్ | 15 |
| బదరీనాథ్ నుండి మాతావిగ్రహము | 2 |
| బదరీనాథ్ నుండి చరణపాదుక | 2 |
| బదరీ నుండి శేషనేత్ర | 11 |
| బదరీనాథము నుండి గోవిందఘాట్ | 12 |
| గోవిందఘాట్ నుండి హేమకుండము (మోటారుమార్గం) | 11 |
| గోవిందఘాట్ నుండి పూలఘాటీ (నడచి) | 11 |
| జ్యోతిర్మఠము నుండి భవిష్యబదరీ (మోటారు మార్గం) | 13 |

**బదరీనాథ్ నుండి తిరిగి కర్ణప్రయాగ 77 మైళ్ళు**

| పేరు | (దూరము) మైళ్ళు |
|---|---|
| బదరీనాథ్ నుండి జ్యోతిర్మఠము (మోటారు మార్గము) | 27 |
| జ్యోతిర్మఠము నుండి పీపలకోటీ (మోటారు మార్గము) | 20 |
| పీపలకోటీ నుండి కర్ణప్రయాగ | 30 |

| | |
|---|---|
| కర్ణప్రయాగ నుండి రాణీపాలము (మోటారు మార్గము) | 50 |
| కర్ణప్రయాగ నుండి గణాయీ | 44 |
| గణాయీ నుండి రాణీపాలము | 23 |
| గణాయీ నుండి రామనగర్ (మోటార్) | 57 |
| కర్ణప్రయాగ నుండి గోచర్ (మోటార్) | 7 |
| గోచర్ నుండి నగరాసు (మోటార్) | 5 |
| నగరాసూ నుండి శివానంది | 1 |
| శివానంది నుండి రుద్రప్రయాగ (మోటారు) | 8 |
| రుద్రప్రయాగ నుండి శ్రీనగరము (మోటారు) | 21 |
| శ్రీనగరము నుండి పౌడీ (మోటారు) | 18 |
| పౌడీ నుండి సత్యపుతలీ (మోటారు) | 33 |
| సత్యపుతలీ నుండి గుమరవాల్ (మోటారు) | 13 |
| శ్రీనగరము నుండి కీర్తినగర్ (మోటారు) | 3 |
| కీర్తినగర్ నుండి దేవప్రయాగ (మోటారు) | 20 |
| దేవప్రయాగ నుండి ఋషికేశము (మోటారు) | 44 |
| ఋషికేశము నుండి హరిద్వారము (మోటారు) | 15 |
| హరిద్వారము నుండి జ్యోతిర్మఠము వరకు (మోటారు) | 172 |

**హరిద్వారము నుండి డెహరాడూన్ వరకు**

| పేరు | (దూరము) మైళ్ళు |
|---|---|
| హరిద్వారము నుండి డెహరాడూన్ | 40 |
| డెహరాడూన్ నుండి రాజపురము (మోటారు) | 7 |
| రాజపురము నుండి ఝూలకీ | 15 |
| ఝూలకీ నుండి ధనోల్టీ | 9 |
| ధనోల్టీ నుండి కాణాతల్ | 8 |
| కాణాతల్ నుండి వల్డియానా | 9 |
| వల్డియానా నుండి ఛామ్ | 5 |
| ఛామ్ నుండి ధరాసూ | 10 |
| ధరాసు నుండి డుండా | 9 |
| డుండానుండి ఉత్తరకాశీ | 10 |
| ఉత్తరకాశీ నుండి మనేరీ | 9 |
| మనేరీ నుండి భటవాడీ | 9 |
| భటవాడీ నుండి గంగనానీ | 9 |
| గంగనానీ నుండి సూఖీ | 9 |

| | |
|---|---|
| సూఖీ నుండి హరిశిల | 10 |
| హరిశిల నుండి జాంగలా | 6 |
| జాంగలా నుండి గంగోత్తరీ | 6 |
| గంగోత్తరీ నుండి గోముఖము | 14 |

**ఋషికేశము నుండి టిహరీ వరకు**

| పేరు | (దూరము) మైళ్ళు |
|---|---|
| హరిద్వారము నుండి దేవప్రయాగ (మోటారు) | 58 |
| దేవప్రయాగ నుండి ఖరసాలీ | 10 |
| ఖరసాలీ నుండి కోటేశ్వర్ | 4 |
| కోటేశ్వర్ నుండి క్యారీ | 14 |
| క్యారీ నుండి టేహరీ | 6 |
| టేహరీ నుండి వల్డియానా | $11^1/_2$ |
| వల్డియానా నుండి ఛామ్ | 5 |
| ఛామ్ నుండి నంగుణ్ | 5 |
| నంగుణ్ నుండి ధరాసూ | 5 |
| ధరాసూ నుండి కల్యాణీ | 4 |
| కల్యాణి నుండి సిలక్యారీ | 10 |
| సిలక్యారీ నుండి సిమలీ | 9 |
| సిమలీ నుండి గంగాణీ | 12 |
| గంగాణీ నుండి యమున | 6 |
| యమున నుండి డండోటీ | 5 |
| డండోటీ నుండి హనుమాన్ | 4 |
| హనుమాన్ నుండి ఖరసాలీ | 4 |
| ఖరసాలీ నుండి యమునోత్తరి | 4 |
| ఋషికేశము నుండి గంగాణి వరకు (మోటారు మార్గము) | 116 |

**యమునోత్తరి నుండి గంగోత్తరీ 99 మైళ్ళు**

| పేరు | (దూరము) మైళ్ళు |
|---|---|
| యమునోత్తరి నుండి సిమలీ | 26 |
| సిమలీ నుండి నాకోరీ | 11 |
| నాకోరీ నుండి ఉత్తరకాశీ | 7 |
| ఉత్తరకాశీ నుండి మల్లా | 16 |
| మల్లా నుండి భటవాడీ | 2 |

| | |
|---|---|
| భటవాడీ నుండి గంగణానీ | 9 |
| గంగణానీ నుండి సుఖీ | 9 |
| సుఖీ నుండి హరశిల | 10 |
| హరశిల నుండి జాంగలా | 6 |
| జాంగలా నుండి గంగోత్తరీ | 9 |

**గంగోత్తరి నుండి కేదారనాథ్ 121 మైళ్ళు దూరము**

| పేరు | (దూరము) మైళ్ళు |
|---|---|
| గంగోత్తరి నుండి భటవాడీ | 43 |
| భటవాడీ నుండి మల్లా | 2 |
| మల్లా నుండి ప్యాలూ | 6 |
| ప్యాలూ నుండి బేలక | 7 |
| బేలక నుండి ఝూలా | 9 |
| ఝూలా నుండి బూడాకేదార్ | 5 |
| బూడా కేదార్ నుండి ఘుత్తూ | 16 |
| ఘుత్తూ నుండి పంవాలీ | 10 |
| పంవాలీ నుండి మూంగ్ | 10 |
| మూంగ్ నుండి త్రియుగీ | 5 |
| త్రియుగీ నారాయణుని నుండి గౌరీకుండము | 7 |
| గౌరీకుండము నుండి కేదారనాథ్ | $7^1/_2$ |
| కేదార్ నుండి గుప్తకాశీ | 27 |

**జ్యోతిర్మఠము నుండి 'నీతో ధూరా' మీదుగా కైలాసనాథ్ 291 మైళ్ళు**

| | |
|---|---|
| జ్యోతిర్మఠము నుండి నీతా | 48 |
| నీతా నుండి నావరామండీ | 23 |
| నావరామండీ నుండి శివచలమ్ | 28 |
| శివచలమ్ నుండి గ్యానిమండి | 28 |
| గ్యానిమ్ మండి నుండి కైలాసనాథ్ | 40 |
| కైలాసనాథ్ నుండి మానస సరోవరము | 16 |
| మానససరోవర చుట్టుకొలత | 54 |
| కైలాసనాథ్ చుట్టుకొలత | 32 |
| ఆల్మోడా నుండి అస్కోట | 69 |

| | |
|---|---|
| అస్కోట నుండి ధారచులా | 29 |
| ధారచులా నుండి గర్బ్యాగన్ | 11 |
| గర్బ్యాగన్ నుండి తకలాకోట్ | 28 |
| తకలాకోట్ నుండి మానస సరోవరము | 28 |
| మానస సరోవరము నుండి కైలాసనాధ్ | 16 |
| బదరీనాథ్ నుండి కైలాసనాథ్ | 240 |
| కైలాసనాధ్ నుండి తీర్థపురీ | 36 |

**గణేష్ గుహలు** : వ్యాస భగవానుడు చెబుతుంటే గణేశుడు ఘంటం ఎత్తకుండా మహాభారతాన్ని వ్రాసింది ఇక్కడే. ఇక్కడికి దగ్గరలోనే 'మానా' వుంది. ఇక్కడ్నించి మానస సరోవరం వెళ్లొచ్చు.

**సతోపకొథా** : అద్భుత అందాల సరస్సు. బదరీనాథ్‌కు 20 కి.మీ. దూరంలో వుంది.

**ఋషీకేశ్, బదరీనాథ్‌ల మధ్య పురాణ స్థలాలు :**

**నంద ప్రయాగ** : మందాకినీ, అలకానందల సంగమస్థానం. ఇక్కడే రావణబ్రహ్మ తపస్సు చేసినది.

**నందా దేవి శిఖరం** : జలపాతాలు, నదీనదాలు, సుందర వనాలతో నిండి వున్న ఈ శిఖరం 70 హిమశిఖరాలపై 7,818 మీటర్ల ఎత్తులో గంగోత్రి-మిలన్‌ల మధ్య వుంది.

**ముస్సోరి** : డెహ్రాడూన్‌కి 35 కి.మీ. దూరంలో వుంది. అనేక రకములైన పండ్లు కనిపిస్తాయి. మోసి, భట్టా, కేంతి మొదలైన జలపాతాలున్న ఈ ప్రదేశంలో గన్‌హిల్ వరకూ రోప్‌వే వుంది. ఈ గన్‌హిల్ కొండ నుంచి బదరీనాథ్ పుణ్యస్థలం చూడవచ్చు.

**వసతికి** : అప్సర ఫోను : 2480, డీప్ ఫోను : 2470, హేవార్డ్ ఇంటర్నేషనల్ ఫోను : 2213, మౌంటెన్ వ్యూ ఫోను : 2476, ముస్సోరి ఇంటర్నేషనల్ ఫోను : 2943, రాక్‌వుడ్ ఫోను : 2686, షిల్‌టాన్ ఫోను : 2482, వేలీవ్యూ ఫోను : 2324, 2211, సేవాయ్ ఫోను : 2601, 2510-2620 లైబ్రరీక్లబ్, గాంధీచౌక్.

**డెహ్రాడూన్** : ముస్సోరికి అతిదగ్గర. రాబర్స్ గుహలు, అశోకుని శిలాశాసనం, తాపకేశ్వర శివాలయం, బ్రిటీషు మ్యూజియంగల ఈ డెహ్రాడూన్‌లో డూన్ స్కూల్‌లోనే రాజీవ్‌గాంధీ చదువుకున్నది. ఋషీకేశ్‌కి 425 కి.మీ. దూరములో వున్న ఈ ప్రాంతములోనే పాండవులు, కౌరవులు ద్రోణాచార్యుని వద్ద యుద్ధవిద్యలు నేర్చుకున్నారు. 'డెహ్రాద్రోణ' గా పిలవబడిన ఈ ప్రదేశం ఇప్పుడు డెహ్రాడూన్‌గా అయింది.

**వసతికి** : అశోక్ ద్వీప్ ఫోను 27278-25434, పర్యాటక్ హౌస్ ఫోను 3523 డూన్‌వ్యూ, 26 రాజ్‌పుర్ రోడ్డు, జైన్ ధర్మశాల ఫోను 25823, మందాకిని ఫోను 27860, సింధి ఫోను 24611, రైల్వే గెస్టుహౌస్ ఫోను 23617, రీజెంట్ 42/1, తూర్పు కెనాల్ రోడ్డు, వైట్‌హౌస్, ఫోను 23694, 26865.

**లాల్ దిబ్బా :** ఇక్కడ నుంచి కేదారనాథ్, బద్రీనాథ్ పర్వత శిఖరాలు కనిపిస్తాయి. ముస్సోరీలోనే ఎత్తయిన శిఖరం లాల్‌దిబ్బా.....

**యమునోత్రి :** పావన యమున పుట్టుక ప్రదేశం, సముద్ర మట్టానికి 4421 మీటర్ల ఎత్తులో వుంది. యమునాదేవి ఆలయముంది. ఆలయం క్రింద ఉష్ణజల ధారల ఊటలున్నాయి. ఈ నీటి వేడి 194 డిగ్రీల ఫారెన్ హీట్ వుంటుంది. రమణీయమైన ప్రకృతి అందాలు గల ఈ ప్రదేశం నుంచి పవిత్రజలాలను బదరీ, కేదారంలో అభిషేకానికి తీసుకువెళతారు. వసతికి ఫారెస్టు రెస్టుహౌస్ వుంది.

**రూప్‌కుండు సరస్సు :** త్రిశూల్ పర్వత పాదంలో వుంది.... రమణీయమైన దృశ్యాలతో రూప్‌కుండు సరస్సు కనులకు పండగ చేస్తుంది. ఈ సరస్సు 4,778 మీ. ఎత్తులో (సముద్ర మట్టానికి) వుంది.

**హిమకుండు సరస్సు :** సిక్కులకు అతి పవిత్ర స్థలం. సిక్కుల గురువు గురు గోవింద్‌సింగ్ ఈ సప్త శిఖరాల మధ్య సరస్సు తీరంలో తపస్సు చేశారు.

**పిండారి మైదానం :** బ్రహ్మాండ శిఖరాలు ఉన్నాయి. ఉత్తుంగ శిఖరాలు జలధారలు ఇవన్ని మనకు మనోహరమైన మధురాతి మధురమయిన అనుభూతి కలిగిస్తాయి.

**శ్రావస్తి :** గౌతమ బుద్ధుడు పద్మంలో ఆసీనుడై విశ్వరూపాన్ని చూపించిన ప్రదేశం గోరక్‌పూర్ నుండి రవాణా సౌకర్యం వుంది ఇక్కడికి.

**ఫైజాబాద్ :** శ్రీరామచంద్రుడు అవతారం చాలించింది ఇక్కడే.....

**అయోధ్య :** వంద కంటే ఎక్కువ దేవాలయాలున్న ఈ ప్రదేశాన్ని చైనా యాత్రికుడు హ్యూయన్ సాంగ్ 7వ శతాబ్దంలో దర్శించారు. వసతికి బిర్లా ధర్మశాల,ఫోను - 41 కనకభవన్ ధర్మశాల, ఫోను 24 UPSTDC టూరిస్టు బంగ్లా, స్టేషన్ రోడ్డు.

రఘుకుల సోముడు, పట్టాభిరాముడు ఆ శ్రీరాముడి జన్మభూమి అయిన ఈ అయోధ్యలో చూడవల్సినవి.

**రామజన్మస్థానం :** దశరథ మహారాజు ఇక్కడే పుత్రకామేష్టి యజ్ఞాన్ని నిర్వహించింది. చరిత్రలో ఎన్నో ఆధారాలుగల ఈ రామజన్మస్థానము చూస్తే ప్రతి భారతీయుడి శరీరం పులకిస్తుంది. "రామా" అన్నమాట నోటివెంట వస్తుంది.

**చేరా :** తులసీదాసు మందిరం వుంది.

**త్రేతా-కా-ఘర్ :** శ్రీరాముడు నిర్వహించిన యజ్ఞవాటికతోపాటు సీతారాముల విగ్రహాలు వున్నాయి.

**క్షీరేశ్వరుని ఆలయం :** కౌసల్యచే ప్రతిష్టింపబడినది.

**కాలారామమందిర్ :** విక్రమాదిత్య ప్రభువుచే ప్రతిష్టింపబడిన యిక్కడ రామకోటికి నిత్యం పూజ జరుగుతుంది.

**హరిహరమందిర్ :** శ్రీరాముని ధ్యానమందిరం.

**కనక భవనం :** బంగారు సింహాసనం వున్న ఈ భవనమే శ్రీరామచంద్రుడి నివాస స్థానం. బంగారు కిరీటాలు ధరించిన విగ్రహాలున్నాయి. ఈ భవనంలోనే కైకేయి కోప గృహం వుంది.

**హనుమాన్ ఘడీ :** నవాబు షాజుద్దౌలా నిర్మించిన రామచంద్రాలయం వుంది.

**స్వర్గద్వార్ :** యాత్రికులు పిండ ప్రదానములు చేసే ఈ చోటునే శ్రీరాముడు అవతారం చాలించి అంతర్ధానమైంది.

**మఘర్ :** భక్త కబీరు సమాధి వుంది.

**మహాసారి నిర్యాణం :** క్రీ.పూ. 487లో గౌతమబుద్ధుడు 80వ యేట సాలవృక్ష వనంలో నిర్యాణం చెందాడు ఇక్కడున్న కాసియా అనేచోట -

**సారనాథ్ :** బుద్ధుడు మొట్టమొదట బోధ చేసిన ప్రదేశం. పాలరాతితో నిర్మించబడిన చైనా దేవాలయం, పురాతన శిల్ప విశేషాలున్న మ్యూజియం, అశోక స్థంభం వున్నాయి. నాగార్జున స్థూపంలో దొరికిన బుద్ధుడి దంతముతోపాటు చైనా, బర్మా, దేశముల ఆలయాలు చూడదగ్గవి.

**రామ్‌నగర్ కోట :** ఈ కోటలో మ్యూజియం వుంది. రాణీవాసపు వెండి పల్లకీలు, హంసతూలికా తల్పం...... పాత ఖడ్గాలు అనేకం చూడచ్చు.

**సితార్ :** సంగీత ప్రియులు ఇక్కడనుంచి సితార్‌లు కొనుక్కోవచ్చు.

**యజ్ఞేశ్వర్ నాథాలయం :** చంద్ర ప్రభానది దగ్గర యజ్ఞేశ్వరనాథ మహదేవ మందిరం వుంది.

**దుర్గాలయం :** కాశీరాజు కోట నుంచి 4 కి.మీ. దూరంలో వుంది.

**దక్షయజ్ఞకుండం :** సరోవర స్నానం చేయండి. దక్షప్రజాపతి యజ్ఞం చేసిన చోటు.

**దేవలాస్ :** దేవలమహర్షి ప్రతిష్ఠించిన సూర్యుని మందిరం వుంది.

**దుర్వాసధామం :** ఖురాసన్ రోడ్డు నుండి 5 కి.మీ. దూరం. ఇక్కడే దూర్వాస మహాముని తపస్సు చేసింది.

**చునారుకోట :** వామనునికి మూడు అంగలు బలి ఇచ్చినప్పుడు స్వామి మొదటి అడుగు ఇక్కడే వేశారు.

## వారణాసి

(కాశి) 100 శివాలయాలు వున్నాయి. ఇక్కడే విశ్వామిత్ర మహర్షి పరీక్షకు నిలబడి హరిశ్చంద్ర మహారాజు తన సత్యనిష్టను లోకానికి చాటింది. తన అహింసా ప్రవచనాన్ని గౌతమబుద్ధుడు మొదట ఇక్కడే చాటింది. ఈ పుణ్యస్థలంలోనే అశోకుడు నిర్మించిన

సారనాధ స్థూపం వుంది. ఈ స్థూపంమీద ఉన్న మూడు తలల సింహస్థూపాకృతమే మన జాతీయజండా మీద వున్న మూడు తలల రాజ్యాంగ ముద్ర. కాశీయాత్ర చేయనిదే స్వర్గద్వారాలు తెరుచుకోవని హిందువుల నమ్మకం. కాశీలో మరణిస్తే మరుజన్మ ఉండదని పెద్దలు చెబుతారు. బ్రహ్మజ్ఞానము ప్రసాదించే ఈ స్థలంలో విశ్వనాధాలయం ప్రధానమైనది. ద్వాదశ జ్యోతిర్లింగములలో 10వది. హిందువులకి మాత్రమే ప్రవేశము. విశ్వవిద్యాలయానికి దగ్గరలోనే "అన్నపూర్ణేశ్వరి" ఆలయం వుంది. ఈ కాశీక్షేత్రమంతా గోవులు ఎక్కడ చూసినా కనపడుతుంటాయి. 64 స్నానఘట్టములు ఉన్నాయి. గంగ ఉత్తర వాహినియై ప్రవహించే ఈ క్షేత్రములో ముఖ్యమైన ఘట్టాలు అయిదు. అసిఘాట్, వీర్లసంగం, దశాశ్వమేధఘాట్, పంచగంగ మణికర్ణికా.

ఇక్కడున్న ప్రతి స్నానఘట్టానికి ఓ చరిత్ర ఉంది.

ఇక్కడున్న 64 స్నానఘట్టముల పేర్లతోపాటు పంచతీర్థ స్నానఘట్టముల పేర్లు.

1. అస్సీఘాట్, 2. రీమామహల్, 3. తులసీఘాట్, 4. పానీకల్ ఘాట్, 5. జానకీఘాట్, 6. ఆనందమాయిఘాట్ - (ఆనందమాయి అను గొప్ప సిద్ధురాలు దీనిని కట్టించెను. ఇచ్చటి భవనమున నిరంతరము సంకీర్తన, ప్రవచనములు జరుగును.) 7. అక్రూరఘాట్, 8. జయినీ పాఠశాలాఘాట్, 9. పంచఘాట్, 10. చేతసింగ్ ఘాట్, 11. నిరంజనీ, నిర్వానీ అఖాడా (ఇచ్చట నాగ 'దిగంబర' సాధువులుందురు), 12. శివాలాఘాట్, 13. డండిఘాట్, 14. జున్నాఅఖాడా, 15. హనుమాన్‌ఘాట్, 16. మైసూర్ మహారాజాఘాట్, 17. హరిశ్చంద్రఘాట్ (హరిశ్చంద్రుడు పాము కాటుచే మరణించిన తన కుమారుడు లోహితాస్యుని దహన మొనరించెనందురు. బీదల శవముల నిచ్చట దహనం చేస్తారు). 18. లీలాఘాట్, 19. కేదార్‌ఘాట్ (ఇక్కడి ఆలయము చాలా పెద్దది. తెలుగువారు విశేషముగ వస్తారు. ఆలయ కుడ్యములపైనను, రాళ్ళ పైనను తెలుగువారి పేర్లు చాలా కలవు). 20. రుక్మాంగదఘాట్, 21. క్షేమేశ్వరఘాట్, 22. మానససరోవర ఘాట్, 23. నారదఘాట్, 24. అన్నపూర్ణాఘాట్ (ఉచిత భోజనము గలదు), 25. సర్వేశ్వరఘాట్, 26. పాండేఘాట్, 27. చౌచట్టి, 28. రాణాఘాట్ (ఉదయగిరి), 29. ధర్మాంగ మహారాజఘాట్, 30. మున్షీఘాటు, 31. అహల్యాబాయి ఘాటు (ఇందూర్ మహారాణి అహల్యాబాయిచే నిర్మితము), 32. దశాశ్వమేధఘాటు (స్నానములకిది రెండవ ముఖ్యస్థానము. అన్ని ఘట్టములకన్న ఇది చాలా క్రిక్కిరిసి వుండును. ఇచ్చట బ్రహ్మ పది అశ్వమేధములొనర్చెనట), 33. ప్రయాగఘాటు, 34. ఫెుండాఘాటు, 35. మాన్ మందిర్ (ఇది జయపూర్ మహారాజా నిర్మితము), 36. త్రిపుర భైరవఘాటు, 37. విశాలాక్షిఘాటు, 38. భజనాశ్రమము (అఖండ సంకీర్తన జరుగును), 39. లలితాఘాటు

(నేపాల్ మహారాజ నిర్మితము), 40. మణికర్ణికా ఘాటు (పరమ పవిత్రమైనది. ఇదియు అహల్యాబాయిచే నిర్మించబడినదే. ఇందు రెండు భాగములున్నవి. ఒక భాగము స్నానములకు ప్రధానము;రెండవ భాగము శవ దహనములకు ప్రధానము. మణికర్ణికను మోక్ష క్షేత్రమందురు. మహా దేవుని చెవి కుండలము క్రింద పడినదనియు, దానిచే మణికర్ణిక అనెడి పేరు సార్థకమనియు నందురు. ప్రతి యాత్రికుడు చక్రతీర్థములో స్నానము చేసిన తరువాత గంగలో స్నానము చేయాలి), 41. మాతృ లింగేశ్వరఘాటు, 42. శిందియాఘాటు, 43. సంకటాఘాటు (గ్వాలియర్ మహారాజావారిది), 44. కోసలఘాటు (నాగపూర్ రాజావారిది), 45. నయాఘాటు, 46. రామఘాటు, 47. చోర్‌ఘాటు. 48. బాలాఘాటు, 49. మంగళఘాటు. 50. పంచగంగా ఘాటు (ఇది స్నానములకు 4వ ముఖ్యస్థానము. చిట్టచివరిది. 5వ స్నానము వరుణ. ఇది రైల్వేబ్రిడ్జికి ఆవలగలదు. పంచగంగా ఘాటువొడ్డున బిందుమాధవాలయము గలదు), 51. దుర్గాఘాటు, 52. బ్రహ్మఘాటు, 53. రాజమందిర్ ఘాటు, 54. లాల్‌ఘాటు (బిర్లామకాం - పెద్ద భవనము గలదు), 55. గాయ్‌ఘాటు (దాల్మియాభవనము గలదు). 56. మాతాఘాటు, 57. త్రిలోచనఘాటు, 58. ఘోలాఘాటు, 59. క్షత్రియఘాటు, 60. ప్రహ్లాదఘాటు, 61. మహిషాసురఘాటు, 62. రాజఘాటు, 63. వరుణాఘాటు.

**పంచతీర్థ స్నానములు** - 1. అస్సీ, 2. దశాశ్వమేధ, 3. వరుణ, 4. పంచగంగ, 5. మణికర్ణిక.

**సరస్వతీ భవనము** : ఇది క్వీన్సు కళాశాలకు సమీపమున గలదు. సంస్కృత వాఙ్మయమునకు ప్రసిద్ధి చెందినది.

**శ్రీరామకృష్ణ మిషన్** : ఇది 1990 సం॥ స్థాపించబడినది.

కాశీ పరిసరాల్లో 1900లో స్థాపించిన రామకృష్ణమిషన్, బెనారస్ హిందూ యూనివర్శిటీ, భారతమాత ఆలయం, తులసీమానసాలయం ముఖ్యమైనవి.

# అలహాబాద్

దీన్నే ప్రయాగ, త్రివేణి అని కూడా అంటారు. వారణాసికి 135 కిలోమీటర్ల దూరంలో వుంది. ఇక్కడ గంగా, యమునలు మన కళ్ళముందే కలుస్తాయి. సరస్వతిదేవి అంతర్వాహినిగా ప్రవహించి కలుస్తుంది. మూడు పవిత్ర నదులు కలవటం వల్ల ఇది త్రివేణి సంగమం అయింది.. సంవత్సరంలో నెలరోజుల పాటు మాఘమేళా అంటే పవిత్ర స్నానోత్సవం జరుగుతుంది. 12 సంవత్సరాలకి ఒకసారి పుష్కరోత్సవం జరుగుతుంది. దీన్నే కుంభమేళా అంటారు. ఈ కుంభమేళా నాలుగు ప్రదేశాల్లో జరుగుతుంది. నాసిక్,

ఉజ్జయిని, హరిద్వార్, అలహాబాద్..... గరుత్మంతుడు అమృతభాండాన్ని నాగుల కోసం తీసుకువస్తూ ఈ నాలుగుచోట్లా ఆగాడట. అందుకనే ఆ నాలుగుచోట్లా కుంభమేళా ఉత్సవం జరుగుతుంది.

సాక్షాత్తు శ్రీరామచంద్రుడు ఈ త్రివేణి సంగమంలో స్నానమాచరించినట్టు రామాయణంలో వుంది.

**కోట :** 1583లో అక్బరు చక్రవర్తి కట్టించాడు. ఈ కోట త్రివేణి సంగమాన్ని ఆనుకొని యమునా నదివైపు వుంది. భారతీయులకు మాత్రమే ప్రవేశం. అశోకుడి శాసనాలు, ఇంకా సముద్రగుప్తుని, గుప్తుల కాలంనాటి శాసనాలు వున్నాయి. ఈ కోటలోనే గుంటలో శయనించిన ఆంజనేయస్వామి మూర్తి వుంది. ఇక్కడే వటవృక్షం వుంది. ఎన్నిసార్లు పీకినా మరలా మొలవటంతో సీసం పోశారు. అయినా మొలకవేసింది. భూగర్భంలో వుందీ అక్షయ వటవృక్షం.

**మ్యూజియం :** రాజస్థానీ చిత్రాలు, నెహ్రూగారు సేకరించిన చిత్రాలతో పాటు, అరుదైన వస్తువులు కూడా వున్నాయి.

**రీవా :** ఇక్కడ కోట వుంది.

ఫన్నా : వజ్రాల గని.

ఇంకా నాగేశ్వరాలయం, నెహ్రూ కుటుంబీకులు నివసించిన గృహం, విశాల ఉద్యానవనాలు అలహాబాదులో వున్నాయి.

**హనుమాన్ ధార :** ఆంజనేయస్వామి విగ్రహం చేతినుండి జలధార పడుతుంది. బాబూర్, ఛాధాయి (జలపాతాలు), రామఘాట్ (శ్రీరాముడు తండ్రికి పిండ ప్రదానం చేసిన చోటు) కామితగిరి : (కైలాసనాధేశ్వరం, శ్రీరామ నామ వృక్షం వున్నాయి) జానకీకుండం (తులసీదాసు మందిరం గల ఈ ప్రదేశమే సతీ అనసూయ సీతాదేవికి పాతివ్రత్య మహిమను చెప్పిన పవిత్ర స్థలం) రాజాపురం (తులసీదాసు జన్మభూమి) బంధూర్‌పూర్ (జగదేశ్వర మహాదేవుని ఆలయం వుంది).

**అలహాబాద్‌లో వసతి :** అలహాబాద్ రీజెన్సీ, 16 తష్కంత్ మార్గ్, ఫోను : 56043.

N.C. కాంటినెంటల్ నియర్ రైల్వేస్టేషన్ జంక్షన్, ఫోను : 4231, 4052.

UPSTD టూరిస్టు బంగ్లా, 35, M.G. రోడ్, సివిల్ లైన్సు.

YMCA 13 సరోజినీనాయుడు రోడ్.

YMCA 9-A కమలానెహ్రూ రోడ్.

ప్రెసిడెన్సీ 19 D సరోజినీనాయుడు మార్గ్ ఫోను : 4460, 4097.

యాత్రిక్ 33 సర్దార్ పటేల్ మార్గ్ ఫోను : 56920, 56020, 601509.

**కాన్పూరు :** ఇండస్ట్రియల్ సెంటర్ అయిన ఇక్కడ దేవాలయాలతో పాటు మంచి ఉద్యానవనాలు ఉన్నాయి.

**రామ్‌పూర్** : పురాతన కాలానికి చెందిన వ్రాతప్రతులున్నాయి.

**ఇటవా** : బాగా శిధిలమైన కోట వుంది.

**కనోజ్** : అశ్వతీర్థమంటారు. దేవి భాగవతంలో చదివిన 108 శక్తి పీఠాల్లో 11వ స్థానంగల గౌరీదేవి ఆలయం వుంది.

**ఆగ్రా** : సెవన్ వండర్స్‌లో ఒకటిగా ప్రసిద్ధి చెందిన కళాత్మకమైన కట్టడం..... సింబల్ ఆఫ్ లవ్ తాజ్‌మహల్ ఇక్కడే వుంది. ప్రపంచం నలుమూలల నుంచి వచ్చే విదేశీయులు ఈ మహల్‌ని చూడకుండా వెళ్ళరు. షాజహాన్ ముంతాజ్‌ల ప్రణయస్మారక చిహ్నమే ఈ పాలరాతి తాజ్‌మహల్. 52 మీటర్లు ఎత్తుగా వున్న సెంట్రల్ డోమ్ నాలుగువైపులా సన్నని తెల్లని స్థంభాలు నిలబెట్టి వుంటాయి. ఆ డోము క్రిందనే ముంతాజ్, షాజహాన్ సమాధులున్నాయి. యమునా నది వొడ్డున వున్న ఈ తాజ్‌మహల్ పైనుంచి ఆగ్రా పట్టణం కళ్ళకు కట్టినట్టు కనిపిస్తుంది. ఈ మహల్‌ని చూస్తే పున్నమి వెన్నెలలోనే చూడాలి. తాజ్ ముందున్న నీటి సరస్సులో నీరు నిండుగా వుంటే మహల్ ప్రతిబింబిస్తుంది. ఆ దృశ్యం చూడవలసిందే గాని వ్రాయుట సాధ్యంకాదు ఈ మహల్ 1653 వరకు నిర్మించినను ఈ మహల్ ప్రారంభించినది 1632లో.

**ఆగ్రాకోట** : అక్బర్ ఈ కోటను 8 సంవత్సరాలు కట్టించాడు. అనేక విశేషాలు వున్న ఈ కోట గురించి పూర్తిగా వివరంగా తెలియాలంటే గైడ్‌ని పెట్టుకోండి. సాయంత్రం వరకే ప్రవేశం.

**దివాని-ఇ-అమ్** : ఒకప్పుడు ఇది కొయ్య కట్టడం సింహాసనం ఓ ప్రత్యేక గదిలో ఉంది.

**దివాన్-ఇ-ఖాన్** : షాజహాను 1636-37 మధ్యన నిర్మించాడు. ప్రసిద్ధి చెందిన నెమలి సింహాసనం ఒకప్పుడు ఇక్కడే ఉండేది. ఆ తరువాత ఔరంగజేబు ఈ సింహాసనాన్ని ఢిల్లీ తరలించాడు.

**జహంగీరు ప్రదేశం** : సుందర విలాస భవనం.

**షాజహాన్ భవనం** : ఇది చలువరాతి భవనం. ఎండాకాలంలో అతిచల్లగా వుంటుంది.ఎలాంటి ఎయిర్‌కూల్ పరిజ్ఞానం లేని ఆ రోజుల్లో ఎలా కట్టారో గాని ఆశ్చర్యం.

**అష్టభుజి గోపురం** : ఈ కట్టడం నుంచి చూస్తే ముంతాజ్ మహల్, తాజ్‌మహల్ కనిపిస్తాయి.

**అద్దాల భవనం** : అప్పటి అంతఃపుర స్త్రీలు బట్టలు మార్చుకునే కళాత్మకమైన మందిరం.

రోహిటాంగ్ కనుమ : ఎముకల్ని కొరికే చలి రోహిటాంగ్ దగ్గర జపాన్ అనే శిఖరంపై జపాన్ దేవత ఆలయం వుంది.. ఈ ఆలయం లేనప్పుడు ఇక్కడ నరమాంస భక్షకులు వుండేవారట

**త్రిలోకనాథ ఆలయం** : బౌద్ధ గురువు పద్మ సంభవునిచే నిర్మించబడిన ఆలయం వుంది. ఈ ఆలయం కీలాంగ్‌నుంచి చంద్రభాగా నది దాటితే వస్తుంది. కీలాంగ్‌లో పురాతనమైన ఖార్డింగ్ ఆరామం వుంది.

కల్పా : మహాదేవుని నివాసమైన కైలాసనగరం ఇదే. కిన్నాపూరు జిల్లా ముఖ్యమైన కేంద్రం అయిన ఈ కల్పా సముద్రమట్టానికి 6050 మీ. ఎత్తులో వుంది.

**దేవ్‌దిబ్బ** : 6000 మీ. ఎత్తునవున్న ఈ దిబ్బలో మనోహరమైన సుందర దృశ్యాలు అనేకం వున్నాయి. దిబ్బ దిగువన ఉన్న సేరి నుండి చంద్రతార్‌కి వెళ్ళవచ్చు.

హిమాచల్ ప్రదేశ్‌లోని ప్రతి ప్రదేశం దేవతా ప్రాముఖ్యాన్ని ప్రతిబింబిస్తుంది. విపరీతమైన చలిగల ఈ ప్రదేశాన్ని దర్శించడానికి శక్తి, స్తోమత తప్పనిసరి.

హిమాచల్ ప్రదేశ్‌లో చూడవల్సినవి మరికొన్ని. "బియాస్ నది జన్మస్థలం బియాస్‌కుండు సోలాంగ్‌లోయ నుండి బైలుదేరే దారిలో చూడవచ్చు. నీర్మాండలోని అంబికా ఆలయం. సేరాజ్ లోయ నుండి నార్కండా వెళ్ళేదారిలో సిమాంజి, తార్థక్ నదుల సంగమ స్థానం. తీర్థక్ లోయ దిగువన బంజార్. ఇక్కడ చాలా దేవాలయాలున్నాయి. 4,000 అడుగుల ఎత్తు వున్న గౌరీశంకర శిఖరం కంటే ఎత్తయిన శిఖరాలు చాలా వున్నాయి హిమాచల్ ప్రదేశ్‌లో. ఇక్కడ వాతావరణం కూడా విభిన్నంగా వుంటుంది. విపరీతమయిన చలి, వెచ్చటి వేడి ఉష్ణతాపం మరో ప్రక్క. ఎన్నో పర్వతాలను, రాళ్ళను చీల్చుకుని ప్రవహించే గంగా, సింధు, యమున, సరస్వతి, అలకనందా, బ్రహ్మపుత్ర, మందాకిని జీవనదులు జన్మస్థలి అయిన ఈ హిమాచల్ ప్రదేశ్ పుణ్యస్థలి నుండి జమ్ము కాశ్మీర్ వెళదాం. ముందుగా......

## హిమాచల్ ప్రదేశ్‌లో వసతి

**డల్హౌసి :**

ఆరోమ-ఎస్క్వైరు, కోర్టు రోడ్డు, ది మాల్ - ఫోను : 99

HPTDC టూరిస్టు బంగ్లా - ఫోను : 55

HPTDC యూత్ హాస్టలు, బస్‌స్టాండు వద్ద - ఫోను : 89

HPTDC ఫారెస్టు రెస్టు హౌస్.

**ధర్మశాల :**

రేవెల్లి గెస్టుహౌస్, కోటవోలి బజారు

పి.డబ్ల్యు.డి. సివిల్ రెస్టుహౌస్

సర్క్యూట్ హౌస్

HPTDC భగ్సు, మెక్లాలాయిడ్ గంజ్, ఆప్సర్ ధర్మశాల - ఫోను : 2290

HPTDC ధౌలాధరు, కోటవాలి బజారు - ఫోను : 2401, 2256, 2536, 2363.

కులు : HPTDC సిల్వర్ మూన్

HPTDC ఏపిల్ బ్లాసమ్, కత్రైన్ - ఫోను : 7

అశోక ట్రావెలర్స్ లాడ్జి (ఐ.టి.డి.సి.) - ఫోను - 76

ఎమ్పైర్ - ఫోను : 97

అల్యూమినియమ్ హట్స్

ఒబరాయ్ స్పాన్ కులు వేలి రిసార్ట్స్, PO కత్రైన్ - ఫోను : 40

మనాలి : HPTDC లాగ్ హట్స్ - ఫోను : 39

HPTDC చీన్

HPTDC టూరిస్ట్ కాటేజస్

అశోక్ ట్రావెలర్స్ లాడ్జి (ఐ.టి.డి.సి) - ఫోను : 31

పికాడిలి, Dt. కులు - ఫోను : 113, 114

వుడ్‌లైన్స్ - ఫోను : 52

HPTDC యూత్ హాస్టలు

ఎమ్బాసిడర్ రిసార్ట్స్, చద్దైరి - ఫోను : 173

హైవే ఇన్, బస్టాండ్ ఎదురు, దిమాల్ - ఫోను : 220

HPTDC హమ్టా & బర్డ్స్ వ్యూహట్స్

రేణుక : HPTDC టూరిస్ట్ బంగ్లా & టూరిస్ట్ ఇన్, ఫోను - 41.

సిమ్లా : ఏషియా ది డాన్ - ఫోను : 6464, 5858

HPTDC గోల్ఫ్ క్లబ్

HPTDC హాలిడే హోమ్ (గెస్ట్ హౌస్ వింగ్)

ఒబరాయ్ క్లర్క్స్, ది మాల్, ఫోను : 6091-5

HPTDC వైల్డ్ ఫ్లోరు హాల్ ఛారబ్రా

వుడ్ విల్లి ప్యాలెస్, హిమాచల్ భవన్ రోడ్డు, ఫోను - 2722, 6473

ప్రివ్యూ, మైధి ఎస్టేట్ ఫోను - 77045

చప్పలె, లాక్కర్ బజారు ఫోను - ఫోను : 3242

HPTDC హాలిడే హోమ్, సర్క్యులరు రోడ్డు, హైకోర్టు దగ్గర - ఫోను : 6031

అక్‌లాండ్, లక్కర్ బజారు - ఫోను : 6315

# జమ్ము - కాశ్మీర్

ప్రధాన నగరాలు, పట్టణాలు : అనంతనాగ్, ఉదయపూరు, శ్రీనగరు, రియసి, రాజౌరి, పూంచ్ ముజాఫర్‌బాద్, బరాముల్లా, మీర్పుర్, చిలాస్, గిల్గిత్, లెహ్, కతువా, జమ్ము, కార్గిల్, పజారత్ మొదలగునవి.

**యాత్రా పర్యాటక స్థలాలు :** ఈ భూతల స్వర్గంలో సోనామార్గ్, గుల్మార్గ్, శ్రీనగరు, పహల్గాం మొదలగునవి పర్యాటకులను విశేషంగా ఆకర్షిస్తాయి.

**సరిహద్దులు :** ఉత్తరాన చైనా, తూర్పున టిబెట్, పశ్చిమాన పాకిస్తాన్, దక్షిణాన హిమాచల్ ప్రదేశ్, పంజాబ్ వున్నాయి.

**విశ్వవిద్యాలయాలు :** జమ్ములో ఆ పేరుతో విశ్వవిద్యాలయం, కాశ్మీరు విశ్వవిద్యాలయం శ్రీనగరులోనూ వున్నాయి.

**బెస్ట్ సీజను :** ఏప్రియల్ నుంచి అక్టోబర్‌లోపు.

**[illegible]**2,22,236 చ.కి.మీ. ఇందు జనాభా 77, 18, 700.

జమ్మూ : వేసవికాలం - సగటున 35°C చలికాలం సగటున 20°C

శ్రీనగరు : వేసవికాలం సగటున 30°C చలికాలం సగటున తక్కువలో 0°C

**ప్రధాన భాషలు :** ఉర్దూ, కాశ్మీరు, డోంగ్రి, లడఖి.

**ఎయిర్‌పోర్టు :** శ్రీనగరు, జమ్ము, లెహ్.

### టూరిజం ఇన్‌ఫర్‌మేషన్ కేంద్రాలు

డైరెక్టర్ ఆఫ్ టూరిజం, గవర్నమెంట్ ఆఫ్ జమ్ము అండ్ కాశ్మీరు, శ్రీనగరు - ఫోను : 2449

జమ్ము అండ్ కాశ్మీరు డెవలప్‌మెంట్ కార్పొరేషన్, షేర్వాణి రోడ్, శ్రీనగర్ - ఫోను : 2644 (మే నుంచి అక్టోబరు); 47756 (నవంబరు నుంచి ఏప్రియల్)

టూరిజం రిసెప్షన్ సెంటర్ జమ్ము - ఫోను : 48172

## శ్రీనగర్

2,260 సంవత్సరాల క్రితం అశోకచక్రవర్తి ఈ పట్టణ వ్యవస్థాపకులు. స్వచ్ఛమైన లిరంగులో వుంటుంది నీరు. నీటిమీద తేలియాడే నగరం అనచ్చు కూడా, పడవల్లలో ృహానావలు వుంటాయి. అందులో సర్వసౌకర్యాలు వుంటాయి. శీతాకాలం విపరీతమైన

గడ్డ కట్టించే చలి. ఇక్కడ తప్పనిసరిగా ఉలెన్ కోట్లు వాడాలి. ఈ శ్రీనగరు చూడాలంటే నాలుగు రోజులు పడుతుంది. నావల్లో వసతి తాహతునిబట్టి దొరుకుతాయి. శ్రీనగరు సరస్సులో నౌకావిహారం ఒక మధురమైన మధురాతి మధురమయిన అనుభూతి జీలం నదీతీరం నాగిన్ సరోవరం ఆకర్షణీయమయినవి.

**నిషాద్‌బాగ్ :** చక్కటి పచ్చిక బయళ్ళతో అత్యంత సుందరంగా వుంటుంది. పై నుంచి చూస్తే బావుంటుంది. డాల్‌సరోవర తీరానికి 11 కి.మీ. దూరంలో వుంది ఈ నిషాద్‌బాగ్.

**ఉద్యానవనాలు :** చక్కటి కుటీరాలుగల ఈ వనాల్ని జహంగీరు చక్రవర్తి అభివృద్ధి చేశాడు. 9 కి.మీ. దూరంలో వుంది.

**నసీమ్‌బాగ్ :** అక్బర్ నిర్మించిన ప్రదేశంలో చీనార్ వృక్షచ్ఛాయలు అధికంగా కనిపిస్తాయి.

**షాలిమార్ బాగ్ :** అందాల చలువరాతి మంటపం వుంది. ఈ మంటపంలో వున్న ఫౌంటెన్‌లు బావుంటాయి. 150 ఫౌంటెన్‌లు వున్న షాలిమార్‌బాగ్ నగరానికి 13 కి.మీ. దూరంలో వుంది.

**హార్వన్ :** ప్రసిద్ధి చెందిన బౌద్ధవిహారం. చక్కని చేపల పెంపకం కూడా. శంకరాచార్యుల ఆలయం వేయి అడుగుల దిబ్బమీద నిర్మించబడినది. ఇక్కడినుంచి పంజాబ్ పర్వతాలను చూడొచ్చు. ఇదో పురాతన కట్టడం.

**హరిపర్వతం :** దీన్ని చూడటానికి అనుమతి కావాలి. పార్వతీదేవి విసిరిన రాయి ఈ పర్వతంగా మారింది అని పురాణ కథ.

**అనంతనాగ్ :** శ్రీ మహావిష్ణువు శయనాగారం. నీటి వూటలు అనేకం వున్న ఈ అనంతనాగ్ శ్రీనగరు నుండి 55 కి.మీ.

**అవంతిపూర్:** పాండవులు నిర్మించిన ఈ పట్టణం కాశ్మీరులోనే అతిపురాతనమైనది.

**అచ్ఛాబార్ :** శ్రీనగరుకి ఆరు కి.మీ. దూరంలో వుంది. నీటి ఊటలు వున్నాయి. ఒకప్పుడు ఇది నూర్జహాన్ విశ్రాంతి ప్రదేశం.

**వన్యమృగ సంరక్షణ కేంద్రం :** కాశ్మీరు దుప్పి, గోధుమవన్నె ఎలుగుగల ఈ కేంద్రాన్ని చూడాలంటే అనుమతి వుండాలి.

**కోకర్‌నాగ్ :** పర్వతాల నుంచి వచ్చే నీరు పిల్లకాలువలుగా మారుతుంది. ఈ నీరు త్రాగితే మంచిది. ఇక్కడ గులాబితోట కూడా వుంది.

**జీలంనది జన్మస్థల్ :** కేవలం 3 కి.మీ. దూరంలో వుంది.

**గుల్మార్గ** : సముద్రమట్టానిక 2,730 మీటర్ల ఎత్తులో వున్న ఆరోగ్యకేంద్రం. దీని గురించి ప్రత్యేకంగా చెప్పక్కర్లేదు. రోడ్ల మీద మంచు కుప్పలు కుప్పలుగా వుంటుంది.

**ఆల్ పథేర్** : ఆఫర్వత్ పర్వతాల పద్దనున్న ఈ సరస్సు గుల్మార్గు నుంచి 13 కి.మీ. దూరం.

**ఖిలాన్ మార్గ** : వృక్షజాతి అధ్యాపకులకు కావలసినంత మెటర్, చక్కటి పుష్పాలు, పర్వత శిఖరాలుగల సుందర ప్రదేశం.

**తోసా మైదానం** : ఫిరోజ్‌పూర్ నల్లా నుండి 50 కి.మీ. దూరం. కాశ్మీరు లోయలన్నింటిలోనూ బహు సుందరమయిన ప్రదేశం. సమస్తం మరిచి ఈ ప్రకృతి అందాలలో లీనమయిపోతాం.

# అమర్‌నాథ్

పార్వతీదేవి భైరవమూర్తులు హిమరూపంలో వుంటారు. స్వామి వివేకానంద దర్శించిన పవిత్ర ప్రదేశం. సూర్యకిరణాలు సోకే వీలు లేకపోవటం వల్ల వేసవిలో కూడా ఇక్కడి లింగము కరగదు. శ్రీనగర్ నుండి 141 కి.మీ. దూరం, పహల్గాం నుండి 46 కి.మీ. దూరం. ఆగష్టు నెలలో యాత్ర చేయండి. ఈ అమర్‌నాథ్ యాత్ర శ్రమతో కూడినది అయినా ఆ బడలికను మహోన్నతమయిన సుందర దృశ్యాలు పోగొడతాయి. శ్రీనగర్ నుంచి అమర్‌నాథ్‌యాత్ర మార్గం, శ్రీనగర్, పహల్గాం, చందన్‌వారి, శేషనాగ్, పంచతరణి, అమర్‌నాథ్..... అమర్‌నాథ్‌కి 19 కి.మీ. దూరంలో శేషనాగ్ సరస్సు వుంది. ఆదిశేషు పడగను పోలిన ఈ సరస్సును దాటితే వర్జన్ లోయలు వస్తాయి. మంచుతో కప్పబడిన శిఖరాలు, సూర్యకాంతి పడి వింతసోయగాలను చూపుతుంది.

పార్వతీ పరమేశ్వరులు హిమపర్వత ప్రదేశంలో విహారం చేస్తున్నప్పుడు పార్వతీదేవి తన భర్తయగు అర్ధనారీశ్వరుడని, జీవుల జనన మరణ రహస్యమేమిటని అడిగింది.

అంత శివుడు ఆ రహస్యములు ఎవరూ వినకూడదని, ఒకవేళ విన్నట్లయితే వారికి జనన మరణాలుండవని చెప్పి, పార్వతికి ఆ రహస్యాలు చెప్పటానికి అనువైన ప్రదేశం వెదికాడు.

చివరకు ఇప్పుడు మానవులమైన మనం దర్శించుకుంటున్న అమర్‌నాథ్ అమరలింగం వున్న గుహ కనిపించింది. అక్కడ శివుడు తన డమరకంతో పెద్ద పెద్ద భయంకరనాదాలు చేశాడు. ఆ గుహలో వున్న పావురాళ్ళు ఆ శబ్దాలకి భయపడి దూరంగా పారిపోయాయి.

ఆ తర్వాత శివుడు జనన మరణ రహస్యాలను పార్వతిదేవికి చెప్పాడు. కాని, అదే గుహలో పావురాళ్ళు పెట్టిన రెండు గ్రుడ్లు వున్నాయి. విషయం తెలుసుకున్న శివుడు ఆ గుడ్లు నుంచి జన్మించిన పావురాళ్ళకి జనన మరణాలుండవని చెప్పాడు.

ఆ పావురాళ్ళే నాటికీ అమర్‌నాథ్ గుహలో మనకి కనిపిస్తాయి.

భక్తుల చుట్టూ తిరిగి మళ్ళీ యథాస్థానానికి వెళతాయి.

శివలింగము. పార్వతి. గణపతి, భైరవమూర్తులు, అమావాస్య నుంచి పౌర్ణమి వరకూ పెరుగుతూ వచ్చి పౌర్ణమినాడు పూర్ణమూర్తులై వుంటారు. పౌర్ణమి నుంచి క్రమంగా తగ్గుతూ, అమావాస్య నాటికి ఏమిలేకుండా కరగిపోతారు.

జీవన్మరణ రహస్యములను పార్వతిదేవికి చెప్పటానికి గుహను ఎంచుకొనక ముందు, ఆ ప్రదేశాన్ని వెతుకుతూ వెళ్ళారు. అలా వారు వెళ్ళిన ప్రదేశంలో ఒక్కోచోట ఒక్కొక్కరిని వదలిపెట్టారు. ఆఖరికి తన మెడలోని నాగుని, నందిని, శిరస్సునున్న చందమామతోపాటు తన మరో భార్యని గంగని కూడా.

ఆ ప్రదేశాలన్ని దాటుకుంటూ వెళ్ళే మనం అమర్‌నాథ్‌ని దర్శించుకుంటాం.

1) ఆ ప్రదేశాలు వరుసగా...... బల్గదామ అదే నేటి పహల్‌గాం ఇక్కడ నందిని వదిలారు.

2) చందమామ.... అదే చంద్రనాడి అని పిలుస్తారు.

**శేషనాగ్ :** ఇక్కడే గరళకంఠుడు తన మెడలోని పాముని వదిలింది.

**పంచతరిణి :** పంచముఖ గంగను విడిచిన ప్రదేశం. ఆ తర్వాత వచ్చేది అమర్‌నాథ్ గుహ....... ఈ అమరలింగేశ్వరుడని హిమలింగమని పిలుచుకుంటారు.

ఎన్నో జన్మల పుణ్యఫలంతోపాటు ఆ స్వామిని చూసే అదృష్టం ఈ కళ్ళకి వుండాలేగాని అంతకుమించిన అదృష్టం ఇంకేముంటుంది. ఈ హిమలింగాన్ని మొదట చూసింది ఓ గొర్రెలకాపరి. లెక్కకు మించిన వేల సంవత్సరాల క్రితం ఓ గొఱ్ఱెల కాపరికి ఓ సాధువు బొగ్గులబస్తా యిచ్చి వాడుకోమంటాడు. ఆ కాపరి ఇంటికెళ్ళి చూసేసరికి ఆ బస్తా బంగారంతో నిండి వుంటుంది. ఇంత ధనమిచ్చిన ఆ స్వామిని వెదుకుతూ ఆ కాపరి వెళతాడు. ఆ సాధువు కనపడడుగాని హిమలింగం కనపడుతుంది. అదే మనం చూసే ఐస్‌లింగం. అమర్‌నాథ్ లింగం. ఈ గుహ పాషాణ నిర్మితం. ఆ రాతిపొడినే విభూదిగా భక్తులు ధరిస్తారు. అమర్‌నాథ్ పార్వతిదేవిల మధ్య నుంచి ద్రవించే జలే 'అమర్ జల్' దాన్ని తీర్థంగా తీసుకుంటారు భక్తులు.

అమర్‌నాథ్ యాత్ర చెయ్యడానికి భారతదేశం నుంచి శ్రీనగర్ నుంచి వెళతారు. శ్రీనగర్ నుంచి అమర్‌నాథ్ చేరటానికి మధ్యలో వచ్చే యాత్రా ప్రదేశాలు.

## శ్రీనగర్

ఈ శ్రీనగర్ నుంచి అతి దగ్గరలో కుంకుమపువ్వు పొలాలున్నాయి. దగ్గరిలో అద్భుత రాజసౌధాలు కలిగిన ప్రదేశం వుంది. అవంతీపూర్, ఇదే వేల సంవత్సరాలనాడు కాశ్మీరుకు రాజధాని.

ఆ తర్వాత వచ్చేది మొదటిగా పహల్‌గాం : దగ్గరిలో శేషధార నది వుంది. ఈ శేషధార నదిలో లిద్దర్ నది కలుస్తుంది. సంగమస్థానం ఈ పహల్‌గాంలో డచ్చిమైదాన్. తుకారియా అనే ప్రదేశాలకి వెళితే అద్భుత హిమసౌందర్యం మీ కనుల స్వంతమవుతుంది. శివుడు నందిని వదిలింది ఇక్కడే.

**పహల్‌గాం తర్వాత శేషధార** : నదితీర ప్రాంతం పీల్చేగాలి తేలికవుతుంది. కారణం 9500 అడుగుల ఎత్తులో వుంటాం. చిన్న చిన్న శారీరక ఇబ్బందులు కలగచ్చు. తలనొప్పిలాంటివి. ఈ యాత్రలో ముందే కొంత ఎక్సర్‌సైజులు చేసుకొనివుంటే ఇబ్బంది వుండదు. అయినా కొంతసేపటికి అలవాటు అవుతుంది. ఆ తర్వాత ........

**చందన్‌వారి** : ఇక్కడికి దగ్గరలో ఓ ఘాట్ వుంది. ఇక్కడ ఎక్కువగా జారుడు వుంటుంది. రెండు వేల అడుగులు పైన ఎక్కాలి. తిరుపతి కొండ ఎక్కేటప్పుడు వచ్చే మోకాళ్ళ పర్వతంలా కొద్దిగా శ్రమ. ఈ యాత్రలో కఠినమైనది ఇది దాటిన తర్వాత కొద్దిగా సుడిగాలి వీస్తుంది. ఈ చందన్‌వారి దగ్గరినే శివుడు తన శిరస్సు భాగమయిన చంద్రుడిని వదిలింది. ఆ చల్లని చంద్రుడు హిమపర్వతాలలో కలసి మరింత చలిని పుట్టిస్తాడు. ఆ తర్వాత ........

**శేష్‌నాగ్ సరస్సు** : సాక్షాత్తు ఆదిశేషుని నివాసమయిన పాతాళములో లోతు వుంటుందనడంలో సందేహం లేదు. సముద్ర మట్టానికి 11,720 అడుగుల ఎత్తులో వుంటుంది. ఆ తర్వాత అసలు శేష్‌నాగ్.

**ఈ శేష్‌నాగ్ వద్ద శివుడు తన కంఠంలోని పాముని వదిలింది** : సముద్రమట్టానికి 12 వేల ఇరవై అడుగుల ఎత్తులో వుంది. మేఘాలు మనల్ని తాకుతూ మనకి స్వాగతం చెబుతున్నాయా అనిపిస్తుంది. శరీరం పులకరిస్తుంది. ఈ మానవజన్మ ఎత్తినందుకు ఆ కైలాసనాథునికి జై జైలు చెప్పుకుంటూ శివనామస్మరణ చేసుకుంటూ భక్తజన సందోహం రెట్టించిన ఉత్సాహంతో ముందుకు సాగుతుంది.

**చివర మజిలి పంచతరణి** : సముద్రమట్టానికి 14 వేల అడుగుల ఎత్తు. ఇక్కడే గంగను వదిలింది........ ఆ తర్వాత అమర్‌నాథ్ గుహ..... అమర్‌నాథ్ గుహ వున్న ప్రదేశం 15 వేల అడుగల ఎత్తు....... అంటే 3,888 మీటర్ల ఎత్తు. ఆ కైలాసవాసుడి దర్శనభాగ్యంలో జన్మ చరితార్థమవుతుంది. సర్వపాపాల పరిహారంతో జన్మ పావనమవుతుంది.

**శ్రీనగర్ నుంచి యాత్రకు బయలుదేరినవారు ఖచ్చితంగా వెంట వుంచుకోవల్సిన వస్తువులు.**

గొడుగు, రెయిన్ కోటు. చేతులకి గ్లోవుస్. టార్చి. అక్కడి పవిత్ర జలం ఇంటికి తెచ్చుకునేందుకు సీసాలు మూత వున్నవి. ఇంకా చలికి తట్టుకునే మందులతోపాటు తలనొప్పికి, వికారం లాంటివాటికి టాబ్లెట్స్.

అమర్‌నాథ్ యాత్ర చెయ్యాలనుకునేవారికి ఓ చక్కటి సలహా. ఢిల్లీలోని సదరన్ ట్రావెల్స్‌వారు ఈ యాత్ర నిర్వహిస్తారు. అమర్‌నాథ్‌తో పాటు జమ్ము, అమృతసర్, శ్రీనగర్, వైష్ణవీదేవి, కురుక్షేత్ర యాత్రలు కూడా చేయవచ్చు.

అమర్‌నాథ్ యాత్ర ఢిల్లీలోని వారి హోటల్ నుంచి ముందుగా జమ్ము చేరతారు. అక్కడ స్నానం, టిఫిన్ కార్యక్రమాల తర్వాత రఘునాధాలయం చూపిస్తారు. అక్కడనుంచి పహల్‌గాం అక్కడ హాల్ట్, పహల్‌గాం నుంచి చందన్‌వారికి జీప్‌లో వెళ్ళి చందన్‌వారి శేష్‌నాగ్ (నడక లేదా ఫోని) మీదుగా పంచతరణి, అమర్‌నాథ్ చూసి తిరిగి పంచతరణి, శేషనాగ్‌ల మీదుగా పహల్‌గాం, శ్రీనగర్, కాట్రా, వైష్ణవీదేవి, కాట్రా, అమృతసర్, కురుక్షేత్రం, ఢిల్లీతో పూర్తవుతుంది యాత్ర.

ఫోనికి వైష్ణవీదేవి ఆలయానికి రాను-పోనూ చందన్‌వారి నుంచి అమర్‌నాథ్‌కు వెళ్ళి చందన్‌వారికి రు. 2000/- వరకూ వైష్ణవీదేవి దర్శనం కోసం ఫోనికి రూ. 500 వరకూ వుంటుంది, నడుస్తే సమస్యలేదు.

ఒక ప్రాంతానికి మరో ప్రాంతానికి మధ్యదూరం కి.మీ.

1) ఢిల్లీ నుంచి జమ్ముకు 583 కి.మీ.

2) కురుక్షేత్రం నుంచి ఢిల్లీకి 165 కి.మీ.

3) చందన్‌వారి నుంచి శేషనాగ్‌కు 14 కి.మీ.

4) శేషనాగ్ నుంచి పంచతరణికి 12 కి.మీ.

5) జమ్ము నుంచి పహల్‌గాంకు 290 కి.మీ.

6) కాట్రా నుంచి అమృతసర్‌కు 280 కి.మీ.

7) పహల్‌గాం నుంచి శ్రీనగర్‌కు 96 కి.మీ.

8) శ్రీనగరు నుంచి కాట్రాకు 263 కి.మీ.

9) కాట్రా నుంచి వైష్ణవీదేవి ఆలయానికి 14 కి.మీ.

10) పంచతరణి నుంచి అమర్‌నాథ్‌కు 6 కి.మీ.

11) పంచతరణి నుంచి చందన్‌వారికి 13 కి.మీ.

12) అమృతసర్ నుంచి కురుక్షేత్రంకు 300 కి.మీ.

ఈ యాత్ర చేసేవాళ్ళు కాన్వాష్ షూస్, వులెన్ క్లాత్, టార్చిలైట్, రెయిన్‌కోట్,వాటర్ బాటిల్స్‌తోపాటు తింటానికి యిష్టాన్నిబట్టి దగ్గరుంచుకోవాలి. బి.పి. షుగరు వున్నవాళ్ళు జాగ్రత్త చాలా అవసరం. మెడికల్ సౌకర్యాలు గవర్నమెంట్ చూసినా మన జాగ్రత్త

అవసరం. పర్సనల్‌గా మీ ఆరోగ్యం ప్రకారం మెడికల్ కిట్ దగ్గరుంచుకోండి. ఈ యాత్రకి గవర్నమెంటు ఉదంపూర్ నుంచి సెక్యూరిటీ పంపిస్తుంది. ఒక్కటే గుర్తుంచుకోండి ఈ యాత్ర చేసి అమర్‌నాధ్‌ని దర్శిస్తే సాక్షాత్తు స్వామిని చూసినట్టే. దానికి కావలసింది నమ్మకం. ధైర్యం. స్వామి మీద అపారమైన భక్తి. ఆ భోళాశంకరుడు మనల్ని సర్వవేళలా కాపాడుతాడనే అపార విశ్వాసం. ఈ యాత్ర చేసినవారి కాళ్ళకి దండం పెట్టి ఆశీర్వాదం తీసుకుంటే అక్కడికి వెళ్ళిన పుణ్యఫలం మనకి కలుగుతుంది.

హిమాలయ యాత్రలు చేయాలంటే ముందుగా ఢిల్లీ వెళ్ళి అక్కడ్నించి ట్రావెల్ వారితో వెళితే తొందరగా అన్ని కవర్ అవుతాయి.

హోటల్ సదరన్, ఆర్యసమాజ్ రోడ్, కరోల్‌బాగ్, న్యూఢిల్లీ వారు నిర్వహించే టూర్స్, ముందుగా ఫోన్ నంబర్స్ : 5726724, 5739508.

**శ్రీ బదరీనాథ్ - కేదారనాథ్** : మే నుంచి అక్టోబర్ వరకూ మాత్రమే ఈ టూర్స్ నిర్వహిస్తారు. ఈ టూర్ ఆయా నెలల్లో ప్రతి సోమవారం, శుక్రవారం వుంటుంది. మొత్తం టూర్ ప్రోగ్రాం 7 రోజులు. ఈ ట్రిప్‌లో హరిద్వార్, ఋషికేష్, లక్ష్మణఝూలా, దేవప్రయాగ, శ్రీనగర్, గౌరీకుండం, రుద్రప్రయాగ, కేదార్‌నాథ్, కర్ణప్రయాగ, నందప్రయాగ, జోషిమఠ్, బదరీనాథ్, బ్రహ్మకపాలం చూపిస్తారు. వెజిటబుల్ ఫుడ్ వసతితో కలిపి ఈ టూర్‌కి రూ. 2700/- A.C. రూ. 3200/-.

**యమునోత్రి-గంగోత్రి-కేదార్‌నాథ్-బదరీనాథ్** : పదకొండు రోజుల ప్రోగ్రాం. ఈ టూర్ జూలై నుంచి అక్టోబర్ వరకు మాత్రమే. ఆయా నెల్లల్లో ప్రతి మొదటి, మూడవ శుక్రవారం బైలుదేరుతుంది బస్సు. అలాగే మే, జూన్‌లలో ప్రతి శుక్రవారం ఈ టూర్‌ని నిర్వహిస్తారు. ఈ ట్రిప్‌లో హరిద్వార్, ఋషికేష్, లక్ష్మణ్ ఝూలా, దేవప్రయాగ, రుద్రప్రయాగ, గౌరీకుండం, కేదార్‌నాథ్, బదరీనాథ్, కర్ణప్రయాగ, నంద ప్రయాగ, యమునోత్రి, గంగోత్రి, బ్రహ్మకపాలం, జోషిమఠ్ లాంటివి చూడచ్చు. ఈ టూర్ 4,500/- భోజనం వసతితో కలిపి.

**సిమ్లా-చండీఘర్-కుఫ్రీ-కురుక్షేత్ర** : మూడు రోజుల ట్రిప్, ప్రతి గురువారం 9 గంటలకు బయలుదేరి తిరిగి ఆదివారం ఉదయానికి చేరుకుంటారు. ఈ టూర్ 1000/- ఎ.సి. అయితే 1500/-.

**అలహాబాద్-వారణాసి-పారనాథ్-బుద్ధగయ-లక్నో-అయోధ్య-నైమిశారణ్యం-మధుర-ఆగ్రా** : ఈ టూర్ ఏప్రియల్, మే, జూన్, సెప్టెంబర్, అక్టోబర్ మరియు నవంబర్‌లలో మాత్రమే. ప్రతి మొదటి శుక్రవారం మూడవ శుక్రవారం నిర్వహిస్తారు. వసతి, భోజన సదుపాయాలతో 3200/- ఎ.సి.తో అయితే 4,700/-.

సిమ్లా-కులుమనాలి-రోహిటంగ్ పాస్-మణికర్ణిక-కుఫ్రీ-చండీఘర్-పింజోరి గార్డెన్స్-కురుక్షేత్ర : ఈ ట్రిప్ 7 రోజులు. ప్రతి శుక్రవారం బయలుదేరుతుంది బస్సు. ఎ.సి. అయితే 3,400/- నాన్ ఎ.సి. అయితే 2,200/-.

కాశ్మీర్-గుల్‌మార్గ్-సోనామార్గ్-జమ్ము-వైష్ణవీదేవి-అమృతసర్, కురుక్షేత్ర : ఈ ట్రిప్ 9 రోజులు. ప్రతి సోమవారం 5 గంటలకు బయలుదేరుతుంది. ఎ.సి. అయితే 3000/-, నాన్ ఎ.సి. అయితే 2,400/-.

**ఖాట్మండ్ ప్యాకేజ్ టూర్** : నాలుగురోజుల ప్రోగ్రాం. ఢిల్లీ ఫ్లయిట్స్ చార్జీలు 5,225/- మనవే. ఈ టూర్‌కి నాలుగు రోజులకి వసతితో కలిపి 2,555/-.

ఇంకా వీరివే బెంగుళూరులో అనేక టూర్స్- తిరుపతి, మైసూర్ లాంటివి బెంగుళూరు నుంచి నిర్వహిస్తారు. ఆ ప్రాంతం వారు కూడా అక్కడ్నించే ఢిల్లీ టూర్ గురించి వాకబు చేసి బుక్ చేసుకోవచ్చు.

వీరి బ్రాంచిలు హైదరాబాద్, విశాఖపట్టణం, ముంబాయి, చెన్నైలో కూడా వున్నాయి. అక్కడ్నించి టికెట్స్ బుక్ చేసుకొని ప్రశాంతంగా పై హిమాలయ యాత్రలు చెయ్యచ్చు.

ఢిల్లీ-2258686, ముంబాయి-4326895, 4326688, బెంగుళూర్ - 2262633, 2267040, చెన్నై-585253, 564864, హైదరాబాద్-223658, 227233, విజయవాడ-576624, 572227, వైజాగ్-545565, 541099.

వీరిదే హోటల్ మయూర్ విహార్ వుంది. టికెట్స్ (టూర్స్‌కి) బుక్ చేసుకొన్నాక ఒకరోజు ముందే ఢిల్లీలో వుండండి. వీరి హోటల్‌లో రూమ్ ఆర్డనరీ 350 సింగిల్, డబల్ అయితే 490/-లో దొరుకుతుంది. సౌత్ ఇండియన్ మీల్స్ ఈ హోటల్ రెస్టారెంట్స్‌లో దొరుకుతుంది. డబ్బు పెట్టగలిగితే ఈ హోటల్లో ఎ.సి డీలక్స్ రూమ్స్ కూడా దొరుకుతాయి.

**పై టూర్స్, విహారయాత్రా ప్రదేశాలు చదువుతుంటే ఎప్పుడూ అక్కడే వుండిపోవాలని వుందికదూ! ఆ అద్భుత ప్రదేశాలను, కొత్త కొత్త యాత్రికులని, ఆధ్యాత్మిక , భక్తి ప్రపత్తులతో నిత్యం ఎదురయ్యే వారిని చూస్తూ జీవితం గడిపేయాలనిపిస్తుంది కదూ. అలాంటి వారికోసం టూరిజం కోర్స్‌లున్నాయి. ఆ కోర్సులు చేస్తే మీ భక్తి, ముక్తి, రక్తి, భుక్తి అన్ని నిండుతాయి.**

**అద్భుతమైన కట్టడాలు, ఎగిరే జలపాతాలు, కొత్త ఆచారాలు. ప్రకృతి రమణీయతకు దర్పణం పట్టిన అద్భుత ప్రదేశాలు, పరవశింప చేసే తీరాలు, ఇవన్నీ అద్వితీయ అనుభూతులు. ఈ అనుభూతుల పర్వంలో నిరంతరం ఉండిపోవాలనిపిస్తుంది.**

కుంకుమపూవు క్షేత్రాలు : శ్రీనగరుకు 15 కి.మీ. దూరంలో వున్నాయి.

**మార్తాండ ఆలయం :** ఈ సూర్యుని ఆలయం అనంతనాగ్ నుండి 3 కి.మీ. దూరం. ఇక్కడ శ్రాద్ధవిధులు నిర్వర్తించి పితృదేవతలను సంతృప్తి చేయవచ్చు.

# జమ్ము

**రఘునాథ దేవాలయం :** చక్కటి పవిత్ర శిలలు వున్నాయి. ఈ ఆలయం నగరం మధ్యలో వుంది. రామాయణగాథకు చెందిన అనేక మందిరాలు వున్నాయి.

**రణబీరేశ్వరాలయం :** కొన్నివేల స్ఫటిక లింగాలుగల ఈ ఆలయం కట్టి వందసంవత్సరాలపైనే అయింది.

**రఘునాథ్ ఆలయం :** ఇక్కడ పురాణగాథలకు సంబంధించిన అనేక పెయింటింగ్సు వున్నాయి.

**కాళికాలయం :** కాళీనది ఎడమవైపు కొండ దగ్గరుంది బహుఫోర్టు బహులోచనుడు అంకురార్పణ చేసిన ఈ కోటలో వున్న ఆలయం తప్పక చూడదగ్గది.

**అఖ్‌నూర్ :** జమ్ము నుంచి కేవలం 32 కి.మీ. దూరం. చక్కటి పిక్నిక్ స్పాట్ అయిన ఈ ప్రదేశంలో పురాతనమైన కోట వుంది.

**వైష్ణవీదేవి ఆలయం :** మోకాళ్ళ మీద వెళ్ళాలి. గుహాలయంలో సరస్వతి, వైష్ణవీ విగ్రహాలున్నాయి. కొండగుహల్లో వున్న ఈ ఆలయం జమ్ము నుంచి 52 కి.మీ. కొన్ని లక్షలమంది భక్తులు ఇక్కడికి వచ్చి దేవతామూర్తులను దర్శించుకుంటారు.

# మానస సరోవరముల యాత్ర

బ్రహ్మదేవుడి మనోసంకల్పంతో ఏర్పడడంవల్ల దీనికా పేరు వచ్చింది. సముద్ర మట్టానికి 16 వేల నాలుగు వందల అడుగుల ఎత్తున 150 మైళ్ళ వైశాల్యంతో ఈ దివ్య సరస్సు అవతరించి వుంటుంది. దీని నుండి పుట్టినదే సరయూ నది. సరస్సులోంచి వచ్చింది కనుక సరయూ నది అని పేరు వచ్చింది. ఈ నది అయోధ్య నగరాన్ని ప్రధానంగా చుట్టివుంది.

ఈ మానస సరోవరానికి దగ్గరలోనే రాక్షస్థల్ సరస్సు వుంది.

ఈ కైలాస మానస సరోవరానికి ఎనిమిది మార్గాలు కలవు. అన్నింటికన్నా తేలికయినది ఆల్మోరా నుంచే.... కఠినమైనది జోషి మఠము నుండి ప్రయాణించుట. కాని, ఎక్కువమంది మానస సరోవరాన్ని భారతదేశం వైపు నుంచి కాక నేపాల్ నుంచి వెళ్ళటానికి ఇష్టపడతారు. భారతదేశం వైపు నుంచి ప్రయాణిస్తే మానససరోవరం దక్షిణ

ముఖం దర్శనమిస్తుంది. అదే నేపాల్ నుంచయితే తూర్పుముఖం కనబడుతుంది. అందుకే నేపాల్ నుంచి పూర్వ ముఖం చూడడానికి ఎక్కువమంది ఇష్టపడతారు. ముందుగా పశుపతి నాథాలయాన్ని దర్శించుకొని భక్తాపూర్ చేరతారు. ఆ దారిలో వెళ్ళాక చైనా సరిహద్దు కేంద్రం తాల్‌పానీ వస్తుంది. ఆ తర్వాత చైనా భూభాగంలో తగిలేది ఫ్రెండ్‌షిప్ బ్రిడ్జ్. ఆ పై వచ్చేది జాంగ్మూ. ఈ జాంగ్మూ సముద్రమట్టానికి 11 వేల అడుగుల ఎత్తు వుంటుంది. ఆ తర్వాత పై కోత్స సరోవరం వస్తుంది. దాన్నే చిన్న మానస సరోవరం అంటారు. ఈ సరోవరాన్ని ఆనుకునే చిన్న కైలాస శిఖరం వుంటుంది. పై కోత్స సరస్సు చేరుకునేసరికి శరీరంలో మార్పులు వస్తాయి. వికారం, ఆకలి లేకపోవటం లాంటివి. కారణం సముద్ర మట్టం నుంచి భూభాగమట్టం పెరుగుతున్న కొద్దీ వాతావరణంలో మార్పు వస్తుంది. వాతావరణ మార్పులు భయంకరంగా వుంటాయి.

అలాగే యింకోమార్గం కాశ్మీర్ వైపునుంచి. ఇక్కడ్నించి దూరం. అన్నింటికన్నా ఉత్తమమైనది. ఆల్మోరా వైపునుంచే. ఈ ఆల్మోరా నుంచి 230 కి.మీ. మానస సరోవరం. మానస సరోవరం నుంచి కైలాసగిరి 55 కి.మీ.

**ఆల్మోరా నుంచి కైలాస మానస సరోవరమునకు 380 కి.మీ.**

| | |
|---|---|
| ఆల్మోరా నుంచి బడేఛినా | 14 కి.మీ. |
| ధేల్‌భినా | 7.2 కి.మీ. |
| బూస్‌గా | 4.8 కి.మీ. |
| కానరిఖినా | 5.2 కి.మీ. |
| శేర్‌ఘాట్ | 7.6 కి.మీ. |
| గానాయ్ | 9.6 కి.మీ. |
| జసెస్ పాటన్ | 9.6 కి.మీ. |

నుకుల్ యాడీ, బేరినాగ్, గార్‌టిర్, థాల్ శాన్‌దేవ్, దీదీహాట్, ఆస్‌కోట, జోల్‌జిబీ, బిల్వాకోట్, ధర్ చూలా, సిర్కా, జిప్తి, నిజంగ్ జలపాతం, ఉదీ, గర్‌బ్యాంగ్, కాలాపానీ, నర్విదాంగ్, పాలా తక్లా కోట్, టోమో, రింగ్‌గూస్‌గ్, బర్‌దాక్, గుర్లాలా, మానస సరోవరం, గుస్సుల్ గుంపా, గంగాచ్చూ, పర్‌ఖా, దార్‌చన్. మొత్తం 380 కి.మీ. దూరం.

ఈ కైలాస పర్వతము సముద్ర మట్టానికి (దార్‌చన్ నుండి) 22,028 అడుగుల ఎత్తు.

భారత చైనాల యుద్ధము తర్వాత కొంతకాలం ఈ యాత్ర నిషిద్ధము. తర్వాత అనుమతి లభించినది. ఈ యాత్రకు పాస్‌పోర్టు, వీసా లాంటివి కావాలి. ముందుగా దరఖాస్తు పెట్టుకోవాలి.

ట్యోమావాంగ్ అని టిబెట్టులు పిలిచే ఈ మానస సరోవరం చూచుటకు రెండు కనులు చాలవు. ఈ జన్మలోనే లక్షల రెట్లు ఫలం సంపాదించుకున్న వారు మాత్రమే దీన్ని దర్శించగలరు. దీన్ని వర్ణించటం అసాధ్యం. చూడవల్సిందే, తరించి దర్శించవల్సిందే. 14,900 ఎత్తు, లోతు 300 అడుగులు, చుట్టుకొలత 97 కి.మీ. మొత్తం ప్రపంచంలోనే సుందరమైన సరస్సు. దగ్గరలోనే బౌద్ధాశ్రమాలు వుంటాయి. గంగాతీరమున మరణమెంత పుణ్యమో అంతకు మించిన పుణ్యప్రదమైనది ఈ సరస్సు చెంత నిర్యాణం. ఈ మానస సరోవరం శక్తి పీఠము కూడా. ఇచ్చట సతి యొక్క కుడిపాదము పడినది.

**రాక్షస్థల్ సరస్సు** : "లక్షాతు" అనగా హంసల ద్వీపమని పేరు. శీతాకాలంలో సరస్సులో నీరు చలికి గడ్డకట్టిపోతుంది. హంసలు, ఇతర పక్షులు ఈ ద్వీపమునకు వచ్చి సంతాన అభివృద్ధి చేసుకుంటాయి. ఈ సరస్సు మానస సరోవరానికి 7 కి.మీ. దూరంలో వుంది. ఇక్కడే రావణబ్రహ్మ తపస్సు చేసింది. సముద్రమట్టానికి 15 వేల అడుగుల ఎత్తు వుంటుంది ఈ ప్రదేశం.

**తీర్థపురి** : ఈ తీర్థక్షేత్రం జ్యోషిమఠం మీదుగా కైలాస పర్వతమునకు వచ్చేదారిలో వుంటుంది. సట్లేజ్ నదీ తీరమునున్న యీ తీర్థపురిలో వేడినీటి ధారలున్నాయి. భస్మాసురుడు వరం పొందినది ఇక్కడే.

**గౌరికుండు** : వేసవిలో కూడా మంచు గడ్డ కట్టి వుంటుంది. మంచును చిదిమి స్నానం చేస్తారు యాత్రికులు. 18,399 అడుగుల ఎత్తులో వుంది. కైలాస పర్వతానికి దగ్గరి గౌరికుండు. దేవతలు కూడా స్నానమొనర్చే, యీ హిమపర్వతాల నుంచి, తిరిగి ఆల్మోరా వస్తే -

**భాగేశ్వరి** : ఆల్మోరా నుండి 40 కి.మీ. దూరం. భద్రకాళి ఆలయం కొండపై కలదు. ఇచ్చట నది గుహ ద్వారము గుండా ప్రవహిస్తుంది. 16 కి.మీ. దూరంలో భాగేశ్వరీ సరయూగోమతీ సంగమము కలదు. మార్కండేయులు తపస్సు చేసిన ప్రదేశం. యీ భాగేశ్వరానికి 21 కి.మీ. దూరంలో గొప్ప శివక్షేత్రము వైద్యనాథ్ కలదు. ఆల్మోరా నుంచి కాఠ్‌గోదాము చేరి అచ్చట నుంచి నేపాల్ వెళ్ళవచ్చు.

**బటోడి** : జమ్ము హిల్ స్టేషన్ శ్రీనగరు నుండి 138 కి.మీ. దూరం.

**రామ్‌నగర్** : జమ్ము నుండి 102 కి.మీ. దూరంలో వుంది ఈ ప్యాలెస్. చక్కటి చిత్రాలు ఎన్నో వున్నాయి.

**శివఖోరి** : పురాతనమైన శివాలయం. జమ్ము నుంచి 88 కి.మీ. దూరం శుద్ధ మహాదేవ్, వేసవి విశ్రాంతి ప్రదేశం.

**ఈ పరిసరాల్లో చాలా విశ్రాంతి ప్రదేశాలున్నాయి వాటిలో ముఖ్యమైనవి.**

మన్సార్ సరోవరం : జమ్ముకి 40 కి.మీ. దూరంలో వున్న ఈ సరస్సులో బోటింగు చేయవచ్చు.

సన్‌సార్ : 2079 మీ. ఎత్తులో వుంది ఈ విశ్రాంతి కేంద్రం.

**పూర్‌మండల్** : హిందువులు తప్పనిసరిగా దర్శించాల్సిన యాత్రా ప్రదేశం. జమ్ముకి 39 కి.మీ. దూరంలో వుంది.

**లూయమారు** : ప్రాచీనకాలపు సన్యాసుల మఠాలువున్న ఈ ప్రాంతం కర్గిల్‌కి 80 కి.మీ. దూరంలో వుంది.

## లే (LEH)

**ఈ లే పరిసరాల్లో :**

**అల్చిగొంప** : 'లే'కి 72 కి.మీ. దూరంలోవున్న ఇక్కడ అనేక చిత్రలేఖనాలు చూడచ్చు.

**హమిస్‌గోంపా** : 50 కి.మీ. దూరంలో (లే కి) వున్న ఇక్కడ అతి ఖరీదయిన విశాలమైన బౌద్ధ సన్యాసుల మఠము వుంది.

**ఇక "లే"** : కాశ్మీరు నుంచి 434 కి.మీ. దూరం. ఈ ప్రాంతానికి వెళ్ళే యాత్రికులు తప్పనిసరిగా రగ్గులు వెంట వుంచుకోండి. వాతావరణం చూసి ఎందుకులే అనుకోవద్దు. క్షణాల్లో విపరీతమైన చలి వచ్చేయవచ్చు మరుక్షణంలోనే వేడి వచ్చెయ్యచ్చు కూడా.....

## జమ్ము కాశ్మీర్ లోని యాత్రా ప్రదేశాలలో వసతి

**శ్రీనగరు :**

బ్రాడ్‌వే, మౌలానా అజాద్ రోడ్. ఫోను : 71211

దారు-ఏస్-సాలమ్, నాగీన్‌లేక్. ఫోను : 77307

ఇంటర్నేషనల్, సన్వరు బాఘ్. ఫోను : 78604

J & KTDC లల్లారుక్. లాల్‌చౌక్, ఫోను : 723778

న్యూషాలిమార్, దాల్ లేక్. ఫోను : 74427, 73339

ఏరిమహల్, దాల్‌లేక్, బేల్‌వార్డు. ఫోను : 78885, 71235

షహన్సా బేల్‌వార్డు. ఫోను : 75856, 75670, 75679

వెల్కమ్ గ్రూప్ గూర్ఖా హౌస్ బోట్స్, P.O. బాక్సు నెం. 57. ఫోను : 75229

ఘుబర్వాన్, బేల్వార్డు. ఫోను : 71441

బ్రౌన్ ప్యాలెస్, బేల్వార్డు. ఫోను : 73856

ఆసియా బ్రౌను ప్యాలెస్, బేల్వార్డు. ఫోను : 73903

J&KTDC చష్మషాహి హట్స్. ఫోను : 7238
కిబిల్, నెహ్రూ పార్కు. ఫోన్ : 78429
సబీనా, రెసిడెన్సీ రోడ్. ఫోన్ : 78046
సూర్యా సామిల్ మార్కెట్, శర్వాణి రోడ్. ఫోన్ : 78778
యూత్ హాస్టల్, హజారి భాగ్
హౌస్‌బోట్స్, P.O. బాక్స్ నెం. 76, ఫోన్ : 74044, 76244
గుల్‌మార్గ్, బేల్వార్డు, ఫోన్ : 71331

## గుల్మార్గ్ :

హిల్‌టాప్, ఫోన్ : 277

J&KTDC టూరిస్టు హట్స్,

బర్నాట్ వుడ్‌లాండ్స్. ఫోన్ : 68

పైన్ ప్యాలెస్, ఫోన్ : 266

జోహల్, ఫోన్ : 28

గోల్ఫ్ వ్యూ, ఫోన్ : 41

నెడోస్, ఫోన్ : 28

## కోకర్‌నాగ్ :

గవర్నమెంటు టూరిస్ట్ హట్స్
గవర్నమెంటు టూరిస్ట్ బంగ్లా

## జమ్ము :

జమ్ము అశోక్ (ITDC) పి.బి. నెం. 60, అమర్ మహల్ ఎదురు, రామ్‌నగర్, ఫోన్ : 49430

సర్క్యూట్ హౌస్
ప్రీమియర్, విల్ మార్గు, ఫోన్ : 43436, 43234
కాస్మోపాలిటన్, విల్‌మార్గు, ఫోన్ : 47561, 47743
J&KTDC టూరిస్టు రిసెప్షన్ సెంటరు
ఆసియా జమ్ముటావి, నెహ్రూ మార్కెట్. ఫోన్ : 49430

## అచ్చాబాల్ :

గవర్నమెంట్ టూరిస్టు బంగ్లా

## పహల్గాం :

గవర్నమెంట్ రెస్టుహౌస్, గవర్నమెంట్ టూరిస్ట్ హట్స్

## లే :

K-సార్, ఫోన్ : 148
లింగ్సే-జంగ్, ఫోన్ : 20
కంగ్లా-ఛ్చన్, ఫోన్ : 144
అమ్బాసిడర్
ఒబరాయ్-షమ్బాల, ఫోన్ : 67, 131
లడక్ సరాయ్, ఫోన్ : 18
కన్గ్రీ, ఫోన్ . 51

## పహల్గాం :

హీవన్, హిల్ వ్యూ, ఫోన్ : 17
మౌంట్ వ్యూ, ఫోన్ : 21
పహల్గాం, ఫోన్ : 26, 52, 78
రాజ్ప్యాలెస్, ఫోన్ : 38
వుడ్స్టాక్, ఫోన్ : 27
న్యూపైన్ వ్యూ, బస్టాండ్ దగ్గర, ఫోన్ : 42
పైన్-ఎన్-పీక్
హిల్పార్క్, ఫోన్ : 79
నటరాజ్, ఫోన్ : 25
గవర్నమెంట్ టూరిస్టు హట్స్

## మన్సర్ సరోవరం :

డాక్ బంగ్లా. శ్రీనగర్ నుండి మిగతా యాత్రా ప్రదేశాలకి దూరం కి.మీ.లలో
పహల్గాం, అనంతనాగ్, మీదుగా 98 కి.మీ.
"లేహ్" డ్రాస్, కార్గిల్ సోన్మార్గ్ మీదుగా 435 కి.మీ.
అమృతసర్, అనంతనాగ్ బనీహాల్, గురుదాస్ బటాలా మీదుగా 548 కి.మీ.
ఢిల్లీ, చండీఘర్ మీదుగా 891 కి.మీ.
గుల్మర్గ : కేవలం 38 కి.మీ. దూరంలో
మణాలి : జోగింధర్ నగర్ నుండి కులూ మీదుగా 733 కి.మీ.

ఆగ్రా 1091 కి.మీ., అహ్మదాబాద్ 1777 కి.మీ., బెంగుళూరు 2910 కి.మీ., భోపాల్ 1632 కి.మీ., ముంబాయి 2299 కి.మీ., కలకత్తా 2133 కి.మీ., గౌహతి 2925 కి.మీ., గ్వాలియర్ 1210 కి.మీ., హైదరాబాద్ 2344 కి.మీ., మైసూర్ 3045 కి.మీ., చెన్నై 3048 కి.మీ., లక్నో 1390 కి.మీ.

**విపరీతమైన చలికి, మంచు శిఖరాలకు నిలయమైన ఈ జమ్ము కాశ్మీర్ నుంచి రాజపుత్రుల స్థానమైన రాజస్థాన్కి వెళదామా?**

# రాజస్థాన్

రాజస్థాన్ (ఉత్తరభారత్) విస్తీర్ణం 3.42,239 చ.కి.మీ. ఇందు జనాభా 4.18.80.645. రాజధాని జైపూర్.

**సరిహద్దులు :** ఉత్తరాన పంజాబు, ఈశాన్యాన హర్యానా, ఉత్తరప్రదేశ్‌లు, దక్షిణాన గుజరాత్, పశ్చిమాన పాకిస్థాన్, తూర్పున మధ్యప్రదేశ్ లున్నాయి.

**విశ్వవిద్యాలయాలు :** ఉదయపూరులో రాజస్థాన్ విద్యాపీఠ్, బిర్లా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ అండ్ సైన్స్ పిలానిలోనూ, బికనీర్‌లోనూ, కోటా సార్వత్రిక విశ్వవిద్యాలయాలు ఉన్నాయి.

**ప్రధాన నగరాలు, పట్టణాలు :** ఉదయపూరు, మధ్‌పూర్, మౌంట్ అబు, కోట, జోధ్‌పూర్, జున్‌జోను, భరత్‌పూర్, భిల్వారా, బికనీర్, చుంది, అజ్మీర్, అల్వార్, బన్‌సవారా, బార్మర్, జైపూర్, గంగానగరు, చిత్తోరు ఘడ్, జైసల్మేరు మొదలగునవి.

**యాత్రా పర్యాటక ప్రదేశాలు :** భరత్‌పూర్, బికనీర్, జైపూరు, జోధ్‌పూర్, చిత్తోర్‌ఘడ్, జైసల్మేరు, పాలి, ఉదయపూరు, మౌంట్ అబు, అజ్మీర్, అల్వారు మొదలగునవి.

**వాతావరణం :** వేసవికాలం 45°C నుంచి 17°C చలికాలం 32°C నుంచి 7°C వరకు.

**బెస్ట్‌సీజన్ :** అక్టోబరు నుంచి మార్చి వరకూ......

**ఎయిర్‌పోర్టు :** జైపూరు, జోధ్‌పూర్, ఉదయపూరు, బికనీరు, జైసల్మేర్, కోటా.....

**ప్రధాన భాషలు :** హిందీ, రాజస్థానీ.

## టూరిజం ఇన్‌ఫర్మేషన్ కేంద్రాలు

రాజస్థాన్ టూరిజం ఇన్ఫర్మేషన్ సెంటర్, బస్టాండ్ ఎదురు మౌంట్‌అబు.

డిపార్ట్‌మెంట్ ఆఫ్ టూరిజం. గవర్నమెంట్ ఆఫ్ రాజస్థాన్, 100, జవహర్‌లాల్ నెహ్రూ రోడ్, జైపూర్.

రాజస్థాన్ టూరిజం డెవలప్‌మెంట్ కార్పొరేషన్. రైల్వేస్టేషన్ వద్ద, జైపూర్.

ఫోన్ : 65848

**జైపూర్ :** రాజస్థాన్ ముఖ్యపట్టణం. 16-17 శతాబ్దంలో నిర్మించబడిన ఈ నగరంలో వీధులు విశాలంగా ఉంటాయి. అనేక రకాలైన ఆభరణాలకు కొలువయిన ఈ రాజపుత్రుల నగరానికి ఢిల్లీ 308 కి.మీ. దూరం.

సవాయి జైసింగ్‌చే నిర్మించబడిన ఈ నగరంలో యాత్రా పర్యటక ప్రదేశాలు :

**ముబారక్ మహల్** : పర్షియన్ సంస్కృత భాషల్లోని అనేక వ్రాతప్రతులు ఇక్కడ వున్నాయి. పాలరాతితో నిర్మించబడిన గడియార స్థంభం, మహారాజు వాడిన నీటి పాత్ర మొదలైనవి వున్నాయి.

**చంద్రమహల్** : ఏడంతస్థుల మహల్. దీనిపై నుంచి సుందరమయిన పింక్ సిటి జైపూర్‌ని చూడవచ్చు. దగ్గరలోవున్న అమిర్ కూడా కనిపిస్తుంది. చంద్రమహల్‌కి ఉత్తరంగా కృష్ణాలయం వుంది. ఈ భవన సముదాయంలో అప్పటి రాజపుత్రులు వాడిన ఆయుధాలు వున్నాయి.

**రామ్‌నివాస్ గార్డెన్** : అనేక రకాల జంతువులతో 70 ఎకరాల్లో వున్న గార్డెన్.

**జంతరు మంతరు** : నక్షత్ర గణితశాల. ప్రిన్స్ ఆఫ్ డయిల్స్‌గా పేర్కొన్న ఇక్కడ చూడాలన్న ఉత్సాహం ఉండాలేగాని సమయం తెలీదు.

**హవామహల్** : సవాయి ప్రతాప్‌సింగ్‌చే నిర్మించబడిన రాజభవనం.

**సెంట్రల్ మ్యూజియం** : వంద సంవత్సరాల క్రితం వాడిన పాత్రలు, అప్పటి రాజపుత్రులు వాడిన ఆయుధాలు, దుస్తులు, అనేక కళాఖండాలు, దంతంతో చేసిన నగిషీలుతోపాటు అనేక విశేషాలు గల మ్యూజియం.

**అమిరు** : చక్కటి చూడాల్సిన కోట ఉంది. దక్షిణంగా ఉన్న జయగర్, మరోవైపు ఉన్న కుంతలఘర్. ఈ రెండు వేయి సంవత్సరాల క్రితంవి. భవనానికి ఉన్న ద్వారాలు మూడు. మెట్లమీదుగా వెళితే చక్కటి మండపం వస్తుంది. మూడో ద్వారం అతి పెద్దది, ప్రసిద్ధమైనది. ఈ అమిర్ జైపూర్ నుంచి 11 కి.మీ. దూరంలో వుంది.

**జయ మందిరం** : పాలరాతితో నిర్మించిన మందిరం. చుట్టుప్రక్కల అనేక శిల్పాలు వున్నాయి. రాజపుత్రుల సాహసాన్ని కళ్ళకు కట్టినట్టు చూపించే ఈ శిల్ప సంపదని తప్పనిసరిగా చూడాలి.

## జైపూరు దగ్గరలో వున్న పర్యాటక ప్రదేశాలు

**గాల్టా** : చక్కటి పిక్నిక్ స్పాట్. కొండమీద సూర్య దేవాలయం ఉంది. జైపూర్‌కి 10 కి.మీ. దూరంలో ఉందీ పర్వత ప్రాంతం.

**సంగనేరు** : జైపూర్‌కి 16 కి.మీ. దూరములో ప్రసిద్ధమైన జైన దేవాలయం ఉంది. రకరకాల వస్త్రాలకు రంగులు అద్దటంలో ప్రసిద్ధి సంగనేర్ కళంకారి పరిశ్రమ.

**నహరగల్ కోట** : ఇక్కడికి దగ్గరలో గణేశ్ ఆలయం వుంది. 6 కి.మీ. దూరంలో వున్న ఈ కోట రెండు అంతస్తులుగా కట్టబడింది. ఇందులో చక్కటి చిత్రాలు వున్నాయి.

ఉద్యానవనం : ఆగ్రా రోడ్‌కి 10 కి.మీ. దూరంలో వుంది. ఇక్కడ శ్రీమహావిష్ణువు, ఆంజనేయుడు, శివుడి దేవాలయాలున్నాయి. అతి వేడుకలో వున్న జలాల ఊటలో స్నానం చేయండి.

జమ్వారామ్ ఘరు : 30 కి.మీ. దూరంలో వున్న ఇది లేక్‌సైడ్ పిక్నిక్ స్పాట్. అనేక రకాలయిన పక్షులను ఇక్కడ చూడవచ్చు.

**జైపూరులో వసతి :**

ది రామ్ బాఘ్ ప్యాలెస్, భవానిసింగ్ రోడ్, జైపూరు, ఫోన్ : 381041, రూ. 2,600/- నుంచి 10,000/-ల వరకు.

హోటల్ జై మహల్ ప్యాలెస్, జాకోబ్ రోడ్, సివిల్ లైన్సు, జైపూరు, ఫోన్ : 370616, 382334, రూ. 1650/-నుంచి 7000/- వరకు.

హోటల్ రాజ్‌మహల్ ప్యాలెస్, సర్దార్ పటేల్ మార్గ్, జైపూరు - 302006, ఫోను : 380757, 381625 రూ. 1100/- నుంచి 3,180/- వరకు.

రాజపుటానా ప్యాలెస్ షెరటాన్ వెల్కమ్ గ్రూప్, ప్యాలెస్ రోడ్, జైపూరు - రూ. 2,100/- నుంచి 10,000 వరకు.

హోటలు జైపూరు అశోక్, జైసింగ్ సర్కిల్, బానిపార్కు, జైపూరు - 302006, ఫోను : 75171, 75421, రూ. 1195/- నుంచి 1800 వరకు.

మేరు ప్యాలెస్, రామ్‌సింగ్ రోడ్డు, జైపూరు, ఫోను - 361212 రూ. 399/- నుంచి 795/- వరకు.

క్లార్క్స్ అమిల్, జవహర్లాల్ నెహ్రూ మార్గ్, జైపూరు, ఫోన్ : 550616

హోటల్ మన్‌సింగ్ ప్యాలెస్, సన్సారు చంద్రరోడ్డు, జైపూరు - 302001. ఫోన్ : 78771, రూ. 1190/- నుంచి 2200/-.

హోటల్ నమోద్ హవేలి, గంగపోల్, జైపూరు - 302002 ఫోన్ : 42407, 540370 రూ. 1150/- నుంచి 1800/- వరకు

హోటల్ జైపూరు ప్యాలెస్, టాంక్‌రోడ్డు, జైపూరు - 302015.

ఫోను : 0141-512961, రూ. 1175/- నుంచి 2,350/- వరకు.

హోటలు సజ్జన్ ప్యాలెస్, 13 కాంతినగర్, పోలివిక్టరి, జైపూరు.

ఫోను : 368858 రూ. 150/- నుంచి రూ. 400/- వరకు.

**జై పూరు నుంచి ప్రయాణ సాధనాలు:**

బస్ : జైపూరు సిటీకి బస్ సౌకర్యం బాగా ఉంది. ఢిల్లీ నుంచి డీలక్స్ మరియు ఆర్డినరి బస్సులు ప్రతి అరగంటకి బయలుదేరి ఆరు గంటలలోపే జైపూరు చేరుకుంటాయి. రాజస్థాన్ రోడ్‌వేస్‌వారి డీలక్స్ బస్ సర్వీస్‌లలో ముఖ్యమైన టూరిస్టు సెంటర్సు కోట, అజ్మీరు, బికనీరు, జోధ్‌పూరు, ఉదయపూరు, జై సల్మేరుకు వెళ్ళే సౌకర్యం వుంది.

సింధిక్యాంప్ దగ్గరున్న సెంట్రల్ బస్టాండు రైల్వేస్టేషన్‌కి అతి దగ్గరగా వుంది. జైపూరు నుంచి ఢిల్లీకి రానూపోనూ బస్‌లు నారాయణ్ సింగ్ సర్కిల్ దగ్గర ఆగుతాయి. రాజస్థాన్ రోడ్‌వేస్ ఎంక్వయిరీకి ఫోను-75834 (డీలక్స్ సర్వీసెస్) ఫోను-75834 (సింధి క్యాంప్‌కోచ్‌కి మరియు) ఫోను-665791 (ఎక్స్‌ప్రెస్ మరియు లోకల్ సర్వీసులకి) రిజర్వేషన్ 24 గంటలు వుంటుంది.

రైలు: దేశం నలుమూలల నుంచి జైపూరుకి రైల్వే సౌకర్యం వుంది. ఇది వెస్టర్న్ రైల్వేస్ మీటరు గేజ్ నెట్‌వర్క్. మరియు ఇది రాజస్థాన్‌లో ముఖ్యమయిన టూరిస్టు ప్రదేశాలకి వెళ్ళటానికి సౌకర్యం కలిగిన ముఖ్యమయిన రైల్వే జంక్షన్. పింక్‌సిటీ ఎక్స్‌ప్రెస్ ఓల్డ్ ఢిల్లీ స్టేషను నుంచి 5.55 A.M కి జైపూరు వెళ్ళుటకు బయలుదేరి, జైపూర్లో మళ్ళీ 5 P.M కి తిరిగి ఢిల్లీకి బయలుదేరుతుంది. అదేరోజు జైపూరు నుంచి రెండు ఓవర్‌నైట్ ట్రైన్సు ఢిల్లీకి వున్నాయి.

**రైల్వే రిజర్వేషన్స్:** 72122, 70707, 68372

**ఎంక్వయిరి:** 131, 133.

**ఎయిర్‌లైన్స్:** సిటీ నుండి జైపూరు ఎయిర్‌పోర్ట్ 13 కి.మీ. దూరములో వుంది. చిన్న ఎయిర్‌పోర్ట్ అయినా వివిధ సౌకర్యాలు కలిగిన చిన్నభవనం. బయట సిటీకి టాక్సీలు దొరుకుతాయి.

**ఎయిర్ లైన్ రిజర్వేషన్:**

ఇండియన్ ఎయిర్‌లైన్స్, ముద్రభవన్, MI రోడ్డు

ఫోను - 74500, 70624, 10.00-17.00 hrs

ఎయిర్ పోర్టు, ఫోను 822222, 822519, 822718

వాయుదూత్: హాండ్లింగ్ మరియు బుకింగ్ ఏజెంట్స్

మయూర్ ట్రావెల్, 10 పార్క్ స్ట్రీట్, ఆఫ్ MI రోడ్డు

ఫోను: 61260, 62728, 64058, 09.30-17.30 hrs.

ఎయిర్ పోర్ట్ ఫోన్ - 822603.

ఎంక్వయిరీస్: ఇండియన్ ఎయిర్‌లైన్స్: ఫోను - 511758, 511782.

**జైపూరు నుంచి వివిధ ప్రాంతాలకి దూరం కిలోమీటర్లలో:**

జైపూర్ నుంచి నేషనల్ హైవే నెం.8 ద్వారా దేశం నలుమూలలకి వెళ్ళుటకు మంచి రోడ్డు వుంది. టూరిస్టుల ఇంటరెస్ట్ మేరకు కొన్ని ముఖ్యమయిన ప్రదేశాలకి దూరం: **ఆగ్రా 231 కి.మీ. అజ్మీర్ 130 కి.మీ. ఆల్వార్ 143.2 కి.మీ. భరత్‌పూరు 176కి.మీ., బికనీర్ 327 కి.మీ., జైసల్మేర్, 655 కి.మీ.జుంజను 182 కి.మీ., జోధపూర్ 335.6 కి.మీ.,**

మాంతప 190 కి మీ. సఫ్ ద్వారా 356.8 కి.మీ.. సరిస్కా 115 కి.మీ . ఉదయపూర్ 374 కి.మీ. మరియు ఢిల్లీ 261 కి.మీ.

**రాజస్థాన్ టూరిజం వారు సిటి సైట్ సీయింగ్ ట్రిప్పు నిర్వహిస్తారు.**

టూరిస్టు ఆఫీస్, జైపూరు రైల్వేస్టేషన్ ఫోను - 69714.

**సిటీ సైట్ సీయింగ్ ప్రాంతాలు:** సెంట్రల్ మ్యూజియం, సిటిప్యాలెస్, అంబర్ పోర్ట్ మరియు ప్యాలెస్. గాయిటోర్, నవాబ్-కి-హవేలి, జంతర్ మంతర్. డల్ మహల్, హవామహల్, నహర్ ఘర్‌పోర్ట్, ఇండోలజి మ్యూజియం, డాల్స్ మ్యూజియం, గల్టా, సిసోడియా రాణి గార్డెన్.

ఇండియా టూరిజం డెవలప్‌మెంట్ కార్పోరేషన్.

ఖావకోటి హోటల్ ఫోను-368461 వారు నిర్వహించే సైట్ సీయింగ్‌టూర్సు సిటీ సైట్ సీయింగ్, నవాబ్-కి-హవేలి, అంబరు పోర్టు & ప్యాలెస్, హవామహల్, సిటిపాలెస్, జంతర్‌మంతర్, జై మహల్, గాయిటోరు, సెంట్రల్ మ్యూజియం.

**ఇంటర్నేషనల్ ఎయిరులైన్సు రిప్రజెంటేషన్:**

ఎయిర్ ఇండియా, జనతా ట్రావెల్స్-M.I. రోడ్డు, ఫోను - 65589.

బ్రిటిష్ ఎయిర్ వేస్, నిఘాహన్ ట్రావెల్ సర్వీస్, పార్కు స్ట్రీట్.

అలితలియా, బమిని మార్గు ట్రావెల్స్ M.I రోడ్.

కాథేపసిఫిక్, ఒయానా ట్రావెల్స్, మోతీలాల్ అతల్ మార్గు ఫోను-75625.

గల్ఫ్ ఎయిర్, సింగపూర్ ఎయిర్‌లైన్, TWA, సుభాష్ మార్గు ఫోను-77202.

పాకిస్తాన్ ఇంటర్నేషనల్ ఎయిర్‌లైన్సు, రాజన్స్ ట్రావెల్స్ కార్పోరేషన్, సంజయ్ మార్గు

పానమ్, అంబర్ టూర్ (P) లి. స్టేషన్ రోడ్.

**ట్రావెల్ ఏజెంట్స్:**

J.K. ట్రావెల్స్ పాల్గో విక్టరి సినిమా ఎదురుగ్గ, స్టేషన్ రోడ్, జైపూరు ఫోను-366108.

జెట్ ఎయిరు ట్రాన్స్‌పోర్టేషన్ ప్రై. లి. M.I రోడ్, జైపూరు, ఫోను-77202.

టూరిస్ట్ గైడ్ సర్వీస్, M.I.D. రోడ్, జైపూరు ఫోను-61269, 64058.

సిరియార్, హవా సరక్, జైపూరు.

రాజస్తాన్ ట్రావెల్స్, మోతీలాల్ ప్యాలెస్ హోటల్, జైపూరు. ఫోను-381041.

డయానా ట్రావెల్స్, మోతీలాల్ అతల్ రోడ్, జైపూరు, పోను-75625.

సీతా వరల్డ్ ట్రావెల్స్ (I) ప్రై.లి. D విల్లా స్టేషన్‌రోడ్, నియర్ పాలో విక్టరి, ఫోను-68886, 66809.

ట్రావెల్ హౌస్, వెల్కమ్ గ్రూప్. రాజ్‌పుతానా ప్యాలెస్ షెరటాన్: ఫోను-368431, 363211.

హాస్పిటల్స్ :

సోని హాస్పటల్, జవహర్‌లాల్ నెహ్రూమార్గ్, ఫోను - 562028.

S.M.S. హస్పిటల్, ఫోను-560291

ఎంక్వయిరి, ఫోను-564222, 560291.

అంబులెన్సు. ఫోను-102.

సన్‌తోకబడురలాబ్జి హాస్పటల్, ఫోను-567251.

**ఉదయపూర్:** మహారాజా ఉదయసింగ్‌చే నిర్మించబడిన ప్రదేశం, సుందరమైన పట్టణాలలో ఒకటి. ఢిల్లీ నుండి 786 కి.మీ దూరం 1500 అడుగుల పొడవు 800 అడుగుల వెడల్పుగల రాజభవనం ఉంది. ఉద్యానవనాలు, దేవాలయాలు, కోటలు అనేకం. చక్కటి ప్రశాంతత కలిగిన పిఛోలా సరస్సువుంది. చితోరుఘర్ 115 కి.మీ. దూరంలో ఉదయపూరులో లేక్ ప్యాలెస్ ప్రత్యేక ఆకర్షణ.

**బడేమహలు:** అనేక పురాతన వస్తువులున్నాయి. దీన్నే గార్డెన్ ప్యాలెస్ అనికూడా పిలుస్తారు.

**జగదీశ్ ఆలయం:** 32 మెట్లు ఎక్కితే నీలమేఘశ్యాముని చూడవచ్చు. ఇత్తడితో చేసిన గరుడ వాహనంకూడా వుంది. ఇక్కడ అనేక శిల్పాలు, చిత్రాలున్నాయి.

**రాణక్ పూర్:** ఉదయపూరునుంచి 98 కి.మీ. దూరంలోగల ఇక్కడ ఆదినాథ్ దేవాలయం వుంది. 1439లో నిర్మించిన ఈ ఆలయంలో తొమ్మిది వరండా లున్నాయి. ఇవన్నీ 1444 స్తంభాలపై ఆధారపడిఉండటం మాత్రమేకాదు విశేషం. ఏ రెండు స్తంభాలు ఒకేలా వుండకపోవటం విశేషం.

**ఫతేసాగరు సరోవరం:** సరస్సు మధ్య దీవిలో ఉంది చక్కటిపార్కు.

**రాణా ప్రతాప్ స్మారకం:** తూర్పుతీరంలో ఉన్న కన్యావనం చూడదగ్గవి. ఉదయపూర్ పరిసరాల్లో.

**అహర్:** ఉదయపూర్‌కి 3 కి.మీ. దూరంలోవున్న అహర్ వంశీయుల స్మారకాలున్న ప్రదేశం. ఇది అతిపురాతనమయిన నగరం.

**ఏక్ లింగ్‌జీ ఆలయం:** ఉదయపూర్‌నుంచి 22 కి.మీ. దూరంలో నాలుగు ముఖాలున్న శివుడిని చూడవచ్చు. నందీశ్వరుడి పరిసరాల్లో అనేక దేవతా విగ్రహాలున్నాయి.

**నాథ్ ద్వారా:** ఉదయపూరుకి 48 కి.మీ. దూరం. 600 సంవత్సరాల క్రితం నాటి శ్రీకృష్ణుని విగ్రహం ఉంది.

హల్దిఘటి : చరిత్ర ప్రాముఖ్యంగల ఇది నాథ్ ద్వారా నుండి 22 కి.మీ దూరం.

కుంభాలుగర్ : నీలకంఠ.కుంభస్వామి ఆలయాలున్నాయి. 1080మీ. ఎత్తున ఉన్న ఇక్కడ్నించి ఆరావళి పర్వత శ్రేణుల బారులు కనబడతాయి.

జయ సమండ్: అతి పెద్ద మంచినీటి సరస్సు.

జగత్ ఆలయం: వేయి సంవత్సరాలనాటి పార్వతీదేవి ఆలయం ఉంది.

**ఉదయపూర్‌లో వసతి:**

లక్ష్మీ విలాస్ ప్యాలెస్, (ITDC) ఫోను: 24411,

RTDC KAJRI టూరిస్ట్ బంగ్లా, శాస్త్రసర్కిల్, ఫోను:23509, 25122.

తాజ్‌లేక్ ప్యాలెస్, P.B. No : 5, పిచోలా లేక్ - ఫోను: 23241.

దామినీస్ OPP: టెలిగ్రాఫ్ ఆఫీసు, ఫోను: 25675.

చంద్రలోక్, 123, సహేలి మార్గు, ఫోను: 29011, 29012

హిల్‌టాప్.3, అమ్బవఘర్, ఫతేసాగర్, ఫోన్ : 28708

RTDC ఆనంద్ భవన్ సర్క్యూట్ హౌస్, ఫతేసాగర్ రోడ్, ఫోను: 23256.

శివనివాస్ ప్యాలెస్ ఫోను: 23239

ఫౌంటెన్2, కుంభమార్గ్, సుఖాడియా సర్కిల్, ఫోను:26646, సర్క్యూట్ హౌస్.

**చిత్తోర్‌ఘడ్** : ఉదయపూర్‌కి 112 కి.మీ. దూరంలోవున్న బ్రహ్మాండమైన కోట..... 700 ఎకరాల వైశాల్యం గల ఈ కోటను కుంతీ పుత్రుడు భీముడు ప్రారంభించారని అంటారు. ఈ కోటకి సప్తద్వారాలున్నాయి. సాత్‌బీస్ దవేరా, కుంభశ్యాముని ఆలయం, మీరాబాయి ఆలయం, జటశంకర దేవుని ఆలయం, విజయ స్తంభం కళామందిరం కీర్తిస్తంభం... మొదలగునవి దర్శనీయమైనవి. అతిలోక సుందరి చిత్తోర్ రాణీ పద్మిని నివసించిన అంతఃపుర భవనంతోపాటు సూర్యదేవాలయంగానూ తర్వాత కాళీమాత ఆలయంగానూ మార్చబడిన ఆలయాన్ని చూడండి.

**కాంక్రోలి** : శ్రీ మహావిష్ణువు అవతరానికి సంబంధించిన ఆలయం వుంది. ఉదయపూర్ నుండి 65 కి.మీ. దూరం.

**నగరి** : ప్రాచీన మౌర్య, గుప్త బౌద్ధకాలంనాటి అనేక శిధిలావశేషాలు త్రవ్వకాలలో బైటపడ్డాయి. ఈ నగరి చిత్తోర్‌ఘడ్‌కి 14 కి.మీ. దూరం.

**అబూపర్వతం** : జైనుల పవిత్ర తీర్థస్థలం. 13 కి.మీ. పొడవున్న సుందరమైన లోయ వుంది. 1000 సంవత్సరాల పూర్వచరిత్ర కలిగిన ఈ జైన ఆలయాల్లో [illegible] శిల్పాలు వున్నాయి.

**తేజ్‌పాల్ ఆలయం** : 23 జైన తీర్థంకరులకు అంకితం చేసిన ఈ ఆలయం డోము మధ్య భాగంలో స్ఫటిక సముచ్చయం వేలాడదీసినట్టు వుంటుంది.

**విమల్ వాసి** : 11 వలయాలతో జంతువుల బొమ్మలు ఏనుగుల ఊరేగింపు మొదలగు శిల్పాలతో కన్నుల పండుగగా వుంటుంది.

**దిల్వారా**: అబూ శిఖరం మీద వున్న దిల్వారా వద్ద 5 జైన ఆలయాలున్నాయి.

**అచలేశ్వరీ మహాదేవ్** : లోతు తెలియని బ్రహ్మకుండు వుంది. పార్వతి పరమేశ్వరుల విగ్రహాలు ఆలయం ముందే వుంటాయి.

**గోముఖం** : గోముఖం నుండి స్వచ్ఛమైన జలాలు కిందవున్న సరస్సులోకి వస్తాయి. ఇక్కడ వాల్మీకి ఆశ్రమం ఉంది.

**అచర్‌గర్** : 15వ శతాబ్దానికి చెందిన కోట. క్వింటాళ్ళు తూగే మిశ్రమలోహ విగ్రహాలున్నాయి.

**అంబికాజీ** : అబూ నుంచి 20 కి.మీ. దూరం. గుజరాతీయుల ఆరాధ్యదేవత అంబికాజీ ఆలయం ఉంది. ఈ ప్రాంతంలోనే సరస్వతీనది జన్మస్థలం.

**ఆల్వార్** : జైపూర్ నుండి 143 కి.మీ. దూరం. ఇక్కడ మ్యూజియంలో అక్బర్, జహంగీర్, ఔరంగజేబు మొదలగువారు ఉపయోగించిన వస్తువులున్నాయి.

**సిలిరేష్**: ఈ పిక్నిక్ స్పాట్ ఆల్వారుకు 13 కి.మీ. దూరంలో వుంది.

**సరిస్కా**: వన్య మృగ సంరక్షణ కేంద్రం. అనేక క్రూర జంతువులను చూడవచ్చు. ఆల్వార్‌కు 37 కి.మీ. దూరంలో వుంది.

**పాండుపోల్** : భీముడు తనగదతో మోదిన ప్రదేశం వుంది. పాండుపోల్ సరిస్కా నుండి 30 కి.మీ. దూరం. ఈ పాండుపోల్ సరిస్కా నేషనల్ పార్కు పరిధిలో వుంది. ఇక్కడున్న జలపాతాలు చూడాలంటే వింటర్‌లో వెళ్ళొద్దు............

**ట్రావెల్ ఇన్‌ఫర్మేషన్**: ఢిల్లీనుంచి 170 కి.మీ., 143 కి.మీ. జైపూరు నుంచి గల ఈ ఆల్వార్ నుంచి పింక్ సిటి ఎక్స్‌ప్రెస్ వుంది. ప్రధాన పట్టణాలకి ఇక్కడ్నించి బస్సు సౌకర్యం వుంది.

**వసతికి**: 21222, 21223.

టూరిస్ట్ హోటల్ ఫోన్: 22727 / 22052

హోటలు అరవవేలి ఫోన్ : 70316 / 70011 వున్నాయి

300 రూపాయలతో వసతి పై వాటిల్లో దొరుకుతుంది. టూరిస్ట్ బంగ్లా సరిస్కాలో వుంది.

## భరత్‌పూర్

డీగ్ : భరత్‌పూర్ నుండి 35 కి.మీ. దూరంలో వుంది. అందాల సరస్సులు, 18వ శతాబ్దంలో నిర్మించిన అందాల భవనాలు, మనోహరమైన ప్రకృతి మధ్య విలసిల్లాడుతుంటాయి. ఇక్కడ మణిమాణిక్యాలు తాపడం చేసిన సూరజ్ భవన్ కోట వుంది. వసతికి డీగ్ డాక్ బంగ్లా వుంది. ఫోను: 18.

**భరత్‌పూర్ కోట:** అతి అరుదైన వజ్రాలు గల ఈ కోటలో మ్యూజియం వుంది.

**కియోలాడియో బర్డు శాంక్చువరీ :** 31 కి.మీ. వైశాల్యంతో అమరిన పక్షుల సంరక్షణ కేంద్రం. అనేక దేశాల నుంచి వచ్చి ఇక్కడ విడిది చేసి పోతుంటాయి రంగు రంగుల పక్షులు. ఇండియాలో అతిపెద్దదైన బర్డ్ శాంక్చువరీ భరత్‌పూర్ నుంచి 5 కి.మీ. దూరం,ఈ శాంక్చువరీని అక్టోబరు నుండి ఫిబ్రవరిలోపు చూడండి. ఇక్కడికి సైబీరియా, చైనాల నుండి పక్షులు వస్తాయి.

**భరత్‌పూర్‌లో వసతికి :** హోటలు ప్యారడైజ్, హోటలు ఈగిల్ నెస్ట్, హోటలు గోలా ప్యాలెస్ వున్నాయి.

భరత్‌పూర్ నుంచి ఆగ్రా, జైపూరు, ఢిల్లీ, గ్వాలియర్‌లకి బస్సులున్నాయి డైరక్టుగా.

భరత్‌పూరు నుంచి ఆగ్రా 54 కి.మీ, జైపూరు 174 కి.మీ, 182 కి.మీ, ఢిల్లీ, మధుర 36 కి.మీ., ఇక్కడికి దగ్గరలో వున్న ఎయిర్‌పోర్టు ఆగ్రాన్...

## అజ్మీర్

**పుష్కర్ :** అజ్మీర్‌కి 11 కి.మీ దూరంలో వున్న లోయ. పుణ్యజలాశయం కూడా. బ్రహ్మదేవునికి, గాయత్రి అమ్మవారికి ఆలయాలున్నాయి. పుష్కర్ చుట్టూ అనేక స్నాన ఘట్టాలున్నాయి. బద్రీనాథ్, పూరీ, రామేశ్వరం, ద్వారక యాత్రలు చేసే వాళ్ళు ఇక్కడ స్నానం చేసి పునీతులయితేనే ఆ యాత్రలకు సాఫల్యం లభిస్తుందని కొంతమంది నమ్మకం.

**ఫోయ్ సాగర్:** సైడ్ పిక్నిక్ స్పాట్ అజ్మీర్ కి 8 కి.మీ దూరంలో వున్న ఇక్కడ చేపలు పట్టచ్చు సరదాగా........

**అజ్మీర్‌లో వసతి:**

సర్క్యూట్ హౌస్, ఫోను: 20795

కింగ్ ఎడ్వర్డ్ మెమోరియల్ రెస్టుహౌస్

రైల్వే రిటైరింగ్ రూములు

RTDC ఖాడిమ్ టూరిస్టుబంగ్లా. సావిత్రి గర్ల్స్ కాలేజి రోడ్. ఫోయ్ సాగర్. ఫోన్: 20490.

అజయమేరు-అన్నాసాగర్ సర్క్యులర్ రోడ్, ఫోను: 20080.

రాజు, ప్రీతి విరాజ్ మార్గ్, ఫోను: 23646.

వెల్కమ్ గ్రూప్ మాన్‌సింగ్ ప్యాలెస్, వైశాలి నగర్. ఫోను: 24702.

**అజ్మీర్‌నుంచి యాత్రా కేంద్రాలకు దూరం కి.మీ.లలో**

ఆగ్రా 370 కి.మీ., ఢిల్లీ 444 కి.మీ., జైపూర్ 138 కి.మీ., అబూ 371 కి.మీ., ఉదయపూరు 269 కి.మీ., భరత్‌పూర్ 312 కి.మీ.

## జోథ్‌పూర్

**ఉమ్మయిధ్ భవనం** : 1948 లో ప్రారంభించబడిన ఈ భవనంలో జోధ్‌పూరుకు చెందిన రాజ వంశీయుల చిత్రాలున్నాయి. రోజాల తోట కూడా వుంది.

**మందోర్‌వనం** : జోధ్‌పూర్‌కు 8 కి.మీ దూరం. 4వ శతాబ్దానికి చెందిన అవశేషాలు వున్నాయి. ఇక్కడున్న ఉద్యానవనంలో రాజ వంశీకుల స్మారకములున్నాయి. చక్కటి ఆహ్లాద వాతావరణం వుంటుందిక్కడ.

**రాల్ పూర్** : ఎడారిలో కట్టబడిన ఆదినాధుని ఆలయంవుంది. ఈ ఆలయం జోధ్‌పూరుకు ఆగ్నేయంగా వుంది.

**ఓసియా** : 16 జైనాలయలు వున్న ప్రాంతం. ఇవన్ని కీ.పూ. 5వ శతాబ్దానికి చెందినవని ఇక్కడి వారు చెబుతారు. జోథ్‌పూర్‌లో వసతి : సర్క్యూట్ హౌస్ ఫోను: 20199: కార్నిభవన్: డిఫెన్స్ లాబ్‌రోడ్, ఫోను 20157, 22220, RTDC ఘూమర్ టూరిస్టు బంగ్లా, హైకోర్టు రోడ్, ఫోను:21900: అజిత్ భవన్ నియర్ సర్క్యూట్ హౌస్, ఫోను: 20409, 26409.

**ఖేడ్** : రణచోరాలయం వుంది. పాపపుణ్యముల కిటికీవున్న ఇక్కడ చిత్రమైన రాయివుంది. అద్దంలా పాలిష్ చేసిన ఈ రాయి రహస్యం ఇంత వరకూ అంతుపట్టని రహస్యం.

**జై సల్‌మీర్** : పాకిస్తాన్ సరిహద్దు పట్నం. రైలుమీద బార్మర్ నుండి వెళ్ళచ్చు. జోధ్‌పూర్ నుండి 187 కి.మీ. ఇక్కడున్న కోటలో శ్రీకృష్ణభగవానుడు త్రవ్విన బావి వుంది. దీనితోపాటు శివునికి, గణేశునికి ఆలయాలున్నాయి. ఇంకా అనేక తీర్థంకరుల ఆలయాలు కళాత్మకంగా వున్నాయి. జైసల్‌మీర్‌లో వున్న గ్రంథాలయంలో పురాతన తాళపత్ర గ్రంథాలు దేవనాగర లిపిలో రాసినవి వున్నాయి. తొంభై తొమ్మిది బురుజులు గల ఇసుకరాతితో నిర్మించిన జైసల్‌మీర్ కోట ప్రత్యేక ఆకర్షణ.

ఈ జైసల్ మీర్ నుండి వివిధ ప్రాంతాలకి దూరం కి.మీ. లలో ఢిల్లీ 897 కి.మీ. జైపూర్ 638 కి.మీ ఉదయపూర్ 663 కి.మీ అజ్మీర్ 500 కి.మీ.

జైసల్ మీర్‌లో వసతి :

జవహర్ నివాస్ ప్యాలెస్, ఫోన్:9

నారైన్ నివాస్ ప్యాలెస్, నయర్ మల్కా ప్రోల్, ఫోన్: 108

RTDC 'మూమల్' టూరిస్టు బంగ్లా, ఫోన్: 92, 192.

డాక్ బంగ్లా

హోటల్ జైసల్ కాస్టిల్

నీరజ్, శివ రోడ్, ఫోన్: 142.

**బికనీరు :** జోధ్‌సింగ్ కుమారుడు నిర్మించిన నగరం. ఈ ఎడారి పట్టణం జైపూర్ నుండి 450 కి.మీ. దూరం సరస్వతి నదీ తీరంలో వున్న ఈ నగరంలో కోట వుంది. ఈ కోటలో అప్పటి రాజులు పెండ్లిండ్లు చేసుకున్న మండపం. అద్దాలతో శోభిల్లే ఫూల్ మహల్, చంద్ర మహల్ వున్నాయి.

**శ్రీకరణిదేవి:** శ్రీ కరణీదేవి ఆలయం వుంది. బంగారు సింహాసనం మీద శ్రీ కరణిదేవి ప్రసన్న వదనంతో దర్శన మిస్తుంది. మందిరం విశాలంగా వుంటుంది. అనేక వేల ఎలుకలు కనిపిస్తాయి, వాటికి భక్తులు ఆహారం వేస్తారు.

**ఇక ఈ రాష్ట్రానికి దక్షిణాన వున్న గుజరాత్‌కు వెళదాం. మహా పురుషులు అవతరించిన ఆపుణ్యభూమిలో అనేక జైనాలయాలు వున్నాయి. ఈ ప్రాంతంలోనే గాంధీమహాత్ముడు ఉద్భవించింది. సబర్మతి ఆశ్రమం, కృష్ణభగవానుడి ద్వారకలను చూడాలంటే వెళ్ళవల్సిందే.**

# గుజరాత్

గుజరాత్ (పశ్చిమ భారత్) విస్తీర్ణం 1,96,204 చ.కి.మీ. ఇందు జనాభా 1991 లెక్కల ప్రకారం 4,11,74,060. ఈ రాష్ట్రపు రాజధాని గాంధీనగర్.

**సరిహద్దులు :** తూర్పున మధ్యప్రదేశ్, ఉత్తరాన పాకిస్తాన్, ఆగ్నేయ దిశలో మహారాష్ట్ర వున్నాయి.

**విశ్వవిద్యాలయాలు :** సూరత్‌లో దక్షిణ గుజరాత్ విశ్వవిద్యాలయం, బరోడాలో ఎం.ఎస్. విశ్వవిద్యాలయం, భావనగర్ విశ్వవిద్యాలయం భావనగరులోనూ, గుజరాత్ విశ్వవిద్యాలయం అహ్మదాబాద్‌లోనూ, పటేల్ విశ్వవిద్యాలయం వల్లభ విద్యానగర్‌లోనూ, సౌరాష్ట్ర విశ్వవిద్యాలయం రాజ్‌కోట్‌లోనూ, గుజరాత్ వ్యవసాయ విశ్వవిద్యాలయం దంతివాడలోనూ వున్నాయి.

**ప్రధాన నగరాలు, పట్టణాలు :** అహ్మదాబాద్, బారుచ్, భూజ్, గోద్రాహిమీత్ నగర్-పాలన్ పూర్, సూరత్, వాల్సర, వడోదర, రాజ్‌కోట్, జునాఘడ్, జామ్‌నగర్, గాంధీనగర్, భావనగర్, అమ్రేలి మొదలగునవి.

**యాత్రా పర్యాటక ప్రదేశాలు :** ద్వారక, సోమనాథ్, ఉద్వాడ, అహ్మదాబాద్, సబర్మతి ఆశ్రమం, సపూతరా పర్వతాలు మొదలగునవి.

**వాతావరణం :** వేసవికాలం : 41°C నుంచి 27°C వరకూ, చలికాలం : 29°C నుంచి 14°C వరకూ.

**ప్రధాన భాషలు :** గుజరాత్, మరాఠి, హిందీ.

**ఎయిర్‌పోర్ట్లు :** అహ్మదాబాద్, భావనగర్, వడోదర, భూజ్, జామ్‌నగరు, రాజ్‌కోట్, పోరు బందర్, సూరత్.

**బెస్టు సీజన్ :** అక్టోబరు నుంచి మార్చి వరకూ.

**టూరిస్టు ఇన్‌ఫర్మేషన్ కేంద్రాలు**

టూరిస్టు ఆఫీసు, అహ్మదాబాద్ మునిసిపల్ కార్పొరేషన్ అహ్మదాబాద్, రాజస్థాన్ టూరిస్టు ఆఫీసు

టూరిజం కార్పొరేషన్ అఫ్ గుజరాత్ లిమిటెడ్ H.K. హౌస్, ఆశ్రమ్ రోడ్, అహ్మదాబాద్, ఫోను:449172, 449683.

యు.పి. టూరిజం స్మృతికుంజ్ సొసైటి, అహ్మదాబాద్, ఫోను: 464318 రాజస్థాన్ టూరిస్టు అఫీసు, 4 కర్నావటి సొసైటి, ఆశ్రమ్ రోడ్, అహ్మదాబాద్ ఫోను: 405289.

టూరిజం కార్పొరేషన్ ఆఫ్ గుజరాత్ లి.నిగమ్ భవన్. సెక్టార్ 16. గాంధినగర్. ఫోను - 22523. 22645

**అహ్మదాబాద్** : రాష్ట్రంలో ఓ ప్రధాన నగరం. 1411 లో అహమ్మద్‌షా స్థాపించిన ఈ నగరంలోనే ఇంగ్లీషువారు మొదటిసారిగా వ్యాపారాంగీకారం కుదుర్చుకున్నది అందమైన నగరాల్లో ఒకటైన ఇక్కడ సబర్మతి నదీతీరాన వున్న మహాత్మాగాంధీ సబర్మతీ ఆశ్రమం ముఖ్యమైన దర్శనీయ స్థలం.

**భద్రకాళి** : భద్రకోటలో భద్రకాళి ఆలయంతోపాటు గడియార స్థంభం వుంది.

కంకరియా సరస్సు : జహంగీరు, నూర్జహాన్‌లు ఎన్నో మధురమైన సమయాలు గడిపింది ఇక్కడే. చక్కటి పిక్నిక్ స్పాట్.

**హథీసింగ్ దేవాలయము** : పాలరాతి దేవాలయం, సేట్ హాథీసింగ్ నిర్మించిన ఈ (1848) దేవాలయంలో 12 మంది తీర్థంకరుల పాలరాతి విగ్రహాలున్నాయి. ఈ ప్రశాంత ప్రదేశం మనసుకు ఊరటని కలిగించి, ప్రయాణ బడలికను పోగొడుతుంది.

**కదిలే స్థంభాలు** : రెండు గోపురాల్లో ఒకదాన్ని కదిలిస్తే రెండోది అదే కదులుతుంది. 1450లో నిర్మించిన ఈ గోపురాల్లో ఒకదానిలో అరిస్తేచాలు రెండో దానిలో వినపడే విచిత్ర కట్టడం.

**సబర్మతి ఆశ్రమం** : సబర్మతీనది తీరంలో వుంది. 1918 నుండి 1930 వరకు గాంధీజీ, కస్తూరిబాయిలు వుపయోగించిన అనేక వస్తువులు ఉన్నాయి. ఇక్కడికి దగ్గరిలోనే విక్టోరియా గార్డెన్సు....

**గాంధీనగర్** : అహ్మదాబాదుకు 25కి.మీ. దూరం. ఇదే రాష్ట్ర రాజధాని. సుందరమైన పార్కులు, ఉద్యానవనాలు ఆహ్లాద పర్చుస్తుంటాయి.

**నాల్ సరోవరం** : అహ్మదాబాద్ నుండి 64 కి.మీ దూరంలో వున్న ఇక్కడ చిత్ర విచిత్రమైన పక్షులను వందల కొద్ది చూడవచ్చు.

**అదాలజ్‌వాల్** : 1466లో రాణి రుడాబాయి నిర్మించిన ఎయిర్ కండిషన్. ఎంతాకాలం నేలమాళిగ పక్కనున్న గదుల్లోకి వెళితే చల్లగా వుంటుంది. అన్ని వందల సంవత్సరాల క్రితమే అప్పటివారు ఏ.సి.చేయించుకున్నారంటే ఆశ్చర్యం. ఏమిటేదు మన ఊహాలకి, ఆలోచనలకి ఇంకా ఇప్పుడు కూడా అందనివి ఎన్నో వారు చేశారు.

**లోథాల్** : అహ్మదాబాదుకి 80 కి.మీ. దూరంలో వున్న ఇక్కడ 4000 ఏళ్ల నాటి పురాతన వైభవం కనిపిస్తుంది. ఇక్కడున్న వస్తు ప్రదర్శనశాలలో ముద్రికలు, ఆభరణాలు, మృణ్మయ పాత్రలు వున్నాయి.

అహ్మదాబాదు నుంచి వివిధ ప్రాంతాలకి దూరం కి.మీ లలో విశాఖపట్టణం 1858 కి.మీ., విజయవాడ 1491 కి.మీ. వారణాసి 1329 కి.మీ. తిరుపతి 1772 కి.మీ.. సూరత్ 273 కి.మీ., శ్రీనగర్ 1777 కి.మీ, సిమ్లా 1254 కి.మీ., అమృతసర్ 1332 కి.మీ., బెంగుళూరు 1514 కి.మీ., భోపాల్ 571 కి.మీ.. ముంబాయి 551 కి.మీ., కలకత్తా 2006 కి.మీ.. ఢిల్లీ 886 కి.మీ., హైదరాబాదు 1220 కి.మీ., కన్యాకుమారి 2136 కి.మీ., లక్నో 1133 కి.మీ., చెన్నై 1848 కి.మీ., మైసూర్ 1649 కి.మీ.

**అహ్మదాబాదులో వసతి:**

రైల్వేస్టేషన్‌కి ఎదురుగా ధర్మశాలలున్నాయి

గాంధీ ఆశ్రమం, యూత్‌హాస్టల్, ఇంకా కొద్దిగా లగ్జరిలో.......

అమ్బాసిడర్, ఖాన్‌పుర్ రోడ్, ఫోను - 453244

కాపిటల్, గుజ్ వెనుక, సమాచార్ బిల్డింగ్, ఖాన్‌పుర్, ఫోను-24633

గవర్నమెంటు సర్క్యూట్ హౌస్, షాహిబగ్, రాజభవన్ ఎదురు, ఫోను: 65033, 65720

కర్నపటి, శ్రీసినిమా ప్రిమిసెస్, ఆశ్రమ్‌రోడ్, ఫోను: 402161

మేఘదూత్, గుప్తఛాంబర్సు-డ్యూక్లాత్ మార్కెటు దగ్గర, ఫోను - 364614

రిట్జ్, లాల్‌దర్వాజ, ఫోను-353637

రూపల్లే, లాల్‌దర్వాజ, ఫోను- 350814, 650112

సిద్దార్థ ప్యాలెస్, దఫ్నల షాహిబార్గ్, ఫోను-55794, 66505.

టూరిస్టు, పంచకుద, ఫోను-33295

వెల్కమ్ గ్రూప్, ఫోను-468603, 468552

వియా రెస్ట్ హౌస్, ఖాన్‌పుర్ రోడ్, ఫోను-393542

అహ్మదాబాద్ ఇంటర్నేషనల్. కాన్బిలి హైవే క్రాసింగ్, నారోల్ రోడ్,

తమా, ఖాన్‌పుర్ రోడ్, ఫోను -25281

అలంకార్ OPP రైల్వేస్టేషను, కాలుపుర్ ఫోను-383815

పంషికుర టౌనుహాల్ వెనుక, అండర్ బ్రిడ్జి ఇల్స్ బ్రిడ్జ్ దగ్గర, ఫోను-402971

TCGL టోరన్ గాంధి ఆశ్రమ్ గెస్టుహౌస్, ఫోను-407742.

**మొధేరా:** నది తీరంలోవున్న సూర్యదేవాలయం. చక్కటి శిల్పకళగల ఈ ఆలయం 1027 లో నిర్మించాలని అంటారు. ఆలయం ఎదురుగా లామికుంజ్‌మనే సరస్సు వుంది. సూర్యుని పన్నెండు ప్రతిమలు ఇక్కడ చూడచ్చు.

పట్టన్: పుష్పావతి నదీతీరానవున్న సూర్యదేవాలయం (మొఢేరా) నుంచి 30 కి.మీ. దూరంలో క్రీ.శ. 8వ శతాబ్దంలో నిర్మించిన ప్రాంతం. ఇక్కడే పెద్ద సరోవరం జైనాలయాలు వున్నాయి.

**వడోదర (బరోడా):**

**లక్ష్మీవిలాస భవనం** : గైక్వాడ్ వంశీయుల చిత్రపటాలున్నాయి. రోమన్ శిల్పకళతో వున్న మకర్‌పూర్ దీనితోపాటు ప్రతాప్‌విలాస భవనం చూడదగ్గవి..

**కీర్తిమందిరం** : నందలాల్ బోస్ చిత్రించిన చిత్రాలతోపాటు గైక్వాడ్ రాజులు వాడిన గదివుంది. ఇక్కడికి దగ్గరిలోనే శ్రీఅరవిందఘోష్‌గారు లెక్చరర్‌గా పనిచేసిన M.S. విశ్వవిద్యాలయం వుంది.

**మ్యూజియం**: రోమన్, చైనా, జపాన్, భారతీయ కళాఖండాలు ఎన్నో వున్నాయి. రాజాఫతేసింగు మ్యూజియంలో.

**వడోదర పరిసరాల్లో:**

**పావ్‌గడ్**: రావణ యుద్ధకాలంలో మూర్ఛిల్లిన లక్ష్మణుడి కోసం సంజీవిని పర్వతం హనుమంతులవారు తీసుకువస్తుంటే కొంత భాగం ఇక్కడ పడింది. కొండమీద కాళికాదేవి ఆలయంవుంది.

**చంపానీర్**: వడోదరాకి 60 కి.మీ. దూరం. శిథిలమైపోయిన కోటవుంది. శక్తి ఆలయం వున్న ఇక్కడే విశ్వానది పుట్టినది....... ఈ ప్రదేశంలోనే గాధినందనుడు తపస్సు చేసింది.

**ఉభయ్‌కోట**: 13వ శతాబ్దంలో నిర్మించిన ఈ కోట వడోదరకి 25 కి.మీ. దూరంలో వుంది. ఈ కోటలో కాళికామాత ఆలయంవుంది. 20కి.మీ. దూరంలో (డభయ్‌కోట) చందాద్‌వుంది. ఇక్కడ రాధికామాత, విశ్వనాధాలయాలున్నాయి.

**వడోదరలో వసతి** : సర్క్యూట్ హౌస్, అలకాపురి, రోడ్, ఫోను-67111.

ఎక్స్‌ప్రెస్, అలకాపురి, 18, అలకాపురిరోడ్, ఫోను-325744

ఎక్స్‌ప్రెస్, R.C. దత్‌రోడ్, ఫోను-323131

గ్రీన్, రేస్‌కోర్సురోడ్. ఫోను-63111

సూర్య, సవాజీగుంజ్, ఫోను-63330, 66592, 66514.

**సూరత్** : మహమ్మద్ బిన్ తుగ్లక్ కట్టించిన కోటవుంది. దగ్గరలో బీచ్‌లున్నాయి. ఇక్కడ జరిచీరలతో చేసిన వస్త్రాలకు ప్రసిద్ధి. బట్టలషాపులవాళ్ళు ఈ సూరత్‌నుంచే బట్టలు తెచ్చేది. ఇక్కడికి అనేక నగరాలను కలుపుతూ రోడ్లు, రైలు మార్గాలున్నాయి. దగ్గరిలో 10కి.మీ. దూరం హాజీరా బీచ్, చక్కటిహాలిడే సెంటర్.

వసతికి : డ్రీమ్‌లాండ్. సుఫీభాఘ్. రైల్వేస్టేషన్ ఎదురు.

సవేరా, రైల్వేస్టేషన్ ఎదురు, సుఫీభాగ్. ఫోను-29430

విశ్రామ్‌గ్రాహ్: వెల్కమ్ గ్రూప్, ఫోను-53027

అప్సర, లాల్ దర్వాజ, నియర్ రైల్వేస్టేషన్

ఒయాసిస్ సూరత్, వైశాలి సినిమా దగ్గర, ఫోను-41124, 41091

టెక్స్‌ప్లాజా, రింగ్‌రోడ్, ఫోను-43002, 43008.

**డాకోరు** : 10 కి.మీ. దూరంలో (వడోదరకి) వుంది. రణచోడరాయ్ (కృష్ణుడు) అలయంవున్న ఇక్కడ సాధువుల మఠాలు ఎక్కువ. నిత్య సంకీర్తన జరుగుతుంది. 100 కి.మీ దూరంలో లక్ష్మి ఆలయం, బోడానాథ మందిరాలున్నాయి.

**కపధన్వజీ** : వడోదరనుండి 32 కి.మీ దూరంలో వుంది. మధ్యదారిలో వేడినీటి వూటలున్నాయి. ఇక్కడ స్నానం చేస్తే చాలా మంచిది. దీర్ఘ చర్మవ్యాధులు పోతాయని నమ్మకం.

**జాలనగరం** : సూర్‌సాగర్ సరోవరం వుంది. ఇక్కడే ఆయుధాగారం కూడా వుంది. ఈ నగరంలో సోలోరియాం అంటే సూర్య చికిత్సాలయం వుంది. గదులలో అమర్చబడిన అద్దాలద్వార సూర్యకిరణాలు రోగుల మీదపడి వ్యాధి నివారణ అవుతుంది. ఇంకా లకోటకోట, జాబ్లిగార్డెన్స్ జూ మొదలయినవి దర్శనీయస్థలాలు.

**జాంబనగర్‌లో వసతి :**

అతిధిగ్రహ (లాల్ బంగ్లా) కలక్టరేట్

ఆశియానా, సూపర్ మార్కెట్, 3rd ఫ్లోర్, ఫోను-2725

**జునాగఢ్** : అంటే అర్థం పురాతనకోటని. 259 సంవత్సరాలనాటి శిలా శాసనాలు వున్నాయి. ఇక్కడున్న దామోదర కుండంలో స్నానంచేస్తే పవిత్రత చేకూరుతుంది. గిర్నార్‌కి వెళ్ళేదారిలో గండశిల వస్తుంది. దీనిమీద అశోకుని శాసనాలు వున్నాయి.

**గిర్నారు కొండలు** : (గిర్) జునాగఢ్‌కి 8 కి.మీ. దూరం. జైన తీర్థం. అయిదు ఆలయాలుగల ఇక్కడ 12వ శతాబ్దంలో నిర్మించిన నిమినాధుని దేవాలయం వుంది. పర్వతం పైకి ఎక్కితే అంబాలయం వుంది.

**ఊపర్‌కోట** : జునాగఢ్ నుంచి 5 కి.మీ. రాజపుత్రరాజు నిర్మించిన ఈ కోటలో 1500 సంవత్సరాలనాటి తీర్థగుహలున్నాయి. అక్కా చెల్లెళ్ళ బావులతో పాటు ఆంజనేయస్వామి, దుర్గ దేవాలయాలు వున్నాయి.

**మక్బారా** : జునాగఢ్‌ను పాలించిన ప్రభువుల స్మారక చిహ్నాలున్నాయి. నరసింహ మెహతా ఆలయం గుజరాత్‌లో గొప్ప కవిశిఖామణి స్మారకచిహ్నం గల ప్రదేశం.

గిర్ : 1295 చ కి మీ. గల అడవులు అద్భుత ఈ ప్రశాంతి కేంద్రంలో అనేకరకాలైన జంతువులను చూస్తూగడపవచ్చు. జూనాగఢ్‌నుంచి 128 కి మీ దూరం

**పాలిటానా :** ఇక్కడే శత్రుంజయ నది వుంది. ఈ నది నీరు ప్రశస్తమైనది. కొండమీద అరుదాటితే ఎవరూ వుండరు. ఈ శత్రుంజయ పర్వతాలు దేవతా నివాసాలు. పరమ పవిత్ర దేవభూమి అహ్మదాబాదు నుంచి 216 కి.మీ దూరం.

**జునాగఢ్‌లో వసతి :**

రైల్వే రిటైరింగ్ రూమ్స్.

TCGL గిర్‌నార్, హధిఖానా మైదాన్

వైవన్, 31. స్టేట్ హైవే. నియర్ S.T. రైల్వే క్రాసింగ్, ఫోను-21070

రెస్టహౌస్ డైలారం

మనోరంజన్ గెస్టహౌస్ (సర్క్యూట్ హౌస్) ఫోను-101

**సోమనాథ్ :**

ప్రఖ్యాతి చెందిన పురాతనమైన శైవక్షేత్రం. ద్వాదశ జ్యోతిర్లింగాలలో ఒకటి అయిన ఈ సోమనాథ ఆలయం ప్రభాసపట్టణంలో వుంది. ఇక్కడ పురాతనమైన కోట కూడా వుంది. 9వ శతాబ్దంలో సరికొత్తరూపుని సంతరించుకున్న ఈ ఆలయంపై ఘజనీ మహమ్మద్ 1026లో దండయాత్ర చేశాడు. సంపదతోపాటు చాలా నష్టం జరిగింది. ఆ తర్వాత మహారాజు రాజామహిపాల్ మరల మరమ్మత్తులు చేయించాడు. ఆ తర్వాత ఔరంగజేబు కూడా ఈ ఆలయం మీదకు వచ్చాడు. ఫలితంగా మారిన శకాలాలమీద మహారాణి అహల్యాబాయి తిరిగి ఆలయం కట్టించింది. సరస్వతినది ఇక్కడ సాగరసంగమం చేస్తుంది. వెళ్ళేదారిలో తపోభూమి వస్తుంది ఇక్కడే పరశురాముడు తపస్సు చేసింది. ఈ సాగరసంగమంలోనే చంద్రభగవానుడు స్నానం చేసి శివారాధనచేసి శాపవిముక్తుడయింది. అప్పుడు ప్రత్యక్షమైన భోళాశంకరుడే ఈ సోమనాథుడు.

**సోమనాథ్ పరిసరాలో :**

**భాలకతీర్థము :** శ్రీకృష్ణభగవానుడు ద్వాపర యుగాంతమున అడవిలో వున్నప్పుడు కిరాతకుడు బాణం వేశాడు. అది సరిగ్గా కృష్ణుడి కాలి బొటనవేలికి తగిలింది. ఆ సన్నివేశం కళ్ళకు కట్టేలా చూపించే విగ్రహం వుంది. ఇక్కడికి దగ్గరిలోనే త్రివేణి సంగమం వుంది.

**దేహోత్సర్గ :** కృష్ణభగవానుడు అవతారం చాలించిన చోటు ఎదురుగ్గా గుబురు గుహలున్నాయి. అందులోకి వెళ్ళే బలరాముడు అదృశ్యమైపోయింది.

ప్రాచిపిప్ల : అనేక దేవాలయాలతోపాటు పాలరాతి జైనాలయం వుంది. సోమనాథ్ నుంచి 25 కి.మీ. దూరంలోవున్న ఈ ప్రదేశం సముద్రస్నానానికి ప్రసిద్ధి. ఇక్కడ పిండప్రదానం చేస్తారు.

**సోమనాథ్‌లో వసతి :**

పథిక్ ఆశ్రమ్, సోమనాథ్ టెంపుల్.

**ద్వారక :** గుజరాత్ రాష్ట్రంలో పశ్చిమకోస్తా తీర ప్రదేశంలో వున్న ద్వారక పేరు విననివారు భారతీయులు కారంటే అతిశయోక్తిలేదు. అన్ని కర్మ సిద్ధాంతాలను బోధించిన శ్రీకృష్ణభగవానుడు సింహాసనాన్ని అధిష్టించి పరిపాలించింది ఈ ప్రదేశాన్నే.

అత్యంత పురాణ ప్రసిద్ధిగల ఈ ద్వారకను ఒకప్పుడు 'ద్వారపతి' అని సంబోధించేవారు. అదే ద్వారక అయింది.

కొంతమంది వాదన ప్రకారం అసలు ద్వారక ఎప్పుడో సముద్రంలోకి వెళ్ళిపోయిందని అంటారు.

**జగత్ మందిరం :** శ్రీకృష్ణభగవానుడి ఆలయం వుంది. ఈ ఆలయాన్ని కృష్ణుడి వంశానికి చెందిన వజ్రనాభుడు స్వర్గద్వారం అని పిలవబడే ప్రధాన ద్వారంలో ఆలయాన్ని ప్రారంభించాడు. పరిసరాల్లోనే బలరామునికి, వేణుమాధవునికి ఆలయాలున్నాయి.

**లక్ష్మీనారాయణాలయం :** గోమతి అవతల వుందీ ఆలయం. దేవాలయంలో రాయి నీటిలో తేలుతుంది. బయటికితీస్తే బరువుగానే వుంటుంది. మరి నీటిలో ఎలా తేలుతుందో అంతా కృష్ణమహిమ.

**రుక్మిణి ఆలయం :** శ్రీమహాలక్ష్మి అమ్మవారి అలయం. అష్టాదశపీఠాల్లో ఒకటి అయిన ఈ అలయం 3 కి.మీ. దూరంలో వుంది.

**మఠం :** ఆది శంకరాచార్యులు స్థాపించిన శారదా పీఠము ద్వారకాధీశుని ఆలయానికి దగ్గరిలో వెనుకవైపుగా వుంది. మఠం దగ్గరిలో మందిరాలు వున్నాయి. పక్కనే గోమతీనదిలో స్నానం సరికొత్త శక్తినిస్తుంది.

**బేట్ ద్వారకా :** ద్వారక నుంచి 5 కి.మీ. దూరం. శంకరాసురుని సంహరించిన ప్రదేశం. అరేబియా సముద్రంలోకి పడవలో వెళితే పరమాత్ముడి పసిడి విగ్రహము కానవస్తుంది. గోమతికి 30 కి.మీ. దూరంలో వున్న ఇక్కడికి వెళ్ళటం పిల్లా, పెద్దలు అని తేడా లేకుండా ఉత్సాహంగా వుంటుంది.

**ద్వారకలో వసతి :** జిల్లా పంచాయితి రెస్టుహౌస్. TCGL తోరన్ టూరిస్ట్ బంగ్లా & డార్మిటరి, ఫోను-113, సర్క్యూట్ హౌస్

**పోరుబందరు :**

మనకి స్వాతంత్ర్యాన్ని తెచ్చి స్వేచ్ఛావాయువులను ప్రసాదించిన మన జాతిపిత మహాత్మాగాంధి జన్మస్థలం. మహనీయుడి కీర్తిమందిరం. ఆయన జీవించిన కాలాన్ని

తెలియచేస్తున్నట్లు 79 అడుగుల ఎత్తుగా కట్టించబడింది. మహాత్ముని జీవిత కాలాన్ని
చూపిస్తూ 79 దీపాలు కూడా వెలుగుతుంటాయి. గాంధీగారు నూలు వడికిన వరకా.
గోడలమీద ఆయన చరిత్రకి సంబంధించిన అనేక చిత్రాలు చూడవచ్చు ఇక్కడ
సాయంత్రాలు గడపటానికి బీచ్ కూడా వుంది.

ఈ పరిసరాల్లో సుధామాలయం, మాధవజీ ఆలయం, బీచ్, కమలానెహ్రూ
పార్కుతోపాటు హిందూ ఆలయాలు కూడా వున్నాయి.

**భావనగరు** : అనేక హిందూ దేవాలయాలతోపాటు మ్యూజియం వుంది. ఈ
జిల్లాలోని అహ్వా, బీచ్‌తీర ప్రదేశంలో అనేక రకాలయిన పక్షులను చూడవచ్చు.
మ్యూజియంలో పురాతన కాలంనాటి అనేక ఆయుధాలని చూడవచ్చు. పోరుబందరు
నుండి అన్ని ప్రయాణ సౌకర్యాలు కలిగిన ఈ భావనగర్లో గౌరీశంకర్ సరస్సు లాక్‌గేటు,
సెంట్రల్ బెట్‌లాంటి యాత్రాపర్యాటక స్థలాలున్నాయి.

**భావనగర్‌లో వసతి** : అతిథి గృహ, సర్క్యూట్ హౌస్, మోరిహెడ్, ఫోను-4673
వెల్‌కమ్ గ్రూప్ నిలంబాగ్ ప్యాలెస్ ఫోను-24340, 24422, 29323
'అపోలో' Opp. సెంట్రల్ బస్‌స్టేషన్, ఫోను-25249, 29551
'పథిక్ ఆశ్రమ్' ఫోను-3944.

**రాజకోట్** : జాంనగర్ నుండి వెళ్ళవచ్చు. సుందరమయిన ఈ నగరంలో మ్యూజియం
వుంది. చక్కటి గార్డెన్సుగల సుందర నగరం. గాంధీగారు ఇక్కడే విద్యాభ్యాసం చేసింది.
విశాలమయిన భవనాలెన్నో వున్న ఇక్కడ గాంధీగారి ఇల్లు కూడావుంది.

**భూజ్** : గేట్ ఆఫ్ కచ్, వెండి వస్తువులకు, అద్దకాలకు పేరు. ఈ భూజ్, గుజరాత్
నుండి, అన్ని నగరాలనుంచి రవాణాసౌకర్యం వుంది. 1877లో నిర్మించిన మ్యూజియంలో
అనేక పురాతన వస్తువులు వున్నాయి. ఊరిలో దేవాలయాలు దర్శించ దగ్గవి.

**సతీపురా** : ఇదే పర్వత విశ్రాంతి కేంద్రం. చిక్కని అడవులలో అనేక వన్యప్రాణులను
చూస్తూ గడపటం మధురాతి మధురమైన అనుభూతి.

**కోటీశ్వర్** : హిందూ దేవాలయాలు గల ఇక్కడ బీచ్ వుంది. దగ్గరలో నారాయణ
సరోవర్ లేక్ వుంది.

**వెరవల్** : సుందరమైన బీచ్ వుంది.

**వెలవదార్** : అద్భుతమైన జాతీయ పార్క్ వుంది. ఈ సుందరమైన పార్కు
చూడాలంటే బెస్ట్ సీజను అక్టోబరు నుంచి మే లోపు.

**కాంబే : (అంకులేశ్వర్)**: నూనె నిక్షేపాలు ఇక్కడే కనుక్కొన్నది. ఇక్కడికి వెళ్ళి
దర్శించవచ్చు.

ఘూర్జరులు స్థిరనివాసం ఏర్పర్చుకోవటం వల్ల గుజరాత్ అని పేరు వచ్చిన ఈ రాష్ట్రం
నుంచి 'గోమింత' అని పూర్వకాలంలో పిలవబడిన అత్యంత ప్రసిద్ధి పొందిన సుందర
సముద్రతీరం, ముంబాయికి 320 కి.మీ. దూరంలో వున్న [illegible].

# గోవా

గోవా (పశ్చిమ భారత్) విస్తీర్ణం 36,597 చ.కి.మీ. ఇందు జనాభా 11,68,622. ఈ గోవా రాజధాని పానాజి

ప్రధాన నగరాలు, పట్టణాలు : పానాజి, వాస్కోడిగామా, మార్మగోవా, పాండా.

సరిహద్దులు : తూర్పున, దక్షిణాన కర్నాటక: పశ్చిమాన అరేబియా మహాసముద్రం: ఉత్తరాన మహారాష్ట్ర వున్నాయి.

**వాతావరణం** : వేసవికాలం 24°C-32.70°C, చలికాలం 21.3°C-32.2°C

**ప్రధాన భాషలు** : కొంకిణి, మరాఠి, హిందీ, ఇంగ్లీషు మరియు పోర్చుగీసు.

**ఎయిర్‌పోర్ట్** : పానాజికి 30 కి.మీ. దూరంలో వుంది. ఇక్కడ నుంచి ముంబాయి, హైదరాబాద్, చెన్నై, కొచ్చిన్, అహ్మదాబాద్ వెళ్ళుటకు ఫ్లయిట్ సర్వీసులున్నాయి.

**రైల్వే సౌకర్యం** : పానాజికి 350 కిలోమీటర్ల దూరంలో వున్న రైల్వే జంక్షన్ వాస్కోడిగామ. ఇదేగాక 40 కిలోమీటర్ల దూరంలో మార్మగోవా రైల్వేస్టేషన్ వుంది. ముంబాయి, త్రివేండ్రం లాంటి ఓడ రేవు ప్రదేశాలనుంచి నౌకలో కూడా రావచ్చు ఇక్కడికి.

**యాత్రా పర్యాటక ప్రదేశాలు** : పాండా (హిందూ దేవాలయాలు), మిండోలినది, అరలోకం జలపాతం, మార్మగోవా, పానాజి, వాస్కోడిగామా, బోండ్ల వన్యమృగ సంరక్షణ కేంద్రం, కోల్వా, వగాటత్, బీచ్‌లు...... మొదలగునవి.

**టూరిస్ట్ ఇన్‌ఫర్మేషన్ కేంద్రాలు**

డైరక్టర్ ఆఫ్ టూరిజం, గవర్నమెంట్ ఆఫ్ గోవా టూరిస్టు హోమ్ పానాజి, గోవా ఫోను: 5583, 4757.

తమిళనాడు టూరిస్టు ఆఫీస్ షాపు నెం 7, రోము ఛాంబర్స్, గ్రౌండ్‌ఫ్లోర్, పానాజి, గవర్నమెంట్ ఆఫ్ ఇండియా టూరిస్టు ఆఫీస్ కమ్యూనిడేడ్ బిల్డింగ్స్, చర్చ్ స్క్వేర్, పానాజి, ఫోను: 3412.

గోవా టూరిజం డెవలప్‌మెంట్ కార్పొరేషన్, ట్రినోర అపార్ట్‌మెంట్స్. పానాజి ఫోను : 43459.

**గోవా** : అతిచిన్న రాష్ట్రాల్లో ఒకటి. అనేక ప్రకృతి అందాలకి పుట్టినిల్లు. ఎన్నో సుందరమైన బీచ్‌లు, మరెన్నో విలాస ప్రాంతాలు జీవితాన్ని బ్రహ్మాండంగా అనుభవించవచ్చు. మునిసిపల్ గార్డెన్సు దగ్గర మహాలక్ష్మి ఆలయం వుంది, ఈ చిన్న రాష్ట్రానికి చిన్న రాజధాని పానాజి (పాంజిమ్)

**పానాజి :** చాలా ఆహ్లాదకరమైన వాతావరణం. పట్టణంలో ఎటు చూసినా తాటిచెట్లు, ఈతచెట్లు కనిపిస్తాయి. మాండోలి నదీ ప్రవాహం సముద్రంలో కలిసే చోట గస్పార్ డియాస్, డొనా పావు అనే బీచ్ లున్నాయి.

**అగ్వాడా :** పానాజికి 10 కి.మీ. దూరంలో వుంది అగ్వాడా కోట. 459 సంవత్సరాల క్రితం కట్టబడిన ఈ పోర్చుగీసు కోట పరిసరాల్లో అనేక ఫల, పుష్పజాతులు కనిపించే ఉద్యానవనాలున్నాయి. పాత గోవాలో ఉన్న ఈ కోటలో విశ్రాంతి కేంద్రం కూడా వుంది. ఇక్కడ ఆర్కియాలాజికల్ మ్యూజియం, గాలరీలు వున్నాయి.

**కాలంగూట్ :** పానాజికి 15 కి.మీ దూరంలో వున్న సుందరమైన బీచ్, అద్భుత సాయంత్రాలుగా మిగిలిపోతాయి ఇక్కడ గడిపిన సాయం సమయాలు.

**డన్‌పౌల్ :** ఏడు కి.మీటర్ల దూరంలో వున్న మంచి పిక్నిక్ స్పాట్, బీచ్ కూడావుంది.

**వేళ :** గోవానుంచి 10 కి.మీ. పోర్చుగీసువారి కోటలున్నాయి. రోమన్ కేథలిక్ పిల్‌గ్రిమ్ సెంటర్.

**వెగటార్ :** పానాజికి 25 కి.మీ దూరంలో వున్న బీచ్, ఇక్కడ పురాతన కోట వుంది.

**మపుకా :** అనేక ఉద్యానవనాలున్న ఇక్కడ ఫ్రైడే ఫెయిర్ జరుగుతుంది.

**బోమ్‌జీసస్ :** ఒకానొకప్పుడు అనేక దేవాలయాలున్నాయి. పోర్చుగీసు వారు నాశనం చేశారు.

**శ్రీమంగేష్ ఆలయం :** పర్వతాల మధ్యనున్న శివాలయం, పవిత్రసరోవరం వుంది. పాండాకి 5 కి.మీ. దూరంలో వుంది.

**సప్తకోటేశ్వర ఆలయం :** అతి ప్రాచీనమయిన దేవాలయం. శివాజీరాజు మరమ్మత్తులు చేయించారు. ఇంకా మహల్సా దేవాలయం మార్డోవాకి దగ్గరిలో వుంది. శాంతి దుర్గాలయం వుంది. ఈ దేవాలయం 1713 లో నిర్మించారు. ఇక్కడి దేవత పార్వతీదేవి అవతారం. శివ కేశవులు వున్న ఈ ప్రదేశం పానాజి నుంచి 32 కి.మీ. దూరం.

**గోవాకార్నివాల్ :** ఈ కార్నివాల్ ఫిబ్రవరిలో మూడు రోజులు జరిగే పండగ. ఈ ఉత్సవంలో ఆసక్తిదాయకమయిన ఆటలు నిర్వహిస్తారు. డాన్సులతో గోలగోలగా వుంటుంది. హానిమూన్‌ర్సు ముఖానికి మాస్కులు తగిలించుకుని ఎంజాయ్ చేస్తారు. చాలా సరదాగా వుండే ఈ ఉత్సవం మంచి రిలీఫ్.

**పాండా :** చూడాల్సిన దేవాలయాలున్నాయి. ఇక్కడికి పది కిలోమీటర్ల దూరంలో కవెలలలో దర్శించాల్సిన ఆలయాలున్నాయి.

**తెరకోల్ :** పురాతనమయిన కోటవుంది.

**హోరవాలి** : పురాతనకాలపు దేవాలయాలు, చరిత్రకెక్కిన గుహలున్నాయి. ఈ అడవి ప్రాంతం మంచి పిక్నిక్ స్పాట్. సుందరమయిన జలపాతాలున్నాయి కూడా.

**కోటిగోవా** : క్రూర మృగాల సంరక్షణ కేంద్రం వుంది.

**దూద్‌సాగర్** : దుమికే జలపాతాలున్న ఈ ప్రదేశం మంచి పిక్నిక్ స్పాట్.

**బెరల్** : అద్భుతమయిన బీచ్ వుంది.

**మోవెక్** : లేక్ రిసార్టు వున్న ఇక్కడ హాయిగా ఉల్లాసంగా కాలక్షేపం చేయచ్చు.

**వాస్కోడిగామా** : పోర్చుగీసునుండి సముద్రమార్గాన్ని కనిపెట్టిన ఆయన పేర్న పిలవబడుతున్న ఈ పట్టణంలో బీచ్, చక్కటి పార్కులున్నాయి.

**బొయినా బీచ్** : సముద్రంలోకి వెళ్ళి ఈతకొట్టి, తిరిగి పానాజీకి స్టీమ్ బోటులో రావచ్చు.

**వాస్కోడిగామాకు** : 10 కి.మీ. దూరంలో బీచ్‌రిసార్ట్ బోగ్‌యలో వుంది. 3కి.మీ. దూరంలో మార్మగోవా వుంది. ఇక్కడ చూడాల్సిన కోట వుంది. దీనితోపాటు ఓడరేవు తప్పనిసరిగా దర్శించండి.

**మడగాం** : కమర్షియల్ సెంటర్ వున్న ఇక్కడ అనేక ఉద్యానవనాలున్నాయి. శుక్రవారం సంత జరుగుతుంది.

**చంద్రేశ్వర్ భూతనాథ్** : పురాతన కాలంనాటి ఆలయాలున్న ఈ ప్రదేశం మడగాంకు 16 కి.మీ దూరంలో వుంది.

**బానావలి** : ది లాండ్ ఆఫ్ ఫన్ అని పిలవబడే గోవాలో వున్న అనేక బీచ్‌లలో ఇదొక బీచ్ సెంటర్.

ఈ గోవా అంటే అందమయిన బీచ్‌లు, ఫ్రీగా వుండే ఫారినర్స్ లాంటిదని చాలామంది అనుకుంటారు. అది నిజమే. వారికి తెలియనిది చాలా వుంది. ఇక్కడ బ్రహ్మాండమైన ఫుడ్, అంతకు మించిన వైన్‌లతోపాటు చరిత్ర ప్రసిద్ధి పొందిన దేవాలయాలు, సుందర జలపాతాలు వున్నాయి. ఆర్కియాలజి, హిస్టరీని గురించి చెప్పాలంటే మనకి ఇక్కడ కొదవలేనన్ని వున్నాయి. ఏడు నదులున్న పర్వతాల ప్రాంతం కూడా గోవా. హనీమూనర్స్‌కి గోవా సుందరమయిన కూడలి. ఫోక్ డాన్సెస్ ఆర్బోరాలో జరుగుతాయి. అక్కడ అనేకమంది లోకల్ పీపుల్స్ టూరిస్టులతో కలిపి సరదాగా ఎంజాయ్ చేస్తారు.

ఇంత సుందరమైన ఈ ప్రాంతాన్ని చూడాలంటే, గడపాలంటే కొద్దిగా ఎక్కువ రోజులే వుండేటట్టు ప్లాన్ చేసుకోండి. మండోలి నది అరవేలం జలపాతం, మాయెం సరస్సు ఇలాంటివెన్నో సుందరమైన ప్రదేశాలున్న ప్రదేశం ఈ గోవా.

# మహారాష్ట్ర

మహారాష్ట్ర (పశ్చిమ భారత) విస్తీర్ణం 3,07,690 చ.కి.మీ, ఇందు జనాబా 7,87,06,719 ఈ రాష్ట్ర రాజధాని బొంబాయి (ముంబాయి).

**ప్రధాన నగరాలు, పట్టణాలు :** అకోలా, ఔరంగాబాద్, అమరావతి, అహ్మద్‌నగర్, చందాపూర్, జలగాం, జుల్నా, నాగపూర్, కొల్హాపూర్, నాంధేడ్, నాసిక్, పర్భణి, పూణే, రాయఘర్, సంగ్లి, షోలాపూర్, థాణే, యవత్మాక్, వార్ధా, రత్నగిరి, ముంబాయి.

**యాత్రా పర్యాటక ప్రదేశాలు :** ఎల్లోరా, అజంతా, ఎలిఫెంటా, కన్హేరి, కరాలాగుహలు, మాధరాక్, మహాబలేశ్వర్, పంచగని, నాసిక్, నాంధేడ్, షిర్డి మొదలగునవి.

**విశ్వవిద్యాలయాలు-ముఖ్యమైనవి :** డియోనార్‌లోని అంతర్జాతీయ జనాభా శాస్త్రాల సంస్థ, టాటా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సోషల్ సైన్సెస్, ఇంకా అమరావతి మరట్వాడ్, నాగపూరు విశ్వవిద్యాలయాలు మొదలగునవి.

**సరిహద్దులు :** దక్షిణాన ఆంధ్ర, కర్నాటక, ఉత్తరాన తూర్పున మధ్యప్రదేశ్: పశ్చిమాన అరేబియా సముద్రం: వాయవ్యాన దయ్యూ డామన్, గుజరాత్ వున్నాయి..

**వాతావరణం :** వేసవికాలం 39°C నుంచి 22°C, చలికాలం 34°C నుంచి 12°Cవరకూ.

**బెస్టుసీజన్ :** సెప్టెంబర్ నుంచి మార్చిలోపు.

**ప్రధాన భాషలు :** మరాఠి, గుజరాత్తీ, హిందీ

**ఎయిర్ పోర్టు :** ఔరంగాబాద్, ముంబాయి, నాగపూర్, పూణే, నాంధేడ్, అకోలా, రత్నగిరి, షోలాపూర్, ముంబాయి ఎయిర్ ఇండియా ఫోన్లు - 2024142/ 6328874/ 6322768 ఇక్కడే ఇండియన్ ఎయిర్‌లైన్స్ నంబర్లు : 2023031/ 6144433.

### టూరిస్టు ఇన్‌ఫర్మేషన్ కేంద్రాలు

గవర్నమెంట్ ఆఫ్ ఇండియా టూరిస్ట్ ఆఫీస్, క్రిష్ణవిలాస్, స్టేషన్‌రోడ్, ఔరంగాబాదు. ఫోను : 24817.

హిమాచల్‌ప్రదేశ్ టూరిజం, 36, వరల్డ్ ట్రేడ్ సెంటర్, కఫెపెరేడ్, ముంబాయి. ఫోన్ : 2181123

మహారాష్ట్ర టూరిజం డెవలప్‌మెంట్ కార్పొరేషన్, ఎక్స్‌ప్రెస్ టవర్స్, 9వ అంతస్థు,

నారిమన్ పాయింట్. ఫోను : 2023472

హర్యానా గవర్నమెంట్ టూరిస్టు బ్యూరో, ఎయిర్ ఇండియా బిల్డింగ్. ముంబాయి. ఫోను : 2024239

రాజస్థాన్ టూరిస్టు ఆఫీస్, 230, డా॥ డి.ఎన్. రోడ్, ముంబాయి. ఫోను : 2044162

డైరెక్టర్ ఆఫ్ టూరిజం, గవర్నమెంట్ ఆఫ్ మహారాష్ట్ర, L.I.C. బిల్డింగ్ (యోగక్షేమ) ఎదురు, మేడం కామరోడ్డు, ముంబాయి. ఫోను : 2026713, 2027762

# ముంబాయి

పడమటి కోస్తా తీర ప్రాంతములో వున్న అంతర్జాతీయ ప్రఖ్యాతి పొందిన మహానగరం. ముంబాయి మహారాష్ట్ర రాజధాని కూడా. అతిపురాతన కాలములో సప్తద్వీప పురంగా, ప్రాచీన కాలములో ముంబాయిగా పిలవబడి కాలక్రమేణా బొంబాయిగా మారి, మరల ముంబాయిగా మార్చబడినది.

స్వతంత్ర పోరాటం నడిపిన జాతీయ కాంగ్రెస్ ఇక్కడనే ఏర్పడింది. ఈ గేట్ వే ఆఫ్ ఇండియాలో చూడదగ్గ ప్రదేశములు కోకొల్లలు ... ముంబాయికి 26 కి.మీ. దూరములో వుంది శాంత్‌క్రజ్ విమానాశ్రయం. విదేశీయులు కూడా వచ్చిపోయే ఈ నగరంలోని విశేషాలు, యాత్రా పర్యాటక ప్రదేశాలను చూద్దాం.

**గేట్ వే ఆఫ్ ఇండియా :** మహారాష్ట్ర రాజు ఛత్రపతి శివాజీ, మహాజిజ్ఞాసువు అయిన వివేకానందస్వామి విగ్రహాలున్నాయి. ఇండియా మహాద్వారాన్ని తప్పనిసరిగా ముంబాయి వెళ్ళినవాళ్ళు చూసి వస్తారు. అప్పట్లో గేట్ వే ప్రాంతాన్ని అపోలో బందర్ అని, వెల్లింగ్టన్ పయర్ అని వ్యవహరించేవారు. ఈ కట్టడం 1913లో శంఖుస్థాపన జరిగింది. 1917లో నిర్మాణం పూర్తి అయింది. పక్కనే తాజ్‌మహల్ హోటల్. మరోవైపు సుందర సముద్ర తీరం. గేట్ వే ఎదురుగా ఆకర్షణీయమయిన ఉద్యానవనం. ఉరన్, ఆలీబాగ్ వంటి ప్రాంతాలకి ఇక్కడ్నించి పడవులు, లాంచీలు వుంటాయి.

**ప్రిన్స్ ఆఫ్ మ్యూజియం :** అర్థ శిల్పరీతులు ప్రస్ఫుటించే విధంగా వుంటుంది. చాలా విభాగాలున్నాయి. మినియేచర్స్ పెయింటింగ్, నేచురల్ హిస్టరీ, బుద్ధుని విగ్రహాలు, ఎలిఫెంటా గుహలు, ఇంకా అనేక పురాతన వస్తు శిల్పకళ కావలసినంత చూడగలిగినంత వుంది. వీటితోపాటు అనేక కంచు విగ్రహాలు, టిబెట్ల మినియేచర్ పెయింటింగ్‌లు, కాశ్మీర్ అల్లికల రగ్గులు, తివాచీలు మొదలగునవి వున్నాయి.

**కొలాబాకాజ్‌వే :** పురాతన కాలానికి చెందిన లైట్ హౌస్ వుంది. గుట్టలుగా పోసిన చేపలు చూడచ్చు.

**హైకోర్టు యూనివర్సిటీ** : రాజాబాయి గడియార స్తంభం, దయ, ధర్మం విగ్రహాలున్నాయి. ఆధునిక కళాఖండా చిత్రపటాలున్నాయి.

**ఆర్ట్ గ్యాలరీ** : అనేక కళాఖండాలు, చిత్రపటాలున్నాయి.

**టౌన్ హాలు** : ముంబాయి అభివృద్ధికి విశేష కృషి చేసిన అనేక అధికారుల విగ్రహాలున్నాయి. చిన్న గ్రంధాలయం కూడా వుంది.

ఎక్వేరియం : కొన్ని వేల రకాల చేపలున్నాయి. మంచినీటి ఉప్పునీటి చేపలు గల ఈ తారా పోర్ ఎక్వేరియాన్ని 1915లో నిర్మించారు. ఉదయం 12 నుంచి రాత్రి 8 వరకూ ప్రవేశం.

**చౌపాటి బీచ్** : సాయంకాలం సరదాగా పిల్లగాలులను పీలుస్తూగడపొచ్చు.

**మణిభవన్** : మహాత్మాగాంధీ చిత్రపటాల ప్రదర్శన వుంది. ఆయన బొంబాయి వచ్చినప్పుడల్లా ఇక్కడే విశ్రాంతి తీసుకునేవారని అంటారు.

**జైనాలయం** : పాలరాతి ఆలయం అద్దాల మందిరాలువున్న ఇక్కడ నలువైపులా తీర్థంకరుల విశేషాలు చిత్రించి వుంటాయి.

**మహాలక్ష్మి దేవాలయం** : పురాతనమైన శ్రీమహాలక్ష్మి అమ్మవారి ఆలయం చాలా ప్రశస్థమైన ఆలయంగా ప్రసిద్ధి. భూలాభాయిదేశాయిరోడ్డులో వుంది.

**మల్ బార్ హిల్స్** : అత్యంత సంపన్నమైన భవనాలున్నాయి. ఇక్కడ్నించి చౌపాటి బీచ్ కనపడుతుంటుంది. చక్కటి ఉద్యానవనాలున్న ఈ పరిసరాల్లో వాకేశ్వర ఆలయం వుంది. శ్రీరామచంద్రులవారు విశ్రమించిన ప్రదేశం కూడా అయిన ఇక్కడ సాక్షాత్తు ఆయన ప్రతిష్ఠించిన లింగంవుంది. దగ్గరిలో హాంగింగ్ గార్డెన్స్ చక్కటి విశ్రాంతి ప్రదేశం.

**విక్టోరియా గార్డెన్స్** : ఈ గార్డెన్స్‌లో విక్టోరియా-ఆల్బర్ట్ మ్యూజియాలున్నాయి. ఉదయం నుంచి సాయంత్రం వరకూ ఎంజాయ్ చెయ్యటానికి, ఇక్కడ బోటు, ఒంటెలమీద సవారీల్లాంటి సౌకర్యాలున్నాయి. ఇంకా ఈ ముంబాయి నగరంలో శ్రీ వెంకటేశ్వరాలయం, గౌరీమఠం, ముంబాదేవి ఆలయం, నెహ్రూ ప్లానెటోరియం వున్నాయి. ఈ నగరంలో పగలుకి రాత్రికి తేడాలేదు. ఫాక్‌లాండ్ ద్వీపాల్లో జలసంధి దగ్గరున్న ఏషియాటిక్, శుక్లాస్ట్రీట్, కాంగ్రెస్ ఆఫీసురోడ్డులవైపు వెళ్ళద్దు... ఏదో రాచరిక కథలో చెప్పినట్టు ఫలానాగదిలోకి వెళ్ళదు అంటేఏదో వుందని ఉత్సుకతగా ఆ రాజకుమారుడు అటువెళ్ళి చిక్కుల్లోపడతాడు. అలగే అనవసర ఇంట్రెస్ట్‌పలన ఆటు వెళ్ళకండి.

**S.L. వరల్డ్** : బ్రహ్మాండమైన వాటర్ వరల్డ్ చూడటానికి ఒకరోజు కూడా చాలదు. అనేక వాటర్ గేమ్‌లున్న ఈ అద్భుతమైన ప్రదేశానికి ముంబాయిలోని అన్ని సైట్‌సీయింగ్ ట్రావెల్స్ నుంచి వెళ్ళచ్చు. ప్రవేశం 200 Rs. కొన్ని గేమ్స్ ఉచితం.

ముంబాయి పరిసర ప్రాంతల్లో యాత్రా పర్యాటక ప్రదేశాలు:

**ఎలిఫెంటాదీవి:** ముంబాయినుంచి 10 కి.మీ దూరం. అయిదు గుహలున్న ఈ ప్రదేశం ఎల్లోరాను మరిపిస్తుంది. వెళ్ళేదారిలో పెద్ద ఏనుగు విగ్రహం వుంది. బహుశ ఈ ప్రాంతానికి అందుకే ఆ పేరు పెట్టివుంటారు. ప్రస్తుతం మాత్రం ఆ విగ్రహం లేదు .... విక్టోరియ గార్డెన్‌లో చూసి వుంటారుకదా అదే ఆ ఏనుగు 8వ శతాబ్దంలో నిర్మించబడినట్టు చెబుతున్న ఇక్కడికి స్టీమ్‌బోటులో వెళ్ళచ్చు. ప్రాచీన శిల్పకళవున్న ఇక్కడ శివుడు, మహాదేవుడు, మాత విగ్రహాలున్నాయి.

**జుహుబీచ్ :** ప్రసిద్ధి చెందిన సుందరమైన బీచ్. నగరానికి 21 కి.మీ దూరంలో విమానాశ్రయం దగ్గరిలోవుంది. కావలిసినన్ని హోటళ్ళతో, సందడిగా కళకళలాడు తుంటుంది.

**నేషనల్ పార్కు :** ఇక్కడే కన్నెరి గుహలున్నాయి. చక్కటి పిక్నిక్ స్పాట్ అయిన ఇక్కడ 100 బౌద్ధగుహలున్నాయి. ముంబాయికి 40 కి.మీ. దూరంలో వున్న ఈ ప్రదేశంలోని బౌద్ధగుహలను 9వ శతాబ్దం వరకూ నిర్మించారు.

**జోగేశ్వరి గుహలు :** అంధేరి స్టేషను దగ్గరిలోవున్న గుహలు.

**కర్లాగుహలు :** 2వ శతాబ్దానికి చెందిన రాతిలో తొలిచిన గుహలు, నాల్లా స్టేషన్ నుండి 8 కి.మీ. దూరం.

**మఢ్ :** (MADH) ముంబాయికి 45 కి.మీ దూరంలోవున్న బీచ్.

**మార్వే :** 38కి.మీ దూరంలోవున్న బీచ్ సెంటర్.

**మనోరి :** (MANORI) నలభై కిలోమీటర్ల దూరంలో సుందరమైన బీచ్

**పొవాయి (POWAI) :** అత్యంత సుందరమైన లేక్‌సైడ్ పిక్నిక్ స్పాట్. ముంబాయికి 27 కి.మీ దూరంలో వుంది.

**తుల్సి (TULSI) :** 41 కి.మీ దూరంలో వున్న లేక్‌సైడ్ పిక్నిక్ స్పాట్ ముంబాయి V.T. స్టేషన్ నుండి (ఛత్రపతి శివాజి టెర్మినల్‌గా మార్చారు) లోకల్ ట్రైన్స్‌లో ప్రయాణించవచ్చు. బస్సులు చాలా రద్దీగా వుంటాయి. జేబులో వస్తువులు జాగ్రత్త. M.T.D.C. వారి నిర్వహణలో నగరంలో సైట్ సీయింగ్ ట్రిప్స్ వుంటాయి. అతి తక్కువలో వసతికి ధర్మ సత్రాలు వున్నయి. సేఠ్ M.M ధర్మశాల C.P. టాంకురోడ్డులో వుంది. కుమ్మోజాఫర్ ధర్మసత్రం వాడి బందర్ లోను వున్నాయి.

**ముంబాయి నుండి వివిధ ప్రదేశాలకి దూరం కి.మీలలో**

విశాఖపట్టణం 1376 కి.మీ., విజయవాడ 1010 కి.మీ., తిరుపతి 1230 కి.మీ., వారణాసి 1590 కి.మీ., కలకత్తా 2081 కి.మీ., గ్వాలియర్ 1089కి.మీ., ఢిల్లీ 1408 కి.మీ., హైదరాబాద్ 739 కి.మీ., లక్నో 1370 కి.మీ., జైపూర్ 1176 కి.మీ., చెన్నై 1367 కి.మీ.,

మైసూరు 1168 కి.మీ., పానాజి 582 కి.మీ., సిమ్లా 1776 కి.మీ., పాండిచ్చేరి 1336 కి.మీ.. సూరత్ 297 కి.మీ., శ్రీనగర్ 2299 కి.మీ., నాగపూర్ 861 కి.మీ.

### ముంబాయిలో కాస్త ఖరీదైన వసతి

ఎయిర్‌పోర్టు ఇంటర్నేషనల్, 516 నెహ్రూ రోడ్, విలేపార్లె (E) ఫోన్ 6122883. 891962, 6422907.

ఎయిర్ క్రాఫ్ట్ ఇంటర్నేషనల్, 179, డయాడర్ రోడ్, ఫోను - 6123667, 6121419, 6120899

ఎయిర్ వేస్. 333,L.B.S. మార్గ్, ఘత్‌కపుర్ (పశ్చిమ) ఫోను - 5149855, 5150917, 5151061.

అమ్బాసిడార్ వీర్ నెయిర్‌మన్ రోడ్, చర్చ్‌గేట్ ఎక్స్‌టెన్షన్, ఫోను -2041131

అనుకూల్, శ్రీరామ శ్రీమతి బిల్డింగ్స్, 2921298, మౌలానా షాకత్ ఆలిరోడ్, ఫోను -391401

అఫోలో లాండ్స్‌డోన్ రోడ్, అఫోలో బంజర్, కొలాబ, ఫోను -2020233, 2874996

అప్సర ఇంటర్నేషనల్, 7 S.V. రోడ్, శాంతకుంజ్(పశ్చిమం) ఫోను 6491241, 5493214

అశ్విని ప్రై. లి. మరోల్ మరోషి రోడ్, అంధేరి (ఈస్ట్)

అవియన్, బొంబాయి ఎయిర్ పోర్టు, నెహ్రూ రోడ్, ఫోను -6123902, 6121348/ 467, 6113220

బెంట్లిన్ 17, ఒలివర్ స్ట్రీట్, (అఫ్ గార్డెన్ రోడ్) కొలాబ, ఫోను- 241733, 241474, 223245

బీచ్‌వ్యూ, జుహు తార్గా రోడ్, జుహు, ఫోను -6148824/28/363

బల్వాస్, 33, మౌలానా షాకిత్ అలీ రోడ్, ఫోను-316361

సిటాడెల్-757 S.V. రోడ్, ఖర్, ఫోను -6485421

క్లారిడ్జ్, టార్డియో ఎయిర్ కండిషన్డ్ మార్కెట్, 8వ ఫ్లోర్, ఫోను -4944000 (1)2

కంఫర్టు, 36. సియోన్ రోడ్, వెస్టు సియోన్. ఫోను -4091645.

### పూనా

పూనా : ఒకప్పుడు ఛత్రపతిశివాజి రాజధాని. ఈ ప్రదేశమే బాలగంగాధర్ తిలక్ జన్మస్థానము. పబ్లిక్ గార్డెన్స్, బోట్ క్లబ్బుగల ఇక్కడ బాబా రజనీష్ ఆశ్రమం వుంది.

## పూనా పరిసరాల్లో

**రాజాకేల్కార్ మ్యూజియం** : ఇందు పీష్వాలు వాడిన వస్తువులు. చేపల ఎముకలతో తయారుచేసిన వస్తువులున్నాయి.

**పార్వతి అమ్మవారి ఆలయం** : చిరు పర్వతం మీద పూనా నుంచి 5 కి.మీ. దూరంలో వుంది. సుందరమయిన జలపాతం కూడా వున్న ఇక్కడ రాయగడ్. పురంధర్ కోటలు చూడదగినవి.

**అళంది** : పూనా నుండి 25 కి.మీ. జ్ఞానేశ్వర్ మహరాజ్ సమాధి వుంది. గణపతి ఆలయం, దేవి ఆలయం వున్నాయి. పవిత్ర వృక్షరాజములుగల ఇక్కడే పవననాధుని జన్మస్థలం.

**దేహూ** : పూనా నుండి 30 కి.మీ దూరంగల ఈ ప్రదేశమే భక్తతుకారం జన్మస్థలం. విఠల్ ఆలయం వుంది.

**ప్రతాప్ ఘర్‌కోట** : పూనానుండి 25 కి.మీ దూరం. 1656లో నిర్మించిన కోట వుంది. భవానీ ఆలయం వుందిక్కడ.

**మహాబలేశ్వరం** : వేసవికాలం విడిది ప్రదేశం. చినమన్ జలపాతం, లింగమల జలపాతాలు అత్యంత సుందరంగా వుంటాయి ఇక్కడ.

**సజ్జన్‌గడ్** : శివాజి ఉపయోగించిన ఆయుధాలు వస్తువులు వున్నాయి. అఫ్జల్‌ఖానును చంపడానికి వాడిన పులిగోళ్ళు ఇక్కడవున్నాయి. శివాజీప్యాలెస్, కోట, సమర్ధరామదాసు సమాధి, అంగలేదేవి ఆలయం వున్నాయి.

**పంచగని** : మహాబలేశ్వరం నుండి 19 కి.మీ. చక్కటి ప్రశాంత పర్వత విశ్రాంతి కేంద్రం.

**పూనాలో వసతి** :

అలంకార్, 14, మోతిలాల్ తలేరారోడ్, ఫోను : 60484

అమర్, 15, కాన్‌నాట్ రోడ్, ఫోను : 661840

ఆశీర్వాద్, 16, కాన్‌నాట్ రోడ్, ఫోను : 66142

బ్లూడైమండ్, 1, కొరెగోవ్ రోడ్, ఫోను : 663775

ఫార్మర్సు ఇన్ పురులి-ఇంచన్, పూనె-సోలాపూర్ రోడ్, ఫోను : 256

మౌర్యరెసిడెన్సీ, 1195/6A, F.C. రోడ్, తుకారం పడుక చౌక్, ఫోను : 54034

సాగర్‌ప్లాజా,1, బండ్ గార్డెన్ రోడ్, ఫోను : 61880

వెల్కమ్ గ్రూప్, ఫోను : 661680

సబ్లైజీ. 917/A&D. శివాజినగరు. ఫర్గుస్సెన్ కాలేజీరోడ్. ఫోను :59065

పూనె గెస్ట్‌హౌస్: 190, బుధవల్‌పేథ్, లక్ష్మీరోడ్, గుణపథి చౌక్. ఫోను 445679

రాజ్‌దూత్, పూనె-సతారా రోడ్, స్వర్గేట్, ఫోను. 434611

నందన్‌దన్, డెక్కన్‌జిమ్‌ఖాన, ఫోను-55251

షాలిమార్, 12-A, కాన్‌నాట్ రోడ్, ఫోను :69191

MTDC సరాస్, నెహ్రూ స్టేడియం, నియర్ సరాస్‌బాగ్, బాగ్ ఫోను: 30499

వుడ్‌లాండ్స్, 5, బైరాంజి జీజిబాయ్‌రోడ్. ఫోను: 61111

**కొల్హాపూర్ :** సముద్రమట్టానికి 50 మీ. ఎత్తులోవున్న ఇక్కడ శ్రీమహాలక్ష్మీ ఆలయం వుంది. ఈ ఆలయంలోనే సరస్వతి, కాళీ మందిరాలున్నాయి. మహాలక్ష్మీ అమ్మవారి బంగారు పాదుకలను ఇక్కడ చూడచ్చు

**గణపతిపూలె :** సుందర విశ్రాంతి ప్రదేశం... ఇక్కడికి 30 కి.మీ. దూరంలో గణపతి దేవాలయం దర్శించదగ్గ ప్రసిద్ధమైనది.

**పన్హాలా :** కొల్హాపూరు నుంచి 18 కి.మీ దూరం. బుద్ధగుహాలయాలున్న ఈ ప్రదేశం చక్కటి విశ్రాంతి కేంద్రం. పురాతన కోటవుంది ఈ హిల్ స్టేషనులో.

**అహ్మద్‌నగర్ :** జవహరులాల్ నెహ్రూని స్వాతంత్ర్య పోరాటసమయంలో కొన్నాళ్ళు నిర్బంధించినచోటు ఈ అహ్మద్‌నగర్, 1550లో కట్టబడినకోటవుంది.

**కొల్హాపూర్‌లో వసతి :**

గవర్నమెంట్ రెస్ట్‌హౌస్, శివాజిపార్క్, ఫోను: 25156

పెర్ల్, న్యూషాహూపురి, తారాబాయి ఫోను: 20461

పాలిని ప్యాలెస్, అశోక్ రంకల, A-వార్డు, ఫోను : 20401

వుడ్‌లాండ్స్, 204-B, ఈస్ట్‌వార్డ్, తారాబాయి పార్క్, ఫోను: 24889, 29642

ఆనంద్, 1557-C, లక్ష్మీపురి, ఫోను: 26066

సంరత్, OPP. S.T. స్టాండ్, ఫోను : 27101

**నాసిక్ :** ముంబాయి నుండి 185 కి.మీ. దూరం పశ్చిమ కాశిగా ప్రసిద్ధి పొందినది. గోదావరి తీరంలోవున్న ఈ పట్టణంలో 12 సంవత్సరాలకి ఒకసారి పుష్కరం జరుగుతుంది. ఇక్కడ శ్రాద్ధవిధులు నిర్వర్తించవచ్చు. ఇక్కడ కాలారామాలయం, పాలేశ్వరాలయం దర్శించదగ్గవి ముఖ్యంగా చూడదగ్గవి. పంచవటి తపోవనం సీతగుహ, శ్రీరామకుండ్ ఆలయం, పాండవ గుహలు, చంబార్ గుహలతోపాటు పంచవటి దగ్గరలో రావణాసురుడు సీతమ్మవారిని ఎత్తుకు పోయిన ప్రదేశం దగ్గరిలో 13 కి.మీ. దూరంలో జటాయువు మోక్షస్థానం దర్శించదగ్గవి.

నాసిక్‌లో వసతి :

గ్రీన్ వ్యూ, 136-M-1.సువర్ణరేఖ, త్ర్యంబక్‌రోడ్, ఫోను : 72231

గేట్‌వే హోటల్, P-17 అంబద్ ఏరియా MIDC; ముంబాయి ఆగ్రారోడ్

సిద్దార్థ, నాసిక్-పూనె రోడ్, ఫోను: 73288

MTDC టూరిస్ట్ బంగ్లా గోల్ఫ్ క్లబ్

VIP ఓల్డు ఆగ్రారోడ్, ఫోను -4121

త్ర్యంబకం : నాసిక్ నుండి 30 కి.మీ దూరం. గోదావరి పుట్టిన ప్రదేశం. ఇక్కడే త్ర్యంబకేశ్వరాలయంవుంది. బాలాజీ బాజీరావు నిర్మించిన ఈ దేవాలయం ద్వాదశ జ్యోతిర్లింగాలలో మూడవది. గౌతముడు అహల్యాదేవిని పూజలందుకున్న ప్రదేశం, మశ్చీంద్రనాధుని పాదుకలు, 108 మహాదేవుని లింగములస్థానం, గోదావరి అమ్మవారి ఆలయం దర్శించదగ్గ ప్రసిద్ధమైనవి. ఈ త్ర్యంబకం ఆలయంలోనికి ప్రవేశం పురుషులకే.... వసతికి కావలసినన్ని ధర్మశాలలు హోటళ్ళు వుంటాయి. ఈ పరిసరాల్లో చూడదగినవి గంగాద్వార్, నీలగిరి, కుశావర్తము మొదలగునవి.

షిర్డి : షిరిడిసాయిబాబా సిద్ధిపొందినచోటు విశాలమయిన చలువరాతి కట్టడం బాబాగారి చలువరాతి విగ్రహం మానసికమైన ప్రశాంతతని ఇస్తుంది. ఇక్కడ ఊదాని ప్రసాదంగా ఇస్తారు. ఇక్కడే జ్యోతిర్లింగముగా ప్రసిద్ధి పొందిన శివాలయం వుంది.

ఇంకా చూడవల్సిన ప్రదేశాలు, ఖండోబా మందిరం, మారుతీ ఆలయం, లూకియా, గురుస్థానం, ద్వారకామాయి, చావడి, వెండికోట, బాబాగారి సమాధి-బూటీవాడ, శివగణపతి శని దేవాలయాలు, లక్ష్మిభాయి షిండేగృహం, భక్త మహల్సాపతి గృహం, దేశపాండే గృహం, సకోరి, నిమ్‌నామ్ గ్రామం, రాహత్ గ్రామం, పైలు గ్రామం, ఇవన్ని సాయినాధుని పవిత్ర పాదస్పర్శను అనుభవించిన ప్రదేశాలే.

షిర్డికి : సదరన్ ట్రావెల్స్ ప్రైవేట్ లిమిటెడ్ వారు విజయవాడ, విశాఖపట్టణం, హైదరాబాదు, న్యూఢిల్లీ, చెన్నై, బెంగుళూరు నుండి షిర్డి, ఎల్లోరా, ఔరంగాబాదు, ఘృష్ణేశ్వర జ్యోతిర్లింగంలకు యాత్రాబస్సులు వారానికి రెండు సర్వీసులు నిర్వహిస్తున్నారు.

వివరాలకు హైదరాబాదు: 223658, 227233 విజయవాడ: 62227, 66624 విశాఖపట్టణం: 545565, 541099, న్యూఢిల్లీ: 5722210, 5739508, చెన్నై : 585253, 564864, బెంగుళూర్: 2262633, 2267040.

శింగణాపురం : ఇంటికి తలుపులే ఉండని వింతగ్రామం. ఇక్కడికి షిరిడీనుంచి బస్సులున్నాయి. ఈ గ్రామంలోనే శనీశ్వర ఆలయం వుంది.

**ఔరంగాబాద్** : అజంతా, ఎల్లోరా గుహలకు వెళ్ళేటప్పుడు వచ్చే ముఖ్యమయిన మజిలి. ఈ పట్టణములో యాత్రాపర్యాటక విశేషాలు.

**బీబీకా మక్బారా:** ఔరంగజేబు కొడుకు తల్లి ఆడింపా జ్ఞాపకార్థం నిర్మించిన కట్టడం అత్యంత సుందరంగా వుంటుంది. చక్కటి ఉద్యానవనాలతో చూడముచ్చటగా వుంటుంది.

**ఔరంగాబాదు గుహలు:** బీబీకా మక్బారా నుండి 2 కి.మీ. దూరంలో వున్నాయి. 7,8 శతాబ్దాలలో నిర్మించిన బౌద్ధగుహలున్నాయి. ఈ పరిసరాల్లో అనేక గుహల సముదాయాలున్నాయి. పడమటి గుహల్లో శిథిలావస్థలో స్తూపం, అనేక దృశ్యాలను శిల్పాలుగా మలిచారిక్కడ. తూర్పు గుహల్లో భోదిసత్త్వుని విగ్రహం వుంది. ఈ గుహల్లో స్త్రీల శిల్పాలు మనోరంజకంగా వుంటాయి. ఈ స్త్రీల శిలా శరీరాలపై బట్టలకంటే నగలే ఎక్కువగా ఉంటాయి.

**దౌలతాబాద్** : ఔరంగాబాద్ నుండి 13 కి.మీ.దూరం. పూర్వనామం దేవగిరి. అనేక భూగర్భ సొరంగపు త్రోవలున్నాయి. 6 కి.మీటర్ల ఎత్తులో చాంద్‌మీనార్ ప్రత్యేక ఆకర్షణ.

**ఎల్లోరా గుహలు** : ఔరంగాబాద్ నుండి 29 కి.మీ. దూరం. హిందూ జైన దేవాలయాల సముదాయం యీ ఎల్లోరా గుహలు. మొత్తం 34 వున్నాయి. 12 బౌద్ధమతానికి, 17 హిందూ మతానికి, 5 జైన మతానికి చెందినవి. 2 గుహల్లో బుద్ధుని విగ్రహం, 6వ గుహలో ఆసీనముద్రలో వున్న బుద్ధవిగ్రహం, 11వ గుహ రెండంతస్థులది, 12వ గుహ మూడంతస్తులది. ఈ గుహల్లో అనేక కుడ్య చిత్రాలున్నాయి. 16వ గుహలో హిందూ ఆలయాలున్నాయి. బౌద్ధ గుహలు క్రీ.శ. 600 నుండి 800 వరకూ, హైందవ గుహాలయాలు క్రీ.శ. 900 సంవత్సరంలో జైన గుహలు క్రీ.శ 1000 సంవత్సరంలో నిర్మించారు. ఈ గుహల్లో హిరణ్యకశ్యపుణ్ణి వధించిన ఉదంతం ఆది దంపతుల కళ్యాణ ఘట్టాలు, పాచికలాడే రసవత్తర ఘట్టాలు, అనేక శిల్పాలు అత్యంత రమణీయం. ఇక్కడున్న కైలాస గుహ నిర్మాణ సమయంలో కొండ తొలిచిన రాయి బరువు 2 లక్షల టన్నులు వుంటుంది. ఎల్లోరాలో అత్యంత ముఖ్య ఆకర్షణ కైలాస గుహ... జీవకళ ఉట్టిపడుతూ, మన పాత తరం వారి అభిరుచిని, వారి మేధస్సుని కళ్ళకు కట్టినట్లు చూపించే ఈ ఎల్లోరా గుహలు ఒక్కసారయినా జీవితంలో చూడదగినవి.

**ఘృష్ణేశ్వరం** : 18వ శతాబ్దపు శివాలయం వుంది. ద్వాదశ జ్యోతిర్లింగాల్లో ఒకటి ఘృష్ణకేశ్వర్, ఘృష్ణేశ్వరాలయం, ధృష్ణేశ్వరాలయం అని కూడా అంటారు. మన్మాడ్ నుండి 121 కి.మీ. ఔరంగాబాదుల్లో దిగవలెను. 'వేరుల్లా' గ్రామమున ఈ ఘృష్ణేశ్వరాలయం వుంది.

**అజంతా** : ఔరంగాబాదు నుండి 166 కి.మీ. దూరంలో వుంది. ప్రపంచ వ్యాప్తంగా ప్రసిద్ధిపొందిన సుందర శిల్పకళ గుహలు ఈ అజంతా గుహలు. మొత్తం 29 గుహలు. 29 గుహల్లో 1, 2, 9, 10, 16, 18 గుహలు తప్పనిసరిగా చూడదగ్గవి. 26వ నెంబరు గుహలో 29 అడుగుల బౌద్ధ విగ్రహం కలదు. ప్రపంచ పర్యాటకులను కూడా విశేషంగా ఆకర్షిస్తున్న ఈ గుహల్లో చిత్రీకరించిన చిత్రాలకు ఏ రంగులువాడారో ఏ రసాయనాలను వాడారోగాని ఇప్పటికి చెక్కు చెదరకుండా వున్నాయి. ఇక్కడున్న గుహల్లో అనేక పెయింటింగులు, వాటిలో అత్యద్భుతమైనవి. భోదిసత్వుని పద్మపాణిగానూ, వజ్రపాణిగానూ చిత్రీకరించిన చిత్రాలు. 2వ గుహలో కుడ్య చిత్రాలున్నాయి. రెండు అంతస్తులది ఆరవ గుహ, 16వ గుహలో అద్దకం చేస్తున్న రాజకుమారి, బుద్ధుని భార్య మిగతా కుటుంబసభ్యుల చిత్రాలు, 17, 18 గుహల్లో సామాన్య జీవితానికి సంబంధించినవి. నాగరాజు దంపతులు, ఏడు తలలనాగు పడగశిరస్సు, ఒకటేమిటి అణువణువు కమనీయమే. అత్యంత సుందరమే. గోడలకి, స్తంభాలకి వేసిన రంగులు పళ్ళరసాలతో వేశారని చెబుతారు. ఏది ఏమైన ఆ శిల్పకళ, చిత్రకళ నేటితరానికి అప్పటి తరాలవారు ఇచ్చిన అపురూప కానుక, అనితరసాధ్యమైన కమనీయ కళాదీపిక.

**ఇక్కడ వసతి :**

ఫారెస్టు రెస్టుహౌస్, 20.3 కి.మీ. (కేవ్స్ దగ్గర నుంచి.)

ITDC అశోక్ ట్రావెలర్స్ లాడ్జి.

**నాగపూర్:** ఈ పట్టణం కమలాలకు ప్రసిద్ధి. సరోవరాలున్నాయి. పూర్వకాలంలో గోండురాజులకు ప్రధాన స్థావరమైన కొండమీద సీకాబర్దీన్ కోటవుంది.

**రామ్‌టెక్** : నాగపూర్ నుండి 40 కి.మీ. దూరంలో 600 సంవత్సరాల క్రితంనాటి దేవాలయాల సమూహం పర్వతం చుట్టూ అమరి వుంది. కాళిదాసు మేఘసందేశం రచించింది ఇక్కడే. ఈ పవిత్రప్రదేశంలోనే శ్రీరామ చంద్రుడు కొంత కాలం నివశించారు.

**సేవాగ్రామ్** : నాగపూర్ నుండి 151 కి.మీ దూరం. మహాత్ముని కుటీరం, కస్తూరిబాయి కుటీరం. గాంధీ స్థంభం, ప్రార్థనా మందిరం, ఫోటో ఎగ్జిబిషన్ దర్శనీయ స్థలాలు. దగ్గరిలో వినోభాభావే కుటీరం కూడా వుంది.

**పండరీపురం** : షోలాపూర్ నుంచి బస్సులో వెళ్ళాలి. ఇక్కడి పాండురంగ స్వామిని విఠోబా అని పిలుస్తారు. నదీ గర్భంలో పుండరీక భగవాన్ లోహదండతీర్థం, పుండరీకుని తల్లిదండ్రుల సమాధులున్నాయి. నది అవతల వొడ్డున వల్లాభాచార్య సమాధి, రామమందిరం, కాళికామందిరం, హనుమాన్ మందిరం, వెంకట స్వామి మందిరం, జ్ఞానేశ్వరీ మహరాజ మఠం వున్నాయి.

**శ్రీ విఠోబా ఆలయం :** చలువరాతితో నిర్మించిన ఆలయం. ఇక్కడ స్వామిని తాకవచ్చు. ఆలింగనము కూడా చేసుకొనవచ్చును. హాలులో ఆంజనేయస్వామి, గణేషుని దర్శించి, దగ్గరిలోనే గోపాలపురంలో జనాబాయి, సక్కుబాయి వాడిన బిందెలు, తిరుగలి, కుండలను చూడచ్చు. గర్భాలయం దగ్గరిలో రుఖ్మాబాయి దేవాలయం కూడా వుంది.

**అంబర్‌నాథ్:** 1060లో నిర్మించిన గొప్ప శివాలయం. చుట్టూ మంచి కమనీయ రమణీయ ప్రదేశాలు, ఈ ప్రదేశం మంచి పిక్నిక్ స్పాట్ కూడా.

**కొల్హాపూర్:** మహిమగల శక్తిపీఠం. శివాజీకి భవాని వరప్రసాదంగా ఖడ్గాన్ని సమర్పించింది ఇక్కడే.

**భీమశంకర్:** నేపాల్ వద్ద వుంది. భీమనది పుట్టిన సహ్యాద్రిపై వెలిసిన స్వామి శంకర మహాదేవుని ఆలయం వుంది.

# నేపాల్

భారత్. చైనాల మధ్య ఒద్దికగా వున్న రాజ్యం. దీని రాజధాని ఖాట్మాండు. ఇక్కడ ప్రజలు ఘూర్ఖాలు. మాట్లాడే భాష నేపాలీ.

గౌతమబుద్ధుని పూర్వ రాజులైన శాక్యరాజులు పాలించిన ప్రాంతం. దీని జనాభా (1993) 19.4 (మిలియన్లలలో) (ఏరియా 140 Sq. Kms.) మేలో వచ్చే వైశాఖ పూర్ణిమనాడు బుద్ధుని జన్మదినం. తథాగతునికి స్వయంభూవద్ద లుంబినీ వద్ద బ్రహ్మాండమైన ఉత్సావాలు జరుగుతాయి. ముందుగా -

**ఖాట్మాండు** : 385 సంవత్సరాల క్రితం చెట్టు బోదెతో తొలచబడిన పగోడా ఆకారంలో వున్న చిన్న దేవాలయం అయిన కష్టమంటన్ వలన దీనికా పేరు వచ్చింది.

**ఈ ఖాట్మాండులో చూడవల్సిన క్షేత్రాలు, ప్రదేశాలు.**

**హనుమాన్ ధాకా** : 16వ శతాబ్దంలో నిర్మించిన రాజసౌధం. ఆంజనేయ స్వామి విగ్రహం వుంది. 1687లో తయారుచేసిన గరుడు వాహనం శిల్పం, గజాననుడయిన గణపతి విగ్రహం, కాలభైరవుని విగ్రహాలు ఉన్నాయి.

**ధరహార** : 200 అడుగుల జయస్థంభం. 1814-16లో బ్రిటిష్‌వారిపై కలిగిన విజయానికి చిహ్నంగా దీన్ని నిర్మించారు.

**పశుపతినాథ్ ఆలయం** : మానస సరోవరానికి వెళ్ళేవారు ముందుగా ఇక్కడ దర్శించుకొని వెళతారు. ఖాట్మాండు నగరానికి 5 కి.మీ. దూరంలో వున్న గొప్ప శివాలయం. భాగమతీ నది వొడ్డున వున్న ఈ పవిత్ర దేవాలయానికి ఎన్నోవేలమంది శివరాత్రికి వస్తారు. ఇక్కడ పార్వతిదేవి అష్టాదశ శక్తి పీఠాల్లో ఒకటి. ఇక్కడి ఆలయం పైభాగం బంగారు పూత నిర్మించారు. పశుపతి నాథాలయం స్వామిని దర్శించుకుంటే సర్వవ్యాధి నివారణమని భక్తుల నమ్మం. సత్యం. ఇక్కడ రుద్రాక్షలు, జవ్వాజిలు, కస్తూరి దొరుకుతాయి. ఈ ఆలయంలో మరో ప్రత్యేక విషయం, ఇనుమును బంగారంగా మార్చే పరుశవేది ఉన్నదని. ఈ దేవాలయానికి సమీపంలోనే గుణేశ్వరి ఆలయం వుంది. ఇక్కడికి 2 కి.మీ. దూరంలో రాజామానదేవుడు కట్టించిన బౌద్ధవిహారం వుంది. కిలోమీటరు దూరంలో వున్న వన్యమృగరక్షణశాలలో ఏనుగు ఎక్కి విహరించవచ్చు.

**బసంతపూర్ దర్బార్** : విశాలమైన ఉద్యానవనంలో నిర్మించిన చక్కటి రాజభవనం.

**నేపాల్ మ్యూజియం** : నేపాల్ రాజులకు సంబంధించిన ఎన్నో వేల వస్తువులను ఇక్కడ చూడవచ్చు.

**మచ్ఛీంద్రనాథ్ మందిర్** : ఇక్కడి స్వామికి రథోత్సవం జరుగుతుంది. నేపాల్ రాజవంశీకుల దైవం ఈ మచ్ఛీంద్రనాథ్.

**న్యాయపాలమందిర్** : 1708లో నిర్మించిన సిద్ధిలక్ష్మి ఆలయం. అంతా కొయ్యతో నిర్మించిన ఈ దేవాలయంలో అడుగడుగునా శిల్పకళ తాండవిస్తుంది.

**బుద్ధనీలకంఠర్** : శ్రీ మహావిష్ణువు పాలసముద్రంలో శేషతల్పం మీద పడుకున్నట్టు వుండే ఇక్కడి స్వామిని వైష్ణవులు మహావిష్ణువుగానూ, శైవులు నీలకంఠునిగా పూజిస్తారు.

**చోవర్** : కొండపైన ఆది మఠము దేవాలయం వుంది. ఇక్కడ్నుంచి అనేక పర్వత దృశ్యములు, అనంత లోయలు చూడవచ్చు. ప్రకృతిలోని అందంతో పాటు, వళ్ళు జలదరించే అధఃపాతాళం కూడా చూడచ్చు.

**దక్షిణ కాశీ** : నారాయణ ఆలయం. ఎన్నో కమనీయ శిల్పాలు చూడచ్చు పార్కింగ్ నుంచి 2 కి.మీ. దూరంలో వున్న ఈ ఆలయంలో వున్న చిన్న కుంటలో మెరిసే వింత చేపలు కనపడతాయి.

**జనకపురిధామ్** : మహాశక్తి పీఠాల్లో ఒకటి. సీతాదేవి బాల్యం, పెళ్ళి జరిగింది ఇక్కడే. జనక మహారాజు పరిపాలించిన యీ ప్రదేశం. ఎంతో పవిత్రం ఆ సీతమ్మ తల్లి నడయాడిన ప్రదేశాలు చూస్తుంటే ఆ తల్లి కనులముందు కదలాడినట్లే వుంటుంది.

ఈ జనకపురిధామ్‌నకు వెళ్ళాలనుకుంటే ముందుగా అంటే ఆల్మోర్గా మంచి నేపాల్ వెళ్ళేముందు రెగ్జీల్‌స్టేషన్ దగ్గరలోని సీతామర్హి వెళ్ళి అక్కడ్నించి బస్సులో జనకపురి ధామ్ చేరచ్చు.

## ఈ జనకపురిధామ్‌లో చూడదగ్గ ప్రదేశాలు

**రామమందిర్** : ధనుష్ తీర్థమున స్నానం చేసి వెళ్ళండి. దేవాలయం పూర్తిగా క్షీణించిన చోట సాధువులు తపస్సు చేసుకుంటుంటారు.

**జానకీ మందిరము** : మహాశక్తి పీఠాల్లో ఒకటి. సీతాదేవి అంతఃపుర ప్రదేశం మందిరంలో అద్దాల మేడ కలదు. [illegible]

ఇక్కడే సీతా కల్యాణ మండపం, లక్ష్మణాలయం, దశరథాలయం, కపిలేశ్వర, కోటేశ్వర, కుబేశ్వర ఆలయాలున్నాయి. ఈ జనక పురిధామ్‌లో 108 తీర్థాలు గలవు.

**పటాన్** : ఖాట్మండ్‌కి 5 కి.మీ. దూరంలో వున్న ఈ పటాన్‌ను పూర్వకాలంలో లలితాపూర్‌గా పిలిచేవారు. హిమాలయ యాత్రా ప్రదేశాలను చూసేవారు తప్పక చూడదగ్గ ప్రదేశం.

**ఈ పటాన్‌లో వున్న దర్బార్ స్క్వేర్** : అనేక పురాతన భవనాలు, బౌద్ధుల

ఆరామాలు. అనేక స్తూపాలు మనసుని ఉక్కిరి బిక్కిరి చేస్తాయి. వాటితో మలిచిన నగిషీలు ముగ్ధుల్ని చేస్తాయి

**హిరణ్యవర్ణ మహావీర్ :** లోకేశ్వరుని ఆరామం. రాజా భాస్కరవర్మ కట్టించిన మూడంతస్తుల మందిరం. ఇక్కడ బుద్ధదేవుని బంగారు చిత్రపటం చూడవచ్చు. గోడల మీద పెయింటింగ్ చేసిన అనేక చిత్రాలు యాత్రికులను తప్పక ఆకర్షిస్తాయి.

**రుద్రవర్మ ఆశ్రమం :** అనేక కంచు, రాతి విగ్రహాలు కలవు. బుద్ధునికి మరో ఆరామం

ఇంకా పగోడా ఆకారంలో నిర్మించిన కుంభేశ్వర ఆలయం దర్శించదగ్గది.

## అరుణ మచ్ఛేంద్రనాథ్ ఆలయం

ఎవరెస్ట్, కాంచనజంగా, ధవళగిరి లాంటి ఎత్తయిన హిమగిరి శిఖరములు వున్న ఈ నేపాల్‌లో వున్న గొప్ప ఆధ్యాత్మిక పవిత్ర పుణ్యక్షేత్రం. ఇక్కడి స్వామి నేపాల్ ప్రభువులకు ఆరాధ్యదైవం. ఒకప్పుడు ఈ నేపాల్ అంతా కరువు కాటకాలతో అల్లల్లాడుతున్నప్పుడు అప్పటి రాజు నరేంద్ర బౌద్ధ భిక్షువును ఆహ్వానించాడు. ఆయన రాకతో సుభిక్షంగా నేపాల్ మారింది. అప్పట్నించి ఇప్పటివరకూ ఈ ఉత్సవాలు జరుపుతున్నారు.

**అశోకుని స్తూపాలు :** మహా చక్రవర్తి అశోకుడు క్రీ.పూ. 250 ప్రాంతములో నిర్మించిన నాలుగు స్తూపాలు చూడవచ్చు. ఇక్కడికి దగ్గరలో వున్న జంతు ప్రదర్శనశాలలో ఎన్నో మృగాలను చూడవచ్చు. హిమాలయాల్లో తిరిగే అనేక అరుదైన జంతువులు చూడటం మరుపురాని అనుభూతి. పటాన్‌కు 10 కి.మీ. దూరంలో బొటానికల్ గార్డెన్, తిలభైరవ తేలాతోపాటు 90,508 అడుగుల ఎత్తుగల బుద్ధుల పగోడాను కూడా చూడండి.

**భట్‌గావ్ :** ఖాట్మండ్‌కు 6 కి.మీ. దూరం. రాజా అమరదేవ 9వ శతాబ్దం ఉత్తర భాగంలో ఈ నగరాన్ని కట్టించాడు. దత్తాత్రేయులవారి ఆలయం, 5 అంతస్థుల నటపోలాలయం దర్శించదగ్గవి.

**సూర్య వినాయక ఆలయం :** భట్‌గావ్‌కి 10 కి.మీ. దూరంలో వున్న స్వామి ఆలయం తప్పనిసరిగా దర్శించదగ్గది.

**పోఖరా :** ఇక్కడ్నించి పర్వతశ్రేణుల్ని, శిఖరాలను చూస్తూ మనం మనల్ని మరిచి సుదూర తీరాలకు వెళ్ళవచ్చు. అంత చక్కటి ప్రదేశం.

**శ్వేతగండకి :** నదిలో స్నానంచేసి పితరులకు పిండతర్పణాదులను విడుస్తారు.

సాలగ్రామము : 107వ దివ్యదేశం. ఈ భువి మీద 108 దివ్య దేశాలు వున్నాయి. వాటన్నింటిని దర్శించి తరిస్తే స్వర్గప్రాప్తి. ఇది శక్తిపీఠం కూడా. సాలగ్రామాలు గండకీ నదియందు దొరుకుతాయి. ఖాట్మండ్ నుంచి సాలగ్రామము వెళ్ళుటకు ఆరు రోజులు పడుతుంది. ఇంకా సాలగ్రామాలు దొరికే ప్రదేశాలు, కృష్ణగండకి నుంచి ముక్తినాథం వెళ్ళేమార్గంలో అక్కడికి దగ్గరలో నృసింగు కోలా, నరసింగు నదిల చోట ఎక్కువగా సాలగ్రామాలు దొరుకుతాయి. ఇక్కడికి వెళ్ళేటప్పుడు భోజన పదార్థాలు వెంట వుంచుకోండి.

## ముక్తినాథము

గండకీ నదీమతల్లి ప్రవహించే ప్రదేశం. ఈమె పాతివ్రత్యాన్ని శ్రీమహావిష్ణువు పరీక్షించి ఆమెకు ఇక్కడే మోక్షం ప్రసాదించాడు. ఆమెను ఇక్కడ నదిగా ప్రవహించమని ఆదేశించాడు. తను సాలగ్రామ రూపంలో భక్తులను పాపవిముక్తులను చేస్తానని శ్రీ మహావిష్ణువు పలికెను. ఇక్కడ్నించి విష్ణు, నరశింహ, కృష్ణ సాలగ్రామాలు తెచ్చి పూజించుకుంటారు. తులసి కోటలో పెట్టి నిత్యం పూజ చేస్తారు. ఈ సాలగ్రామ నది పుట్టుక దామోదర కుండం. దీన్ని చేరుట అతికష్టం.

## ముక్తినాథ్ యాత్ర (108వ చివరి దివ్య దేశం)

3 కోట్ల 50 లక్షల మహా తీర్థాలలో స్వయంవ్యక్తములు 81, దివ్యతిరుపములు 108. వాటిలో చివరిదే ఈ ప్రదేశం. ఈ ముక్తినాథ్ పద్మ పురాణంలోనూ, స్కంధ పురాణంలోనూ, బ్రహ్మవైవర్త శివపురాణాల్లో, యింకా దేవీ భాగవతమందు యీ స్థల మహాత్మ్యం గురించి విశేషంగా చెప్పబడి వుంది. ఇక్కడ రామానుజ జీయర్ స్వామివారు నిర్మించిన శ్రీరామ మహాశ్రమ స్తంభము వుంది. ఈ ముక్తినాథ్ చేరుటకు పోఖరా నుంచి 76 కి.మీ. ముక్తినాథ్ యాత్రా మార్గం అంతా పర్వతాల మీద, కొండ చరియల మీదుగా, ఇరుకు మార్గాల గుండా సాగుతుంది.

**మరొకదారి బుటోక్ నుంచి :** తాన్‌పేన్, రాణిఘాట్‌ల మీదుగా రిదీకి రావాలి. ఇక్కడ గండకీనదీ తీరాన విష్ణువు ఆలయం వుంది. ఇక్కడే విభీషణుడు తపస్సు చేసింది.

రిదీనుంచి జమీర్‌ఘాట్, మధువన్‌ల మీదుగా బస్తీ బాగులూరు చేరతారు.

ఈ బాగులూరు శ్వేతగండకీ, కాశీనదుల సంగమస్థానం. ఇచ్చట నుంచి గాలేశ్వర్ (శక్తిపీఠం) తప్తపానీ, ధారా, జుంసా కాకన్‌వీల మీదుగా ముక్తినాథ్ చేరతారు.

### పోఖరా నుంచి ముక్తినాథ్‌కు మధ్య వచ్చు ప్రదేశాలు, పుణ్యక్షేత్రాలు

నాగుడాడా, నుమ్లో, పీరేతారి, సుధామా, ఉల్లేరి, ఘూరపానీ, శిఖా, ధారా జుంసా..... ముక్తినాథ్.....

[illegible] వెంబడి [illegible] ఈ [illegible] [illegible] ఉంటాయి. [illegible] జన్మించినట్టు శాస్త్ర ప్రవచనం. గర్భాలయమునకు వెనుకభాగములో ముక్తినాథ [illegible] [illegible] కష్టం [illegible] స్వామి దర్శనభాగ్యంతో పునీతమవుతుంది తనువు. మనసు. [illegible] పై వున్న స్వామికి ఇరువైపుల [illegible] శ్రీదేవి [illegible] ఇంకా [illegible] విగ్రహాలున్నాయి. ఇక్కడ పూలు, కొండ తులసి దొరుకుతుంది.

**గండకీనది ధారలు** : ఇక్కడున్న 108 ధారలు పడతాయి భక్తులు 108 ధారల కింద నడచి స్నానం చేస్తారు ఇక్కడ స్నానం చెయ్యగానే వెంటనే బట్టలు ధరించండి. చలి ఎక్కువగా వుండడంవల్ల శరీరం చల్లబడిపోవును ఇక్కడే పిండతర్పణాదులు వదులుతారు. ఇక్కడ పిండతర్పణాలు వదిలితే వారికేకాక వదిలినవారికి కూడా ముక్తి.

**జలజ్వాలా**: ఈ ముక్తినాథ ముఖారవింద దర్శనం కొండంత వృష్టి. 108 జలధారల క్రింద స్నానం [illegible] నుంచి ఏముక్తి. ఈ ఆలయంలో గుహల్లోని నాలుగుచోట్ల నాలుగు జ్వాలలు వెలుగుతూ వుంటాయి. ఒక గుహలో జ్వాలకింద నుంచి నీరు ప్రవహిస్తుంటుంది.

**ఆజన్మకన్యలు** : ముక్తినాధుని ముఖారవింద [illegible]ందహాసాన్ని రోజూ తిలకించే మానవరూపంలో వున్న దేవతాకన్యలు. ఆలయం తలుపులు మూయుట. తీయుట. దీపములు వెలిగించుట వీరి పనే. వారి జీవితాలని స్వామికి అర్పించి సేవిస్తారు. ముక్తినాథ్‌కు దగ్గరిలోవున్న పల్లెలో నివశిస్తారు.

## ముక్తినాథ్‌కు సమీపంలోని దర్శనీయ పుణ్యప్రదేశాలు

**సాలగ్రామపహాడ్** - పెద్ద గుట్ట. ఇక్కడ సాలగ్రామాలు అధికంగా దొరుకుతాయి. 20 లైన్ల క్రింద చదవండి. (సాలగ్రామ మహత్యం పూజ గురించి వివరణ) బౌద్ధాలయము, నరసింహస్వామి ఆలయంతో పాటు మరో ముఖ్యమైన యాత్రా ప్రదేశం.

**దామోదర కుండం** . ముక్తినాథ్ నుంచి 65 కి.మీ. దూరంలో వుంది. గండకీనది పుట్టిక ఇక్కడే ఈ గండకినది [illegible] పవిత్రమైంది. ఇక్కడికి ప్రయాణం బహుకష్టం. స్థానికులను [illegible] తీసుకెళితే మంచిది. [illegible] నారాయణతీర్థం చూసుకొని వరత్పృష్టిగా వెనక్కిరండి. ఈ దామోదరకుండంలో సంవత్సరం పొడవున సాలగ్రామాలు దొరుకుతాయి.

## కృష్ణగండకీ నందున్న మరో పుణ్యక్షేత్రం దేవఘాట్

ఇక్కడున్నది రెండు నదులు కలిసే ప్రదేశం ప్రసిద్ధమైంది. విశాలమైన విష్ణువు ఆలయాలుగల ఈ ప్రదేశాన్ని సప్తగండకీ సంగమ క్షేత్రమంటారు. నారాయణఘాట్ నుంచి భక్తులు ఈ ప్రదేశానికి వస్తారు. ఇక్కడ ఆశ్రమాలున్నాయి. ఇక్కడ క్రతు స్తంభము వుంది. దీన్ని శ్రీమన్నారాయణ రామానుజ జియర్‌స్వామి వారు నిర్మించారు.

**గోరక్‌పూర్** : మనకి కాశీ ఎంత పుణ్యక్షేత్రమో, నేపాలీయుల రిడీక్షేత్రం అంతటి పుణ్యప్రదేశం. కృష్ణ, రిడీనదుల సంగమస్థానం. రిడీ నుంచి కృష్ణగండకీ తీరంలో వెళ్తే ముక్తినాథం వస్తుంది.

ఎవరెస్ట్, కాంచజంగా శిఖరాలను అధిరోహించేవారికి ఈ నేపాల్‌లో చక్కటి ప్రోత్సాహం. చలికాలం మాత్రం ఎక్కవద్దు. ఎవరెస్ట్ శిఖరావలోకనానికి మంచి పాయింట్ సంచి బజార్.

## సాలగ్రామ పూజ - మహాత్మ్యం

వడిగాపారే పుణ్యనదుల తీరాన లభ్యమయ్యే సాలగ్రామాల్ను పవిత్రమైనవి. కొన్ని అండాకారముగాను, కొన్ని గుండ్రని ఆకారంతో (గోళీలవలె) వుండునవి. ఇవి చుట్టును అతి నునుపుదనము కలిగి ప్రకృతిసిద్ధముగ అట్టి ఆకారములు పొందిన రాళ్లు. కొన్ని తెల్లనివి. కొన్ని నల్లనివిగా వుంటాయి.

ప్రకృతి వైచిత్ర్యములవలనను, మరియే యితర కారణములవలనైనను కొన్ని పెద్దరాళ్ళు, ప్రవాహ మార్గమునకు అవరోధముగా వచ్చుట వలన ప్రవాహములో వేగమువలన కొట్టుకొని వచ్చును. పగిలి చిన్న చిన్నరాళ్ళయి ప్రవాహ ఒరవడికి అటు నిటు ఒరిసికొని ఆ తాకిడికి నునుపుదనము పొంది అండాకృతి లేక గుండ్రని ఆకారము పొంది, ప్రశాంతముగా పారు నదీ తీరమునకు కొట్టుకొని వచ్చిపడి లభ్యమగుట వీటి సహజ లక్షణమై ఉన్నది.

అనగా స్వతస్సిద్ధమైన ప్రకృతి పరిణామ విశేషమువలన ఇట్టి అందమైన, పవిత్రమైన ఆకృతులు పొందిన రాళ్ళను సాలగ్రామములంటారు. ఇది మన సంప్రదాయబద్ధముగ, పూజనీయములై యున్నవి. వీటి గమనమును పరిణామములను పరిశీలించినచో ఒక పరమ (జీవిత) సత్యము గోచరింపకమానదు.

జీవాత్మ ఈ అనంత జగత్తునకు మూలాధారమైన బ్రహ్మపదార్థము నుండి కారణాంతరముచే విడివడి కాలమనే మహా ప్రవాహంలో కొట్టుకొనివచ్చును. అనేక జన్మలెత్తుతూ, అనగా ప్రవాహ ఒరవడికి అటు నిటు కొట్టుకొనుచు, కొండరాళ్లలో చిక్కుపడి ఉంటూ మరల పారేనీటితో సాగుతూ, క్రమాకృతి లేక ముడిపదార్థముగానే వున్నరాయి, సాలగ్రామమువలె నునుపైనట్లు, అనగా కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములనే. జీవాత్మ నావరించియున్న వాసనలచే అనేక జన్మలెత్తుతూ క్రమేపి పడత

లేని రాయివలె) నిండియుండి, కాలప్రవాహ ఒంపదీసి, ఇట్టి వాసనలను పోగొట్టుకొను పరిశుద్ధమైన ఆకృతితో వెలుగుచు ప్రకాశవంతమగును

సంకల్పక్షయము. వాసనాక్షయము అనగా అనేక జన్మలయందలి కోరికలు, అలవాట్లు, అభ్యాసములు సంస్కారములు ఒకదానితో ఒకటి చేరి బాగుగా దృఢపడి వాసనగా ఏర్పడును. అట్టి వాసనలను త్యజించుట అనగా వాసనా వైవశ్యముచే

దృఢ భావనయా వ్యక్త పూర్వాపర విచారణమ్.

యదాదానం పదార్థస్య, వాసనా సాప్రకీర్తితా. (శ్రీ వశిష్ఠగీత)

మనుజుడు తన వాస్తవ స్వరూపమును బాగుగా త్యజించివైచి దోషయుక్తమగు దృష్టికలవాడై సమస్తమును భ్రాంతి సహితముగ గాంచు కామాది వాసనలనే త్రాళ్ళచే బంధింపబడి, నదీ తీరమందలి నాచు తీగలు మొదలయిన (చిన్నరాళ్ళను ఇవి ఆపినట్లు) ఆశాపాశములందు తగుల్కొని యున్నవాడు, జన్మపరంపరలచే అభ్యాసము చేసి వాసనా రాహిత్యుడై, సాలగ్రామమువలె మహోన్నతుడు కావలెనని, విజ్ఞులు చెప్పుచున్నారు.

విచారితమలం శాస్త్రం చిరముద్గ్రాహితం మిదః

సంతక్త వాసనాన్మౌనాదృతే నాస్త్యుత్తమం పదం (శ్రీ వశిష్ఠగీత)

శాస్త్రములన్నీ బాగుగా విచారించిన పిదప మరియు చిరకాలము ఆత్మజ్ఞుల తోటి పరస్పర సంవాదముల ద్వారా ఆత్మతత్త్వమును దృఢపరచుకొనిన పిమ్మట గ్రహించినది ఏమన, ఎన్ని విచారించినను వాసనలను కోరికలను ఆశలను, సంపూర్ణముగ త్యజించి, ఆత్మయందు మౌనముగా నుండుట కంటె ఉత్తమమైన పదవి ఇంకొకటి లేదు అని వశిష్ఠ మహర్షి నొక్కి వక్కాణించెను.

ఇట్టి అద్భుతమైన విజ్ఞాన విషయమును పరిశీలించిన మీదట క్రమాకృతిలేని రాయి, నది పుట్టిన ప్రదేశము నుంచి ఎన్నో అడ్డంకుల నధిగమించి, చిక్కులను విడతీసుకుని, ఆలాగు విడివడిన రాయి చుట్టును అనగా అన్నివైపుల నునుపుదేరి నిర్ణీత రూపమునకు వచ్చిన పిదప, ప్రశాంతముగ పారు మైదాన ప్రదేశమునకు వచ్చి యట స్థిరపడిగాని, ఒడ్డునకు కొట్టుకొని వచ్చిగాని లభ్యమయ్యే సాలగ్రామమువలె పవిత్రమైనది ఆత్మ. అట్టి సాలగ్రామములు, ఆత్మతత్త్వము ధృఢముగ పొందిన అనగా కోరికలను ఆశలను వీడి, పవిత్రమైనట్టి ఆత్మస్వరూపునితో సమానమని పెద్దలు సూచించుచున్నారు. అట్టి ఆత్మ స్వరూపుడు పరమపూజనీయుడని సూచించునదే సాలగ్రామ పూజ.

ఈ కలియుగమున, తులసీదళములు, గంగా జలములు, మరియు సాల గ్రామములయందు దైవత్వముండునని వేదవిదులు వక్కాణించుచున్నారు.

సాలగ్రామములలో అనేక విధములైనవి కలవు. ఈ తరగతి వాటి చిహ్నాములు, ఆకృతులను బట్టి నిర్ణయించెదరు. అవి యేవన, షట్చక్రసీతారామం, సంతాన గోపాలం, లక్ష్మీనరశింహం, హయగ్రీవము, శ్రీధరమూర్తి, మత్స్యమూర్తి, వాసుదేవమూర్తి, మరియు బ్రహ్మ మొదలయినవి.

ఈ సాలగ్రామ పూజానుష్ఠానముల వలన, అన్న వస్త్రములకు లోటు లేకుండుట,

సంపూర్ణ కలిగిన సంతానప్రాప్తి, శత్రుదోష నివారణ, విద్యా విజ్ఞాన సమృద్ధి, ఐశ్వర్యము, ఆరోగ్యము, వంశాభివృద్ధి మరియు మోక్షాకారకములని పెద్దల అనుభవములోని విషయములయి వున్నవి.

ఈనాటికి అనేక వైష్ణవ దేవాలయములలో నియమిత పద్ధతులలో సాలగ్రామ పూజలు జరుపుచుండుట ముదావహము.

దేవస్థానాధికారులు ఈ విషయమునందు శ్రద్ధ వహించి తగు ప్రచారమొనరించి భక్తులు సాలగ్రామ పూజలు జరిపించుకొనుటకు ఇతోధికమైన అవకాశములు కల్పించెదరుగాక.

మనకు ఇట్టి మహోత్కృష్ట జ్ఞానోపదేశము సంపూర్ణముగ బోధపడుటకు, దూరదృష్టితో మన ఋషులు ఏర్పాటు చేసిన ఒకానొక పూజావిధానమీ సాలగ్రామ పూజ.

- (మన పవిత్ర వారసత్వము నుంచి)

# లుంబిని

లుంబిని : దీన్నే లుంబినీ వనమని కూడా పిలుస్తారు. తథాగతుని జన్మస్థలం. బుద్ధుని తల్లి మాయావతి కపిలవస్తునుంచి పుట్టింటికి వస్తూ ఇక్కడ దారిలో ఈ లుంబినీ వనంలో ఆ మహాత్ముడుని ఈ భువికి అందించెను.

ఇక్కడున్న చెట్టుకొమ్మ పట్టుకున్నప్పుడు ఆమెకి కాన్పు అవటంతో బుద్ధుడు తొలిసారి భూమిని స్పృశించటంతో బుద్ధుని జన్మ ప్రదేశమయింది. గోరక్‌పూర్ నుంచి ఆనందనగర్, జాయిన్‌సారి మీదుగా వచ్చి నేమర్ చేరి ఘంఘీనది చేరాలి. ఇచ్చట నుంచి 10 కి.మీ. దూరం లుంబిని. గోరక్‌పూర్ నుంచి లుంబినీ 180 కి.మీ.

**ఈ లుంబినీలో దర్శనీయ స్థలాలు :** బుద్ధభగవానుడి తల్లి మాయాదేవి ఆలయము, మహాబోదిమంథిరము. ఈ మందిరములో బుద్ధభగవానుడి బంగారు విగ్రహాలున్నాయి. తన ఆధ్యాత్మిక ప్రవచనాలతో మొత్తం ప్రపంచాన్నే తనమార్గానికి తిప్పుకున్న తథాగతుడు తొలిసారిగా భూమిమీద పడ్డ ప్రదేశంలో చిన్న కొలను వుంది మెట్లు దిగి జలాన్ని శిరస్సున జల్లుకోండి. ఆత్మీయులకు, బంధువులకు, స్నేహితులకు ఈ పవిత్ర నీటిని తీసుకెళ్ళండి. అశోకుడు నిర్మించిన 36 అడుగుల అశోక స్థంభాన్ని చూడండి.

**ఈ నేపాల్‌లో వుండటానికి వసతి :** ఖాట్మండులో అన్నపూర్ణ, సోల్టీ ఒబరాయ్ లాంటి ఫైవ్‌స్టార్ హోటల్స్‌తోపాటు, శంకర్, బ్లూస్టార్ హోటల్ లాంటి 2 స్టార్ హోటల్స్ కూడా వున్నాయి.

ఖాట్మండుకి 29 కి.మీ. దూరంలో రిసార్ట్ హోటల్, ధి మౌంట్ ఎవరెస్ట్ లాడ్జి, నగరికోట వున్నాయి. మౌంట్ ఎవరెస్ట్ దగ్గరిలో ఎవరెస్ట్ వ్యూ హోటల్ ఇంకా, అనేక అత్యాధునికమైన హోటల్స్‌తోపాటు మధ్యతరగతివారు దిగటానికి అనుకూలమైన వసతులున్నాయి.

పటాన్‌లో యూత్‌హాస్టల్, ఫోఖరాలో న్యూ క్రిస్టల్ హోటల్ వసతికి అనుకూలంగా వుంటాయి.

# INDIAN ROAD SIGNS


Road ahead zigzags towards right


Road ahead zigzags towards left


Cross-roads ahead


Sharp bend ahead towards right


Sharp bend ahead towards left


Dead-end ahead


Side road ahead to right


Side road ahead to left


Hair-pin bend ahead towards right


Hair-pin bend ahead towards left


Ferry crossing ahead


Steep hill ahead


Rough road ahead


Guarded level-crossing ahead


Unguarded level-crossing ahead


Narrow bridge ahead


School ahead

## LOCAL MANADATORY SIGNS


'U' turn prohibited



No vehicle
to enter the road


Drive around island



Dead slow


No-Parking zone


No entry towards
direction of arrow

## AL INDIA MANDATORY SINGS



Road closed






Junction with
main road


One-way street



No-Parking zone


Use of sound signals
prohibited


Overtaking prohibited



Speed limit

## ALL INDIA INFORMATORY SIGNS


End of speed limit



Parking place

## LOCAL INFORMATORY SIGN



Public bus stop